## ప్రసిద్ధ సంస్కృతాంధ్ర రామాయణాల్లో

# రాజనీతి తత్త్వము



ఆచార్య నేతి అనంత రామ శాస్త్రి

# PRASIDDHA SAMSKRUTA RĀMĀYA NĀLLO

# RĀJA NEETI TATWAMU.

*By*

## Prof. Neti Anantha Rama Sastry



| | | |
|---|---|---|
| Frist Publication | : | 2002 |
| Copies | : | 1000 |
| © | : | Author |
| Price | : | Rs.120/- |
| Cover Design | : | Devi Prasad. |
| Publisher | : | Aruna Publications. |
| Copies available | : | 1. Prof. N. Anantha Rama Sastry,<br>B1 - 82, Pattabhipuram,<br>GUNTUR - 522 006.<br>Phone : (0863) 352377<br>2.Visalandhra Book House,All branches.<br>3. Navodaya Book House,<br>Opp.Arya Samaj Kachiguda,Hyderabad. |
| Printed at | : | D.S. Digital Graphics.<br>Arundelpet 1/2, Guntur - 2. |
| Cover paper Printed at | : | Sri Lakshmi Press,<br>Arundelpet,14th line, GUNTUR-2. |

# అంకితం



వామాంకస్థిత జానకీ పరిలసత్కోదండ దండంకరే
చక్రం చోర్ధ్వకరేణ బాహుయుగళే శంఖం శరం దక్షిణే
బిభ్రాణం జలజాతపత్ర నయనం భద్రాద్రి మూర్ధ్ని స్థితం
కేయూరాది విభూషితం రఘుపతిం సౌమిత్రి యుక్తం భజే ।

భద్రాద్రి శ్రీ సీతారామ లక్ష్మణుల దివ్యమూర్తులకు

భక్తి పురస్సరంగా

     

యావత్ స్థాస్యంతి గిరయః సరితశ్చ మహీతలే ।
తావద్రామాయణ కథా లోకేషు ప్రచరిష్యతి ॥

కూజంతం రామ రామేతి మధురం మధురాక్షరమ్ ।
ఆరుహ్య కవితా శాఖాం వందే వాల్మీకి కోకిలమ్ ॥

శ్రీరామ రామ రామేతి రమే రామే మనోరమే ।
సహస్రనామ తత్తుల్యం రామనామ వరాననే ॥

రామాయ రామభద్రాయ రామచంద్రాయ వేధసే ।
రఘునాథాయ నాథాయ సీతాయాః పతయే నమః ॥

ఆపదా మపహర్తారం దాతారం సర్వ సంపదామ్ ।
లోకాభిరామం శ్రీరామం భూయో భూయో నమామ్యహమ్ ॥

     

# విషయసూచిక

## 4. చతుర్థాధ్యాయము



## 5. పంచమాధ్యాయము

# ప్రస్తావన

ఏ దేశంలో అయినా, ఏ కాలంలో అయినా, రాజకీయ వ్యవస్థ వర్తమాన సమాజానికి ప్రతిబింబం. సంప్రదాయబద్ధమైన భారతీయ రాజకీయవ్యవస్థకు ఈ సూత్రం మరింత ఎక్కువగా వర్తిస్తుంది. ప్రాచీన భారతీయ వైజ్ఞానిక సంపదలో రాజకీయ సామాజిక తత్త్వవిచార అధ్యయనానికి ఎంతో కీలకమైన స్థానం ఉంది. మానవసమాజం సర్వతోముఖంగా వికసించ డానికి ఏవిధమైన వాతావరణం నెలకొనాలో నిర్ణయించటంలో రాజకీయ సామాజిక తత్త్వవిచారం అత్యంత విశిష్టప్రాధాన్యం వహిస్తుంది.

సంస్కృతంలో ఆదికావ్యం వాల్మీకి విరచిత శ్రీమద్రామాయణం. ఇందులో సంప్రదాయ, సాంఘిక, నైతిక, రాజకీయాదిఅంశాలు విపులంగా ప్రస్తావించబడ్డాయి. ఒకజాతి జీవనవిధానంగా రూపం సంతరించుకొని జాతి జీవన స్రవంతిలో ఒక విడదీయలేనిభాగంగా రామాయణం పెనవేసుకుపోయింది. భారతదేశంలోనే కాక ప్రపంచదేశాలన్నింటి యందును రామాయణకథ వ్యాప్తిలో ఉంది.

తెలుగులో రామాయణాలు వాల్మీకి రామాయణాన్ననుసరించి అనేకం వ్రాయబడ్డవి. అందులో భిన్నకాలాల్లో, వివిధప్రక్రియల్లో వచ్చిన 1.రంగనాథ రామాయణం (ద్విపద-క్రీ.శ1240) 2.భాస్కర రామాయణము (చంపూకావ్యం -క్రీ.శ.14వ శతాబ్దం) 3.మొల్ల రామాయణం మొదటి కవయిత్రి (క్రీ.శ.1581) రామాభ్యుదయం (ప్రబంధం - క్రీ.శ.1544) అను నాలుగు రామాయణాలను గ్రహించి అందు పేర్కొన్న రాజ్యాంగపరిపాలనా విధానాన్ని, రాజధర్మాలను, మంత్రిపురోహితవిధులను, యుద్ధదౌత్య నీతులను, అంతర్గత రాజ్యాంగవిధానాన్ని మొదలుగాగల అనేక విషయాల్ని వాల్మీకి రామాయణంతో తులనాత్మక పరిశీలన గావించటమే ఈ గ్రంథ ప్రధానోద్దేశ్యం.

ధర్మం సార్వత్రికమైంది. అది ఒక జాతికిగానీ, ఒకదేశానికి గానీ, ఒక సమాజానికి గానీ, పరిమితం కాదు. అది సమస్త మానవజాతి కళ్యాణానికి దోహదం చేస్తుంది. వారిని ప్రమాదం నుండి కాపాడి రక్షించేది ధర్మం అని రామాయణం చెప్తుంది. సత్యంచేత, వివేకం చేత, సత్త్వవర్తన చేత కార్యాకారణముల సమన్వయం చేత ధర్మం రక్షింపబడుతుందని రామాయణం

వివరిస్తుంది. వ్యక్తి శ్రేయస్సు కన్నా సమాజశ్రేయస్సు కోసం అవసరమైతే వ్యక్తిని అధర్మమార్గంలో రూపుమాపుట ధర్మమే అని రామాయణం ప్రతిపాదించింది. అధర్మవ్యవస్థను తొలగించి పునఃధర్మవ్యవస్థను ఏర్పరచటానికి రాజనీతి ఏర్పడింది. రక్షాధర్మం నిర్వర్తించే రాజుకు నిర్దేశక సూత్రాలు అవసరం. ఈ సూత్రాలన్నీ కలిస్తే రాజనీతిశాస్త్రం అవుతుంది.

రాజవ్యవస్థను అధ్యయనం చేసేది రాజనీతిశాస్త్రం. ఈ శాస్త్రంలో రాజ్యావతరణ, రాజ్యలక్షణాలు, రాజ్యాధికారం, పౌరుల సమత్వ స్వాతంత్ర్యాలకు రాజ్యాధికారంలో గల సంబంధం, రాజ్యపాలనా విధానం, రాజ్యం యొక్క కర్తవ్యాలు మొదలైన విషయాలకు సంబంధించిన నిగూఢమైన వివరణ ఉంది.

రామాయణంలో మూడువిధాలైన రాజకీయవ్యవస్థ ఉంది. కోసల రాజ్యాధిపతులైన దశరథ - రాముల (మానవ), కిష్కింధాధిపతులైన వాలి - సుగ్రీవుల(వానరుల), లంకాధిపతులైన రావణ-విభీషణుల(రాక్షసుల) పరిపాలనా విధానాదుల వల్ల, ప్రాచీనకాలంలో భారతదేశ పరిపాలనా విధానాల యొక్క పరిపూర్ణ అవగాహనకు ఈ గ్రంథం ఉపకరిస్తుంది. అంతేగాక ప్రసిద్ధ తెలుగు కవులు రచించిన రామాయణాల్లో కాలానుగుణంగా కొన్ని మార్పులు వచ్చాయి.. వాల్మీకి రామాయణకాలంనాటికీ తెలుగు రామాయణాల కాలంనాటికీ రాజకీయవ్యవస్థలో ఏమేమి మార్పులువచ్చాయో ఇందులో పరిశీలించటం జరిగింది.

రాజులకు నీతిని బోధించడం ఎందువల్లనంటే మానవ సమాజాన్ని అరాజకవ్యవస్థపాలుచేయకుండా ఉండటానికే. తద్వారా తిరిగి మానవ సమాజం వసుధైక కుటుంబకంగా మనుగడ సాధించడానికే. నీతిని నిర్లక్ష్యపరచి భ్రష్టతపొందవద్దని రావణ - కుంభకర్ణ - వాలి మొదలైన రాజులకు రామాయణం సూచన చేసింది. మొత్తం మీద రామాయణం సత్యం - ధర్మం - న్యాయం అనే విషయాలను దృష్టిలో నుంచుకొని రచింపబడ్డ గ్రంథం. ఈ సందేశాన్నిస్తూ రాజనీతిలో గల వైవిధ్యాలను నొక్కి వక్కాణించింది.

జ్యేష్ఠ పూర్ణిమ -2002
గుంటూరు-6

**- నేతి అనంతరామశాస్త్రి**

# కృతజ్ఞతా కుసుమాంజలి

**'యాదేవీ సర్వభూతేషు బుద్ధి రూపేణ సంస్థితా।**

**నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమోనమః ॥**

ఏదేవి సర్వజీవుల యందు బుద్ధిరూపంలో ఉంటుందో అట్టి మా ఇష్టదేవతయైన శ్రీ మహాకామేశ్వరీ, మహాశ్రీ చక్రనగర సామ్రాజ్ఞీ, మహా త్రిపుర సుందరీ, రాజరాజేశ్వరీ ప్రతిప భారతీ, పరదేవతకు నమస్కారిస్తూ,

ఇది రామాయణానికి సంబంధించింది. కాబట్టి ఈ గ్రంథాన్ని భద్రాద్రి శ్రీ సీతారామ లక్ష్మణుల దివ్యమూర్తులకు అంకితమివ్వాలని తలంపు కలిగింది. ఆదివ్యమూర్తులకు భక్తి పురస్సరంగా అంకితమిస్తూ,

భద్రాద్రి శ్రీ సీతారామ లక్ష్మణుల చిత్ర పటాన్ని అందించిన శ్రీ అంకరాజు సుబ్బారావు దంపతులకు,

కవిత్రయ భారతం రాజనీతి గ్రంథాన్ని 1988లో ముద్రించిన తర్వాత' "రామాయణంలోని రాజనీతి తత్త్వాన్ని'' కూడా పరిశీలించాలనే కుతూహలం కలిగింది. 1994లో 'విశ్వవిద్యాలయ స్థాయిలో గ్రంథరచనల రూపకల్పన' అనే ప్రాజెక్టు క్రింద యు.జి.సి (న్యూఢిల్లీ) వారికి 'ప్రసిద్ధ సంస్కృతాంధ్ర రామాయణాల్లోని రాజనీతి తత్త్వము' అనే ఈ అంశాన్ని ప్రతిపాదించగా వారందులకు అంగీకరించారు. ఈ అంశాన్ని గ్రహించి 2000 సంవత్సరంలో దీన్ని పూర్తిచేసి యు.జి.సి. కి పంపటం జరిగింది. ఈ విధంగా నా ప్రతిపాదనను ప్రోత్సహించిన యు.జి.సి అధికారులకు,

గ్రంథ రచనకు తోడ్పడిన ఉపయుక్త గ్రంథాలను చివర పేర్కొనటం జరిగింది. ఆ గ్రంథాల సహాయంతో ఈ గ్రంథం రూపొందింపబడింది. ఆ గ్రంథ రచయితలకు,

ఈ గ్రంథాన్ని వ్రాత ప్రతిసిద్ధం చేయటంలో సహకరించిన శ్రీ సి.వి.యల్ నరసింహారావు, ఆంధ్రోపన్యాసకులకు,

ముద్రణకు ఆర్థిక సహాయం గావించిన తిరుమల తిరుపతి దేవస్థానం కార్య నిర్వహణాధికారులకు,

ఈ గ్రంథాన్ని కూలంకషంగా చదివి తమ అమూల్య అభి ప్రాయాలను అందించిన డా॥ మైలవరపు శ్రీనివాసరావు, ఆచార్య శలాక రఘునాథ శర్మగార్లకు,

ఈ గ్రంథానికి ప్రూపులు చూడటంలో సహకరించిన డా॥కె.రంగనాయికి గారికి,

ముఖచిత్రాన్ని ఔచిత్య సుందరంగా రూప కల్పన చేసిన కళాకారులు శ్రీ దేవీ ప్రసాద్‌కు,

డి.టి.పి. బైండింగ్ వగైరా చేసి ముచ్చగా ముద్రించిన డి.యస్.గ్రాఫిక్స్ వారికి , కృతజ్ఞతాభివందనములు.

1-7-2002.
గుంటూరు-6

- నేతి అనంతరామ శాస్త్రి

'రామాయణ ప్రవచన సుధాకర'
**డాక్టర్. మైలవరపు శ్రీనివాసరావు,**
ప్రాచ్యభాషా కళాశాలాధ్యక్షులు, తెనాలి

## శ్రీమద్రామాయణీ గంగా పునాతు భువనత్రయమ్.

యుగాలు మారినా, ధర్మాలు వేరైనా, ప్రజ కొత్తవారైనా, అలనాటి శ్రీమద్రామాయణ కథ మాత్రం మారదు - మారలేదు - మారరాదు - అయినా కొత్తదనాన్నిస్తూనే ఉంటుందంటే అక్కడి విశేష మొక్కటే మహర్షుల తపశ్శక్తి. పై మాటల్లో 'శ్రీమద్రామాయణకథ మారలేదు - మారరా' దనడానిక్కారణం, ఈ కథని మార్చి వ్రాసిన తెలుఁగు రామాయణ కావ్యాలేవీ ప్రసిద్ధిలో వాల్మీకీయాన్ని మించలేకపోవడమే. మరో కోణంలో ఆలోచిస్తే ఈ మార్పులని నిశితంగా పరిశీలించిన సహృదయులు వాల్మీకి రామాయణపు గొప్పదనాన్ని మరోమాఱు గమనించి 'మార్పు చేయడ మెంత తప్పో' నిశ్చయించుకో గలిగారు కూడ.

ఉదాహరణకి 'అహల్యని బండరాయిగా శపించడ'మనేది వాల్మీకంలో లేదు. మొల్లరామాయణంలో గుహుఁడు రామపాదాలని కడిగి నావనెక్కించడంలో ఓ చమత్కారాన్ని మనం వింటాం. సరే!

'వాయుభక్షా నిరాహారా తప్యంతీ భస్మశాయినీ।
అదృశ్యా సర్వభూతానా మాశ్రమేఽస్మి న్నివత్స్యసి॥'

ఇదీ వాల్మీకివచనం.

రామావతార ప్రయోజనం సిద్ధించాలంటే రామునికి మహర్షుల - సాధ్వీమతల్లుల తపశ్శక్తి అవసరమైయుంది. ఆ కారణంగా తపశ్శక్తి సాధనకి ఉపకరణంగా అహల్యని నిర్ణయించుకున్న దేవతలు దేవాధ్యక్షుని ద్వారా ఓ చక్కని నాటకాన్నాడించి గౌతమశాపాన్ని పైతీరుగా ఇప్పించారు. వాయు భక్షణా, నిరాహారతా, భస్మశాయి విధానం, అదృశ్యపద్ధతీ. ఇవన్నీ యోగ మార్గానికి చెందినవీ, సమాధికి

అవసరమైన పీను. ఈ సాక్ష్యం నిజం కాబట్టే ఆమె ఆ తపస్సుని ఫలంగా చేసి రామునికే అర్పించింది. రాముడు కూడ ఆమె ఇచ్చిన ఫలాన్ని గ్రహించడమేకాక, 'పాదౌ జగృహతు స్తదా' తనతమ్మునితో కలిసి - పాదాభివందనం కూడ చేసాడు. ఇంతటి ప్రయోజనకర విషయం కాస్తా బండరాతిశాపంతో మఱుగున పడిపోదా ? ఇలాటి అసందర్భాలెన్నో ఎన్నెన్నో......కాబట్టి చెప్పవచ్చిందేమంటే వాల్మీకమే శ్రీమద్రామాయణమౌతోందనీ - ఇతరాలన్నీ రామాయణ మాత్ర వ్యపదేశార్హాలై ఆ బరువుముందు తేలిక ఔతున్నాయనీను.

ఎత్తైన ఒక కొండనెక్కినప్పుడు ఆ పర్వతాగ్రంనించి అనేక దిశల్లో అనేక విషయాలని స్థాయీభేదాన్ని బట్టి వ్యక్తి గ్రహించగలిగినట్లు, శ్రీమద్రామాయణానికి వెలువడ్డ వ్యాఖ్యానాలు కూడ ఒక్కోటి ఒక్కోతీరు విధానంలో సాగివెళ్లాయి.

అలా సాగిన వ్యాఖ్యానాలన్నింటిలోని విషయాలకి మూలమైన శ్రీమద్రామాయణంలోని రాజనీతితత్త్వాన్ని గూర్చి వివరించడానికి డా॥ అనంతరామశాస్త్రిగారు కృతకృత్యులయ్యారు. 'ఒకటిఁగొని రెంటి నిశ్చల యుక్తిఁజేసి......' అనే తిక్కన పద్యాన్ని చూచి అలా పెదవి విరిచి (అర్థంకాక) వెళ్లకుండా ఈ పరిశోధన గ్రంథంలో రాజనీతికి సంబంధించిన అన్ని అంశాలూ, అంశాల్లోని అంగప్రత్యంగాలూ శ్రీమద్రామాయణానికి సంబంధించి సంపూర్ణంగా డా॥ అనంతరామశాస్త్రిగారు వివరించారు.

యువరాజుగా ఎన్నుకోవలసిన వారిని గూర్చి అథర్వవేదమే సూచించింది. 'త ఈం విశోన రాజానం వృణాయ' అనే మంత్రం ద్వారా శ్రీమద్రామాయణంలో సరిగా ఆ విషయాన్ని ఆవిష్కరించదలిచిన వాల్మీకి అందరిచేతా రామనాయకత్వాన్ని బలపరుస్తూ ప్రతిపాదనలని చేయించాడు. సభ - సమితి - బ్రాహ్మణులు- సేనాధిపతులు - రాజ్య ప్రజలు - ఇంతవఱకున్న - స్త్రీలు - కాలము - మహర్షులు- పై ఏ విభాగానికీ చెందనివారు - పృథివి - అభ్యర్థి - అనే ఇందరు కలిసి రాజుని ఎన్నుకోవాల్సి ఉందని దీన్నిబట్టి అర్థమౌతుంది.

ఇదంతా ఒక ఎత్తైతే ఈ గ్రంథంలో వివరిచినట్లు (4వపేరా పుట 18) దిక్పాలకాంశలు వీరిలో ఉండడంబట్టి వీరి ఎన్నిక సక్రమమా ? కాదా? అనేది అనుక్షణం వారికి వారే గమనిస్తూంటారని సుస్పష్టం.

దిలీపుడు గోరక్ష చేస్తూ తన శరీరాన్నే సింహానికి అర్పణ చేయబోయాడంటే కారణం తనకి దిక్పాలకాంశ ఉంటుంది కాబట్టి రక్షచేయకపోతారా ? అని అందుకే తాను రక్షింపబడ్డాడు.

అశ్వమేధ యాగాన్ని చేసేప్పుడూ, అలాగే ఇతర రాజసూయాది యాగాలు చేసేప్పుడూ కూడ యాగ దృష్టిమగ్నుడైన రాజు రాజ్యాన్ని రక్షించే బాధ్యత ఈ దిక్పాలకులదే ఔతుంది. అష్టదిక్పాలకాహ్వానం మనకి అన్ని శుభకార్యాల్లోనూ జరుగుతూనే ఉంటుంది. ఇదే రాజసూయం లేదా అశ్వమేధం - మరీ విశేషించి పట్టాభిషేకంలో జరుగుతుంది. ఈ విషయాన్నే ఆంధ్రమహాభారతంలో చూచాయగా నన్నయ మహాకవి చెప్పాడు గరుడుడు అమృతం తేవడానికి వెళ్లే సందర్భంలోనిది.

'దిక్కుల చివరి వరకూ కీర్తి వ్యాపించిం'దనే మాటని తరుచు వింటూంటాం. దిక్కుల చివరి వరకు రాజు తన రాజ్యాన్ని విస్తరించక పోయినా కీర్తి వ్యాపించడానిక్కారణం నేటి కాలంలోలా నాడు ప్రచారం జరిగిందనేది కాదు వాస్తవం. ఆ దిగధిపతి అయినవాని బాధ్యత తత్కీర్తి వ్యాపనమే. ఈ ధోరణిలో అర్థాన్ని గ్రహించాలి. ఈ కారణంగానే యువరాజ పట్టాభిషేకం జరిగే సందర్భంలో అగ్నిలో వేసే హవిస్సులలో దిక్పాలకులక్కూడా భాగం ఉంటుంది - వీరికి ఈ బాధ్యత ఉందని గుర్తుచేస్తూ నన్నమాట.

ఇలాటి బాధ్యత వారికుండి రాజు రాజ్యాన్ని సుస్థిరమూ సుసంపన్నమూ అయ్యేలా వారి అనుగ్రహాన్ని జోడించి వారు చేస్తూంటారు కాబట్టే, రాజులు కూడ వారికి రాక్షసులతో యుద్ధాలు జరిగిన దశలో వారికి సహాయపడేందుకు వెళ్తూండేవారు.

దశరథుడు దేవతాయుద్ధాల్లో సహాయపడ్డాడంటే దానిలోని భావమిదే. యుద్ధాలనగానే మనమనుకునేటట్లు కేవల శస్త్ర యుద్ధాలు జరగవు. అస్త్ర యుద్ధాలుంటాయి. మంత్రపూర్వకంగా ప్రయోగింపబడ్డ శస్త్రం, అస్త్రమౌతుంది కాబట్టి, తచ్ఛక్తి, ప్రయోగించిన ప్రతిసందర్భంలోనూ తగ్గిపోతూ ఉంటుంది కాబట్టి, ఆ తరిగిపోయిన శక్తిని పునఃపూర్ణం చేసుకునేందుకే రాజులు తపస్సు చేస్తూండేవారు. (177 పుట )

రాజైన రాముడు స్వయంగా మహర్షుల ఆశ్రమాలకి పోయి మహర్షులు తపశ్శక్తిని యాచించడంలో ఉన్న రహస్యం కూడ ఇదే. ఎంతగా ఎందఱు రాక్షసుల్ని వధిస్తే, అంతగా అంత తపశ్శక్తి క్షీణిస్తుంది. ఓ బాణం వేస్తే, 'ఇంత తపశ్శక్తి' అని ఉండదు. అవతలివ్యక్తి తపశ్శక్తిని అధః కరించేంత తపోనష్టం బాణ ప్రయోగం ద్వారా జరుగుతుందని గ్రహించాలి కాబట్టి ఏ రోజున ఎంత తపోనష్టం జరిగిందనేదీ-జరుగబోతోందనేదీ ఆ ప్రత్యర్థినిబట్టి ఉంటూంటుంది.

ఇదంతా ఎందుకంటే, 'రాజనీతి' అనగానే మనం నేడు చదువుకునే Politics, Political Sciences పర్యాయంగా రాజనీతి పదాన్ని వాడ వీలులేదనీ, అంతటి అల్పార్థక పదం ఇది కాదనీ చెప్పేందుకు. ఈ మాటలో ఇంతలోతునీ మనసులో భావించారు కాబట్టే డా॥ అనంతరామశాస్త్రిగారు ప్రత్యక్షరాన్ని ఆ దృష్టితోనే మలిచి రాసారు. (2-2-3 2వ పేరా)

ఆలోచిస్తే పూర్వుల దృష్టి చాల చిత్రమైంది. దేవతలంతా ఉత్సవమూర్తులుగా తిరిగి మనని అనుగ్రహించడానికీ ఏ రథాల్లో తిరుగుతారో, వాటినే యుద్ధాల్లో వాడాలనే విధానాన్ని ఏర్పాటు చేసారు వాళ్లు రథాన్ని చూడగానే ఏ దృష్టి రావాలి వ్యక్తికి ? అంటే సందర్భాన్నిబట్టి గమనించాలనేది ఇక్కడి సమాధానం. రథమే ఉంచడానికెక్కడ కారణం మళ్లీ వేదాంతదృష్టి

"ఆత్మానం రథినం విద్ధి శరీరం రథమేవచ ।
బుద్ధింతు సారథిం విద్ధి మనః ప్రగ్రహ ఏవ చ॥ అనేదే
'ఇంద్రియాణి హయాన్యాహుః ఇంద్రియేభ్యః పరమ్మనః
మనసత్తి పరా బుద్ధిః బుద్ధేః పరతరస్తుసః ॥ అనేది దీనిలోని పరమార్థం.

ఇంత గట్టి దృష్టి ఉంది కాబట్టే రాజు రాజ్యాన్ని సరిగా చేయకపోతే 'పదవి పోతుం'దని నేటివారిలా కాక, అ- రాజక విధానాలెలా ఉంటాయో వాటిని చెప్పారు ప్రాచీనులు.

నారాజకే జనపదే ---------- (ఈ గ్రంథంలో 3-2-10)

కాబట్టి రథమనేది ఓ వ్యక్తి. ఊరేగే రథమంటే ఉన్నత వ్యక్తి. రాజు అన్నమాట. అతడు సరిగాలేని సందర్భంలో ప్రజలంతా అలానే సరికాని స్థితిలో ఉంటారని సంచూచనమన్నమాట. ఇంకొక్క అడుగు ముందుకేస్తే రాజు తానై ఓడిపోవడానిక్కూడ బాధ్యుడు తానే అని పురాణేతిహాసాలు చేప్తాయి. భారతంలో 'యత్ ధర్మ స్తతో జయః' అనడంలో పరమార్థమిదే.

'రాజు' అనే వ్యక్తి, తానేదో ఓ దండధారిగా, శిక్షకునిగా, నేరాలని విచారించి తీర్పుచెప్పే న్యాయాధికారిగా ఉండాలనే నియమమేమీ గొప్పది కాదన్నమాట. కేవలం అతని ఋజుధర్మ ప్రవర్తనమే పరిపాలనమన్నమాట. ఈ విషయాన్ని చెప్పే కారణం కూడ ఒక్కటే. ఈ దృష్టితో శ్రీమద్రామాయణం వ్రాయబడింది కాబట్టి - దాన్ని ఆధారంగా చేసుకుని వ్రాయబడిన ఈ 'రాజనీతి తత్త్వం' కూడ అంతర్లీనంగా ఈ ఛాయలోనే ఉంది.

దశరథుడు పోయాడు. లోకానికొచ్చిన నష్టమేముంది? నలుగురిలో ఒకరు రాజౌతారు. ఏమిటి ఇబ్బంది ? అనేది నేటి ప్రశ్న. కాని అయోధ్య మొత్తం దశరథ మరణంతో ఎందుకు కదిలిపోయింది ? విధవా పృథివీ రాజన్! (పుట 25) ఇలా ఎందుకనుకోవాలి ? దీనికి పరిష్కారాన్ని కూడ సూచిస్తూ 'ఇక్ష్వాకూణాం మహద్వంశే......' ఇక్ష్వాకు వంశంలో వారినే ఒకరిని రాజు చేయవలసిందన్నారు. (పుట

24) కారణమొక్కటే. సూర్యవంశం ఇక్ష్వాకువులది. ఆ కారణంగా సూర్యశక్తి రాజ ఉండి ప్రజల్ని సర్వత: రక్షిస్తుందనేది వారి భావం. ఇలా అడుగడుగు గమనించవలసింది - 'రాజనీతి' అనగానే ఈ రాజు ఆ రాజుతో ఎలా ఏ ఆయుధా పోరాడాడు ? ఎన్ని బాణాలని ఏయే పరిమాణాలు కలవాటిని వేసాడు ? ---- వ వాటిని మాత్రమే లెక్కించవద్దనీ- లో విశేషాలతో నిండిన ఈ గ్రంథాన్ని ఆ దృష్టి పరిశీలించాలనే బుద్ధిని పెట్టాలనీను.

అదృష్టకరమైన అంశమేమంటే రంగనాధ - భాస్కర - మొ రామాభ్యుదయ రామాయణ కర్తలు కూడ వాల్మీకి అభిప్రాయాన్ని గౌరవించి తపశ్శక్తికి ప్రాధాన్యమిస్తూ ఆ విషయాలనే ఉటంకించడం. కవులు వర్ణన ప్రియు కాబట్టి ఏమేమో వ్రాయకండా యథా మాతృకంగా వ్రాయడం మన అదృష్టం.

సేనాధిపతిని నియమించినా, ఎవరిని సైన్యానికి అధ్యక్షునిగా చేసినా వై తతంగమంతా ఉండడానిక్కారణమిదే. (పుట 30) పైకి మామూలుగా చూస్తే 'న తీర్థంబురాశి నదులు జలంబుల్ వానర వీరులచే' తెప్పించడం కన్పిస్తుంది / లోఁజూస్తూ 'గంగాది సర్వతీర్థేభ్య: ఆహుతై రమలైర్జలై: -------' ఇదీ ఇక్కడి విశే రాజ నిర్ధూత దండాస్తు కృత్వా పాపాని మానవా: (పుట - 92).

అని రాజు ఎవరినైనా శిక్షించక విడిచిన కారణంగా వచ్చే కష్టాలని మన చెప్పడంలోని ఔచిత్యంకూడ ఇదే. ఇందుకే శ్రీమద్రామాయణం' తప:స్స్వాధ్య నిరత' మ్మంటూ తపశ్శబ్దంతో ప్రారంభమౌతుంది. కురుక్షేత్ర యుద్ధాన్ని వివరి విశేషం ఉన్న భగవద్గీత 'ధర్మ' శబ్దంతో మొదలౌతుంది.

ఈ విషయం కూడ ఎందుకు వివరించాల్సి వచ్చిందంటే అడుగడుగ డా॥ నేతి అనంతరామశాస్త్రి గారు. తులనాత్మక పరిశీలనాన్ని చేస్తూ ఈ దృ తప్పరాదని సూచిస్తూనే ఉన్నారని పేర్కొనడానికి. (చివరి పేరా పుట 92 పుట &95).

శ్రీమద్రామాయణ బాలకాండ ప్రారంభంలోనే విశ్వామిత్రుడు వశిష్ఠుని నిష్కారణ కలహానికి సిద్ధపడతాడు. ఒకమారు కాదు ఐదుమార్లు యుద్ధం చేసా ఒకసారికీ మరోసారికీ ఓ చిన్న భేదం. ఆభేద యుద్ధంలో ఓ చిన్న ధర్మసూక్ష

ఓటమిలో ఓ కొంత అనుభవం. చివరికి రాజర్షియైన విశ్వామిత్రుడు కోరుకున్నది బ్రహ్మర్షిత్వం తప్ప రాజ్యం కాకపోవడం విశేషం. విశ్వామిత్రుడు 'బ్రహ్మర్షి' అని ప్రకటించడానికి వచ్చిన వారే 'రాజు' అని ప్రకటించడానికి వచ్చేవారు కూడ. అయినా రాజరికం వద్దన్నదెందుకంటే - సత్యగుణప్రతీక అయిన వశిష్ఠునితో రాజస్తమో గుణ ప్రాధాన్యలతో తాను పోరాడక గ్రహించింది - సత్త్వమే గొప్పదీ సరైనదనీ మరొకటికాదనీ మనకి చెప్పడానికే. ఈ నేపథ్యంతో మనం యుద్ధ ఘట్టాలని చూడాలనేది ప్రారంభంలోనే మనకి నాందిగా చెప్పాడన్నమాట వాల్మీకి. కాబట్టి యుద్ధాన్ని ఎప్పుడూ యుద్ధమాత్రంగా చూడకూడదు.

లోకంలో యుద్ధ ప్రధానమైన లేదా యుద్ధైక దృశ్యాలున్న చిత్రాలని చూస్తే చెడిపోవడం నిశ్చయం కదా! అందుకే కదా చర్చలూ వాదోపవాదాలూ ఈ హింసమీద సాగుతోంది!

మరి శ్రీమద్రామాయణాన్ని చూస్తే ఏడు కాండల ఈ ఇతిహాసంలో ఓ కాండ కాండంతా యుద్ధమే. అదీకాక ప్రతికాండలోనూ కొంత కొంత యుద్ధం ఉంటుంది. మొత్తం చూసుకొంటే రెండు కాండల యుద్ధం ఉందికదా ! అలాగే యుద్ధపంచకముతో కూడిన భారతం కూడా. మరి 'ఇంత యుద్ధం నిండిన శ్రీమద్రామాయణ భారతాలని చదివి నేను పాడయ్యా' నని ఎవరు ఎందుకన (లే)రు? కారణం ఒక్కటే. ఈ యుద్ధం నిండా ధర్మమూ సత్యమూ తపశ్శక్తీ ఇమిడి ఉండడమే.

అందుకే 'శరణాగతరక్షణ' పద్ధతిలో ప్రత్యర్థులు మాట్లాడుకునే మాటలు ఈ నేపథ్యం అర్థం కాని దశలో - చిత్రంగానే కన్పిస్తాయి. (పుట 106 - 108).

ప్రయోగించిన అస్త్రం ఒక్కొక్కరికి ఒక్కోలా కన్పించడం అలా ఎందరికో కన్పించడం (180 పుట) అసత్యం కానేకాదు.

ఈ గ్రంథ విషయసూచికను ఒక్కసారి చూస్తే సంగ్రహించిన ఆ విశేషాలకి గుండె బేజారౌతుంది. ఎన్నెన్ని విశేషాలు! అన్నిటికీ వివరణాన్ని చూపిస్తూ, ఈ విధంగా ఎంతైనా వ్రాసే అవకాశముంది. ప్రతి సంఘటనలోనూ ప్రతి సందర్భంలోనూ ఈ దృష్టిని పెట్టి పరిశీలించాలనీ - అలా పరిశీలించే విధంగా డా॥ అనంతరామశాస్త్రిగారి వివరణ ఉందనీ ఆ ధోరణిని మాత్రం విడవద్దనీ పాఠకులని ప్రార్థించడమే నా లక్ష్యం.

చివరిగా ఒక మాట. పదవీ విశ్రాంతి పొందినతరవాత కొందఱు చతుర్ముఖ పారాయణాన్నీ ,మరికొందరు మరో జూదాన్నీ - మరి ఎందరో దూరదర్శన చలన చిత్రదర్శనాన్నీ తమ కాలక్షేపానికీ, మోక్ష ప్రాప్తికీ సాధనాలుగా ఎంచుకుంటూన్న ఈ రోజుల్లో, ఏ అంశం రాయాలా ? ఇది బాగుందా ? సమన్వయపడలేదే ? ఇలా చేస్తే బాగుంటుందా ? --- ' వంటి తర్కవితర్కాలు చేసుకుంటూ ఏ గ్రంథాన్ని రాస్తున్నారో ఆ గ్రంథైకరచన దృక్పథంతో ఎన్నో వ్యావృత్తులనించి తప్పించుకుంటూ జీవిస్తూ రాయడం ఎంతెంతో కడుంగడు - అత్యంత కష్టమైన అంశమనేది ఒక్కపుస్తకాన్నైనా వ్రాసినవానికి తెలుస్తుంది.

ఒకవైపు శ్రీమద్రామాయణాన్ని చూడడం, దానికి సరిపోయిన తెలుగు రామాయణాల పద్యాలని ఎంచుకోవడం, ఆ ఎంపికకోసం మొత్తం గ్రంథాలని మూడు నాలుగు మార్లు పరామర్శించడం, అన్నిటికీ అథసూచికలకోసం ప్రత్యేకమైన అంకెలని ఒకచోట భద్రపరచుకోవడం , ఆ అన్నిటినీ గుదిగుచ్చి ఓచోట రాసుకుని ,అన్నిటినీ విడవకుండా గుచ్చెత్తి రాయడం - మళ్లీ సంప్రదాయవిరోధమైతే కాదనుకుంటూ ఉండడం - గ్రహబాధలు గృహబాధలు ------ ఇవన్నీ 'నాకుకా'దని సమర్థించుకుంటూ ఉండడం ---- ఇంత 'చాకిరీ' ఓ గ్రంథం వెనుక ఉంటుంధి. ఇంత శ్రమని దీక్షతో దక్షతతో విశేషించి లలితా పరాభట్టారికోపాసన శక్తితో డా॥ అనంతరామశాస్త్రిగారు వ్రాసారనడానికి ప్రత్యక్ష సాక్షిని నేను.

ఏ అంశమూ పై వాటి స్థాయికి తగ్గకుండా, కిందివాటి స్థాయికి పెరగకుండా ఒకే తీరుతెన్నుల్లో ఉండేలా విస్తృతమైన అంశాన్ని సశాస్త్రీయంగా నిర్వహించారనేది నా మాట త్రికరణశుద్ధిగా. ఈ గ్రంథాన్ని నేనేదో పరామర్శించాననుకోకుండా, దీన్నించి నేనెంతో చదువు కోగలిగాననేది యదార్థం. మీరు అలా గ్రహించగలరని నా విశ్వాసం.

జ్యేష్ఠ పూర్ణిమ -2002
గుంటూరు-2

**- మైలవరపు శ్రీనివాసరావు.**



ఆచార్య శలాక రఘునాథశర్మ
విశ్రాంతాంధ్రాచార్యులు,యస్.కె.యు,
సి-3, రెసిడెన్సీ అపార్ట్‌మెంట్స్, శ్యామలానగర్,
రాజమండ్రి - 533 103. ఆం.ప్ర.

# సహృదయ సంభావనము

మానవునిలో అనేక పశుసామ్యాలు ఉన్నా, కొన్ని నియమనిష్ఠల చేత అతడు విశిష్టుడవుతున్నాడు. ఆ విశిష్టత లేకపోతే - స్థూలదృష్టితో - పశువు అంటారు . గానీ సూక్ష్మంగా ఆలోచిస్తే పశువు కన్నా హీనుడవుతాడు. అందుకనే ధర్మము,నీతి,నియమము, నిష్ఠ అనేవి మానవజాతికి మాత్రమే వర్తించే మాటలు.

రాజనీతి అంటే పాలనకు సంబంధించిన పద్ధతి అని భావన. ఇక్కడ రాజు పాటింపవలసిన నీతియా? పాలింపజేయవలసిన నీతియా? అనే ప్రశ్న కలగటం సహజం. రెండూ అని సమాధానం. అయితే ప్రజానీతి అనవచ్చు గదా!- గాదు. పాలించేవాడు పరమనీతి కలవాడైతే పాలితులలో కొంతకు కొంత నీతి నిలవటానికి అవకాశం ఉంటుంది. అందుకని ఇది రాజనీతియే.

ఈ రాజనీతిని గురించి ముఖ్యంగా అనాదిగా పురాణేతిహాసాలు అతివిస్తృతంగా చర్చించాయి. ఆ విస్తృతికి అర్థమేమంటే అది బహుసంక్లిష్టమైనదని. శతకోటిదరిద్రాలకు అనంతకోటి ఉపాయాలన్నట్లు ద్వారపిధానాలు ఎంతగా చేసినా తప్పించుకొనేవారికి సందుగొందులు దొరుకుతూనే ఉన్నాయి. అందుకే ఋషులు అనంతముఖాలుగా రాజనీతిని వింగడించి, విశ్లేషించి, వివరించి మానవజాతికి అందించారు.

రామాయణం అచ్చమైన కావ్యధర్మంగల సాహిత్యరత్నాకరం. అందులో అన్నీ ఉంటాయి. అయితే ఖనిలోని అనర్ఘరత్నాలనులాగా కష్టపడి మేధాపాటవంతో త్రవ్వితీసుకోవాలి. తీసుకొన్నకొద్దీ అనంతంగా లభిస్తూనే ఉంటాయి.

ఆచార్య నేతి అనంతరామశాస్త్రిగారు పరిశోధనవ్యవసాయంలో మంచి ఫలసాయం సాధింపగల సర్వవిధసామర్థ్యమూ సమృద్ధిగా పండించుకొన్న

మనీషివర్యులు. వారి చూపు రాజనీతిమీద పడింది. అందులోను రామాయణగతరాజనీతివైపు ప్రసరించింది. ఆబుద్ధినైశిత్యంతో వారు రూపొందించిన ఈ గ్రంథం ప్రసిద్ధసంస్కృతాంధ్రరామాయణాలలో రాజనీతితత్త్వము బహుధావిరూపిత సూక్ష్మతర విషయాంశం వెల్లివిరిసిన ఒక ఉత్తమ, ఉదాత్త రచన

ఇందులో వారనుశీలించిన అంశాలు శతాధికంగా ఉన్నాయి. అన్నింటికీ సప్రమాణమైన వివరణలు ఉన్నాయి. దీనికోసం అనుశీలించిన గ్రంథాలు కూడా గణనీయంగానే ఉన్నాయి. సమన్వయించుకొన్న తీరు రుచికరంగా ఉన్నది. ఇది ఒకవిధంగా రామాయణానికి రాజనీతిపరమైన వ్యాఖ్యానగ్రంథం. ముఖ్యంగా ఈ రోజులలో రామరాజ్యం అని జపం చేస్తూ రావణరాజ్యం కంటె ఘోరాతిఘోరమైన పాలనావిధానంతో మానవతకు సమాధి కడుతున్న రాజకీయ నాయకులు తప్పక అనుశీలింపవలసిన ఉత్తమగ్రంథం.

భారతంలో మంత్రుల లక్షణాలను వ్యంగ్యంగా తెలియజేస్తూ మొదటగా పేర్కొన్న లక్షణం 'అనఘత్వం'. అది కలికానికి కూడా కనపడటం లేదు. ఇప్పటి పాలకనీతి పరమార్థం ఒక్కటే. అది నీతిపేరుతో పరమమైన అర్థాన్ని ఎంత స్వాయత్తం చేసుకోవటం అనేది. ఇంత సంక్లిష్టమైన ఈ కాలంలో కనీసం కొందరైనా హృదయసంస్కారం పొందటానికి, పొందించటానికి ఇటువంటి గ్రంథాలు ఎంతగానో ఉపకరిస్తాయి.

నేను గ్రంథంలోపలికి వెళ్లటం లేదు. ఎందుకంటే ఎక్కడ మునగటం, ఎక్కడ తేలటం అనేది తేలని విషయంగా మిగిలిపోతుంది. అందుకని స్థూలదృష్టితో గ్రంథగౌరవాన్ని గురించి ఈ నాలుగుమాటలూ వ్రాస్తున్నాను. ఆచార్య శాస్త్రిగారు ఈ గ్రంథరచన ద్వారా తెలుగుజాతికి మహోపకారం చేస్తున్నారు. సరిగా ఉపయోగించుకుంటే ఇది యౌగంధరాయణులను, చాణక్యులను రూపొందించటానికి సమర్థమైన శాస్త్ర గ్రంథం - ఇది నా విశ్వాసం. ఆచార్య శాస్త్రిగారిని మనసారా అభినందిస్తున్నాను.

30-6-3002 - *శలాక రఘునాథశర్మ*

రాజమండ్రి - 533 103

# ప్రథమాధ్యాయము

## 1. సంస్కృతాంధ్రములలో వచ్చిన రామాయణములు

### *1-1 రామాయణ విశిష్టత :*

ప్రాచీన భారతీయ సంస్కృతికి వేదము మూలమైనది. "వేదః ప్రాచేతసాదాసీత్ సాక్షాద్రామాయణాత్మనా" అని కీర్తింపబడినది రామాయణము. ఆదికవి వాల్మీకి మహర్షిచే రచింపబడ్డ ఆదికావ్యమైన శ్రీమద్రామాయణం భారతీయ భాషల్లోనేగాక ప్రపంచ సాహిత్య చరిత్రలోనే ఒక విశిష్ట స్థానాన్ని పొందింది. కాబట్టే ఇది భారతజాతీయ కావ్యంగా పేర్కొనబడింది[1]. రామాయణ కావ్య విశిష్టతను ప్రొఫెసర్ గ్రిఫిల్, విలియంజోన్స్, వింటర్‌నిడ్స్, మిస్ మేరీ స్కాట్ వంటి పాశ్చాత్య విద్వాంసులు పొగడటంబట్టి ఈ గ్రంథం ఖండాంతర ఖ్యాతి పొందిందనటంలో విప్రతిపత్తి లేదు.

శ్రీ మద్రామాయణం పెక్కు భారతీయ భాషల్లోనే గాక ఇతర ప్రపంచ భాషల లో కొన్నింటియందును రచింపబడింది. రామాయణకథను ఆధారంగా చేసుకుని అనేక స్వతంత్రగ్రంథాలు కూడా వెలిసాయి.

ప్రసిద్ధ సంస్కృతాంధ్ర రామాయణాల్లోని రాజనీతిని గురించి ఇక్కడ వివరించ దలచాను. కాబట్టి ముందుగా సంస్కృతాంధ్ర భాషల్లో వచ్చిన రామాయణ కథాత్మక కావ్యాలను రేఖా మాత్రంగా తెలియజేస్తాను.

### *1-2 రామాయణ కథాకావ్యములు :*

వాల్మీకి రామాయణం తరువాత సంస్కృతభాషలో శ్లోకరూపంలో వచ్చిన రామాయణాల్లో చెప్పదగినవి.

1. జ్ఞాన వాసిష్ఠంగా చెప్పబడు 'వాసిష్ఠరామాయణము'
2. సీతావిజయమనుపేరు గల 'వసిష్ఠోత్తర రామాయణము'
3. ఉమామహేశ్వర సంవాదరూపమైన బ్రహ్మాండపురాణాంతర్గతమైన అధ్యాత్మ రామాయణం'
4. సీత శతకంఠరావణుని సంహరించిన 'అద్భుత రామాయణం'
5. ఆనంద రామాయణం
6. ఆశ్చర్య రామాయణం
7. శ్రీ రామాయణ సారోద్ధారము

8. రామబ్రహ్మానంద కవి రచితమగు 'తత్త్వసంగ్రహరామాయణం'

9. శబ్దమంజరి యందలి రామానుజకవి రచితమగు 'బాల రామాయణం'

మొదలుగునవికాక ఇతరపురాణములందు, మహాభారతమునందును రామాయణకథ సంక్షిప్తంగా చెప్పబడింది. ఇవిగాక కొందఱు పండితకవులు సంస్కృతభాషలో రామకథను ద్వ్యర్థి, త్ర్యర్థి కావ్యాలుగా కూడ రచించారు.

## 1-3 ఆంధ్రభాషలో వచ్చిన రామాయణములు :

తెలుగుభాషలో వచ్చిన సాహిత్య ప్రక్రియలన్నింటియందును దాదాపు రామాయణకథ గ్రహింపబడింది. వీనిలో పద్యగద్యాత్మకంగా కావ్యపద్ధతిని అనుసరించి రచింపబడ్డవి, ప్రబంధ పద్ధతిననుసరించి రచింపబడినవి, ద్విపద ఛందస్సులో రచింపబడినట్టివి. రూపకాలుగా రచింపబడినట్టివి, కేవలం వచనరూపంలో రచింపబడినట్టివి. సంస్కృతకావ్యాలకు అనువాదాలైనట్టివి, అయిన గ్రంథాలు అనేకం ఉన్నాయి. ఇవన్నీ యథామూలంగాను స్వేచ్ఛానువాదాలుగాను సాగినవి.

## 1-4 తెలుగులో వచ్చిన ప్రసిద్ధమైన రామాయణాలు :

చంపూ పద్ధతిననుసరించి రామాయణ రచన చేసినవారిలో ప్రసిద్ధుడు ఎఱ్ఱాప్రెగ్గడ. ఈ రామాయణం నేడు అలభ్యము. కానీ ఎఱ్ఱన రామాయణం సకలవర్ణనాపూర్ణమై సంస్కృత రామాయణానుసారియైనట్లు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారు తెలిపియున్నారు. అట్లే తిక్కన నిర్వచనోత్తర రామాయణం 'ఉత్తరకాండ' కథకు మాత్రమే సంబంధించినది. తర్వాత పద్యరామాయణాలలో మొదటగా చెప్పదగినది భాస్కరరామాయణం. మరియొకటి ఆతుకూరి మొల్ల రచించిన 'మొల్లరామాయణం'. రఘునాథరాయల 'రఘునాథ రామాయణం'.

ద్విపదఛందస్సులో రామాయణాన్ని స్వతంత్రకావ్యంగా రచించిన కవులనేకమంది గలరు. ద్విపదరామాయణాలలో మొదటగా చెప్పదగినవి 'గోన బుద్ధారెడ్డి చే రచింపబడ్డ 'రంగనాథరామాయణము'. తరువాత చెప్పదగిదవి 'కట్టావరదరాజు రచించిన 'వరదరాజ రామాయణము' భోసల ఏకోజీ రచించిన 'ఏకోజీ రామాయణం'.

ప్రబంధ రీతిలో రచింపబడ్డ రామాయణాల్లో మొదటగా చెప్పదగింది శ్రీ అయ్యలరాజు రామభద్రకవి చే రచింపబడిన 'రామాభ్యుదయము'. తరువాత

రేవణూరి వెంకటాచార్యుడు రచించిన 'రామచంద్రోపాఖ్యానం, ఏనుగులక్ష్మణకవి రామవిలాసము, పసుపులేటి రంగాజమ్మ 'రామాయణ కథా సంగ్రహం' చెప్పదగినవి.

రామకథ ద్వ్యర్థికావ్యములు, త్ర్యర్థికావ్యములు, నిరోష్ఠ్య చిత్రకావ్యములుగా, అచ్చతెనుగు కావ్యములుగా అనేకులచే రచింపబడినవి. ఆధునికంగా విశ్వనాథ సత్యనారాయణగారిచే రచించబడిన 'రామాయణ కల్పవృక్షం' పేర్కొనదగింది.

ఈ ప్రకారం వివిధ సాహిత్య ప్రక్రియల్లో రామాయణం ప్రాధాన్యతను సంతరించుకొన్నది. రామాయణకథారచన ఇంతవరకు జరిగినదేగాక, ఇక జరుగుచున్నది, ఇకముందు జరుగునట్టిది.

***1-5 ఈ గ్రంథము వ్రాయుటకు గ్రహించిన ప్రసిద్ధ రామాయణములు :***

ఆదికవియైన వాల్మీకి 'విశ్వశ్రేయః కావ్యమ్' అను ఉత్తమ కావ్యప్రయోజనాన్ని గోరి ప్రపంచమునకు శ్రేయమును గల్గింపవలెనను సదాశయంతో రామాయణ రచన చేసినాడు. శ్రీరామునివంటి ఆదర్శమూర్తిని నాయకునిగా చేసి 'రాముని వలె ప్రవర్తింపవలెనని, రావణునివలె ప్రవర్తింపరాదని లోకానికి సందేశమిచ్చాడు. కథతోపాటు నాటి సమాజాన్ని గ్రంథంలో ప్రతిబింబింపజేసాడు. ఇందులో కవి తన గ్రంథం ద్వారా సందేశాన్నివ్వడం ప్రధానం. తర్వాతి కాలంలో కావ్యనిర్మాణపద్ధతులలో కొన్ని మార్పులు వచ్చాయి.

(1) సత్కావ్యము ధర్మార్థ కామమోక్షములయందును, కళలయందును నేర్పును, కీర్తిని, ప్రీతిని కల్గిస్తుందని భామహుడు చెప్పగా

(2) కావ్యము వలన యశస్సూ, అర్థమూ, వ్యవహారజ్ఞానమూ, అమంగళ పరిహారమూ, సద్యఃపరనిర్వృత్తియూ, ఉపదేశమునూ కలుగవలెనని మమ్మటుడు చెప్పెను. మనస్సును రంజింపజేయుటయే కావ్యప్రయోజనమైనది. అందుకొఱకు 'శబ్దార్థ వైలక్షణ్యాన్ని కవులు ఆశ్రయించుట జరిగినది.ఈ విధంగా వివిధ కాలాలలో వివిధ కవులచే రామాయణ రచన చేయబడినది. విషయమొక్కటే యైనప్పటికి కవులు రచనలో నేర్పును చూపించారు. ఈ దృక్పథంతో పరిశీలిస్తే సంస్కృత, ఆంధ్రభాషల్లో వివిధ కవులచే రచింపబడిన రామాయణాలన్నీ ప్రసిద్ధమైనవే. దేనికది విలక్షణమైనదే. కాబట్టి వివిధ కాలాలకు చెందిన, వివిధ సాహిత్యప్రక్రియలకు చెందిన సంస్కృతాంధ్ర రామాయణాల్లో ఐదింటిని మాత్రం యీగ్రంథంలో గ్రహించడం జరిగింది.

### 1-5-1 వాల్మీకి రామాయణము :

ఇది సంస్కృతభాషలో ప్రసిద్ధమైనది. తర్వాతికాలపు రామాయణరచనలకు ఆధారమైనట్టిది. ఈ మహేతిహాసము ధర్మార్థకామసంయుక్తమైన భారతీయ జీవన విధానమునకు అద్దం పట్టింది. ఏడుకాండలుగా, 24,000 శ్లోకములతో రచింపబడిన వాల్మీకిరామాయణం రామకథాసంవిధానమున సందర్భోచితముగా రాజ్యలక్షణాలను, రాజ్యాంగానికి సంబంధించిన పరిపాలనా విధానాలను గురించి విపులీకరించినది. పౌరులస్వేచ్ఛాస్వాతంత్ర్యాలకు రాజ్యాధికారంతో గల సంబంధాలను దౌత్య సంబంధాలను గూర్చి యిందులో విపులమైన వివరణగలదు.

పిమ్మట నాలుగు తెలుగు రామాయణాలను గ్రహించడం జరిగింది. ఇవి భిన్నకాలాల్లో, వివిధ సాహిత్యప్రక్రియలలో గూడి రచింపబడినవి. అందులో మొదటిది.

### 1-5-2. రంగనాథ రామాయణము :

ఇది ద్విపద ఛందస్సులో క్రీ.శ 1240 ప్రాంతమున గోనబుద్ధారెడ్డి చే రచింపబడినది. తెలుగు రామాయణాలలో మొదటిది. దేశీయమైన ద్విపదలో పూర్తి పద్యకావ్యంగా రచింపబడినది. పండిత పామరులకు ఉపకరించేవిధంగా తీర్చిదిద్దబడ్డ యీ గ్రంథములో బుద్ధారెడ్డి తొలుత "ఆదికవీశ్వరులైన వాల్మీకి చెప్పిన తెలుగున శ్రీరామచరిత్రము చెప్పుదును" అని చెప్పినప్పటికీ, అవాల్మీకములగు భిన్నములగు అంశములుకూడ యిందు గలవు. ఇందు 17,290 ద్విపదులున్నవి. ఆరుకాండలు గలవు. లలితపదమధురముగా సుందరశైలిలో రచింపబడినది.

కథాపరముగా మూలమునకు కొన్ని మార్పులు ఈ గ్రంథంలో చేయబడినవి. ఇంకనూ రాజ్యాంగపరిపాలనా విధానములు గూడ కొంతవరకు మూలానికి భిన్నంగా చెప్పబడినవి. ముఖ్యంగా రాజనీతి ఔన్నత్యాన్ని గురించి విశేషంగా చెప్పబడినది.

### 1-5-3 భాస్కర రామాయణము :

మార్గకవితారీతిలో గద్యపద్యాత్మకంగా తెలుగులో రచింపబడిన రామాయణాల్లో ఇది మొదటిది. ఇది క్రీస్తుశకం 14 వ శతాబ్దమునకు చెందినది. హుళక్కి భాస్కరుడు, మల్లికార్జునపండితుడు, కుమారరుద్రదేవుడు, అయ్యలార్యుడు అను నలుగురు కవులచే రచింపబడినదని పరిశోధకుల అభిప్రాయము. బహుకర్తృకమైన రామాయణాల్లో యిది మొదటిది. ఈ రామాయణంలో మల్లికార్జున భట్టు బాలకాండము,

కిష్కింధకాండము, సుందరకాండములను రచించినాడు. కుమారరుద్రదేవుడు అయోధ్యకాండమును రచించినాడు. భాస్కరుడు అరణ్యకాండమును, యుద్ధకాండమున మొదటిభాగమును రచింపగా, అయ్యలార్యుడు యుద్ధకాండము చివరిభాగమును పూర్తిచేసినాడు. ఇది బహుకర్తృకమైనను నిర్దిష్టమైన కవితారీతిలో స్వతంత్రానువాద విధానము గలిగి సుమనోహరమైన శైలీసౌకుమార్యములతో సాటిలేని మేటి గ్రంథముగా ప్రసిద్ధి చెంది పేరు పొందింది.

మూలమునకు భిన్నములగు కథాంశములే గాక రాజ్యాంగ పరిపాలనా విధానములు కూడా ఇందు పేర్కొనబడినవి. హనుమంతుడు రావణునకు చేసిన హితబోధ, రావణసుగ్రీవుల అధిక్షేపము మున్నగుచోట్ల రాజనీతి ప్రధానముగా చర్చించబడినది.

### *1-5-4* మొల్లరామాయణము :

ఆంధ్రకవయిత్రులలో ఆతుకూరి మొల్ల రామాయణ రచయిత్రులలో మొదటిది. ఈమె క్రీ.శ. 1581కి కొంత పూర్వకాలమునకు చెందినదని ఆరుద్రగారి అభిప్రాయము. ఈమె రచించిన తామాయణము సులభశైలిలో రచితమై ఆమెపేరనే 'మొల్లరామాయణము' అనుపేరుతో ప్రసిద్ధికెక్కినది. ఇది 871 గద్యపద్యములతో మనోజ్ఞముగా రచింపబడినది.

ఇందులో దశరథుని రాజ్యపరిపాలనావర్ణనమునందు, సీతాన్వేషణ విషయమున శ్రీరామచంద్రుడు చేయు ప్రయత్నములను హనుమంతుడు సీతకు తెలియజేసిన సందర్భమునందు, విభీషణుడు రావణునికి చేసిన హితబోధయందును మూలమునకు భిన్నముగా రాజనీతి అంశములు ప్రస్తావింపబడినవి.

### *1-5-5* రామాభ్యుదయము :

ఇది ప్రబంధయుగముకు చెందిన కవులలో ఒకడైన అయ్యలరాజు రామభద్రకవిచే రచింపబడినది. ఇది మహా ప్రబంధమని రామభద్రకవియే చెప్పియున్నాడు. ఇది పూర్తిగా ప్రబంధ లక్షణములు గల గ్రంథము. ఇందు కాండల విభజనలేక ప్రబంధ పద్ధతిలో ఆశ్వాసముల విభజనే కనిపించును. ఈ గ్రంథము క్రీ.శ. 1544 తరువాత రచింపబడినట్లుగా పరిశోధకుల అభిప్రాయము. ఇది ఎనిమిది ఆశ్వాసములతో 1800 గద్య పద్యములతో రచింపబడినది.

మూలానికి భిన్నంగా రాజ్యాంగ పరిపాలనా వ్యవస్థను గూర్చి ఇందు

సూచితమైనది. శుక, సారణులతో రావణుడు కోపముగా పలికిన మాటలను, దశరథుని వర్ణనమున, రావణుని వర్ణనమున, రాజ్యాంగ పరిపాలనా విశేషములు మూలమునకు భిన్నముగా వర్ణింపబడినవి.

మూలమగు వాల్మీకి 'రామాయణము' నందు, విభిన్నధోరణులతో భిన్న కాలముల యందు వెలసిన 'రంగనాథ', 'భాస్కర' 'మొల్ల' రామాయణములందు, రామాభ్యుదయమునందు పేర్కొనబడ్డ రాజ్యాంగ పరిపాలనా విధానములను చర్చించుట వల్ల ఉపయుక్తమైన రాజకీయం, సామాజిక అంశములు బహిర్గతములగుచున్నవి. రాజ్యం యొక్క విధులను, ఉత్తమ పాలనా విధానమును, రాజధర్మమును, మంత్రిపురోహిత విధులను, యుద్ధదౌత్యనీతులను, అంతర్గత రాజ్యాంగ విధానమును సంతరించుకొని పైన పేర్కొనబడిన రామాయణములు విశిష్ట రాజకీయ వ్యవస్థను అవగాహన చేసుకొనుటకుపకరించుచున్నవి.

ప్రాచీన భారతీయ పరిపాలనా విధానములను అవగాహన చేసుకోవటానికి కౌటిల్యుని అర్థశాస్త్రం ఉపకరిస్తుంది. అది అర్థవిషయములనేగాక దేశపరిపాలనా విధానమును గూడ అందించినది. తరువాత కాలమ్మున వచ్చిన 'కామందక నీతిసారము' సోమదేవుని నీతి కావ్యామృతము 'వైశంపాయనుని 'నీతిప్రకాశిక' 'శుక్రనీతి' 'మనుస్మృతి' మొదలగు గ్రంథములయందు రాజధర్మ ప్రబోధ నిర్దేశకతగలదు.

నీతిని నిర్లక్ష్యపరచి భ్రష్టత పొందవద్దని 'రామాయణం' రాజులకు హెచ్చరిక చేసింది. ఆత్మజయాన్ని పొంది దండనమును జాగ్రత్తగాచేస్తూ ప్రజలను కన్న బిడ్డలవలె కంటికి రెప్పవలె రాజు కాపాడవలెనని రామాయణం చెప్తున్నది. ఇంతేకాక ప్రజారంజకమైన పాలన, ప్రజాక్షేమం అతిముఖ్యమైనదని రామాయణం ప్రబోధించింది. రాజ్యాంగములు, ఉత్తమ పాలనా పద్ధతులు, ఆచరణముల వలన ఆంతర్యమును నిగూఢంగా సూచించిన రామాయణమును లోతుగా పరిశీలిస్తే మహోత్కృష్టమైన పరిపాలనా సంవిధానం తేటతెల్లముకాగలదు.

## పాదసూచికలు

1. రామాయణ సుధాలహరి - పేజి - 3.

# ద్వితీయాధ్యాయము

## 2. రామాయణము రాజకీయ వ్యవస్థ- నేపథ్యము

### 2-1 ప్రస్తావన :

ప్రాచీన భారతీయ సాహిత్యంలో అపారమైన వైజ్ఞానిక సంపదగలదు. అందుండి రాజకీయ, సామాజిక విలువలను అధ్యయనం చేయవచ్చును. మానవసమాజం సర్వతోముఖ వికాసం పొందడానికి ఆనాటి రాజులు అవలంబించిన పరిపాలనా పద్ధతులు తోడ్పడినాయి. వీని ద్వారా ప్రజల సంక్షేమం కోసం నేటి పాలకులు పాటించవలసిన విధానాలను తెలుసుకొనవచ్చును.

'దేశాన్ని పాలించడానికి ఏర్పడిన వ్యవస్థనే రాజకీయ వ్యవస్థ (Political system) అంటారు[1]. అట్టి రాజకీయ వ్యవస్థను స్పృశించే ముందు దానికి మూలమైన అంశాలను చర్చించడం అవసరం.

ఋగ్వేదంలో రామ, దశరథ[2] శబ్దములు, రామకథ[3] రామాయణ ప్రాచీనతను రూఢీ వరుస్తున్నది. రాజకీయ వ్యవస్థను అధ్యయనంచేసే రాజనీతి కూడ అతిప్రాచీనమైనదే. ఋగ్వేదంలో రాజనీతి, రాజధర్మం ప్రస్తావించబడింది[4]. రామాయణం అందించిన విశిష్ట రాజకీయ వ్యవస్థ అప్పటికప్పుడు సృజింపబడిన వ్యవస్థకాదు. జాతుల సహజ ధోరణులు, అంతకుముందు జరిగిన సంఘటనలు, వివిధ ప్రయత్నములు, రామాయణ కథాకాలంనాటి రాజకీయ వ్యవస్థకు ప్రధాన కారకములు.

### 2-1-1 జాతుల స్వభావములు - మానవజాతి.

రామాయణంలో ప్రధానంగా మూడుతరగతుల జాతివిభాగం కనబడుతున్నది. 1. నరులు 2. వానరులు 3. రాక్షసులు.

మానవజాతిగా పిలువబడే నరజాతికి చెందిన వారిలో శ్రీరాముడు ప్రధానుడు. సీత, లక్ష్మణుడు, దశరథుడు, జనకుడు, కౌసల్య, కైకేయి, మంథర వశిష్ఠుడు, విశ్వామిత్రుడు, గుహుడు, సుమంత్రుడు, భరతుడు మొదలగువారు

'నృనంతి నయంతి సర్వం స్వవశమితినరా:'[5]

సమస్తాన్ని తనవశం చేసుకొనేవాడు లేక వశంఅయ్యేలా చేసుకునేవాడు నరుడు. అట్టి నరునకు సంస్కారం, సభ్యత, వీరత్వం మొదలగు గుణాలుండాలి. అంతేగాక దివ్యతేజస్సుతో ప్రకాశించే దేవతలయెడ గూడ సఖ్యభావంతో ఆనాటినరులు

సంచరించేవారు. ఉదాహరణకు దశరథునివంటి మహాయోధులు దేవతలకు సహాయం చేసేవారు. అట్లే ఎందరో దైవసహవాసాన్ని పొందడానికి కఠోరమైన తపస్సును యజ్ఞయాగాదులను నిర్వహించేవారు. దుర్గరక్షణ సాధనాలు క్షీణించగా జనకమహారాజు దేవగణాన్ని ప్రసన్నంచేసుకొని చతురంగ బలాన్నిపొంది మిథిలానగరాన్ని రక్షించు కోవడంకోసం ప్రయత్నించడం మానవులకు దేవతలతో సంబంధాలుండుటను నిరూపించుచున్నది[6].

పుత్రకామేష్టి చేయదలచిన దశరథ మహారాజు దేవతలను, ఋషులను ఆహ్వానిస్తాడు. ఆసందర్భంలో లోక కంటకుడైన రావణుని వధ ప్రస్తావనకు రాగా దానికి రాజులు తమ అంగీకారాన్ని తెలియజేస్తారు. ఆ మేరకు ఒకవీరుని సుశిక్షితునిజేసి, రాజ్య రక్షణ, ప్రజారక్షణలను అప్పగించే ప్రయత్నాలు జరిగినవి. ఋషీశ్వరులును ఇందుకు సహకరించారు. విశ్వామిత్రుడు రామలక్ష్మణులను తన వెంట బెట్టుకొని తీసుకొనివెళ్లి మంత్రవిద్యలను నేర్పడం, శస్త్రాస్త్ర ప్రయోగోప సంహారాల్ని ఉపదేశించడం, రాజపుత్రుని కర్తవ్యాన్ని తెలియజెప్పటం, ఇతిహాస కథలను జెప్పడంద్వారా రాజకీయ తత్త్వోపదేశం జేయడం జరిగింది.

### *2-1-2* వానరులు :

కామరూపధరులు[7] చంచలమైన మనోవృత్తిగలవారు, వానరులు, వీరు మాయల నెఱిగినవారు[8] . అస్త్రములన్నింటియొక్క ప్రయోగోప సంహారములనెఱిగినవారు. వీరు ఎల్లెడల స్వేచ్ఛగా సంచరించువారు[9]. దేవతలు బ్రహ్మచే ఆజ్ఞాపింపబడినవారై వానర రూపము గలిగిన కుమారులను పుట్టించిరి[10].

వానరజాతిలో 1. కోతులు 2. కొండముచ్చులు 3. భల్లూకములు ఉన్నట్లు తెలియుచున్నది[11]. వాలి, సుగ్రీవుడు, అంగదుడు, హనుమంతుడు మొదటి విభాగమునకు చెందినవారు. కొండముచ్చులకు రాజు గవాక్షుడు. వీరు భయంకరమైన పరాక్రమముగలవారు. భల్లూకములలో వృద్ధవీరుడు జాంబవంతుడు ఈతని సోదరుడైన ధూమ్రుడు భల్లూకరాజు. పైనచెప్పబడిన వానరులనందఱిని పరాక్రమ వంతుడైన వాలి తన భుజబలముతో రక్షించును.

వింధ్యపర్వతములనుండి తామ్రపర్ణికి దక్షిణముగానున్న సముద్రము వఱకు వానరుల పరిపాలనలో ఉన్న ప్రాంతముగా తెలియుచున్నది. వానర రాజు వాలి లంకాధీశుడైన రావణుని ఓడించాడు. అందువలననే రావణుడు వాలితో స్నేహముజేసి

వానరరాజ్యాన్ని, వానర యోధులను తన పక్షంలో ఉండే ఏర్పాటుచేసుకొనెను.

తమ్ముడైన ఖరుని, చెల్లెలైన శూర్పణఖని, త్రిశిరుడను రాక్షసుని, రావణుడు జనస్థానము నందుంచెను. అంతేగాక భయంకర కృత్యములు జేయు శూరులును, మహోత్సాహులునగు పదునాలుగు వేలమంది రాక్షసులను గూడ ఉంచినాడు. వారందఱు ఖరునిమాట జవదాటక యుండిరి. రావణుడు ఈ విధమైన ఏర్పాటు చేయుటద్వారా వానరులకు మానవజాతి వీరులతో మైత్రి ఏర్పడకుండ నిరోధించుటకు ప్రయత్నించెనని తెలియుచున్నది. దీనిద్వారా రావణుని కుటిలనీతి తెలియుచున్నది. ఎట్లనగా బలవంతులగువానరులు ఏ పక్షంలో ఉంటే ఆపక్షమునకు విజయము తథ్య మని రావణుడు భావించెను[12]. దీనినిబట్టి వానర బలము అమేయమని తెలియు చున్నది.

ఆనాడు మానవజాతితో వానర జాతికి సంబంధములు దాదాపుగా లేవనియే చెప్పవచ్చును. దశరథుని పుత్రకామేష్టికి వానరుల నాహ్వానింపక బోవుట యిందులకు నిదర్శనము.

శ్రీరాముడు వాలిని వధించి సుగ్రీవుని రాజుగాచేయుటద్వారా అమేయమైన వానరబలముగూడ మానవజాతికి లభించినట్లయినది. రాక్షసవధకు వానరులతోడ్పాటు శ్రీరామునికి లభించుటవలన లోక కంటకుడైన రావణుని సంహరించుటలో వానరులు సమభాగులుగా వ్యవహరించిరి.

### 2-1-3 రాక్షసులు :

రాక్షసులు భయంకర రూపులు, షడ్వికార స్వరూపులు. అని ప్రాచీన గురు శ్రేష్టుల అభిప్రాయము[13]. రామాయణంలో రావణుడు, కుంభకర్ణుడు, విభీషణుడు, శూర్పణఖ, మారీచుడు, సుమాలి, ప్రహస్తుడు ఇత్యాదులు రాక్షసముఖ్యులు. లంక వీరి నివాసస్థానము. రావణుడు నియోగించిన కారణంగా 14,000 మంది ఖరుని అధీనమున జనస్థానమున నివసించిరి. వీరందరికి రాజు రావణుడే. రావణుని ఆజ్ఞానుసారం జనస్థానంలో నివసిస్తున్న ధర్మాత్ములైన మునులను బాధించెడివారు.

రాక్షసులు కామరూప ధరులు[14] వీరు ఆకారముచేతనేగాక స్వభావంచేతను గూడ భయంకరులే . తామస ప్రవృత్తి అధికంగా గలవారు. వీరిలో ఒక్క విభీషణుడు మాత్రమే సాత్వికుడు. ఇతడు ఉచిత కార్యములు నెరవేర్చుటయందు సమర్థుడు[15].

రాక్షసులు ధర్మవిధ్వంసకులుగా యజ్ఞయాగాది క్రతువులకు భంగము

గల్గించువారుగా గో(బ్రాహ్మణ భక్షకులుగా, దీర్ఘకాయులుగా, భయంకర రూపులుగా విజాతీయులుగా గుర్తింపబడినారు. వీరు భోగలాలసులు. ఆహారప్రియులు[16]. వీరికి నీతియన్నదే తెలియదు. వీరు మందబుద్ధులు. శత్రువులను గూర్చిన పరిజ్ఞానము శూన్యము. శరీరబలము మాత్రము మిక్కుటము[17].

రాక్షసరాజైన రావణుడు బ్రహ్మ అనుగ్రహముచే వరములను పొంది వర గర్వితుడై లోకాలను పీడించెను. అంతేగాక అధర్మ ప్రవర్తకుడయ్యెను. తత్ఫలితముగ రాక్షసజాతి వినాశము చెందినది. దశరథుని పుత్రకామేష్టి నాటికి రాక్షసులు రావణుని ఆజ్ఞచే మునిశ్రేష్ఠులను పీడించిరి. దేవతలను, గంధర్వులను, సిద్ధులను బాధించు చుండుటచే విశ్వామిత్రుడు రామలక్ష్మణులను ఆరాక్షసవీరులను సంహరించుటకుగాను దశరథుని కోరెను. అందుకు దశరథుడంగీకరించక నేనే ధనుస్సును ధరించి నీయాగ రక్షకుడనయ్యెదనని చెప్పెను. కారణమేమనగ అప్పటికి 16 సంవత్సరముల వయస్సుకూడ లేనివాడైన రాముడు రాక్షసులతో తలపడజాలడను భావన దశరథునికి గలదు. దశరథుని మాటనుబట్టి రాక్షసులనిన ఆనాటి మానవేంద్రులకు ఎంతటి భయముండెడిదో తెలియుచున్నది.

రాక్షసులు మాయోపాయులు, ఘనబలోన్నతులు, భీషణాకృతులు, విపుల గర్వాటోప బాహు బలులు, వీరు దుంపలు, పండ్లు, జలములను విషముచే కలుషితము చేయుటద్వారా శత్రువులనంతమొందించెడివారు[18]. గోతులలోను, వనములలోను, జలదుర్గముల యందును ఈ సైన్యములను దాచియుంచి శత్రువులను దెబ్బతీసెడివారు[19]. రాక్షస రాజ్యమగు లంకయందు ఉత్తమ మంత్రాలోచనలుసాగు చుండెడివి[20]. రావణుడు కొలువులో మంత్రులతో చర్చించి నిర్ణయముగైకొనెడివాడు. కోట సంరక్షణయందును యుద్ధవ్యూహ రచనయందును రాక్షసులు నేర్పరులే. కానీరాజైన రావణుడు అధర్మప్రవర్తకుడగుటచేతనే రాక్షస నాశనము సంభవించినది.

## 2-2 మానవజాతి అంతర్గతవైరములు :

త్రేతాయుగంలో రావణుడు తన రాక్షస కృత్యాలతో మానవజాతి తీవ్ర సంక్షోభాన్ని కలిగించాడు. దీనిమూలముగా మానవజాతి అంతర్గత వైరములతోనుండెను. ఉదాహరణకు పితృవధనుగూర్చి విన్న పరశురాముడు అనేకపర్యాయములు క్షత్రియములను సంహరించెను. కార్తవీర్యార్జునుడు మొదలగు

రాజులు బ్రాహ్మణుల ఆశ్రమాలను కొల్లగొట్టి నష్టపరిచారు. ఆకారణంగా అక్కడ ఉన్న సమస్త జాతుల వారికి క్షత్రియులతో శాశ్వతవైరం ఏర్పడింది. అప్పటి నుండి క్షత్రియవీరులు కరువైనారు. ఉన్న కొద్ది మంది రాజులూ బెదురుతూ రాజ్య పాలన చేశారు. ఇట్టి స్థితిలో వారు రాక్షసులంటే వణకిపోయారు. రావణుడు లోకాలను పీడిస్తున్నా అతనిని ఎదిరించే సాహసానికి వారుపూనుకొనలేరు. మేధావులైన ఋషులతో విరోధము క్షత్రియజాతిని మరింత దిగజార్చింది. ఆనాడు సకల జాతుల సమాగమనానికి యజ్ఞయాగాది క్రతువులు వేదికలుగానుండేవి. ఎట్లనగా దశరథుడు తలపెట్టిన పుత్రకామేష్ఠి యాగానికి నాలుగువర్ణములవారు, వివిధదేశాధిపతులు, దేవతలూ, గంధర్వులు, సిద్ధులు, మహర్షులు ఏతెంచినారు. బ్రహ్మాదిదేవతలు తమ తమ హవిర్భాగములను స్వీకరించుటకు ఒకచోట చేరిరి. ఆసమయముననే రావణవధార్థమై వీరందఱు చక్కని ఆలోచనచేసిరి. రావణునికి బ్రహ్మ అనుగ్రహించిన వరమునకు భంగము కలుగని రీతిలో ప్రణాళిక రూపుదిద్దుకొన్నది. మానవజాతిలోని ఉపజాతులన్నీ ఏకమై రాక్షసేతర జాతుల సహకారాన్ని పొంది రాక్షసజాతిని తుదముట్టించే యత్నాలు జరిగినాయి.

### *2-2-1* వానరజాతి స్థితి :

రామాయణకథారంభకాలానికి అపారమైన వానరబలము వాలి అధీనమున నుండెను. దేవేంద్రునితో సమానమైన బలముగల[21] వాలి, మహాబుద్ధిశాలి. యుద్ధకుశలుడు. సమర్థుడు. కిష్కింధను రాజధానిగా చేసుకొని వానరరాజ్య పాలనమునుగావించెను. పితృ పైతామహమగు ఈ రాజ్యమును తండ్రియైన ఋక్షరజసుడు మరణించగా వాలికి ప్రాప్తించినది[22]. సుగ్రీవుడు తండ్రియందు వలెనే ఆదరభావముతో వాలిని సేవించెను. రావణునితో వానర జాతి మైత్రితో వ్యవహరించినది. వాలి దురహంకారముతో సుగ్రీవుని నగరము నుండి వెడలగొట్టి అతని భార్యనపహరించినాడు. సుగ్రీవుడును, ఆతని మంత్రులు ఋష్యమూక ప్రాంతమున చరించిరి. ఆస్థితిలో అపారమగువానరబలము సుగ్రీవుని వెంట గలదు.

### *2-2-2* రాక్షసజాతి స్థితి :

లంకా రాజ్యానికి రావణుడు రాజుగా ఉండగా లంకాపట్టణము దుర్భేద్యముగా రక్షింపబడుచుండెను. లంకకు కావలిగా కామరూపములో స్త్రీరూపమున 'లంకిణి' ఉండెను. కొందఱు రాక్షసులలో వేదాధ్యయన పరులుండిరి. జడధారులు, ముండిత

మస్తకులు, వృషచర్మధారులు, తాంత్రికులు, అగ్నికుండముల నాయుధములుగా గలవారు రాక్షసులలో నుండిరి. రావణుని పాలనమున రాక్షసులు భోగలాలసులుగా, పరహింసాపరాయణులుగా నుండిరి.

### *2-2-3 జాతుల సమీకరణ : పునరేకీకరణ :*

దశరథుని పుత్రకామేష్టియందు రావణుని వధకొఱకు రూపొందించబడిన ప్రణాళికలో భాగంగా శ్రీరాముడు పితృవాక్యానుసారియై సీతాలక్ష్మణులతో అడవులకు బయలుదేరుటతో కార్యరూపం ధరించినది. మేధావులైన మహర్షుల అనుగ్రహం శ్రీరామునికి లభించినది. అంతేగాక పక్షి సంతతకి చెందిన జటాయువు, సంపాతి సహాయంకూడ తోడైనది[23]. ఇంతవరకు రావణునికి మిత్రులుగా నున్న వానరులను మానవజాతివైపు మళ్లించే ప్రయత్నంజరిగింది. ఎట్లనగా తన శత్రువునకు మిత్రుడగు వాలికి సుగ్రీవుడు శత్రువు. సుగ్రీవునికి అండగానిలిచి శత్రువు యొక్క మిత్రుని (వాలిని) శ్రీరాముడు నిర్జించినాడు. వానిని వధించుటవలన రావణునికి సగంబలము తగ్గిపోయింది. ఈ విధంగా శ్రీరాముడు రాజకీయ చాతుర్యాన్ని ప్రదర్శించాడు.

వాలి వధానంతరం కిష్కింధకు సుగ్రీవుడు రాజుకాగా అసంఖ్యాకమైన వానరబలం సుగ్రీవునకు మిత్రుడైన శ్రీరామునికి తోడుగా నిలిచింది. తపస్సంపన్నులు, విద్యావేత్తలు యజ్ఞ దీక్షా పరులగు మునులు శ్రీరాముని యెడల అనుగ్రహాన్ని ప్రదర్శించిరి. వశిష్ఠుడు విశ్వామిత్రుడు, శరభంగుడు, అగస్త్యుడు మొదలగు మహర్షులు క్షత్రియ వీరుడగు శ్రీరామునికి సహాయాన్ని అందించారు. ఈ ప్రకారం భిన్నజాతుల సమీకరణ, పునరేకీకరణములు దుష్కరమైన లంకపై దాడిచేసి రాక్షసవధ గావించుటకు మార్గమును సుగమము చేసినవి.

### *2-2-4 క్షాత్ర ఆధిపత్య పునరుద్ధరణ :*

రావణుని వధించుటవలన ప్రజలకు స్వస్థత చేకూరింది. రాజ్యంలోని కొండలు, వనాలు, అరణ్యాలయందున్న మృగాలు, పక్షుల, మనుష్యుల నిగ్రహానుగ్రహం ఇక్ష్వాకులదిగా నిరూపించబడింది[24]. క్షత్రియులకుగల ధర్మాల్లో మొదటిది ప్రజారక్షణ. ఆవిషయం రావణవధద్వారా ప్రకటించబడింది.

### *2-2-5 మానవ - వానర - రాక్షస రాజ్యాలు :*

రామాయణంలో ప్రధానంగా మానవ - వానర - రాక్షస రాజ్యాలకు ప్రతిబింబంగా కోసల, కిష్కింధ, లంకారాజ్యాలు కానవస్తున్నవి. ఈమూడు రాజ్యాలకు

కొద్దిపాటి తేడాలున్నప్పటికి సమానధర్మాలు పెక్కుకానవస్తున్నవి. మూడు రాజ్యాలలోను పటిష్టమైన రాజకీయ వ్యవస్థ రూపుదాల్చింది. మంత్రాలోచనలు, యువరాజు నియామకం, రాజ్య పట్టాభిషేకం, ధర్మపరిపాలన, మేలైన అంతర్జాతీయ సంబంధాలు మొదలగువాటిని మూడింటియందు సమానంగా చూడగలం. ముఖ్యంగా ప్రజాసంక్షేమమే పాలనయొక్క పరమార్థం అనే సత్యాన్ని మూటియందు ఆవిష్కరింపబడింది. ప్రజాపరిపాలన, ఆర్థిక న్యాయ పాలనలయందు ప్రజాసంక్షేమానికి ఇవ్వబడ్డ ప్రాధాన్యాన్ని ఇందు పరిశీలించడంద్వారా మనం గుర్తించగలం.

### *2-2-6 రాజ్యాంగాల సమన్వయం :*

స్థూలంగా రాజు - రాజ్యములను కౌటిల్యునిచే పేర్కొనబడ్డ సప్తాంగ యుక్తమైన రాజ్యాంగాల అధికారులకు, సమన్వయానికి పురోగతికి, రామాయణం చక్కని మార్గం ఏర్పరచింది. రాజ్యం సులక్షణమై ప్రజాసంక్షేమానికై పాటుపడటానికి అవసరమైన రాజ్యాంగశక్తులను రామాయణం తీర్చిదిద్దింది. నిరంకుశ ధోరణికి ఎంతమాత్రం అవకాశమీయలేదు. రాజకీయ, సమాజ స్వరూపాన్ని పరిరక్షించే పద్ధతుల్ని సూచించింది.

### *2-2-7 పరిపాలనా వైశిష్ట్యము :*

పరిపాలన అంతిమ ప్రయోజనం. ప్రజాసంక్షేమమే అను మూలాభిప్రాయంతో రామాయణం విశిష్ట పరిపాలనా పద్ధతులను అందించింది. ముఖ్యంగా అయోధ్యకు సంబంధించిన దశరథుని, శ్రీరాముని పాలనావిశేషాలు వారి పరిపాలనా పరమార్థాన్ని నిరూపిస్తున్నాయి.

ఉత్తమ పాలనను ప్రజలు ఆమోదించెదరనియు అట్టిపాలనలో పౌరులు తమ అభిప్రాయములను స్వేచ్ఛగా వ్యక్తీకరించగలిగెదరని[25] రామాయణం నిరూపించినది. విధాన నిర్ణయాలను అందఱు ఏకగ్రీవ ఆమోదంతో అమలుపరచువ్యవస్థ ఆనాడుండేది. పాలనలోని మెలకువలను రాజకుమారులు చిన్నప్పుడే గురువులద్వారా అభ్యసించేవారు.

రాజ్యాధికారం చేపట్టి నిర్వహించేటప్పుడు సమస్త కార్యాలను స్వయంగా నిర్వహించడానికి రాజుకు వీలుండదు. కాబట్టి మంత్రి, పురోహితుడు, యువరాజు, చమూపతి, ద్వారపాలకుడు, నగరాధ్యక్షుడు, సభాధ్యక్షుడు, దండపాలురు మొదలైన అధికారులు రాజ్య కార్యకలాపాలను నిర్వహిస్తుంటారు. రాజ్యాంగంలోని అధికారులందఱు రాజుకు విధేయులే. రాజువ్యక్తిగతంగా గూఢచారుల ద్వారా

రాజ్యంలోని సమస్తవిషయాలు ఎప్పటికప్పుడు గ్రహిస్తుంటాడు. ప్రజాభిప్రాయాలను అతడు గ్రహించి మన్నించాలి. రాజ్యం వెలుపలి విషయాలను గూడ జాగ్రత్తతో కనిపెట్టి తదనుగుణంగా వ్యవహరించాలి. నాడు రాజు ఉత్తమ పరిపాలకునిగా వ్యవహరించేవాడు. నిరంతరమూ ప్రజాసేవకుడిగా జవాబుదారీ వహించే వానిగా ప్రవర్తించేవాడు. రామాయణము అందించిన ఈ విశిష్ట పరిపాలనా పద్ధతులు నేటికిని మార్గదర్శకములు, ఆచరణీయములు.

***2-2-8- విదేశాంగనీతి :***

రాజు సరియైన విదేశాంగ నీతిని అవలంబించినపుడు మాత్రమే రాజ్యాభివృద్ధి, రాజ్యసంక్షేమం సాధ్యవడుతుంది. దశరథుడు, శ్రీరాముడు, సుగ్రీవుడు విదేశాంగనీతినెఱిగి చక్కగా ఆచరణలో పెట్టినారు. పొంచియున్న ప్రమాదాన్ని గ్రహించి దానినెదుర్కొనడానికి మంత్రాలోచనచేసి విదేశాంగ విధానాన్ని నిర్ణయించుకోవలెను.



## పాదసూచికలు

1. కేంద్ర రాష్ట్ర సంబంధాలు - పుట.1
2. ఋగ్వేదం - 10-73-41
3. ఋగ్వేదం - 10-3-3,10-13-14
4. ఋగ్వేదం - 10-173-174
5. వాల్మీకి - రామాయణ వ్యాఖ్యానం-పుట 8
6. వాల్మీకం - బాల-66-22-24
7. వాల్మీకం - బాల- 17-21, 25-16
8. వాల్మీకం - బాల - 17-5
9. వాల్మీకం - బాల - 17-23
10. వాల్మీకం - బాల - 17-7
11. వాల్మీకం- బాల - 17-18
12. వాల్మీకి రామాయణ వ్యాఖ్యానము-పుట-5,
13. వాల్మీకి - రామాయణ వ్యాఖ్యానం - పుట.10
14. వాల్మీకం - అరణ్య- 43-51
15. వాల్మీకం - సుందర - 2-3
16. వాల్మీకం - సుందర - 9-30
17. వాల్మీకం - యుద్ధ - 7-2
18. వాల్మీకం - యుద్ధ - 4-12
19. వాల్మీకం - యుద్ధ - 4-13
20. వాల్మీకం - యుద్ధ - 6-2-19
21. వాల్మీకం - కిష్కింధ - 11-21
22. వాల్మీకం - కిష్కింధ - 9 - 2
23. రంగనాథ - కిష్కింధ - పేజి - 267
24. వాల్మీకం - కిష్కింధ - 18.6
25. రంగనాథ - అయోధ్య - 74, 95, 97 పుటలు.

# తృతీయాధ్యాయము

# 3. రాజ్యం - సప్తాంగములు

## 3-1 రాజ్యం-ఆవిర్భావం

### *3-1-1.* రాజ్యం :

రాజ్యమనే మాటకు మనప్రాచీన సాహిత్యంలో నిర్దిష్టమైన నిర్వచనంలేదు. కానీ వివిధ అంగాల సమిష్టి ప్రయత్నం రాజ్య నిర్వచనాన్ని తెలియజేస్తుంది. నిర్దిష్టమైన రాజకీయ ఆధిపత్యము కలిగిన సాంఘిక వ్యవస్థగా రాజ్యం చెప్పబడుచున్నది. రాజ్యం ఒక్కసారిగా ఆవిర్భవించినది కాదు. భిన్న సామాజిక కార్యకలాపాలు శాంతియుతంగా కొనసాగడానికి రాజ్యాన్ని ఉద్దేశించారు. దీన్నిబట్టి రాజ్యం ఒకసామాజిక వ్యవస్థగా చెప్పబడినది. పరిపాలనావశ్యకతయే రాజ్యనిర్మాణానికి దారితీసినదనటంలో సందేహంలేదు. రాజ్య ఆవిర్భవానికి సంబంధించి ఏర్పడిన పలు సిద్ధాంతాలు రాజ్యావిర్భవానికి మూలములగు అంశములను స్పష్టపరుస్తున్నవి.

రామాయణంలో రాజ్యోత్పత్తికి సంబంధించిన ప్రస్తావన పరోక్షంగా ఉన్నది. వశిష్ఠుడు సీతారామ కళ్యాణానికి ముందు జనకునితో దశరథుని వంశక్రమాన్ని తెలిపిన సందర్భంలోను[1], చిత్ర కూటమున వశిష్ఠుడు శ్రీరామునకు లోకోత్పత్తిని గురించి తెల్పిన సందర్భంలోను[2], రాజ్యోత్పత్తిని గూర్చి ప్రస్తావించబడింది. దీని ప్రకారం పరబ్రహ్మమున పుట్టినవాడగు బ్రహ్మకు మరీచి, మరీచి వలన కాశ్యపుడు జన్మించెను. వానికి వివస్వంతుడు, వానికి మనువు జన్మించిరి. ఆ మనువు కుమారుడే ఇక్ష్వాకుడు. సమస్తమైన భూమిని ఆ మనువు ఇక్ష్వాకునకు ఇచ్చాడు. ఇక్ష్వాకుడు అయోధ్యకు మొదటిరాజు. మనువునకు చాతుర్వర్ణ్యయుక్తమగు మానవులు జన్మించిరి.

దైవం వలన జలముపై భూమి నిర్మింపబడినది[3]. పిమ్మట పరబ్రహ్మము నుండి దేవతలు, బ్రహ్మసృష్టింపబడినారని తెలియుచున్నది[4]. అట్టి బ్రహ్మ చాల కాలము వినాశము లేకుండా ఉన్నాడు. అట్టి స్థితిలో శ్రీ మహావిష్ణువు వరాహరూపంలో ఉద్భవించి జలమయమైన భూమిని ధరించినపుడు[5] బ్రహ్మకు నాల్గవ తరంవాడైన ఇక్ష్వాకునకు ఇచ్చినాడని చెప్పడాన్నిబట్టి రాజ్యం దైవనిర్ణితము, దైవదత్తమని తెలియుచున్నది.

అయోధ్యకు మొదటి రాజైన ఇక్ష్వాకువు మొదలు రాజ్యాధికారాన్ని చేపట్టిన రాజులందఱు వీరులు, సత్యవాక్కులు[6]. ఇక్ష్వాకు వంశీకులలో మొదట పుట్టినవాడే

రాజగుట గలదు[7] . తన పూర్వులననుసరించిన పద్ధతినే దశరథమహారాజు ప్రజాభిప్రాయానికి విలువనిచ్చాడు. దాన్నిబట్టి తనజ్యేష్ఠ కుమారుడైన శ్రీరామునకు యౌవరాజ్య పట్టాభిషేకము చేయుదలచి పౌరజానపదుల అభిప్రాయాన్ని తెలుసుకోదలచాడు ("మీరు ఈ రీతి సమ్మతించె అనుచు తెలుసుకొనగోరెను[8]) ఆసమయంలో ప్రజలు ఏకవాక్యంగా రామ పట్టాభిషేకమునకు సమ్మతమును దెలిపిరి. అపుడు దశరథుడు "నాలో ఏలోపాలున్నవని నన్ను కాదని ఇంకొకళ్ళను రాజుగా చేసుకుంటున్నారు" అని అడుగగా దానికి వారు 'తమరు అలసిపోయినందున, తమరే రామునికి రాజ్యాన్ని అప్పగించవలెనను అభిప్రాయమును తెలిపినందు వలన మేమంగీకరించినామని" చెప్తారు. దీన్ని బట్టి ఆకాలంలో రాజుకూడా ప్రజాభిప్రాయాన్ని సమగ్రంగా తెలుసుకొని పట్టాభిషేకం చేయడానికి సిద్ధపడినట్లు తెలుస్తుంది. దశరథుని మరణానంతరం శ్రీరాముని ప్రతినిధిగా రాజ్యాధికారాన్ని స్వీకరించిన భరతుడుకూడా ప్రజాభిప్రాయానికి అనుగుణంగానే వ్యవహరించి రాజ్యాన్ని కాపాడాడు[9]. పదునాలుగేళ్ల అనంతరం రాజ్యాధికారం స్వీకరించిన రాముడు ప్రజలను తండ్రివలె రక్షించాడు. అంతేగాక ప్రజాభిప్రాయాన్ని ఎప్పటికప్పుడు గ్రహిస్తూ శ్రీరాముడు మేలైన రాజ్య పాలన గావించాడు.

### *3-1-2* రాజ్య స్వభావము :

రామాయణంలో ముఖ్యంగా కనబడే కోసల, కిష్కింధ, లంకారాజ్యాలలో రాజ్యాంగ సంపద పుష్కలంగా ఉన్నది. ముఖ్యంగా కోసల రాజ్యాధిపతియగు దశరథుడు ప్రకట రాజ్యాంగ సంపన్నుడై యున్నట్లు తెలుస్తున్నది[10].

రాజ్యాంగానికి సంబంధించి యాజ్ఞవల్క్య స్మృతిలో, గౌతమస్మృతిలో, విష్ణుధర్మ సూత్రాలలో, మనుస్మృతిలో, కౌటిల్యుని అర్థశాస్త్రంలో అనేకనిర్వచనాలు ఇవ్వ బడినాయి. దాన్నిబట్టి 1. రాజు 2. అమాత్యుడు 3. రాష్ట్రం 4. కోశం 5. సైన్యం 6. మిత్రుడు 7. పురం. అని సప్తాంగాలుంటే అది రాజ్యమని పిలువబడుచున్నది. శుక్రనీతిసారం సప్తాంగాలను మానవ శరీరభాగాలతో పోల్చిచెప్పింది[11].

రాజు శిరస్సుగా, మంత్రులు కన్నులుగా, చెవులుకోశంలా, సైన్యం మనస్సులా, దుర్గం చేతులుగా, రాష్ట్రం పాదాలుగా పోల్చబడినవి. ఇట్టి సమన్వయం ద్వారా మానవమనుగడకు శరీరాంగాలు దోహదపడే విధంగానే రాజ్యాంగాలు రాజ్యముల మనుగడకు దోహదపడుచున్నవని స్పష్టమగుచున్నది. రాజ్య నిర్వహణలో సప్తాంగాల

సమష్టి ప్రవర్తన ప్రధానమైన భూమికను పోషించును. రాజ్యం సుభిక్షం కావడానికి ఇవి ఎంతైనా అవసరం. రాజ్యరక్షణ, ప్రజాసంక్షేమములను సాధించడం రాజ్యానికి గల రాజ్యాంగాల సమన్వయ ప్రవర్తన మీదనే ఆధారపడియున్నది.

*3-2-1 రాజు :*

రాజ్యానికి కావలసిన ఏడు ప్రధానాంగాలలో ప్రధానంగా పేర్కొనబడునది రాజు. ఇతడు రాజ్యమనే రాజకీయ సౌధానికి పునాదిరాయి వంటివాడు. 'రాజన్' శబ్దానికి, 'రాజృదీప్తౌ' అనే ధాతువు మూలమని నిరుక్తము. 'రాజ్' అంటే ప్రకాశించేది అని అర్థం. ప్రజలను రంజింపజేసేవాడు కాబట్టి 'రంజ్' అనేధాతువునుండి కూడ రాజశబ్దం వచ్చిందని చెప్పవచ్చు. 'క్షత-త్రయ్' అనే ధాతువులనుండి క్షత్రియశబ్దం నిష్పన్నమైనది. అంటే గాయము నుండి ఉపద్రవము నుండి స్వస్థత చేకూర్చేవాడు క్షత్రియుడు. "క్షత్రియై ర్ధార్యతే చాపో నా ర్తశబ్దో భవే దితి" అని రామాయణమున చెప్పబడినది[12].

మంచి లక్షణములు కలిగియుండి విద్యావినయసంపన్నుడైన రాజకుమారుడు పట్టాభిషేకము నుండి రాజ్య రక్షణ, ప్రజాసంక్షేమములకై నిరంతరం పాటుపడవలెను. సాధారణ ప్రజాపాలన, న్యాయపాలన, ఆర్థిక పాలనను ఇతడు సమర్థవంతంగా నిర్వహింపవలెను. అంతేగాక రాజు ధార్మికుడై యుండవలెను.

*3-2-2 రాజు - ఆవిర్భావము :*

రాజ్యాంగాలన్నింటిలోను కేంద్రబిందువనదగు రాజు పుట్టుక విషయమై మనువు

"అరాజకే వా లోకేస్మిన్ సర్వతో విధ్రుతో భయాత్।
రక్షార్థమస్య సర్వస్య రాజాన మసృజ త్ప్రభు: ॥
ఇంద్రానిల యమార్కాణా మగ్నే శ్చ వరుణస్య చ
చంద్రవిత్తేశయో శ్చైవ మాత్రా నిర్హృత్య శాశ్వతీ: ॥[13]

రాజులేని కారణముగా జగత్తు బలవంతులవలన భీతిచే బాధపడుతుంటే బ్రహ్మజగద్రక్షణకురాజును ఇంద్రుడు, వాయువు, యముడు సూర్యుడు, అగ్ని, వరుణుడు, చంద్రుడు, కుబేరుడు మొదలగు వారి అంశలతో సృజించెనని తెలిపెను. దీనినిబట్టి జగద్రక్షణకు దేవతాంశములచే రాజు సృజింపబడెనని తెలియుచున్నది.

*3-2-3 రామాయణము - రాజావిర్భావము :*

రామాయణము ప్రతిపాదించిన రాజ్యోత్పత్తి సిద్ధాంతమునందు కూడ మూలపురుషుడు బ్రహ్మయే. బ్రహ్మకు ఐదవతరానికి చెందిన మనువు కుమారుడగు ఇక్ష్వాకువు సమృద్ధిగల భూమికి మొదటి రాజు కాగలిగెనని తెలియుచున్నది.

వాల్మీకి రామాయణాన్ననుసరించి వశిష్ఠుడు జనకునితో దశరథుని వంశాన్ని గూర్చి తెలిపే సందర్భంలో[14], అరణ్య వాసంలో ఉన్న శ్రీరామునితో వశిష్ఠుడు లోకోత్పత్తిని గూర్చి తెల్పే సందర్భంలో[15], ప్రజాపతియైన మనువు కుమారుడు ఇక్ష్వాకువే మొదటిరాజుగా చెప్పబడినాడు. రంగనాథరామాయణంలోకూడ పై రెండు సందర్భాలలోను ఇట్టిక్రమమే యున్నప్పటికి ఇక్ష్వాకువే మొదటి రాజని మాత్రములేదు[16]. అట్లే భాస్కర రామాయణంలో కూడ వశిష్ఠుడు జనకునికి దశరథుని వంశ క్రమాన్ని చెప్పే సందర్భంలో కూడ ఇక్ష్వాకువు మొదటిరాజని పేర్కొనబడలేదు[17]. వశిష్ఠుడు శ్రీరామునికి లోకోత్పత్తిని గూర్చి చెప్పుటయు లేదు.

మొల్ల రామాయణం, రామాభ్యుదయములలో రాజుపుట్టుకను తెల్పు సందర్భములు లేవు.

రాజుదైవాంశ సంభూతుడను విషయము వాల్మీకమున గలదు.

పంచరూపాణి రాజానో ధారయన్నమితతేజసః।
అగ్నేరింద్రస్య సోమస్య వరుణస్య యమస్య చ[18]॥

దీనిని బట్టి రాజులు అగ్ని, ఇంద్ర, సోమ, వరుణ, యమాంశలతో గూడి ఐదు గురి రూపములు దాల్చి యుండెదరని తెలియుచున్నది.

"జేష్ణ్యం తథా విక్రమం చ సౌమ్యం దండం ప్రసన్నతామ్।
ధారయన్తి మహాత్మానం రాజానః క్షణదాచరః"॥[19]

మహాత్ములగు రాజులు అగ్నియొక్క వేడినీ, ఇంద్రుని యొక్క పరాక్రమాన్ని, చంద్రుని యొక్క చల్లదనాన్ని, వరుణిడి ప్రసన్నతను, యముని యొక్క దండమును ధరించెదరని తెల్పెను. దీనిననుసరించి రాజు దైవాంశసంభూతుడని తెలియుచున్నది.

***3-2-4* రాజు - అర్హతలు :**

మనువు రాజను నామానికి అర్హతను తెల్పుచూ

"శుచినా సత్యసంధేన యథాశాస్త్రానుసారిణా।
ప్రణేతుం శక్యతే దండ స్సుసహాయేన ధీమతా॥[20]

శుచిమంతుడు, లోభరహితుడు, సత్యసంధుడు, శాస్త్రము తెలిసినవాడు, మంచి సహాయము చేయువాడు, తత్త్వజ్ఞుడు, సకల లక్షణోపేతుడు, సుసంపన్నుడైనవాడు, రాజుగా ఉండాలని పేర్కొనెను. ఆకర్షణ, ప్రజ్ఞ, ఉత్సాహగుణములను, ఆత్మ సంపదలను గూర్చి కౌటిల్యుడు రాజునకుండవలసిన లక్షణములను చెప్పెను[21].

*3-2-5 రామాయణము - రాజు అర్హతలు :*

రామాయణంలో రాజుకు ఉండదగు విశిష్ట గుణాలను నిర్ణయించి రాజార్హతలను స్పష్టపరచినది.

"దమ: శమ: క్షమాధర్మో ధృతిసత్య పరాక్రమ: ।
పార్థివానాం గుణా: రాజన్ దండాశ్చ వ్యపకారిషు[22] ॥ అనియు
"సామ దానం క్షమా ధర్మః సత్యం ధృతి పరాక్రమౌ।
పార్థివానాం గుణా రాజన్ దండ శ్చా వ్యపకారిషు[23]॥

ఇంద్రియజయము, చిత్తశాంతి, ఓరిమి, ధర్మము, ధైర్యము, సాంత్వనము, దానం, సత్యము, పరాక్రమము, అపరాధులను శిక్షించుట మొదలగునవన్నియు రాజ గుణములుగా పేర్కొనబడినవి.

ఇదే సందర్భమున రంగనాథరామాయణంలో :

'దమమును శమమును దయయు సత్యంబు
సమబుద్ధియును నీతి సౌమనస్యంబు [24] అని రాజుకుండవలసిన గుణముల ప్రస్తావన గలదు.

భాస్కర రామాయణములో :

కం॥ శమమును దానము ధర్మము క్షమయును పటు విక్రమంబు సత్యంబును శీ
లము దుర్జన శిక్షయు భూ రమణునకుం గలుఁగవలయు రాజితగుణముల[25]

అని వాలి శ్రీరామునితో పలుకుటను బట్టి రాజుకుండవలసిన గుణములు తెలియుచున్నవి.

*3-2-6 రాజు - విద్యలు :*

విద్యలలో సుశిక్షితుడైనట్టి రాజకుమారుడే రాజుగావలయునని 'మనుస్మృతి' 'అర్థశాస్త్రములు పేర్కొనినవి.

"తేభ్యోధిగచ్ఛేత్ వినయం వినీతాఽత్మాపి నిత్యశ:
వినీతాత్మా హి నృపతి: న వినశ్యతి కర్హిచిత్" [26]

సహజ బుద్ధిచేతను, అర్థశాస్త్రము మున్నగు వాని యందలి జ్ఞానముచేతను రాజు సుశిక్షతుడైనను, వినీతాత్ములగు పెద్దలకడ నీతిని నేర్వవలెను. సుశిక్షితుడైన రాజు ఎన్నడు నశింపనేరడు.

"త్రైవిద్యేభ్యస్త్రయీం విద్యాం దండనీతించ శాశ్వతీమ్।
ఆన్వీక్షకీంచా ఆత్మవిద్యాం వార్తారంభాంశ్చ లోకత:" [27]

వేదములు మూడింటినీ ఎఱిగిన వాని నుండి ఋగ్యజుస్సామవేదాలనూ, దండనీతిని, బ్రహ్మవిద్యను, తర్క శాస్త్రమును (సుఖ దు:ఖములందు ఒకే రీతిగా నుండుటను) కృషి , వర్తకము మొదలైన విషయాలను రాజు ఆయా విషయజ్ఞుల వలన నేర్చుకొన వలయునని 'మనుస్మృతి' ప్రతిపాదించింది. 'అన్వీక్షకీ, త్రయీ, వార్త, దండనీతి అను నాలుగును రాజ విద్యలుగా కౌటిల్యుడు పేర్కొనెను[28]. విద్యలలో శిక్షతుడైనరాజు ప్రజలను వినయ వంతులుగా చేయుటయందు శ్రద్ధ వహించి సర్వభూతాలకీ హితాన్ని చేయుటయందు అనురక్తుడై భూమిని ఏకచ్ఛత్రాధిపత్యంగా పాలించునని కౌటిల్యుడు రాజ విద్యలను గుఱించి విశదముగా తెల్పెను[29].

**3-2-7 రామాయణము - రాజ విద్యలు :**

రామాయణ కాలంలో రాకుమారులు విద్యయందు సుశిక్షతులై రాజ్యాధికారాన్ని చేపట్టేవారు. జ్యేష్ఠుడు, శ్రేష్ఠుడు అగు రాకుమారుడే రాజ్యాధికారాన్ని చేపట్టే అవకాశం ఉన్నప్పటికి తక్కిన రాకుమారులు కూడ విద్యలయందు సుశిక్షతులై సద్గుణ సమన్వితులై రూపొందెడివారు. దశరథ మహారాజుయొక్క నలుగురు కుమారులు

"సర్వే వేదవిద: శూరా: సర్వే లోకహితే రతా:।
సర్వే జ్ఞానోప సంపన్నా స్సర్వే సముదితాగుణై:" [30] ॥

సర్వవేదములను అధ్యయనమొనరించి వేదార్థములనెఱిగిన వారైరి. సర్వలోక హితమునందు ప్రవర్తించువారు, జ్ఞానసంపన్నులూ సకల సద్గుణ సమన్వితులైనవారని వారని వాల్మీకి రామాయణము పేర్కొనెను.

రంగనాథ రామాయణంలో :

"రమణీయమూర్తులు రామలక్ష్మణులు భరతశత్రుఘ్నులు పాయకపుణ్య
నిరతులై చాలోపనీతులై ప్రీతి నఖిల వేదంబులు నఖిల శాస్త్రములు
నఖిల శాస్త్రార్థ విద్యలు నేర్చిరంత."

అని దశరథుని నలుగురు కుమారుల యొక్క విద్యాభ్యాస వివరములు తెలుపబడినవి.

భాస్కర రామాయణంలో ఆ నలుగురి రాజకుమారుల రాజవిద్యలను గూర్చి తెలుపుచూ :

"అంత బాలక్రీడ లాదిగాఁ దమలోన గవగూడి రామలక్ష్మణుల భరత
శత్రుఘ్నులును బొల్పెసఁగ వేదశాస్త్రముల్ చన ధనుర్వేదంబు సకల కళల
నభ్యసించుచు నాయుధాభ్యాసములు వాహ నారోహణాదులు నాప్తతోడ

నలవరించుచు వారలన్యోన్యరాగులై యమర నేకగ్రీవులగుచు గురుల
కెలమి శుశ్రూష సేయుచునెల్లజనులు
బొగడ ధీరులు శూరులై బుద్ధినీతి
పుణ్యమున దేజమునఁ బేర్మి భూతినఖిల
సుగుణములనొప్పుచుండిరి సొంపులెసగ[31] "అంతేగాక
కం॥ గుణకర్షజనిత పరుష వ్రణకిణ పటు బాహుయుతుల వాజిగజారో
హణ కఠినాంగుల సతతోల్బణ శస్త్రాభ్యాస లలిత లఘుతర తనులన్[32].
రామాభ్యుదయములలో ఇదే సందర్భమున :
కం॥ నిసువుం దనపుందటి నా నసువులు రాసుతులు సకల శాస్త్ర కలాపా
భ్యసన వ్యసనాభిముఖో ల్లసన శ్రీ శాలులైరి లలిత ప్రతిభన్.
కం॥ సర్వజ్ఞ శిఖామణులై, యుర్వర నా బాలచంద్రు లుత్తుంగ శ్రీ
ధూర్వహులై కనుపట్టి రపూర్వోదయరేఖఁ బ్రబలి బుధపూజితులై.
కం॥ రాఘవులు మించి రతిశర లాఘవులై పటుధనుష్కళా పాండిత్య
శ్లాఘా రేఖా మోఘా, వ్యాఘాత భుజావిజృంభణారంభగతిన్[33] అని పేర్కొన బడింది.

మొల్ల రామాయణంలో రామలక్ష్మణ భరత శత్రుఘ్నులకు దశరథుడు "యథోచిత కర్తవ్యంబులు జరిపి యప్పుది దినంబులు నరిష్టంబు లేక ప్రతిదిన వర్ధమాన మగుచున్న కుమారచతుష్టయంబునకు గాలోచితంబులగు చౌలోపనయనాది కృత్యంబులు గావించి వెండియు విద్యాప్రవీణులగునటులొనర్చి గజాశ్వ రథారోహరణంబులు నేర్పి ధనుర్వేదపారగులంగావించి" [34] నట్లుగలదు.

దశరథుని కుమారులలో జ్యేష్ఠుడైన శ్రీరాముడు రాజ్యానికి భవిష్యత్తులో రాజుకాదగినవాడు. అట్టి శ్రీరాముడు నేర్చినవిద్యలను గూర్చి వాల్మీకిరామాయణంలో

"తేషామపి మహాతేజా రామస్సత్య పరాక్రమః॥
ఇష్టః సర్వస్య లోకస్య శశాంక ఇవ నిర్మలః॥
గజస్కంధేఽశ్వపృష్ఠే చ రథచర్యాసు సమ్మతః॥
ధనుర్వేదే నిరతః పితృ శుశ్రూషణే రతః"॥[35]

సోదరులందఱిలోనే గాక సకల రఘువంశజులలోనూ రాముడు మహాప్రతాపము గలవాడు. చంద్రుని వలె నిర్మలుడు. సకల జనులకు ప్రీతిపాత్రుడు. రాముడు

ఏనుగునెక్కుటయు, గుఱ్ఱమునధిరోహించుట, యుద్ధక్షేత్రమున రథము నడుపుట మొదలగువానియందు కుశలుడు. అంతేగాక ధనుర్వేదమున నిష్ణాతుడు.

'వెలయు ధనుర్వేద వేదశాస్త్రము వలయు విద్యలయందు వలనొప్పువాని"[36] యని రంగనాథ రామాయణము పేర్కొనినది. వాల్మీకమున నారదుడు వాల్మీకితో రాముని గుణగణములను గూర్చి ఈ విధంగానే చెప్తాడు[37].రాముడు సర్వశాస్త్రతత్త్వజ్ఞుడు, పూర్వమెరిగిన విషయములను మరువనివాడు. ప్రతిభాశాలి. దీనినిబట్టి రామాయణ కాలమున రాజులు సంపాదించిన విద్యలెట్టివో తెలియచున్నవి.

*3.2.8 రాజపదవి యోగ్యత - అయోగ్యత :*

అత్యంత విశిష్టమైన రాజపదవికి రామాయణము కొన్ని యోగ్యతలను సూచించుచున్నది. రాజు యొక్క జ్యేష్ఠపుత్రుడే అనంతరము రాజు కాదగినవాడని పేర్కొనెను. అతడు లోక కంటకుడైనపుడు ఆ అర్హతను కోల్పోవును. అప్పుడతడు దేశమునుండి వెడలగొట్టదగినవాడగును. ఇదే విషయము అసమంజసుడను సగర పుత్రుని విషయములలో నిరూపింపబడినది[38].

రామో లోకాభిరామోఽ యం శౌర్యవీర్యపరాక్రమైః
ప్రజాపాలన సంయుక్త న రాగోప హతేన్ద్రియః
శక్త స్త్రైలోక్యమప్యేకో భోక్తుం కిం ను మహీ మిమామ్
నాస్య క్రోధః ప్రసాదశ్చ నిరర్థోస్తిఽ కదాచన "[39]

దీనినిబట్టి రాముడు లోకాభిరాముడు, శౌర్యవీర్య పరాక్రమములు గలవాడు, ప్రజా పరిపాలనతత్త్వము నెఱిగినవాడు, రాగము లేక ఇంద్రియములను జయించినవాడు, ముల్లోకములను జయించి పాలించదగినవాడు, క్రోధములేనివాడు, అనుగ్రహప్రదాయకుడును, అని కీర్తించుటను బట్టి అట్టివానిచే రాజు యోగ్యుడగునని తెలియుచున్నది. అంతేగాక

బలమారోగ్య మాయుశ్చ రామస్య విదితాత్మనః ॥
దేవాసుర మనుష్యేషు సగంధర్వోరగేషు చ[40]॥

బలము, ఆయురారోగ్యములు గలిగిన విదితాత్ముడు రాముడు. దేవతలు, మనుష్యులు, గంధర్వులు, నాగులలో ఇతడే శ్రేష్ఠుడు.

ఇదే సందర్భమున రంగనాథ రామాయణములలో :

'రాజనీతిజ్ఞు, నిర్మలధర్మనిపుణుఁదేజోజగద్బంధు దీనైక బంధు
సత్యసంధు,ప్రసన్న శాంతిసంపన్ను- నిత్యవిప్రార్చనా నిరతుసచ్చరితు

నీతియు, బ్రీతియు నేర్పును నోర్పు- ఖ్యాతియు భూతియుగాంతియు దాంతి
శాంతియు మొదలైన సద్గుణావళుల- నెంతయు నీకన్న నెక్కుడై యున్న
రాముని లోకాభిరాముని నీవు- భూమికి రాజుగాఁ బూన్చుట దగదె
త్రైలోక్యమైన నతండేల జాలు - నీ లోకమేలుటదెంత మాత్రము.[41]

అని పూర్వజనపదులు అభిప్రాయపడినట్లుగలదు.

భాస్కరరామాయణములో ఇదే సందర్భములో దశరథుడు సభలో

'రాజ్యభరంబఖిల గుణ, ప్రాజ్యుండగు రామునంద ప్రాప్తించెద,సా
మ్రాజ్య పదంబున కెంతయు బూజ్యుండతి చతురుఁడతఁడు పుత్రులలోనన్'[42]

అని రామునికి గల యోగ్యతలను ప్రస్తావించినట్లు గలదు.

మొల్ల రామాయణములో ఇట్టిచర్య ఆ సందర్భమున లేదు.

రామాభ్యుదయములో రాముడు 'రాజ్యభరణోదారుండని' రాముని యోగ్యత ప్రస్తావింపబడినది[43].

జ్యేష్ఠుడైన రాకుమారుడు దుష్కృత్యములకు పాల్పడిన యెడల రాజపదవికి అయోగ్యుడనియు అట్టివానికి అరణ్యగమనము విధింపబడెనని తెలియు చున్నది.

*3-2-9 రాజు ఎంపిక :*

విద్యలందు సుశిక్షితుడైనవాడు, యోగ్యతగలవాడునగువానిని రాజుగా ఎంపిక చేయవలయును. భవిష్యత్తులో రాజుగా తమను పాలించే పాలకుని ఎంపిక చేయడములో ప్రజలకు కూడా భాగస్వామ్యముండేది. శ్రీరాముని యౌవరాజ్య పట్టాభిషేకవిషయమై దశరథుడు పౌరజానపదుల అభిప్రాయమడుగుట దీనికి తగిన నిదర్శనము[44].

శత్రువు చేతిలో రాజుహతుడై రాజ్యాంగ సంక్షోభ మేర్పడినపుడు మంత్రులు బాగుగా ఆలోచించి అతని సోదరుని రాజుగా ఎంపిక చేసే విధానం రామాయణంలో ఉన్నది. వాలి మాయావి అను అసురునితో పోరాడి బలమున మృతిచెందెనని తలచి వానరరాజ్యమంత్రులు వాలి సోదరుడైన సుగ్రీవుని రాజుగా ఎంపిక చేసుకొనిరి[45]. విజీగీషుడగు శత్రువు చేతిలో రాజు మరణించిన సందర్భమున ఆరాజు తమ్ముడు యోగ్యుడైన యెడల అతనినే రాజుగా ఎంపిక చేయు పద్ధతి గలదు. శ్రీరాముడు వాలిని వధించిన పిమ్మట వాలి సోదరుడగు సుగ్రీవుని రాజుగా జేసెను[46]. రావణుని యుద్ధమునందు వధించిన శ్రీరాముడు రావణుని సోదరుడగు విభీషణుని రాజుగా చేసెను[47].

వాలి మరణానంతరము సుగ్రీవుని రాజుగా చేయుటయే గాక వాలి కుమారుడగు అంగదుని యువరాజుగా జేయుటయు ఆనాటి యౌవరాజ్యమునకు చేయబడు ఎంపిక విధానము సూచించుచున్నది[48].

రాజు మరణించినపుడు ఆతని కుమారులెవరును దగ్గఱలేనప్పుడు ఆ వంశానికి చెందిన ఏ ఒక్కడినైనను రాజుగా ఎంపిక చేసే పద్ధతి గూడ గలదు. దశరథుడు మరణించినపుడు రాజ్యం అరాజకం కారాదనుచు "ఇక్ష్వాకు వంశజులలో ఏ ఒక్కరినైనను రాజుగా నియమింపుమనుచు మార్కండేయాది బ్రాహ్మణమంత్రులు రాజ్యపురోహితుడగు వశిష్ఠుని కోరిరి[49].

*3-2-10 రాజులేకపోతే గలుగు అనర్థాలు :*

రాజులేని అరాజకస్థితి రాజ్యానికి అనర్థహేతువని రామాయణం స్పష్టపరచినది. రాజ్యాంగసంక్షోభం దీర్ఘకాలం కొనసాగనీయక రాజు నియామకం వెంటనే జరగ వలయును.

దశరథుడు పుత్రశోకంతో తుదిశ్వాస విడుచుసరికి అతనికున్న నలుగురు కుమారులలో ఏ ఒక్కరును అచటలేరు. రాజును అభిషేకించునట్టి మార్కండేయ, మౌద్గల్య, వామదేవ, కాశ్యప, కాత్యాయన, గౌతమ, జాబాలి మొదలగు బ్రాహ్మణ మంత్రులు సభచేసి పురోహితుడైన వశిష్ఠునితో రాజు లేకపోతే ఏర్పడే అనర్థాలను తెలుపుతూ ఇక్ష్వాకువంశంలో ఏఒక్కరినైనా రాజును చేయుమని కోరిరి.[50]

'నారాజకే జనపదే బీజముష్టిః ప్రకీర్యతే
నారాజకే పితుః పుత్రో భార్యా వా వర్తతే వశే'.[51]

రాజులేని రాజ్యం భూమిపై విత్తులు చల్లబడవు. తండ్రికి తనయుడు భర్తకు భార్య వశమందుండరు.

'యథా హ్యనుదకా నద్యః యథా వా ప్యతృణం వనం।
అగోపాలా యథాగావ స్తథా రాష్ట్ర మరాజకమ్॥

అరాజకమగు రాష్ట్రం నీరులేని నదులవలె, పచ్చగడ్డిలేని వనంవలె గోపాలురులేని గోవులవలె శోభించదు[52].

'అహోతమ ఇవేదం స్యాన్నప్రజ్ఞాయేతకించన
రాజాచేన్నభవేల్లోకే విభజన్ సాధ్వసాధుని.'[53]

లోకమున మంచి చెడులను ఏర్పరచుచూ పాలించు రాజొకడు లేక పోయిన

లోకమే అంధకారమగును. ఇది ఇట్టిదని ఏమి తెలియకుండును.

ఇదే సందర్భమున రంగనాథ రామాయణంలో :

"రాజులేకున్న పురంబు రాష్ట్రంబు - రాజిల్లదెల్ల వర్ణంబులు గలయు
దండనీతి క్రియల్ దానధర్మముల్ - మెండోడిచెడిపోవు మింతురు రిపులు
జారులు చోరులు సందడింపుదురు - కోరినొంతురు సాధుకోటి దుర్జనులు
దొరలు సామంతులు దుర్గాధిపతులు - నరి యప్పనముటీయ'---[54]

అని అరాజక వ్యవస్థయందలి అనర్థములు తెలుప బడినవి. ఈ అరాజక వ్యవస్థను గురించి భాస్కర, మొల్ల రామాయణములందు, రామాభ్యుదయమునందు ప్రస్తావించబడలేదు.

వాలి మాయావి యను రాక్షసునితో బిలము నందుండి సంవత్సరకాలము యుద్ధము చేసెను. అపుడు వాలి బిలము నందే మరణించెనని పౌరులు, మంత్రులు భావించిరి.

'బలాదస్మిన్ సమాగమ్య - మంత్రిభి: పురవాసిభి:॥
రాజభావే నియుక్తో హం శూన్యదేశ జిగీషయా"[55]॥

దేశమున అరాజకత్వాన్ని తొలగించుకోవడం కోసం తనను కిష్కింధకు రాజు జేసెనని సుగ్రీవుడు వాలికి విన్నవించు కొనెను. దీనినిబట్టి అరాజకత్వ మేర్పడకుండుటకు రాజును వెంటనే నియమించే వారని తెలుస్తున్నది.

భరతుడు తన తండ్రియైన దశరథుని పార్థివ శరీరమును చూచిన నాటి అయోధ్య స్థితిని వర్ణించుచూ:

'విధవా పృధి వీరాజన్! త్వయాహీనా న రాజతే॥
హీనచన్ద్రేవ రజనీ నగరీ ప్రతిభాతి మే॥[56]

రాజులేని భూమి విధవయై ప్రకాశింపకున్నది. ఈ అయోధ్యాపురి నాకు చంద్రుడులేని రాత్రి వలె తోచుచున్నదని భరతుడనెను. కాగా దశథుని అంత్యక్రియల తదుపరి భరతుని శీఘ్రమే అభిషిక్తుడవు కమ్మనినట్లు రామాయణమున కలదు.[57]

ఇదే సందర్భమున రంగనాథ రామాయణములో :

'ఉర్వికి రాజులేకున్న కార్యములు - నిర్వహింపంగరారు నిలువరు ప్రజలు"[58]

ఇదే సందర్భమున భాస్కర రామాయణమున వశిష్ఠుడు భరతుని చూచి

'సకల నృప మంత్ర మునిలోక సమ్మతమున
భరతుగనుగొని రఘువంశ గురుడు రాష్ట్ర
మిట్లరాజకమై యున్న నిగ్గుదొడరు
గాన నీవింక పట్టంబు గట్టి కొనుము[59]

అని పలికినట్లు గలదు. రామాభ్యుదయంలో ఇదే సందర్భమున

'ఇట్టి తెఱంగునన్ భరతుఁడెంతయుఁగుంద వశిష్ఠుడున్ బుధుల్
పట్టన మీయెడం బగిలి పాటి యరాజకమైన దింతటన్
బట్టము గట్టుకొమ్ము జనపాలన శీలన యాభి రమ్యతల్
నెట్టుకొనన్ సమస్త ధరణీ వలయాంకిత బాహుశాలివై ।'[60]

అని భరతునితో వశిష్ఠుడు వలుకుట రాజ్యం అరాజకం కారాదనే నిరూపించుచున్నది. కాబట్టి రాజు లేకపోతే రాజ్యం చుక్కానిపట్టువాడు లేని నౌకవలె అల్లల్లాడునని చెప్పబడింది. రాజులేకపోతే కలిగే అనర్థాలను తొలగించడానికి రాజు ఎంపిక తప్పనిసరి. రాజ్య సంక్షేమం కోసం రాజును నియమించేవారు. భరతుడు రాజుగా ఉండటానికి ఇష్టపడక రామపాదుకలు గ్రహించి తాను రాజ ప్రతినిధిగా ఉండి సమస్తరాజ కృత్యములు నిర్వహించుటలో రాజ్యమరాజకం కారాదనే ముఖ్యోద్దేశ్యమే తెలియ బడుచున్నది.[61]

### *3-2-11 రాజు పట్టాభిషేకం :*

రాజు రాజకుమారులు రాజ విద్యను నేర్చుకొనిన తర్వాత జనామోదముతో తన జ్యేష్ఠ పుత్రునికి యౌవరాజ్య పట్టాభిషేకం చేయడం ప్రాచీన భారతీయ రాజ సంప్రదాయం. శ్రీమద్రామాయణములో దశరథుడు ఈ విధానాన్ననుసరించియే శ్రీరామునకు యౌవరాజ్య పట్టాభిషేకం చేయ సంకల్పించ్చాడు.[62] రాజు ఏ కారణం చేతనైనా మరణించినపుడు రాజ్యాంగ సంక్షోభం తొలగించడానికి, అరాజకం కొని తెచ్చే అనర్థాలను తొలగించడానికి యోగ్యుడైన వారసుని రాజుగా పట్టాభిషిక్తుని చేసేవారు. రాజు సోదరునకు గానీ, జ్యేష్ఠపుత్రునికి గానీ, జ్యేష్ఠేతరులకు గానీ ఆవంశంలో యోగ్యుడైన వానికి గాని రాజ్య పట్టాభిషేకం చేసేవారు.[63]

### *3-2-12 రామాయణము - పట్టాభిషేకములు :*

రాజగు దశరథుడు సభజేసి తనజ్యేష్ఠ కుమారుడగు రామునికి యౌవరాజ్య పట్టాభిషేకము చేయునెంచితిననియు, దానిపై పౌరజాన పదుల అనుమతిని కోరుచున్నట్లు పల్కెను. అంతట వారందఱు శ్రీరాముని మంచి లక్షణాలను పేర్కొనుచూ తమ అంగీకారమును తెల్పిరి. పిమ్మట వశిష్ఠుడు కార్యకర్తలనుద్దేశించి దశరథమహారాజు మఱునాడు చేయబోవు హోమమునకు పూజాద్రవ్యములను, తెల్లనిపూల దండలను ఓషధులను, నవరత్నాలను, నూరు కలశాలను, పులితోలును, రెండు వింజామరలను సిద్ధముగా నుంచుడనెను. తేనె, నెయ్యి, పేలాలను వేర్వేరు పాత్రలలో నుంచవలెను, చతురంగబలములతో, ఆబోతులతో, ధ్వజములతో,

సర్వాయుధములతో రావలెనని తెల్పును. ఇది ఆనాటి యౌవరాజ్య పట్టాభిషేక విధానాన్ని సూచిస్తుంది.

పట్టాభిషేకానికి ముందురోజున రాముడు, సీత ఉపవాస నియమాన్ని పాటించారు. విష్ణ్వాలయములో దర్భశయ్య నమర్చుకొని మౌనవ్రతముతో వైదేహీసమేతంగా శయనించాడు రాముడు.

అభిషేకముకోసం మేడిమ్రానుతోచేసిన భద్ర పీఠాన్ని సిద్ధంగా ఉంచారు. దగదగలాడే పులితోలు పరచిన నాలుగు గుఱ్ఱాలు, రథాలతోగూడి బోయీలను, పల్లకీని సిద్ధంచేసారు. పవిత్రమైన గంగోదకాలు త్రివేణీ సంగమపుణ్యజలాలు తెచ్చినారు. ఆ నీటిలో రావి ఆకులూ తామరపువ్వులూ, కలువలు ఉంచి మూత పెట్టారు. ఇంతలో సామంతులేతెంచినారు. రాజవీథులు అలంకరింపబడ్డవి. జన సందోహంతో అయోధ్య నిండిపోయింది. ఇంత వైభవంగా రాముని యౌవరాజ్య పట్టాభిషేక ఏర్పాట్లు పూర్తయిన పిమ్మట కారణాంతరాలచే ఆ పట్టాభిషేకము నిలిచిపోయినది.

దశరథుని మరణానంతరం వశిష్ఠుడు భరతుని పిలిపించి రాజ్య పట్టాభిషేకం పొందుమని పల్కును. అందులకు సమ్మతింపని భరతుడు రామపాదుకలను గ్రహించి అయోధ్యలో ప్రవేశింపక నందిగ్రామమునకు వెళ్లెను. బంగారముచే అలంకృతములైన రామపాదుకలను ధరించుడనుచూ రామ పాదుకలనే రామ పాదములుగా భావించి సంభావించెనని తెలియును. రావణ వధానంతరము రాజుగా శ్రీరాముని పట్టాభిషేకమునకు చేయబడ్డ ఏర్పాట్లు ఆనాటి ఆచారవ్యవహారములను వ్యక్తపఱచు చున్నవి.

రాముడు వాలిని వధించిన పిదప సుగ్రీవునకు వానర రాజ్య పట్టాభిషేకము జరిగినది. సువర్ణమయమగు ఆసనముపై వివిధ మంత్రములచే నదులు, నదముల, తీర్థములు, సకల సముద్రముల నుండి తీసుకొనిరాబడిన స్వచ్ఛమగు మంగళ జలములను సువర్ణపాత్రములలో నుంచి గజ, గవాక్ష, గవయ, శరభ, గంధమాధన, మైంద, ద్వివిద, హనుమత్, జాంబవత్, నలులు స్తోత్రములు చేయుచుండగా సుగ్రీవుని వానర రాజుగా అభిషేకించిరి[64]

ఇదే సందర్భములో రంగనాథ రామాయణమున:

"పుణ్యాంగనలు రత్నములసేస జల్ల - బుణ్యాహవచన పూర్వకంబుగను
సింహచర్మంబునఁ జిహ్నితమైన - సింహపీఠమున గపి సింహంబునునిచి
సురనింద్రుబోలె భాసురలీల - బ్లవగ - వరులభిషేకపూర్వకముగ గదిసి
లలితపుణ్యోదయ లగ్నంబునందు - బలియు సుగ్రీవుని బట్టంబు గట్టి'[65]

నట్లుగలదు. భాస్కర రామాయణం గూడ ఇదేవిధముగా పేర్కొనుచూ 'అభిషిక్తుండయిన' సుగ్రీవునకు హేమ దండమండితంబైన ధవళచ్ఛత్రంబు పవన సుతుండు పట్టె; నలుండును కనక రత్నమయంబులైన చామరంబులు వీవదొడంగి."[66]

మొల్ల రామాయణములో మూలమునకు భిన్నముగాకుండా ఇట్లు చెప్పబడినది.

నిగ్రహము మాని నృపతి శుభగ్రహ లగ్నంబునందు బట్టము గట్టెన్
విగ్రహ రాజోపగ్రహు, సుగ్రీవుని హేమదామ సుగ్రీవుఁదగన్'

అని సుగ్రీవుని పట్టాభిషేకము సంక్షిప్తముగా తెలుపబడెను.

రామాభ్యుదయములో రామానుజ్ఞచే లక్ష్మణుడు

"కిష్కింధానగరంబు వివిధ రత్న తోరణ విచిత్ర శృంగార రచనా విశేషంబుల నలంకరింపించి హనుమత్ప్రముఖ ప్రధాన నిఖిల వీరవానర సమ్మతంబుగా నమ్మి హిర సుతునకు నఖిల కపిరాజ్య పట్టాభిషేకంబు గావించి......" శ్రీరాముని వద్దకు తిరిగి వచ్చినట్లుగలదు.

రామానతిచే సుగ్రీవుడు అంగదుని యువరాజుగా అభిషేకించినట్లు వాల్మీకి రామాయణమున చెప్పబడినది.[67]

రంగనాథ రామాయణమున గూడ వానరులు "ఉరుసత్త్వునంగదు యువ రాజ్యమునకు - కరమొప్ప బట్టంబు గట్టిరి ప్రీతి"[68] యని తెలుపబడినది.

మొల్ల రామాయణమున శ్రీరాముడే " ----- వాలిత నూభవుని యువరాజ్య పదంబున నిలిపె" అని తెలుపబడినది.

రామాభ్యుదయములో రామానతిచే లక్ష్మణుడు యౌవరాజ్యంబునకు నంగదు ప్రతిష్టించి"[69] రామునివద్దకు తిరిగివచ్చినట్లు గలదు.

ఇదే సందర్భములో భాస్కర రామాయణములో రాముని ఆజ్ఞచే సుగ్రీవుడు వానరులచే రాజ్య పట్టాభిషేకమొంది సుగ్రీవుడు

"వాలినందనుడైన అంగదుని సమ్మదంబున నాలింగనముచేసి రఘు పుంగవు నానతిక్రమమున యౌవరాజ్య పట్టం బంగదునికి కట్టె"[70] నని తెలుపబడినది. ఇందు లక్ష్మణుని ప్రస్తావనలేదు.

సముద్ర తీరమున రావణుని తమ్ముడు విభీషణుడు శ్రీరాముని శరణాగతి పొందెను. శ్రీరాముడు విభీషణుని యందలి ప్రీతితో లక్ష్మణుని చూచి మహాబుద్ధిశాలియగు విభీషణుని రాక్షసులకు రాజుగా అభిషేకింపుమనెను.

'ఏవముక్తస్తు సౌమిత్రి రభ్యషించ ద్విభీషణం।
మధ్యే వానరముఖ్యానాం రాజానం రామశాసనాత్ '॥[71]

రాజాజ్ఞ చొప్పున లక్ష్మణుడు వానరశ్రేష్ఠుల నడుమ విభీషణుని రాక్షస రాజుగా అభిషేకించెను.

ఇదే సందర్భమున రంగనాథ రామాయణములో శ్రీరాముడు లక్ష్మణునితో

'నీ సముద్రమునీటి నినజాండు నీవు - జేసేత వడినభిషేకంబుసేసి
కట్టుడు వేగ లంకా రాజ్యమునకు - బట్టంబు వానికి బ్రతివిభీషణుని
ననియానతిచ్చిన నతడును నతని - వనధి జలంబులు వనచరుల్బేర
నభిషేకమొనరించి యసురులకెల్ల - బ్రభుడవుగమ్మని పట్టంబుగట్టి
తలపోయ నాచంద్రతారార్కముగను - సలలితమ్ముగ రామచంద్రునికీర్తి
యెంతకాలము గల్గు నిల విభీషణుడ, యంతకాలము రాజ్యముసేయు"[72]

మని ఆకాంక్షను తెలిపెనని చెప్పబడినది.

భాస్కర రామాయణములో "రామచంద్రుడు లక్ష్మణుంగనుంగొని నీవు సముద్రోదకంబులు దెచ్చి లంకారాజ్యమునకు విభీషణు నభిషేకంబుచేయుమని నియోగించె"[73] ననియు, అట్టి సమయమున సుగ్రీవుడు రావణుడే శరణువేడిన ఏమిచేసెద వనగా నతనికి అయోధ్యనిచ్చెదనని పల్కినట్లు కలదు[74]

అఖిల వానర వీరులు నయ్యును గ్ర
హంబు గొనియాడి రంత నయ్యధిపు నాజ్ఞ
నట్లు సౌమిత్రియును రాక్షసాధిపత్య
మునకు నభిషిక్తుఁజేసి నంపెననియు నతని.[75] అని స్పష్టపరచబడినది.

మొల్ల రామాయణములో శ్రీరాముడు విభీషణునికి అభయ ప్రదానం బొసగి ఆదరించినట్లు గలదు.[76] కానీ అట్టి సమయమున రాక్షసాధిపత్యమును అతనికి పట్టాభిషేకము ద్వారా నొసగినట్లులేదు.

రామాభ్యుదయములో గూడ శ్రీరాముడు శరణాగత రక్షా పరాయణత్వంబుతో విభీషణునికి అభయమిచ్చినట్లు తెల్పబడినది. ఇచ్చట విభీషణుని పట్టాభిషేక ప్రస్తావనలేదు.

పిమ్మట రావణవధానంతరము శ్రీరాముని ఆజ్ఞచే విభీషణుడు లంకకు రాజ్యాధిపతిగా రాజ్య పట్టాభిషేకము పొందెనని తెలియుచున్నది. శ్రీరాముడు లక్ష్మణునితో నాకు ఉపకారము చేసిన విభీషణుని లంకారాజ్యమందు అభిషిక్తుని

చేయు మనుచూ వాల్మీకమున ఇట్లుకలదు.

"ఏష మే పరమః కామో యదీమం రావణానుజమ్ ।
లంకాయాం సౌమ్య! పశ్యేయ మభిషిక్తం విభీషణమ్ ॥"[77]

రంగనాథ రామాయణములో రాముని యొక్క అనుజ్ఞచే లక్ష్మణుడు
తడయక తరుచరోత్తములను బనిచి - కడక సముద్రోదకములు దెప్పించి
దారి పురోహిత వరుల రప్పించి - వారి సజ్జన మంత్రి వరుల రప్పించి
భూరి మంగళ తూర్యములు మ్రోయనతని - నారూఢని యతితో నభిషిక్తు జేసి
సంచిత మంగళా చారముల్మెరయ - సంచిత సింహాసనాసీను జేసి
కరమొప్పనతని లంకా రాజ్యమునకు - పరమసమ్మదమున పట్టంబుగట్టి"[78]

నట్లు గలదు.

భాస్కర రామాయణములో రాముని ఆనతిచే లక్ష్మణుడు వానరులతో "నానా తీర్థంబు రాశి నదుల జలంబుల్ వానరవీరులచే తననూత దెప్పించి.

సీ॥ సంచిత మణిమయ స్తంభాభిరామంబు - బహు విచిత్ర వితాన భాసురంబు
ఘన సముత్తేజిత కనక వేదికమును - సాద్రు పల్లవహేమ క్రమ కుంభ
ముపకంఠ గత మదద్వీప సంకులంబును -బుణ్యాంగనా గేయపూరితంబు
మంగళ తూర్యాది సంగీత ముఖరంబు - వందిమాగధ జనానందితంబు
నై మనోజ్ఞమైన యాస్థాన మండపం - బమర నందు రత్న హైమతుంగ
భవ్య సింహయుక్త భద్రపీఠంబున - నునిచె దానవేంద్రునుత్సహించి

క॥ వారిపురోహిత మంత్రులు - దారమతినే సంతసిల్ల దద్దయు వేడ్కనే
భూరమణా వరజుడు ప్రియ - మారగ నభిషిక్తుజేసె నయ్యసురేంద్రున్[79]

అని విభీషణ పట్టాభిషేకము విశదముగా పేర్కొనబడినది.

మొల్ల రామాయణములో శ్రీరాముడే "------ విభీషణుని లంకానగరమునకు బట్టంబు గట్టించి"[80] నట్లు సంక్షిప్తముగ గలదు.

క॥ ఆమ్రేడిద కరుణారస
క్రమ మనోవాక్క్రియావకాశుఁడు లంకా
సామ్రాజ్య మొసఁగె రఘుపతి
నమ్రునకు విభీషణునకు నయగుణనిధికిన్"[81] అని రామాభ్యుదయమున చెప్పబడినది.

దీనిని బట్టి రామాయణకాలంలో రాజుల అభిషేకములు నిర్వహింపబడినవని తెలియు చున్నది.

*3-2-13 రాజు - సమ్మానార్హత :*

రాజు రాజ్యానికి అధిపతి. ప్రజాసంక్షేమము, సంరక్షణలకుగాను అతడు నిరంతరం పాటు పడతాడు. రామాయణంలో రాజునకు ఎదురొడ్డి ఎవడును సుఖముగా వర్ధిల్లడని స్పష్టపరచబడినది. రాజు సర్వకాల సర్వావస్థలయందు సమ్మానార్హుడని పేర్కొనినది. హితవు పలికిన మారీచునితో రావణుడు

తస్మా త్సర్వా స్వవస్థాసు మాన్యా: పూజ్యాశ్చ నిత్యదా।
త్వం తు ధర్మ మవిజ్ఞాయ కేవలం మోహమాస్థితః॥[82]

ప్రభువులు సర్వావస్థల యందును సమ్మానార్హులు, పూజనీయులు, ధర్మమెఱుగక నీవు కేవలము అజ్ఞానములో పడితివి అనెను. సుగుణములు గల్గిన రాజును జనులు పూజింతురని స్పష్టపరచుట ద్వారా రాజు ప్రవర్తనయే సమ్మానార్హతను సాధించునని రామాయణము పరోక్షముగా సూచించుచున్నది. అధికముగా పన్నులు విధించు రాజును ప్రజలు అవమానింతురని రంగనాథ, భాస్కర రామాయణములలో సూచింపబడెను. రామాభ్యుదయమున ఇట్టి ప్రస్తావన లేదు.

*3-2-14 రాజు - విధులు :*

రాజ్యతంత్రాన్ని రక్షించడం రాజు యొక్క ముఖ్యవిధి. అదే అతని ముఖ్యధర్మం. 'ఏషఏవ పరోధర్మం యద్రాజా రక్షతి: ప్రజా:'[83] సైన్యసమేతుడై తనవద్దకు వచ్చిన భరతుని కుశల ప్రశ్నల డుగుచున్న సందర్భమున శ్రీరాముడు రాజ విధులను గూర్చి స్పష్టపరచెను.[84] దీని ప్రకారం రాజు రాజపురోహితుని గౌరవింపవలెను. నీతిశాస్త్ర కోవిదుడైన ధనురాచార్యుని గౌరవించవలెను. మంత్రులతో బయటకు పొక్కని విధముగా మంత్రాలోచనము చేయవలెను. నిద్రావశులుగాక రాచకార్యములకు సంబంధించిన సామర్థ్యమును ఆలోచింపవలయును. ఒంటరిగాను, పలువురితోను ఆలోచింపక సరియైన పద్ధతిలో మంత్రాలోచనముచేసి శీఘ్రమే యుక్తమైన పనిని ఆచరింపవలెను. పరులు గుర్తింపని విధంగా సంకల్పించిన పనులు చేయవలెను. కార్య సంకట స్థితిలో పండితులను సంప్రదించవలెను. ఉత్తమ, మధ్యమ సేవకులను జాత్యాదిహీనులగు సేవకులను తగు పనులయందు నియమింపవలెను. మంత్రులను ఉత్తమ కార్యములందు నియోగింపవలెను. కార్యకుశలురగు వానిని సేనాధిపతిగా నియమించవలెను. శూరులైన ప్రధాన వీరులను పారితోషికాదులతో శ్లాఘించవలెను. సైన్యమునకు ఇవ్వవలసిన ఆహారమును, వేతనములను సకాలంలో వారికి తగినట్లు

ఇవ్వవలెను. తగిన యోగ్యత గల వానిని దూతగా చేసుకొనవలెను. శత్రుపక్షంలోని పదునెనిమిది తీర్థములయు స్వపక్షము నందలి పదునైదు తీర్థముల యొక్కయు రహస్య ప్రయత్నములు తెలుసుకొనుటకు ఒక్కొక్క తీర్థమునకు వేషాంతర ధారణ చేసినట్టి ముగ్గురు గూఢచారులను నియమించి వారిచే సర్వము తెలుసుకొనవలెను.

కృషి గోరక్షణములచే జీవించు వైశ్యులకు అభీష్టములనిచ్చి క్లేశములను తొలగించి పోషించవలయును. తన దేశమున గల వారందరిని రక్షించవలయును. అంతఃపుర కాంతలను అదుపులో నుంచవలయును. వారికి రహస్యములు చెప్పరాదు. ప్రతి దినము ఉదయముననే లేచి అలంకరించుకొని సభలో దర్శనమీయవలెను. తగువిధముగా ఆదాయ వ్యయములను నిర్వహింపవలెను. ముసలి వారిని, పిన్నలను, పండితులను, ధనాదులిచ్చుట, స్నేహంతో చూచుట, ప్రియముగా మాట్లాడుట, మొదలగువానిచే వశీకరింపవలయును. ధర్మార్థకామముల మూడింటిని వేరువేరుగా సేవింపవలెను. శాస్త్రోక్తమైన మంచి లక్షణములతో గూడిన నలుగురు లేదా ముగ్గురు మంత్రులతో ఆలోచించి వేరువేరుగా వారి అభిప్రాయాన్ని గమనించుచుండవలెను. మధురమైన ఆహారాన్ని తానొక్కడే తినరాదు. ధనాన్ని కోరే మిత్రులకు ధనం ఇవ్వాలి. ఈ ప్రకారంగా వాల్మీకి రామాయణంలో రాజవిధుల ప్రస్తావన గలదు. ఇదే సందర్భంలో రంగనాధ రామాయణమున

"శక్తి త్రయంబు షడ్గుణంబులును - సూక్తి పంచాంగముల్ చతురుపాయములు
బదునాల్గు రాజపాపంబులు దెలిసి - సదయత మనుధర్మశాస్త్ర పద్ధతిని
దేవతా పితృమహీ దేవతాపూజ - గావించి స్వర్గంబుగాంచు భూవిభుడు
నీవును నారీతి నీతి రాజ్యంబు - గావింతువో ------[85] అని రాముడు భరతుని ప్రశ్నించినట్లు గలదు.

భాస్కర, మొల్ల రామాయణములందు, రామాభ్యుదయమందు, ఈ సందర్భమున రాజ విధులను గూర్చి సూచింప బడలేదు. పై అంశములను బట్టి రాజు శాస్త్ర ధర్మమునమసరించి అనేక విధులను నిర్వహింపవలయునని తెలియుచున్నది.

### *3-2-15 రాజ్యభ్రష్టతనొందిన రాజు స్థితి :*

రాజు తన కర్తవ్యము నుండి తప్పించుకొనజాలడు. తాను చేయవలసిన పనులను సకాలంలో నిర్వహించలేకపోతే అతడు రాజ్యభ్రష్టుడౌతాడు. శూర్పణఖ రామునితో కఠినోక్తులాడుచూ

"నానుతిష్ఠతి కార్యాణి భయేషు న బిభేతి చ।
క్షిప్రం రాజ్యాచ్చ్యుతో దీనస్తృణైస్తుల్యో భవేదిహ॥"[66]

ఏరాజు కార్యములను చక్కగా ఆచరింపక భయహేతువులనుచూచి భయపడడో అట్టి దీనుడగురాజు శీఘ్రమే రాజ్యము నుండి పతితుడై గడ్డిపోచతో సమానుడగును.

'శుష్కైః కాష్ఠైర్భవేత్కార్యం లోష్ఠైరపి చ పాంసుభిః।
న తు స్థానాత్ పరిభ్రష్టైః కార్యం స్యా ద్వసుధాధిపైః॥"[67]

ఎండిన కట్టెలతోనైనను, మట్టిగడ్డల తోనైనను, తుదకు దుమ్ముతో నైనను, పనియుండును. కానీ రాజ్య భ్రష్టులైన రాజులతో ఎవరికిని పనియుండదు. అని పేర్కొనుచు రాజ్య భ్రష్టుడైన రాజు సమర్థుడయ్యును వ్యర్థుడేనని

ఉపభుక్తం యథా వాస స్రజో వా మృదితా యథా।
ఏవం రాజ్యాత్పరిభ్రష్టః సమర్థోఽపి నిరర్థకః॥"[68]

కట్టి విడిచిన వస్త్రము, అలంకరించుకొని విడిచిన మాలలు, ఇతరులకెట్లు ఉపయుక్తము కావో అట్లే రాజ్యభ్రష్టత నొందిన రాజు సమర్థుడయ్యును నిరర్థకుడే అనేమాటనుబట్టి రాజ్యభ్రష్టత నొందిన రాజుస్థితి హీనమైనదని తెలియుచున్నది.

రంగనాథ, భాస్కర, మొల్ల రామాయణములలోను, రామాభ్యుదయములోను యిట్టి ప్రస్తావన లేదు.

### *3-2-16* మానవ - వానర - రాక్షస రాజ్యాలలో రాజు:

రామాయణంలో ప్రధానంగా కనబడే కోసల, మిధిల, అంగ, అను ఈ మూడు రాజ్యాలలోని రాజులను తిరుగులేని అధికారంతో రాజ్యపాలన చేశారు. కోసలదేశాన్ని దశరథుడు, శ్రీరాముడు, అయోధ్యను రాజధానిగా చేసుకొని పరిపాలించారు.

దేవతానుగ్రహంచేత మిథిలానగరాన్ని జనకుడు పరిపాలించాడు. రోమపాదుడు అంగదేశాధిపతి. ఇతడు ధర్మం తప్పినందున దేశంలో అనావృష్టి సంభవించింది. అతడు గొప్ప ప్రయత్నంతో దేశాన్ని సుభిక్షంచేసాడు.

వానరరాజ్యమైన కిష్కింధను వాలి సుగ్రీవులు పరిపాలించిరి. రాక్షస రాజ్యమగు లంకకు రావణుడు రాజు. ఇతడు మహాబలవంతుడు. బ్రహ్మదత్తమగు వరబలంచే ఋషులను, యక్షులను, గంధర్వులను, మునిశ్రేష్ఠులను పీడించెను. ఇతడు పటిష్ఠమైన రక్షణ వ్యవస్థతో లంకను పరిపాలించెను. లోక కంటకుడగుటచే ఇతడు శ్రీరామునిచే వధింపబడెను. ఈ ప్రకారం మానవ - వానర - రాక్షస రాజ్యములలోని రాజులు శ్రేష్ఠమైన పరిపాలనకే ప్రాధాన్యమిచ్చిరని తెలియుచున్నది. వానరరాజగు వాలి ధర్మలోప మొనర్చుట చేత, రాక్షస రాజగు రావణుడు లోకకంటకుడగుటచేత వధింపబడెననియు,

పిమ్మట అవే రాజ్యాలకు చెందిన యోగ్యులు, ధార్మికులు నగు సుగ్రీవ విభీషణులు రాజులు కాగలిగారని తెలియుచున్నది.

*3-3-0* అమాత్యులు:

రాజ్యాంగంలో ద్వితీయ శక్తిగా పేర్కొనబడిన అమాత్యుడు రాజ్య వ్యవహారములలో కీలకమైన స్థానాన్ని పొందాడు. రాజ్య నియంత్రణమునందు రాజు తర్వాత అమాత్యుని పాత్ర చాలా ప్రముఖ స్థానాన్ని ఆక్రమించింది. మనువు ముఖ్యా మాత్యుని ఆవశ్యకతను మాత్రమేగాక, అతడు ఎట్టి వాడుగా ఉండవలెనో ఈ విధంగా స్పష్టపఱచెను.

అమాత్యముఖ్యం ధర్మజ్ఞం ప్రాజ్ఞం దాంతం కులోద్గతమ్।
స్థాపయే దాసనే తస్మిన్ ఖిన్నః కార్యేక్షణే నృణామ్॥[89]

ఇట్టి అమాత్యుడు ధర్మము తెలిసినవాడు, వివేకి, జితేంద్రియుడు, సత్కులమున పుట్టినవాడుగా నుండవలయును. కౌటిల్యుడు తన అర్థశాస్త్రంలో అమాత్య, మంత్రి పదవులను వేరువేరుగా విభజించెను. అమాత్యపదవి కంటే మంత్రి పదవిని ఉన్నతమైనదిగా భావించెను. కార్యములందుగల సామర్థ్యాన్ని బట్టి అంతస్థును, వారు పనిచేయవలసిన ప్రదేశమును, కాలాన్ని, పనిని, నిర్ణయించి అమాత్యులను మంత్రులు నియమింపవలెను. కానీ మంత్రులుగా నియమింపరాదని కౌటిల్యుడు పేర్కొనెను.[90]

*3-3-1* మంత్రి - అర్హతలు:

మనువు ఎట్టివానిని మంత్రిగా నియమించవలెనో మనుస్మృతి ఈవిధంగా చెప్పబడింది.

"మౌలాన్ శాస్త్రవిద శ్శూరాన్ లబ్ధ లక్ష్యాన్ కులోద్భవాన్"[91]

వంశపారంపర్యముగా వచ్చిన వానిని, శాస్త్రజ్ఞులను, శూరులను, ఆయుధ విద్యలందు నేర్పరులను, సద్వంశమున జనించిన వానిని సచివునిగా నియమించవలెను.

మనుస్మృతిలో సమానార్థకాలుగా పేర్కొనబడ్డ అమాత్య, మంత్రి, సచివ శబ్దాలు రాజ్యవిధానాలను అమలుపరచడంలో అమాత్యులదే ముఖ్య పాత్రయని నిరూపిస్తున్నది.

రామాయణంలో అమాత్య, మంత్రి సచివ శబ్దాలు సమానార్థకాలుగా ప్రయోగింప బడ్డాయి. కోసల రాజ్యానికి సుమంతుడు మంత్రి, కిష్కింధకు హనుమంతుడు మంత్రికాగా లంకకు మంత్రిముఖ్యుడు ప్రహస్తుడు. మూడు రాజ్యాలలోని ఆయా సంప్రదాయాలకు అనుగుణంగా మంత్రుల సంఖ్యగలదు. అంతేగాక మరికొందరితో కూడిన మంత్రి పరిషత్తు కూడ గలదు.

***3-3-2 రామాయణము - మంత్రిప్రాధాన్యము:***

రామాయణంలో మానవ, వానర, రాక్షస రాజ్యాలలోని మంత్రులందఱూ అధికమైన ప్రాధ్యాన్యాన్ని గలిగియున్నారు. మంత్రుల స్వధర్మాచరణం యొక్క ప్రాధాన్యం, వారి విశిష్ట సేవలు రామాయణంలో ఆచరణాత్మకంగా నిర్మింపబడ్డాయి. అంతేగాదు దుర్మంత్రులవల్ల గలిగే ప్రమాదాలు ప్రస్తావించబడ్డాయి. ఇంకా మంత్రియెడ రాజు మెలగవలసిన విధానాన్ని నిర్దేశించడం జరిగింది. మనువచనాను సారంగా దశరథునికి ఎనిమిది మంది మంత్రులు గలరు. వారందఱు వీరులు, కీర్తిగలవారు. రాచకార్యములందు ఎల్లప్పుడు ఆసక్తి గలవారు.

'అష్టౌ బభూవు ర్వీరస్య తస్యామాత్యా యశస్వినః।
శుచయశ్చానురక్తాశ్చ రాజకృత్యేషు నిత్యశః॥[92]

దశరథుని మంత్రులందరిలో సుమంతుడు మంత్రిముఖ్యుడు. ఎనిమిది మందేగాక వశిష్ఠ, వామదేవ, సుయజ్ఞ, జాబాలి, కశ్యపుడు మొదలగు ఋత్విజులను మంత్రులుగానే దశరథునిచే ఆదరింపబడ్డారు.

దశరథుడు పుత్రుల కొఱకు యాగం చేయదలచిన సందర్భంలోను, శ్రీరామునికి యౌవరాజ్య పట్టాభిషేకం చేయదలచిన సందర్భంలోను, ముందుగా మంత్రులను సంప్రదించడం జరిగింది. దీనిని బట్టి ఆనాడు మంత్రులకివ్వబడిన ప్రాధాన్య మెంతటిదో తెలియుచున్నది. జనకుడు పంపిన దూతల వచనములాలించిన దశరథుడు పురోహితుల, మంత్రుల అనుమతిని కోరుతూ 'ఆలస్యమువద్దు, మీకిది సమ్మతమైన యెడల మిథిలకుపోవుదమని పల్కుట గమనింపదగినది. వారి అనుమతితో రాకుమారుల వివాహమునకు దశరథుడు ప్రయాణమయ్యెనని తెలియుచున్నది. జనకుడు రామునికి వింటిని చూపుటకు:

జనకేన సమాదిష్టాః సచివాః ప్రావిశన్పురమ్।
తద్ధనుః పురతః కృత్వా నిర్జగ్ము రమితౌజసః॥[93]

ఈ ప్రకారం మంత్రులను ఆజ్ఞాపించగా వారు పట్టణంలో ప్రవేశించి రాజు నాజ్ఞచేత వింటిని ముందుంచుకొని అక్కడ నుండి మరలునట్లుగా వాల్మీకి రామాయణములో గలదు. రంగనాథ, భాస్కర, మొల్ల, రామాయణములు, రామా భ్యుదయములలో శివ ధనుస్సును తీసుకొని రావడానికి సేవకులు వెళ్లినట్లుగా తెలియుచున్నది. శ్రీరాముడు శివధనుస్సును విరచిన తర్వాత జనకుడు మంత్రులను దూతలుగా దశరథుని వద్దకు పంపెను.[94] రంగనాథ, భాస్కర, రామాయణములలో

కూడ మంత్రులే దూతలుగా వెళ్లినట్లు చెప్పబడినది. మొల్లరామాయణంలో, రామాభ్యుదయంలో మంత్రులు దూతలుగా వెళ్లుట చెప్పబడలేదు.

అంగదేశాధిపతియగు రోమపాదుడు ధర్మము తప్పిన వాడగుటచేత దేశమంతటా అనావృష్టి ఏర్పడెను. ఆ సమయంలో ఋష్యశృంగుని ఏవిధంగా రప్పించాలో రోమపాదుడు చింతాక్రాంతుడయ్యెను.

తతో రాజా వినిశ్చిత్య సహ మంత్రిభిరాత్మవాన్।
పురోహిత మమాత్యాంశ్చ తతః ప్రేష్యతి సత్కృతాన్॥[95]

రాజు మంత్రులతో మంత్రణమొనర్చి ఆ పనిని నెరవేర్చుటకు పురోహితుని, అమాత్యులను, సత్కరించి పంపెను. రంగనాథ రామాయణంలో పై విషయములను విచారించినట్లు మాత్రమే గలదు.[96]

భాస్కర రామాయణంలో రోమపాదుడు తనదేశంలో ఏర్పడ్డ అనావృష్టిని గురించి విచారించడానికి సచివులను, పురోహితులను తన సభకు పిలిచినట్లు పేర్కొనబడింది.[97] మొల్లరామాయణం, రామాభ్యుదయములలో పై ఇతివృత్తం పేర్కొనబడలేదు.

వానర రాజగు సుగ్రీవుని మంత్రిసత్తముడు హనుమంతుడు. ఇరువురు ధనుర్ధారులు ఋష్యమూక పర్వత ప్రాంతంపైకి వచ్చుటను చూచి సుగ్రీవుడు ఎంతగానో భయపడినాడు. ఆ సమయమున సుగ్రీవుని మంత్రులే విషయాన్ని గ్రహించి సుగ్రీవుని పరివేష్టించి నిలిచారు.[98] ఆ సమయములో హనుమంతుడు రామలక్ష్మణులను కలసి నేను సుగ్రీవుని మంత్రిని అని చెప్పుటద్వారా రాజుయొక్క ప్రతినిధిగా మంత్రి భావింపబడెడివాడని తెలియుచున్నది.

రావణుని రాజ్యంలో రాజగు రావణుడు ఉచితమైన కాలంలో మంత్రాలోచనను చేయక సమయము మీరిన తర్వాత మంత్రాంగము నెఱపెను. ఆ సమయములో కుంభకర్ణుడు రావణునితో

'త్రయాణాం పంచధాయోగం కర్మణాం యః ప్రపద్యతి।
సచివైః సమయం కృత్వాససమ్యక్ వర్తతే పథి'[99]॥

మంత్రులతో చక్కగా ఆలోచనచేసి తగినవిధంగా ఫలితాన్ని పొందెడి వాడెవడున్నాడో అతడే ఉత్తమమంత్రి యనియు చెప్పెను. పిమ్మట రావణుడు తన సభలో

ఐకమత్యముపాగమ్య శాస్త్రదృష్టేన చక్షుషా।
మంత్రిణో యత్ర నిరతా స్తమాహూ ర్మంత్ర ముత్తమమ్॥[100]

మంత్రులందరూ ఎట్టి ఆలోచనను శాస్త్రరూపమగు కంటితో దర్శించి ఒక

నిశ్చయమునకు వచ్చేదెరో వారు ఉత్తమ మంత్రాలోచనము చేసిన వారగుదురు. దీన్నిబట్టి రావణుడు కూడ మంత్రిప్రాధాన్యం ఎరిగిన వాడని తెలియుచున్నది.

*3-3-3* మంత్రాంగ ప్రాధాన్యము :

రాజు క్షేమకరమైన విధానాన్ని కనుక్కోవడానికై మంత్రాంగము చేస్తాడు. అట్టి మంత్రాంగమే విజయానికి మూలము. ఇదే విషయాన్ని రావణుడు తన మంత్రులతో

'మంత్రమూలం చ విజయం ప్రవదంతి మనస్వినః॥[101]

మంత్రాంగమే విజయానికి మూలమని తెలుస్తున్నది. కార్యారంభమున మంత్రాలోచనచేసి దైవ సహాయానికై ప్రయత్నించిన వారు పురుషోత్తముడని పలికెను. మంత్రులు, బంధువులు, మిత్రులతో రాజు ఆలోచనచేయవలెను.

'మంత్రిభిర్హితసంయుక్తైస్సమర్థైర్మంత్రనిర్ణయే।
పాత్రైర్వాపి సమానార్థై ర్బాంధవైరపి వా హితైః॥
నహితో మంత్రయిత్వా యః కర్మారంభాన్ ప్రవర్తయేత్।
దైవే చ కురుతే యత్నం తమాహుః పురుషోత్తమమ్॥
మంత్రాలోచనముకూడా మూడు విధములనుచు
యధే మే పురుషా నిత్యముత్తమాధమ మధ్యమాః।
ఏవం మంత్రోఽపి విజ్ఞేయ ఉత్తమాధమమధ్యమః॥[102]

మంత్రులందరు ఒకేనిశ్చయమునకు వచ్చినట్టి ఆలోచనయే ఉత్తమ మంత్రాలోచనగా పేర్కొనబడినది. ఇదే సందర్భములో రావణుడు తన మంత్రులతో ఇట్లనెను.

తస్మిన్నేవం విథే కార్యే విరుద్ధే వానరైస్సహ।
హితం పురే చ సైన్యే చ సర్వం సమ్మంత్ర్యతాం మమ॥[103]

పరిస్థితి ఇట్లుండి వానరులతోమనకు విరోధం గలిగియుండగా లంకాపురానికి సైన్యానికి, నాకును హితమెయ్యేదియో దాన్ని సమగ్రంగా ఆలోచించు అనిచెప్పడం వల్ల మంత్రాలోచన ఫలితం యొక్క ఫలం తెలుస్తున్నది.

ఇదే సందర్భంలో రంగనాధ రామాయణమున రావణుడు తన మంత్రులతో

ఇనకులుఁడీయబ్ధి యింకించినైన। దన సేనబంచి యుద్ధతి గట్టినైన
దాటివచ్చినమతి తప్పు గార్యంబు। దాటకమున్నెమేతజ్ఞత మెఱసి

ఇది కార్యమని చెప్పుడిందఱుఁ గూడి ! యదియె చేయుదము మేలగు తెఱుఁగైన[104]

ఇందు మంత్రుల మంత్రజ్ఞత తెలియుచున్నది.

భాస్కర రామాయణములో రావణుడు తనమంత్రులతో

తే॥ అఖిల సమ్మతి గావించునదియు బహు వి
చారములుదోప నందొక్కసరణి నడుపు
నదియు నొగాదు నాజేయు నదియు నవ్వి
ధంబులుత్తమ మధ్యమాథమములండ్రు

ఆ॥ కామమంత్రులొక్క కార్యమందఱుఁగూడి
నిశ్చయింపు డంబునిధి గడాక
మున్ను రిపుల గెలిచి మూడులోకంబుల
కళకు పుట్ట జేయవలయు ననిన'[105]

ఇందులో జయము కలిగించునట్లుగా మంత్రాలోచన నిర్వహింపబడినది. మొల్ల రామాయణంలో ఈ సందర్భమున 'తన మంత్రులతో రాజమార్గమున' సభకు యేతెంచినట్లు తెలుపబడింది.మంత్రాలోచన ప్రాధాన్యాన్ని గూర్చి రామాభ్యుదయంలో రావణుడు విచారించినట్లు లేదు.

### *3-3-4* రామాయణము - మంత్రి పరిషత్తు సమావేశాలు:

రామాయణంలో మానవ, వానర, రాక్షస రాజ్యాలలోమంత్రుల ప్రస్తావనే కాకుండా మంత్రులతో పాటు పురోహితుడు, ఋత్విజుడు, యువరాజు, రాజుయొక్క సోదరులు బంధువులతో గూడిన మంత్రిపరిషత్ నిర్వర్తించిన విధులను స్పష్టపరిచింది.

దశరథునికి ఎనిమిది మంది మంత్రులు గలరు. బిడ్డల కోసం తపిస్తున్న దశరథుడు మంత్రి ముఖ్యుడైన సుమంతునితో, మిగిలిన మంత్రులతో బ్రాహ్మణో త్తములతో తాను యాగం చేసే విషయాన్ని ప్రస్తావించగా వారందఱు దానికి సమ్మతించిరి. వెంటనే దశరథుడు తన మంత్రులను తగు ఏర్పాట్లకై నిర్దేశించుట ద్వారా మంత్రి పరిషత్ యొక్క స్వరూపము తెలియుచున్నది.[106] రావణుడు మంత్రులతో, మిత్రులతో ఆలోచించడానికి తగిన సమయమును భావించి సభా భవనానికి వెళ్లినాడు. ఆ సమయంలో రావణుని యొక్క ఆజ్ఞచే అనేకమంది మంత్రులు (విభీషణుడు, ప్రహస్తుడు, కుంభకర్ణుడు, మహాపార్శ్వుడు, ఇంద్రజిత్తు, నికుంభుడు,

సూర్యశత్రువు, సుప్తఘ్నుడు, యజ్ఞహుడు, రక్షుడు, మహోదరుడు, అగ్నికేతువు, రస్మికేతువు, దుర్మఖుడు, విరూపాక్షుడు,మొ॥) మంత్రులతో తన ఆలోచన వెల్లడించెను.

ఇదే సందర్భమున రంగనాథ, భాస్కర రామాయణములలో గూడ రావణుడు మంత్రాలోచన జరిపినట్లు తెలియుచున్నది. మొల్ల రామాయణమున మంత్రాలోచనలో పాల్గొన్నవారి పేర్లు ప్రస్తావించబడలేదు. రామాభ్యుదయంలో యూపుడు, ధూమ్రాక్షుడు, విభీషణుడు, కుంభకర్ణుడు, ఇంద్రజిత్తు, రావణుని మంత్రాలోచనలలో పాల్గొనినట్లు తెలియుచున్నది. మంత్రాలోచన యందు సమర్థులగు దిట్టలయిన మంత్రులు, బంధుమిత్ర హితులు, పాల్గొను మంత్రిపరిషత్తుగా ఉండెడిదని తెలియును.

రంగనాధరామాయణములో మూలరామాయణమునకు భిన్నముగా రావణుని తల్లి కైకసి, భార్య మండోదరి, మంత్రాలోచన జరుగు రావణుని సభకు వచ్చి హితవచనములు పలికినట్లు గలదు. తల్లియగు కైకసి తన సభకు విచ్చేసినపుడు రావణుడు

'జనయిత్రి యీ సభాస్థలికి నెన్నడును - జనుదేరవేటికి జనుదెంచి తిప్పు
డెఱింగింపు " - మనుటయు.[107]

భార్యయగు మండోదరి సభకు విచ్చేసినపుడు అతడు

" కొలువులోపలికిటు కువలయనేత్ర - తలపనెన్నడు రాని దానవు నేడు
వడవడవడకుచు వచ్చుట యెల్ల - కడు చోద్యమైనది కారణంబేమి
యనిన మండోదరి యాత్మేశుజూచి - దనుజేశ ! నాకు రాదఱియయ్యెగాన
వచ్చితి నేడు నా వచ్చుటకెల్ల - నిచ్చలోపల గడునెగ్గుసేయకుము.[108]

అనుటయు స్త్రీలు సభకు యేతెంచెడి వారు కాదనియు మంత్రాలోచనలో పాల్గొనెడి వారు కాదనియు తెలియుచున్నది.

భాస్కర రామాయణములో రావణుని సభకు ఆమె వచ్చినపుడు రావణుడామెను అర్థాసనాశీనురాలినిగా చేసినట్లును, ఆమె రాకకు కారణం అడిగినట్లు చెప్పబడింది. అప్పుడామె

నన్నధిప నీవు పెద్దయు
మన్నించుట జనవు మెఱసి మంత్రులగొని యే

విన్నపము సేయ వచ్చితి
విన్నంగులమెల్ల బ్రతుకు విశ్రుతలీలన్

అని అనేక హితవచనములు పలికినట్లు గలదు. మొల్లరామాయణమున ఈ ప్రస్తావన లేదు.

*3-3-5* మంత్రుల సంఖ్య :

రాజుకు మంత్రులు ఎంతమంది యుండవలయును అను అంశంపై అనేక అభిప్రాయములు కలవు. ఏడుగురుగాని, ఎనిమిదిమందిగాని ఉండాలని మనుస్మృతి చెప్పుచున్నది. దశరథుడు మనుస్మృతి ననుసరించి యోగ్యులైనవారిని, సుశిక్షితులను బాగుగా పరిశీలించి మంత్రులుగా నియమించవలెను. దృష్టి, జయంతుడు, విజయుడు, సిద్ధార్థుడు, అర్థసాధకుడు, అశోకుడు, మంత్రిపాలుడు, సుమంతుడు, అను అష్టమంత్రులతోపాటు వశిష్ఠుడు అవదేవుడు, వనవీరుడు, రాజపురోహితుడు, సుయజ్ఞుడు, జాబాలి, కాశ్యపుడు, మున్నగు బ్రాహ్మణులు దశరథుని మంత్రులుగానే చెప్పబడిరి[109].

సుగ్రీవునకుగల మంత్రులెందరో రామాయణం స్పష్టంగా పేర్కొనలేదు. అట్లే రావణునకుగల మంత్రుల సంఖ్య చెప్పబడలేదు. మహాపార్శ్వుడు, శుక సారణుడు మొదలగు 17 మంది రావణుని మంత్రులుగా వాల్మీకి రామాయణంలో పేర్కొనబడింది. మారీచుడు కూడ రావణుని మంత్రిగానే చెప్పబడ్డాడు[110]. రంగనాథ రామాయణంలో ముప్పది నాలుగు మంది మంత్రులున్నట్లు తెలుపబడింది[111].

భాస్కర రామాయణంలో ప్రహస్తుడు, దుర్ముఖుడు, వజ్రాక్షుడు, నికుంభుడు, మహాపార్శ్వుడు, మహోదరుడు, ధూమ్రాక్షుడు, అతికాయుడు, మహాకాయుడు, అగ్నికేతువు, రశ్మికేతువు, సుప్తఘ్నుడు, సూర్యశత్రువు, శుకసారణులు, మారీచునితో కలిపి మొత్తం 16 మంది రావణుని మంత్రులుగా ఉండినట్లు భాస్కర రామాయణం ద్వారా తెలియుచున్నది. మొల్ల రామాయణములో అతికాయుడు, దేవాంతకుడు, ప్రజంఘుడు, యూపనేత్రుడు మొదలగు మంత్రుల వివరణ స్వల్పముగాగలదు. రామాభ్యుదయములో యూపుడు, ధూమ్రాక్షుడు, అనే మంత్రుల గురించి పేర్కొనబడింది.

*3-3-6* దుర్మంత్రి తెచ్చు ఆపదలు :

రాజు ధార్మికులగు మంత్రులతోనే మంతన మాడవలయును. దుర్మంత్రి జేయు ఉపదేశము రాజుయొక్క పుత్రులను, రాష్ట్రము నందలి మంత్రులందరిని నశింపజేయును. కుంభకర్ణుడు రావణునితో

వినాశయంతో భర్తారం సహితాశ్శత్రుభిర్బుధైః।
విపరీతాని కృత్యాని కారయం తీహ మంత్రిణః॥[112]

దుర్మంత్రులు శత్రువులతో చేతులుగలిపి ప్రభువులను నాశనము చేయగోరి అతనిచేతనే అహిత కృత్యాన్ని చేయించెదరు.

"యో హి శత్రుమవజ్ఞాయ ఆత్మానం నాభిరక్షతి।
అవాప్నోతి హి సోఽనర్థాన్ స్థానాచ్చవ్యవరోప్యతే ॥[113]

తన శత్రువు లెవ్వరో గ్రహించలేక దుర్మంత్రులను తొలగింపుమని, లేనిచో తన శత్రువులెవరో గ్రహింపలేనపుడు దుర్మంత్రులను తొలగింపని రాజు అనర్థముల పాలయి పదభ్రష్టుడగునని చెప్పెను. దుర్మంత్రుల ప్రస్తావన తెలుగులోని ప్రసిద్ధ రామాయణములందెచ్చటను లేదు.

*3-3-7* మంత్రి ముఖ్యుడగు సుమంత్రుని బహుముఖసేవ:

దశరథుని ఆంతరంగికుడైన సుమంత్రుడు రాజు తలపెట్టిన సమస్త కార్యాలలోను పాల్గొనుచు కర్తవ్య నిర్వహణ చేయుచుండెడివాడు. వశిష్ఠుడు యాగమునకు చేయవలసిన ఏర్పాట్ల గురించి సుమంతునికే తెల్పగా అతడు ఏలోపము లేకుండా పూర్తిగావించినాడు. ఇతడు దశరథునికి, ఇతరమంత్రులకు మధ్య సంధానకర్తగా వ్యవహరించెడివాడు. రాజ్యాంగ సంక్షోభపరిస్థితి తలెత్తినపుడు రాజు సుమంతుని పిలిపించెడివాడు[113a] అపుడు యుక్తమైన రీతిని మంత్రాలోచనయందు పాల్గొనెడివాడు. శ్రీరాముని వనవాసమునకు పంపించు విషయమున కైక కోరిన కోరిక సరియైనది కాదని యితడు నిర్ద్వంద్వముగా తెల్పెను. ధైర్యముగా హితవచనములను పల్కెను[133b] ఇంకను ఇతడు రథసారధిగా కూడ రాజును సేవించెను. సీతా రామలక్ష్మణులు వనమునకు పోవునపుడు వారి రథమునకు సుమంతుడే సారధ్యము వహించెను. దశరథుని వద్దకువచ్చిన సుమంతుని కౌసల్య అతనిని రామదూతయనును. కౌసల్య దశరథునితో

ఇమం తస్య మహాభాగ దూతం దుష్కరకారిణః
వనవాసా దనుప్రాప్తం కస్మాన్న ప్రతిభాషసే॥[114]

ఎవరికిని శక్యముగాని కార్యాన్ని నిర్వహించిన రాముని దూత ఇతడు అని పేర్కొనును. దీనిని బట్టి ఇతడు కేవలం మంత్రిగానే గాక దూతగా కూడ గుర్తింపబడినట్లు తెలియచున్నది. ఆసమయంలో సీతారామ లక్ష్మణులు పంపిన సందేశాలను ఇతడు యుక్తిగా వారికి వినిపించెను. అనేక విధములుగా సేవలందించిన మంత్రిముఖ్యుడయిన సుమంతుని గుఱించి శ్రీరాముడు

'ఇక్ష్వాకూణాం త్వయా తుల్యం సుహృదం నోపలక్షయే।
యథా దశరథో రాజా మాం న శోచేత్ తథాకురు"॥[115]

ఇక్ష్వాకువంశం వారికి నిన్నుమించిన మిత్రుని వేఱొక్కరిని కానను. ఇంతేగాక దశరథ మహారాజు నన్నుతలచి దు:ఖింపకుండా ఉండేటట్లు ఏమి చేయవలెనో ఆవిధంగా ఆచరింపమని చెప్పాడు. దీనినిబట్టి సుమంతుని బహుముఖసేవ, అతని సామర్థ్యంపై శ్రీరామునకుగల అపారమైన నమ్మకము వ్యక్తమగుచున్నది.

రంగనాథరామాయణములో సుమంతుడు అనఘుడనియు, గౌరవమతి యనియు గౌరవింపబడెను. దశరథుడు శ్రీరాముని వద్దనుండి వచ్చిన సుమంతునితో "గౌరవమతి నీవు గల్గితిగాన। మారామచంద్రుని సేమములెల్లవింటి"[116] అనును. ఈ ప్రస్తావన మిగిలిన రామాయణములలో లేదు.

### *3-3-8 యుద్ధకాండములో మంత్రుల నిర్వహణ:*

లంకలో హనుమంతుడు చేసిన కల్లోలమునకు రావణుడు తనసభలో సిగ్గుతో తలవంచి మంత్రులను కర్తవ్యమును గూర్చి ప్రశ్నించెను[117] అపుడు రావణుని మంత్రులు తమ అభిప్రాయాలను వెల్లడించిరి. వారికి అధికమైన బలమున్నది. కానీ వారు మందబుద్ధులు. నీతియన్నది వారికి తెలియదు. శత్రువులనుగూర్చి వారికి సరియైన పరిజ్ఞానంలేదు. అటువంటి మంత్రులు రావణుని గూర్చి అనేక విధముల కీర్తించుచూ వీరాలాపములు పలికిరి. ఆ మంత్రాలోచనములో ఒక్క విభీషణుడు మాత్రము సీతను రామునికి ఇవ్వవలసినదిగా పల్కెను. విభీషణుడు తప్ప రావణుని మంత్రులందఱు మందబుద్ధులనువిషయము నిది నిరూపించుచున్నది. రావణుని సోదరుడైన కుంభకర్ణుడు మంత్రాలోచనయందు పాల్గొనుచూ

యః పశ్చాత్ పూర్వకర్మాణి కర్మా ణ్యభిచికీర్షతి ।
పూర్వంచాపర కార్యాణి న స వేద న యానయా ॥[118]

మంత్రులు ముందుగా మంత్రాలోచన చేసిన తర్వాత కార్యాన్ని ఆచరింపవలసి ఉంది ఎవరు తద్విపరీతముగా ముందు తనకు తోచినట్లు చేసి తర్వాత ఆలోచన చేయునో వారికి మంచిచెడ్డలు తెలియవు అనెను.

'త్వ యేదం మహ దారబ్దం కార్యమప్రతిచింతితం।
దిష్ట్యా త్వాం నా వధీ ద్రామో విషమిశ్ర మివామిషమ్ ॥[119]

కుంభకర్ణుడు రావణునితో మాట్లాడుతూ నీవు ముందువెనుకల నాలోచింపక గొప్ప అనర్థమైన పనిని చేసితివి. విషము కలిపిన మాంసము తినిన వానిని చంపనట్లుగా నీ అదృష్టముకొద్ది నిన్ను రాముడు చంపలేదు. అని అనుటను బట్టి కుంభకర్ణుని యొక్క ఉత్తమమంత్రాలోచనావిధానమెట్టిదో తెలియుచున్నది.

పిమ్మట యుద్ధ రంగంలోని విశేషాలను శుకసారణులను మంత్రులు రావణునికి ఈవిధంగా వివరించారు.

'ప్రవృష్ట యోధా ధ్వజనీ మహాత్మనాం।
వనౌకసాం సంప్రతి యోద్ధుమిచ్ఛతాం॥
అలం విరోధేన శమో విధీయతాం।
ప్రదీయతాం దాశరథాయ మైథిలీ॥[120]

ఇపుడు బలవంతులైన వానరులతో కూడిన సేన యుద్ధముచేయడానికి సిద్ధముగా నున్నది. కాబట్టి వారితో విరోధమువద్దు. కాబట్టి శాంతస్వభావుడైన రామునకు సీతను అప్పచెప్పవలసినదిగా హితవచనాలను పలికారు. వానిని స్వీకరింపక రావణుడు వారిని నిందిస్తాడు. అంతేగాక వారిని స్థానభ్రష్టులను చేయుటయే ఉత్తమమని భావించి వారిని వదలి పెడతారు. రాముడు అధికసైన్యంతో సువేల పర్వతంపై విడిదిచేసి యున్నాడని తెలిసిన రావణుడు మంత్రులతో ఆలోచనచేస్తాడు. ఆతర్వాత తన భవనానికి వెళ్లి విద్యుజ్జిహ్వుని సహాయంతో మాయలు ప్రదర్శిస్తారు. ఆ సమయంలో మాల్యవంతుడు రావణుని తప్పును తెలియజెప్పుతూ హిత వచనాలను పల్కుతాడు.

'తత్త్వయా చరతా లోకాన్ ధర్మోఽపి నిహతో మహాన్ ।
అధర్మః ప్రగృహీతశ్చ తే నాస్మద్బలినః పరే॥[121]

ధర్మాధర్మములు ఇట్టివి కాబట్టి దిగ్విజయాన్నికోరి లోకంలో తిరిగేటపుడు నీవు శుభహేతువగు ధర్మాన్ని నాశనం చేసినావు. అధర్మాన్ని ఆశ్రయించావు. కాబట్టి ధార్మికుడైన శ్రీరామచంద్రుడు మనకన్నా బలవంతుడు.

'స ప్రమాదాత్ ప్రవృద్ధస్తే ధర్మోఽహి గ్రసతే హి నః।
వివర్ధయతి పక్షేచ సురాణాం సురభావనః॥[122]

నీవు ముందు వెనుకలను ఆలోచించకుండా అధర్మాన్ని పెంచావు. అదే మనలను మ్రింగివేస్తున్నది. దేవతలకు అనుకూలమైన వారి పక్షాన్ని పెంపొందించు చున్నది. ఇంకను ఋషులను బాధించితివనియు, ఉత్పాతములు కలుగుచున్నవనియు మంత్రిశ్రేష్ఠుడైన మాల్యవంతుడు రావణుని హితాన్ని పలికినప్పటికీ అహంకారంగల రావణుడు వాటిని తిరస్కరించాడు.

పిమ్మట యుద్ధరంగంలో చాలామంది మంత్రులు మరణించారు. కుమారుడైన ఇంద్రజిత్తు మరణించాడు. ఆసమయంలో రావణుడు సీత వద్దకు కత్తి తీసుకొని వెళ్లగా అప్పుడు సుపార్శ్వుడను మంత్రి

'వేదవిద్యా వ్రతః స్నాతః స్వకర్మ నిరతస్సదా।
స్త్రియాః కస్మాద్వధం వీర మన్యసే రాక్షసేశ్వర॥[123]

వీరుడవైన ఓ రాక్షసరాజా! వేదాధ్యయనంచేసి వ్రతస్నాతుడవై సదా స్వకర్మ నిరతుడవైన నీవు స్త్రీవధ చేయవలెనని ఎందుకు కోరుతున్నావు' అంటూ రావణుని అకృత్యంనుండి మరలిస్తాడు. తర్వాత రావణుని మూలబలం అంతా యుద్ధంలో హతమైపోయింది. ఆ సమయంలో రావణుడు మహోదరుడు, మహాపార్శ్వుడు, విరూపాక్షుడు అనే ముగ్గురు మంత్రులను యుద్ధరంగానికి పంపిస్తాడు. చివరకు వారును హతులగుదురు. ఈ ప్రకారం యుద్ధకాండలో తమకర్తవ్యాలను తగిన రీతిగా మంత్రులందఱు నెఱవేర్చినట్లు తెలియుచున్నది.

### *3-3-9 మానవ- వానర - రాక్షస రాజ్యాలలో మంత్రులు - విధినిర్వహణ - ఫలితములు:*

దశరథునికిగల మంత్రులందఱు శత్రువులను అదుపులో నుంచగల పరాక్రమవంతులు. నీతిశాస్త్రాన్ని ఆచరణలో పెట్టినవారు. వారు రాజ్యవ్యవహారాలను చూస్తుండగా మోసగాడుగాని, పరస్త్రీ వ్యామోహంగల వాడుగాని ఒక్కడుగూడ లేడు. అయోధ్యయేగాదు కోసల దేశమంతయు అన్యాయము అధర్మము లేక మిగుల ప్రశాంతముగనుండెను.[124]

దశరథుని మంత్రులందఱు మంత్రాలోచనలో నిపుణులు. దశరథుడు పుత్రులకోసం యాగం చేయడానికి ఏర్పాట్లు చేయుమని మంత్రుల నాదేశిస్తూ

'తద్యథావిధి పూర్వం మే క్రతురేష సమాప్యతే।
తథా విధానం క్రియతాం సమర్థాః సాధనేష్వితి॥[125]

యాగము నిర్విఘ్నంగానూ శాస్త్రోక్తంగానూ పరిసమాప్తమగునట్టి ఏర్పాటు చేయవలెను. మీరిలాంటి కార్యాన్ని నిర్వహించడంలో సమర్థులు అని పేర్కొనడాన్ని బట్టి దశరథుని మంత్రులు కార్యనిర్వహణ దక్షులని తెలియుచున్నది. మంత్రి ముఖ్యుడైన సుమంతుడు రాజుకు సహకరిస్తూ మిత్రదేశాల రాజులను దశరథునిఆజ్ఞానుసారం ఆహ్వానించెను. యాగం నిర్విఘ్నంగా సాగటంలో మంత్రులందఱు దశరథునికి ఎంతగానో తోడ్పడ్డారు. రాముని యౌవరాజ్య పట్టాభిషేక ప్రయత్నానికి భంగం కలిగినపుడు మంత్రులందరు వ్యథచెందినారు. ఆసమయంలో సుమంతుడు, సిద్ధార్థుడు కైకతో తగువిధంగా హితంపలికాడు.

రాముడు అరణ్యానికి వెళ్లగానే ఆబాధను భరించలేక దశరథుడు మృతిచెందినాడు. ఆ సమయంలో రాజ్యాంగ సంక్షోభస్థితి ఏర్పడింది. అపుడు మంత్రులందఱు తగిన రీతిని వ్యవహరించి వశిష్ఠుని ఆదేశానుసారం భరత శత్రుఘ్నులను అయోధ్యకు తెచ్చిరి. ఈ సందర్భములో మంత్రులే దూతలుగా వ్యవహరించిరి[125(a)]. అపుడు భరతుడు రాజ్యము స్వీకరించగా శ్రీరాముని తీసుకొని వచ్చుటకై ప్రయాణమైన సందర్భములో మంత్రులందఱు భరతుని అనుసరించారు. భరతునికి రామునిపైగల సోదర ప్రేమకు మంత్రులందఱు శ్లాఘించారు. అరణ్య వాసానంతరము రాముడు అయోధ్యకు తిరిగిరాగా మంత్రులు వశిష్ఠునితో రామపట్టాభిషేకమునకు తగిన ఏర్పాట్లు చేయుటలో ఆలోచనగావించారు.

'అశోకో విజయశ్చైవ సుమంత్రశ్చైవ సంగతాః।
మంత్రయన్తే రామవృద్ధం వృద్ధ్యర్థం నగరస్యచ॥[126]

అశోకుడు, విజయుడు, సుమంతుడు అనుముగ్గురు మంత్రులు పట్టాభిషేకానికి ఆలోచనలు చేశారు. ఈవిధంగా కోసల రాజ్యంలోని మంత్రులందఱు తమ విధులను నిర్వర్తించినట్లు తెలియుచున్నది. అంగ దేశాధిపతియైన రోమపాదుడు ధర్మాన్ని తప్పటంచేత అంగదేశంలో అనావృష్టి ప్రబలింది. ఆసమయంలో ఆరాజు మంత్రుల సలహాను గ్రహించి వేశ్యాంగనలను ఋష్యశృంగుని వద్దకు పంపునట్లు చేసెను. వారట్లుచేసి ఋష్యశృంగుని రప్పించి దేశమున అనావృష్టి తొలగింపజేయుటలో తమ

విధులను చక్కగా నిర్వర్తించిరి. మిథిలానగరరాజైన జనకుని మంత్రులుకూడా సమర్థులే. శ్రీరాముడు శివధనుర్భంగము చేయగానే జనకుడు విశ్వామిత్రుని అనుమతితో తన మంత్రులను దశరథుని వద్దకు పంపెను. దశరథుని సందర్శించిన జనకుని మంత్రులు

'మైథిలో జనకో రాజా సాగ్నిహోత్ర పురస్కృతమ్।
కుశలం చావ్యయంచైవ సోపాధ్యాయపురోహితమ్॥
ముహుర్ముహుర్మధురయా స్నేహసంరక్తయా గిరా।
జనక స్త్వాం మహారాజ పృచ్ఛతే సంపురస్సరమ్॥[127]

జనకమహారాజు నీకు, నీ అగ్నిహోత్రానికి, నీ ఋత్విజులకు, పురోహితులకు యోగక్షేమముల నరసినాడు'అంటూ జనకుని సందేశాన్ని వినిపించారు. నీరాకతో మాకు ప్రీతిని కలిగించెదవు కాబట్టి నీ కుమారుల వివాహమునకు సంబంధించిన ఆనందమును పొందగలవు'. అంటూ తమ అభిప్రాయాన్ని వ్యక్తంచేసి దశరథుని మిథిలకు తెచ్చుటలో మంత్రులు తమ ప్రతిభ చూపించారు.[128]

ఇక వానర రాజ్యంలో సుగ్రీవుని మంత్రులందఱు కలసి ఆతనిని కపిరాజ్యానికి అధిపతిని చేశారు. పిమ్మట వాలి తిరిగివచ్చి సుగ్రీవుని రాజ్యము నుండి వెడల గొట్టించెను. సుగ్రీవుడు రాజ్యభ్రష్టుడైనను ఆతని వెంట మంత్రులున్నారు. మంత్రులలో ముఖ్యుడైన హనుమంతుడు సుగ్రీవునిభయాన్ని తొలగించడానికి ప్రయత్నంచేశాడు. సుగ్రీవుని కోరిక మేరకు హనుమంతుడు భిక్షుకరూపంలో వెళ్ళి తమదగ్గఱకు వచ్చుచున్న యువకులను రామ లక్ష్మణులుగా తెలుసుకొని సుగ్రీవునితో సఖ్యాన్ని ఏర్పరచినాడు.[129] వాలి వధానంతరము సుగ్రీవుడు వానరరాజైనాడు. ఆసమయమున మిత్రుడైన శ్రీరాముని పనులలో హనుమంతుడు సాఫల్యమును పొంది లంకానగరాన్ని అగ్నికి ఆహుతిచేసెను. ఈ ప్రకారం వానరరాజ్యంలోని మంత్రులు సమర్థవంతంగా తమ పనులను నెరవేర్చారని తెలుస్తున్నది. లంకారాజ్యంలోని మంత్రులు రావణుని యందు అపారమైన భక్తికలవారు. వారికి నీతి తెలియదు కావుననే తమవద్దగల అపారమైన ఆయుధ సంపదతో రాముని జయింపగలమని భావించి రావణుని యుద్ధానికి ప్రోత్సహించిరి.[129(a)] ఆ సమయంలో కుంభకర్ణుడు, మాల్యవంతుడు,విభీషణుడు హితోక్తులు పలికినప్పటికి తక్కిన వారు అంగీకరించలేదు. రావణుడు కూడా శత్రువులను జయించగలనను ధీమాతో వ్యవహరించి యుద్ధంలో మరణించాడు. రాజ్యాంగంలో ద్వితీయస్థానాన్ని పొందిన మంత్రి పరిపాలనా పరంగా అత్యంత బలీయమైన శక్తి యనడం నిర్వివాదాంశము.

### *3-4-0* రాష్ట్రం:

రాష్ట్రం, జనపదం, భూమి, దేశం అనే పదాలలో కొద్దిపాటి అర్థభేదం ఉన్నప్పటికి సమానార్థకాలుగానే ప్రయోగింపబడుతున్నాయి. రాజునకు, రాష్ట్రానికి విడదీయరాని సంబంధం ఉన్నది. తన రాష్ట్రం అభివృద్ధి చెందడానికి రాజు శ్రద్ధచూపాలి. రాజులేని రాష్ట్రం శోభించదు.

### *3-4-1* రాష్ట్రం - నిర్వచనాలు

రాష్ట్రం అనే శబ్దం చాలాప్రాచీనమైనది. ఋగ్వేదంలో వరుణుడు రాష్ట్రాలకు రాజు అని వశిష్ఠుడు చెప్పినట్లు గలదు.

'యథా రాష్ట్రం గుపితం క్షత్రియస్య'[130] అని పేర్కొనబడింది. సారవంతమైనది, నీటి వసతి గలది, పుష్కలంగా గడ్డిగలది, మంచి గాలి, ఎండగలది, ధనధాన్య సంపన్నమైనది, ఉపద్రవము లేనిది. పుష్పఫల తరులతాదులచే మనోహరమైనది. కృషి వాణిజ్యాది జీవనోపాయం గల్గిన దేశాన్ని రాజు ఆశ్రయించాలని మనువు ఉద్దేశ్యం.[131] యాజ్ఞవల్క్యస్మృతి, విష్ణుధర్మసూత్రాలుకూడ సర్వసమృద్ధమైన ప్రదేశాన్ని రాజు ఆశ్రయించాలని పేర్కొన్నది.[132]

### *3-4-2* మనువు నిరసించిన రాష్ట్రం:

రాష్ట్ర స్వరూపాన్ని స్పష్టపరచిన మనువు ఎట్లాంటి రాష్ట్రం ఉండకూడదో కూడ పేర్కొన్నాడు. అంతేగాకుండా ఎట్టిరాష్ట్రం నాశనమౌతుందోకూడా చెప్పాడు.

'యద్రాష్ట్రం శూద్ర భూయిష్టం నాస్తికాక్రాంత మద్విజమ్।
వినశ్యత్యాశు తత్కృత్స్నం దుర్భిక్ష వ్యాధిపీడితమ్.॥

శూద్రులతో నిండినది,నాస్తికులతో చుట్టుకొన్నది,ద్విజరహితంగా నున్నదియగు రాష్ట్రం నశిస్తుందని చెప్పాడు.

### *3-4-3* రామాయణము - క్షామబాధను పొందిన రాష్ట్రము :

అంగదేశానికి రాజు రోమపాదుడు. అతనిదేశంలో బహుశాస్త్ర విషయములు తెలిసిన బ్రాహ్మణులున్నారు. రాజైన రోమపాదుడు ధర్మము తప్పిన కారణంగా దేశంలో అనావృష్టి ప్రబలిపోయింది. ఆ స్థితిలో రోమపాదుడు బ్రాహ్మణులను పిలిపించి ప్రాయశ్చిత్తవిధానాన్ని తెల్పుమని కోరగా వారు ఋష్యశృంగుని అచ్చటకు రప్పింపుమని

పలికిరి. అంతేగాక నీపుత్రికయైన శాంతను అతనికిచ్చి వివాహముచేయుమని చెప్పిరి. ఈ విషయాన్ని అతడు మంత్రులతో ఆలోచించి ఆప్రకారమేచేశాడు. ఋష్యశృంగుని అంగదేశానికి తీసుకొని వస్తుండగనే వర్షంకురిసి అనావృష్టి తొలగిపోయింది.

'తత్ర చానీయమానే తు విప్రే తస్మిన్ మహాత్మని।
వవర్ష సహసా దేవో జగత్ ప్రహ్లాదయం స్తదా॥[133]

అని వాల్మీకి రామాయణంలో ఉండగా రంగనాథ రామాయణంలో కొంత భిన్నత్వం కనబడుతుంది. రోమపాదుడు తనదేశంలో వానలు లేకుండుటచే వగలచే బొగిలి.

'వరమునీంద్రులచేత వర్షహోమములు - వరువడి జేయించి పడయ రాకున్న
భూరిశోకంబున బొగులుచునున్న.[134] అని మూలమునగల వర్ణనకు కొంతచేర్చి ప్రకటింపబడినది.

భాస్కర రామాయణంలో రోమపాదుడు తనదేశంలోగల అనావృష్టి విషయమై సచివులను పురోహితులను తన సభకు పిలిచి విచారించినట్లు గలదు.

మన యంగదేశమునకుం
జనగ ననా వృష్టి దోషశాంతులు సేయం
బొనరిన యత్నము లేమిట
జనరారగ జేయు డీరు దక్షత ననన్[135]

ఇక్కడ ఋష్యశృంగుని తీసుకొని రావలెనని రోమపాదునకు తెలిపినట్లు ఆ ప్రకారం అతడు ఆచరింపగా అనావృష్టి తొలగినట్లు గలదు. మొల్ల రామాయణములోగాని, రామాభ్యుదయములోగాని ఈ వృత్తాంతము పేర్కొనబడలేదు.

### *3-4-4* రామాయణం - రాష్ట్ర ప్రస్తావన :

రామాయణంలో పౌరజానపద సంయుక్తమగు రాజ్యము అనే అర్థంలోనే రాష్ట్రం అనే పదం అనేక సందర్భాలలో ప్రస్తావించబడింది.

'రాజు లేకున్న బురంబు రాష్ట్రంబు రాజిల్లదు'[136] అని రంగనాథ రామాయణంలో పుర, రాష్ట్రాలు రెండును వేరు వేరుగా ప్రస్తావింపబడ్డాయి. దశరథుని మంత్రులందఱూ రాజ్యపాలనా వ్యవహారాలను చూస్తుండగా

'ప్రశాంతం సర్వమేవాసీత్ రాష్ట్రం పురవరం చ తత్[137]

అయోధ్యయేగాక కోసలదేశమెల్ల ప్రశాంతముగా నున్నట్లు వాల్మీకి రామాయణం

పేర్కొన్నది. ఇదే సందర్భంలో రంగనాథ రామాయణంలో

----- నాతని దేశమునను - గృశుండు గొండీడు రోగియు దరిద్రుండు
జారుండు మరియనాచారుండుఁబుణ్య - దూరుండు గ్రూరుండుఁదుచ్ఛుండు శఠుండు
మందుండు మరిలేరు మందునకైన - నందఱు మణికుండ లాద్యలంకృతులు
నందఱు ధర్మపరాయణచిత్త - లందఱు విహితకులాచార రతులు
ఈ చందమున రాజ్యమేపుదీపింప - భూచక్రమెల్ల నిమ్ములనేలియేలి"[138]

అని దశరథ రాజ్యవైభవాన్ని ప్రకటించడం జరిగింది.

వాల్మీకి రామాయణంలో

'కోసలో నామ ముదితః స్ఫీతో జనపదో మహాన్।
నివిష్టః సరయూతీరే ప్రభూత ధనధాన్యవాన్॥[139]

సంతుష్టులైన ప్రజలతో, అపారమైన ధనధాన్యసంపదలతో పరితుష్టమై కోసలదేశము ప్రసిద్ధిగాంచినది విస్తృతమైన ప్రదేశము కలిగి సరయూనది ఉభయతీరములతో కూడినది.

రంగనాథ రామాయణములో పై విధమగు కోసలదేశవర్ణనలేదు. భాస్కర రామాయణములో కోసలదేశాన్ని గుఱించి

సరయువు తీరంబున బహు
తరధన ధాన్యములు గలిగి ధరణికి దొడవై
పరగెడు కోసలదేశం
బరుదారగ మెఱసియుండు నద్దేశమునన్[140] అని ప్రకటింపబడింది.

రామాయణంలో జనపదమనేపేరుతోగూడ రాష్ట్రం వ్యవహరింపబడింది. గుహునితో శ్రీరాముడు

'అప్రమత్తో బలే కోశే దుర్గే జనపదే తథా।
భవేథా గుహ రాజ్యం హి దురారక్షతమం మతమ్॥[141]

రాజ్యాన్ని రక్షించుకోవడం చాల కష్టం అంటారు. కాబట్టి నీవు చతురంగబలాన్ని, ధనాగారాన్ని, దుర్గాన్ని, దేశాన్ని, కడుజాగరూకతతో చూచు కొనవలసినది యని చెప్పెను. దశరథుడు మరణించిన తర్వాత మార్కండేయ మౌద్గల్యాది బ్రాహ్మణులు వశిష్ఠునితో రాజు లేక రాష్ట్రం వినాశనం పొందగూడదు. కాబట్టి ఇక్ష్వాకు వంశీయులలో ఒకరిని రాజుగా చేయుమని చెప్పారు. ఇక్కడ రాష్ట్ర శబ్దం రాజు అనే అర్థంలో ప్రయోగింపబడింది. ఇదే సందర్భములో రంగనాథ రామాయణమున

' రాజు లేకున్న పురంబు రాష్ట్రంబు రాజిల్ల''[142] దనుట ద్వారా పురము కాక మిగిలిన రాజ్యభాగ ప్రదేశమంతయు రాష్ట్రమని స్పష్టమగుచున్నది.

"విధవా పృధివీ రాజన్ త్వయా హీనా న రాజతే
హీన చంద్రేవ రజనీ నగరీ ప్రతిభాతిమే[143]

తండ్రి మరణానంతరం భరతుడు దుఃఖిస్తూ నీవు లేని ఈ భూమి విధవయై ప్రకాశిస్తున్నది. అయోధ్యా పట్టణము కూడా చంద్రుడు లేని రాత్రివలె తోచుచున్నదని దశరథుని పార్థివ శరీరాన్ని ఉద్దేశించి పలికెను.

రంగనాథ రామాయణములో భరతునితో వశిష్ఠాదులు

'ఉర్వికి రాజులేకున్న గార్యములు నిర్వహింపగరాదు'[144] ఇక్కడ ఉర్వియను పదము రాజ్యము అను అర్థములో ప్రయోగింపబడినట్లు తెలుస్తున్నది.

వశిష్ఠునితో మౌద్గల్యాది మహర్షులు రాజు యొక్క ఆవశ్యకతను తెలియజేస్తూ రాష్ట్రశబ్దమునే గాక జనపద శబ్దమునుగూడ అనేకమార్లు ప్రయోగించిరి. దీనినిబట్టి రాష్ట్రజనపదములు రాజ్యము అనుదానికి సమానార్థకమని నిరూపితమగుచున్నది.[145]

భాస్కరరామాయణములలో వశిష్ఠాదులు భరతునితో

సకల నృప మంత్రి మునిలోక సమ్మతమున
భరతు గనుకొని రఘువంశ గురుడు రాష్ట్ర
మిట్లరాజకమై యున్న నెగ్గుదొడరు
గాక నీవింక బట్టంబు గట్టికొనుము''.[146]

అని వచించుటను బట్టి రాష్ట్రం - రాజ్యం సమానార్థకములుగానే వాడబడినట్లు తెలియుచున్నది. మొల్లరామాయణంలో దశరథుడు.

సీ॥ తన సుమంత్రాది ప్రధానులతోఁ గూడి సుఖగోష్ఠినుండఁగ నఖిలజనులఁ
జక్కఁగా రావించి సమ్మదంబున వంశ గురునితో దశరథ ధరణినాథుఁ
డనియె నీభూభారమంతయు నొక్కట నేలితిఁ జాలదె యేకహేళి
నటుగాక పగతుర నవలీల గెల్చితి నిల్పితి ధర్మమ్ము నిష్ఠతోడ
నింతచాలదె యాశకు నెంత, కెంత రామచంద్రుని ధరణికి రాజుగాఁగ
మీరు సూఁడంగ బట్టంబు భూరిమహిమఁ గట్టవలయును మంచి లగ్నమునఁజెలఁగి[147]

అని పేర్కొను సందర్భమునగల భూమి, ధరణి శబ్దములు రాజ్యమున సమానార్థకములని నిరూపించుచున్నవి.

మొల్లరామాయణంలోనే భరతుడు శ్రీరామునితో

తే॥ రాజులేకున్నచో మఱి రాష్ట్రమందుఁ
గార్యమెట్లొను మీ రెఱుంగనిది గలదె
నేఁటి సమయానఁ బట్టంబు నిలుపుకొనఁగ
దిరిగి విచ్చేయు డనుడు తోడ నాభరతునకును

చ॥ జనకుడు సేసినట్టి మితిఁ జక్కగఁదీర్చికడంక నేనువ
చ్చిన గుఱిదాఁక భూతలము జేకొని రాజ్యముఁజేయుమాట గా
దనకు మటన్న నొల్లినన నాతనికిం దనపాదుకా యుగం
బొనరఁగ నిచ్చి పొమ్మనుచు నుర్వికి రాజుగఁబంచెసొంపుగన్[148]

అని పేర్కొనబడుటను బట్టి రాష్ట్ర - భూతల - ఉర్వి శబ్దముల సంబంధము తెలియుచున్నది. రామాభ్యుదయములో శ్రీరాముడు.

చ॥ భరతుడు రాజ్య మేలుమని ప్రార్థనచేసిన దాఁటవచ్చునే
నరవరునాజ్ఞ నాకుఁ బదునాలుగు వర్షము లోర్చియంతఁగ్ర
మ్మఱఁజనుదెంచి పూనెద సమస్త మహాభర మన్ని యేండ్లు భా
స్వర నయవృత్తిఁ జేయుము ప్రజా పరిపాలన మీవు నావుడున్

అనుటద్వారా మహాశబ్దము రాజ్యమను అర్థమునిచ్చుచున్నది. మారీచుడు సీతాపహరణము చేయనెంచిన రావణునకు హితము పల్కుచూ

త్వద్విధః కామవృత్తో హి దుశ్శీలఃపాప మంత్రితః।
ఆత్మానం స్వజనం రాష్ట్రం స రాజా హంతి దుర్మతిః॥[149]

తన ఇచ్చవచ్చిన రీతిని ప్రవర్తించువాడు, చెడునడవడిగలవాడు, దుష్టాలోచన గలవాడు, దుర్బుద్ధి యగునీవంటిరాజు తనను, తనవారిని, తన రాష్ట్రమును నశింపజేయునని పేర్కొనెను.

భాస్కర రామాయణములో

క॥ మిడుతలు కార్చిచ్చు పయిం
బడఁబోయిన యట్లజావె బల్లిదుఁడగునా
పుడమిఁపతి మీఁద బల్విడి
నడరఁగ మన తలఁచుటెల్ల యనినం గినుకన్[150]

ఈ సందర్భములో పుడమి శబ్దం రాజ్యానికి సమానార్థకంగా వాడబడింది. వానర రాజ్యానికి కూడా విశాలమైన ప్రదేశము గలదు. కావున దేశమున రాజు

లేకుండా ఉండకూడదు. కాబట్టి అరాజకత్వాన్ని తొలగించడానికే నన్ను మంత్రులు పౌరులు బలాత్కారంగా రాజును చేశారని సుగ్రీవుడు వాలితో చెప్తాడు.

సామాత్య పౌరనగరం స్థితం నిహత కంటకం।
న్యాసభూతమిదం రాజ్యం తవ నిర్యాతయామ్యహమ్॥[151]

అమాత్యులు పౌరులు నగరములతో గూడిన ఈ రాజ్యము నా దగ్గఱ ఇల్లడముగా నుంచబడినట్లు భావించి ఇంతవరకు నేను ఏ కంటకము లేకుండా దీనిని కాపాడితిని. దీన్ని నీకిపుడు తిరిగి ఇచ్చివేస్తున్నాను. అని అనడాన్ని బట్టి వానర రాజ్యం ఎంత విశాలమైనదో అర్థమౌతుంది. రామాయణంలో పేర్కొనబడ్డ సాంకాస్యము, మిథిల లంకారాజ్యాలు నగర రాజ్యాలుగానే చెప్పవచ్చు.

**3-4-5 కోసల - కపి - లంకా రాజ్యాల రాష్ట్ర విస్తీర్ణము:**

రామాయణంలో కానవస్తున్న ప్రధానమైన కోసల - వానర - లంకా రాజ్యాలు చాల విశాలమైనవి. మనుదత్తమగు సమృద్ధిగల భూమిని ఇక్ష్వాకు వంశంలోని వారు క్రమంగా పరిపాలించారు. ఈ క్రమంలోనే దశరథుడు విస్తృతమైన భూమిని పాలించెను.[152]రాముడు వనవాసానికి బయలుదేరివెళ్లుచూ తమసానదీ తీరాన్ని చేరాడు. అంత వరకే కోసల దేశమని స్పష్టమగుచున్నది. ఈ సందర్భంలో రాముడు విడిచిపెట్టిన కోసల రాజ్యాన్ని గుఱించి వివరణ గలదు.[153] ఆ వివరణ ప్రకారం కోసల రాజ్యం ధన ధాన్యోపేతమైనది. ప్రజలందఱు దానశీలురు. ఆగ్రామాలన్నీ రమ్యమైనవి. ఆ గ్రామాలలోని జనులు నిర్భయంగా జీవిస్తున్నారు. ప్రతి గ్రామంలోను దేవాలయాలు, యూపస్తంభాలు, యజ్ఞశాలలు ఉన్నాయి. జలాశయాలన్నీ జలసమృద్ధంగా ఉన్నాయి. అన్ని గ్రామాలలోను ఆవుల మందలు అశేషంగా ఉన్నాయి. జనులందఱు దేహపుష్టితోను, మనః సంతుష్టితోను ఉన్నారు.

రంగనాథ రామాయణంలో శృంగబేరపురమున శ్రీరాముడు జటాధారుడై సుమంతుని వీడ్కొలుపుటనుబట్టి అంతవరకు కోసల రాజ్యమని తెలియుచున్నది.

రామాభ్యుదయములో గుహుని ఆశ్రమమున

క॥ అచలేంద్రధీరుఁడవ్విభుఁ
డచట జటావల్కలాజినాంబరధరుఁడై
రుచిర తపోధనవేష
ప్రచురశ్రీఁ దాల్చి నియమ పరతం బొలిచెన్[154]

అని పేర్కొనుటను బట్టి గుహుని ఆశ్రమప్రాంతం వరకు కోసల రాజ్యం విస్తృతమైనట్లు తెలియును. కపి రాజ్యంకూడా విశాలమైనదే. దానికి రాజధాని కిష్కింధ. బ్రహ్మ దత్తముగా ఋక్ష విరజునికి ప్రాప్తించినది కపిరాజ్యం. అతని మరణా నంతరం అతని జ్యేష్టపుత్రుడగు వాలికి ప్రాప్తించినది. పిమ్మట కపి రాజ్యానికి సుగ్రీవుడు ప్రభువైనాడు. అపుడు శ్రీరాముడు లక్ష్మణునితో

'ఇమాః స్ఫీత గుణా వర్షా స్సుగ్రీవ స్సుఖమశ్నుతే।
విజితాం స్సదరశ్చ రాజ్యే మహతి చ స్థితః॥[155]

సుగ్రీవుడు వర్షాకాలంలో శత్రువుల్ని జయించి విశాలమైన రాజ్యంలో ప్రతిష్టితుడై సుఖముగా ఉన్నాడనుటద్వారా కపిరాజ్యం విశాలమైనదని తెలుస్తున్నది. అంతేగాక వానరాలు, భల్లూకాలు, కొండముచ్చులు, అన్ని దిక్కులలోనూ విస్తారంగా వ్యాపించి యుండటం చేత రాజ్యం విశాలమైనదని స్పష్టమౌతున్నది. లంకా రాజ్యం యొక్క విస్తీర్ణం విస్తృతమైనది. నగర రాజ్యంగా ఎంచదగిన లంకకు రాజ్యానికి ఉండవలసిన లక్షణాలన్నీ ఉన్నాయి. త్రికూటశిఖరం పైనున్న లంక పటిష్టమగు లక్షణ వ్యవస్థతో గూడి చతుర్విధ దుర్గములచే భీకరమైనట్టిది.రాజ్యాంగంలో తృతీయ స్థానాన్ని పొందిన రాష్ట్రం అన్నివిధాల విస్తరించి ఉన్నట్లుగా తెలియుచున్నది.

### *3-5-0* కోశం:

రాజ్యం యొక్క సప్తాంగాలలో ముఖ్యమైనది కోశం. రాష్ట్ర సమృద్ధి కోశ సమృద్ధి పైననే ఆధారపడియున్నది.[156] మనువు కోశమును గురించి.

'అమాత్యేదండ ఆయత్తో దండే వైనయికీ క్రియా।
నృపతౌ కోశ రాష్ట్రే చ దూతే సంధి విపర్యయా॥[157]

అనిప్రస్తావించబడటాన్ని బట్టి కోశము రాష్ట్రము రాజు యొక్క అధీనములోనివని స్పష్టమగుచున్నది.

సైన్యమునకు కోశమే మూలము. కోశము లేనియెడల సైన్యము శత్రువులను ఆశ్రయించును అని కోశప్రాధాన్యాన్ని గూర్చి కౌటిల్యుడు వివరించెను.[158]

### *3-5-1* కోశ ప్రాముఖ్యము :

సమస్త కార్యాలకు కోశేమే మూలము. ఆయ వ్యయములు రెండును ఆరోగ్యకర విధానము ననుసరించినపుడే రాజ్యము యొక్క కోశం పటిష్టంగా నిర్వహింపబడుతుంది.

సమస్త విషయాలను కోశం సఫలంగావించి, ధర్మానికి, కామానికి సాధనమయ్యేది కోశమని కౌటిల్యుడు పేర్కొన్నాడు.[159]

శ్రీరాముడు గుహునితో రాజ్యాన్ని రక్షించుకోవడం చాలా కష్టమంటూ చతురంగబలాలు, ధనాగారము, దుర్గముల విషయంలో జాగరూకుడవు కమ్ము అని అనుట కోశసంరక్షణ ప్రాధాన్యాన్ని నిరూపిస్తున్నది. రాజ్యరక్షణకు అత్యంత ఆవశ్యకమైనది ధనము. అదియే అర్థము. మనుష్యుల జీవితానికి మూలం అర్థమే. అట్టి అర్థాన్ని సంపాదించు ఉపాయములను గుటించిన శాస్త్రమే అర్థశాస్త్రమని కౌటిల్యుడు పేర్కొనెను. అంతేగాదు ధర్మార్థ కామములలో అర్థమొక్కటే ప్రధానమనెను.

కైక వర కారణముగా సీతారామలక్ష్మణులు అరణ్యానికి పోయేటప్పుడు దశరథుడు సమస్తసంపదలు రామునకిచ్చునట్లు పల్కెను.[160] అప్పుడు కైక " రాజా! రామునివెంట సమస్తము పంపించివేస్తే పౌరులందఱు వెళ్ళిపోతే అయోధ్యా నగరం సురాసారాన్ని త్రాగివేసిన సురాభాండమువలె అయిపోయింది. అటువంటి రాజ్యము భరతునకక్కరలేదు"[161]అనుటలో కోశప్రాధాన్యము నిరూపితమైనది.

### *3-5-2 రామాయణము - కోశ నిర్వహణము:*

రామాయణ కాలంలో మంత్రులకు కల వివిధ బాధ్యతలలో కోశ నిర్వహణముకూడా ఒకటిగా పేర్కొనబడెను. దశరథుని యొక్క మంత్రులు

'కోశ సంగ్రహణే యుక్తా బలస్య చ పరిగ్రహే'[162]

కోశమును సంపాదించి ధనాగారము నింపుటలోనూ తగువిధంగా ధనమిచ్చి చతురంగ బలాలను సమకూర్చుటలోను నేర్పరులని తెలియుచున్నది. ఒక వ్యక్తి చేసిన అపరాధములోని బలాబలములను విచారించి అపరాధము పెద్దదైనచో కఠిన దండము, స్వల్పమైనచో సాధారణ దండము విధించి మంత్రులు దండము ద్వారా ధనాగారమును నింపుటయు గలదు[163]. కోశనిర్వహణకై నియమింపబడిన ధనాధ్యక్షుడను ఉద్యోగి అధీనములో కోశము సంరంక్షింపబడెడిది. రాజాజ్ఞమేరకు ప్రవర్తించు ధనాధ్యక్షుడు రాజసంపదను యథోచితముగా వినియోగించెడివారు. సీతారామలక్ష్మణులు అరణ్య వాసమునకు బయలుదేరు సమయమున దశరథుడు వనవాసకాలమునకుసరిపోవు విధముగా లెక్కలు వేసి సీతాదేవికి మంచిచీరలు, రత్నాభరణములు ఇచ్చుటకు ఆజ్ఞాపించెను. అట్లే లెక్కగట్టి ధనాధ్యక్షుడు ఇచ్చుట

ఆనాటి కోశ నిర్వహణలో ధనాధ్యక్షుడి ప్రాధాన్యం, ప్రావీణ్యం తేటతెల్లమగుచున్నవి. ఆ కాలంలో ఆప్తులకు వీడుకోలు తెలుపు సమయాన కానుకలనూ ధనమును ఇచ్చు సంప్రదాయమున్నట్లు తెలియుచున్నది. రాజగృహ పట్టణమున కేకయ మహారాజుయొక్క దౌహిత్రుడైన భరతుడు అయోధ్యకు మరలిపోవునపుడు

'తస్మై హస్త్యుత్తమాంశ్చిత్రాన్కంబళానజినాని చ।
అభిసత్కృత్య కైకేయో రాజాభరతాయ ధనందదౌ॥[164]

భరతుని సత్కరించి అతనికి శ్రేష్టములగు గుఱ్ఱములను, చిత్రకంబళములను, ఉత్తములగు తోళ్ళను మిక్కిలి ధనమును ఇచ్చెను.

రుక్మనిష్కసహస్రే ద్వే షోడశ శాశ్వతాని చ।
సత్కృత్య కైకయీపుత్రం కేకయో ధనమాదిశత్॥[165]

రెండు బంగారు కంఠాభరణములను, పదియారువందల గుఱ్ఱములను కానుకగా ఒసగెను.

రామాయణకాలంలో ధాన్యకోశమునకు కూడా ప్రాధాన్యమున్నట్లు తెలియుచున్నది. దశరథుడు సుమంతునితో శ్రీరాముని వెంట ధనకోశము, ధాన్యకోశములను పంపెదమనుటను బట్టి ధాన్యకోశముల ప్రాముఖ్యము తెలియుచున్నది.[166] ధనధాన్య సంపదలతోపాటు గజ, హయ, తదితరజంతుజాలమును సంపాదించుటకు ప్రాముఖ్యము గలదు. భరతునితో శ్రీరాముడు

'కచ్చిన్నాగవనం గుప్తం కచ్చిత్తే సంతి ధేనుకాః।
కచ్చిన్న గణికాశ్వానాం కుంజరాణాంచ తృప్యసి॥[167]

ఏనుగులను, గుఱ్ఱములను సంపాదించుటలో తృప్తినొందవు గదా! అని ప్రశ్నించుట దీనిని నిరూపించుచున్నది.

### 3-5-3. ధనకోశము - ధనాధ్యక్షుని అర్హతలు - విధులు :

రామాయణంలో ధనాధ్యక్షుని యొక్క లక్షణాలు, అతనికి గల అర్హతలను ఈవిధంగా నిర్దేశింపబడినవి. ధనాధ్యక్షుడు దేశకాలములను ఎరిగినవాడుగా, ఆయా కాలోచిత వస్తు విషయజ్ఞానిగా పరిశుద్ధునిగా నుండవలెను[168]. రాజాజ్ఞ మేరకు సరిపడేవిధంగా ఆభరణాలను లెక్కగట్టి సమకూర్చెడివాడని, సీతాదేవి వస్త్రాభరణాదులను రాజాజ్ఞమేరకు ధనాధ్యక్షుడు సమకూర్చుటను బట్టి తెలియు చున్నది.[169]

శ్రీరాముని వివాహ నిమిత్తమై దశరథుడు బయలుదేరుచూ

అద్య సర్వే ధనాధ్యక్షాః ధనమాదాయ పుష్కలమ్।
వ్రజంత్వగ్రే సువిహితా నానారత్న సమన్వితాః॥[170]

అని పేర్కొనుటను బట్టి వారి విధి నిర్వహణమెట్టిదో తెలియుచున్నది.

### 3-5-4 పన్నులవిధింపు - కోశసంగ్రహణము:

ధనకోశ సంగ్రహణంలో రాజ్యానికి ఉన్న అతిపెద్ద ఆదాయవనరులు పన్నులు. రాజు భూమికి అద్దెలు వసూలుచేయడు. కానీ దాని రక్షణకొఱకుపన్నులు విధించును.[171] రామాయణ కాలమున ప్రజలు పంటలో ఆరవభాగాన్ని పన్నుగా చెల్లించే పద్ధతి అమలులోనున్నట్లు తెలియుచున్నది. భరతుడు కౌసల్యతో

'బలి షడ్భాగముద్ధృత్య నృపస్యా రక్షితః ప్రజా।
అధర్మోయోఽస్య సోఽస్యాస్తు యస్యార్థోఽనుమతేగతః॥[172]

ప్రజల ఆదాయములో ఆరవపాలు కప్పముగా గ్రహించియు వారిని రక్షింపని రాజు అధర్మపాలుడగును. బలాత్కారముగా పన్నులు విధించుట తగదని రామాయణము బోధించినది. తన వద్దకు వచ్చిన భరతుని శ్రీరాముడు కుశలప్రశ్నలడుగుచూ

'కచ్చి త్వాం నావజానంతి యాజకాః పతితం యథా।
ఉగ్రప్రతి గ్రహీతారం కామయానా మివస్త్రియః''॥[173]

పట్టకూడని దానమును పట్టి, ధనాన్ని ఆర్జించి యాగమును చేయతలపెట్టిన పతితుని యాజకుడు అనాదరము చేయునట్లు, ఇష్టములేకపోయినను బలాత్కారము చేయువానిని స్త్రీలు అవమానించునట్లు, బలవంతముగా అధికమైన పన్నులు వసూలు చేసి ధనార్జన చేయు నిన్ను ప్రజలు అవమానించుటలేదు గదా! యని ప్రశ్నించుటను బట్టి పన్నులపరిమితిని, వసూలు చేయు విధానమును నిర్దేశించుచున్నది.

### 3-5-5 పన్ను విధింపు పరిమితి:

పన్నులను విధించుటలోను, వసూలు చేయుటలోను రాజు తగు జాగ్రత్త వహించవలెను. జలగరక్తాన్ని, ఆవుదూడ పాలను, తుమ్మెదమకరందాన్ని ఏ విధంగా స్వల్పంగా గ్రహించునో అదే విధంగా రాజు ధనవిచ్ఛేదము కాకుండా పన్ను స్వీకరింపవలెనని మనువు పేర్కొనెను.

### *3-5-6* పన్ను విధింపులో మినహాయింపు:

రాజు పన్నును విధించుటలో కొంత మినహాయింపును పాటింపవలెను. వేదాధ్యయనపరుడైన శ్రోత్రియుని కడనుండి రాజు కప్పమును గైకొనరాదు. అతనిని పన్నునుండి మినహాయించవలెనని మనువు చెప్పాడు. అట్లే అరణ్యములలోని ఋషులవద్ద నుండి కూడా పన్నులు వసూలు చేయరాదు.

రంగనాధ రామాయణంలో భరతునితో శ్రీరాముడు

అర్థలోభమున విప్రాగ్రహారముల - నర్థమెత్తవుగదా యరపీసమైన[174]

అని ప్రశ్నించుటనుబట్టి మనువు చెప్పిన విషయము నిరూపితమగుచున్నది.

### *3-5-7* వేట - కోశ సంగ్రహణ సంబంధము:

రాజు యొక్క వ్యసనాలలో వేట ఒకటి. వేట వినోదము మాత్రమేకాదని వేటకు కోశసంగ్రహణ సంబంధము ఉన్నదని రామాయణం ప్రబోధిస్తున్నది.

బంగారు లేడిని చూపుచూ లక్ష్మణునితో శ్రీరాముడు

మాంసహేతోరపి మృగాన్విహారార్థం చ ధన్వినః।
ఘ్నంతి లక్ష్మణ రాజానో మృగయాయాం మహావనే'॥[175]

రాజులు విల్లు ధరించి మహారణ్యంలో వేటాడుచూ మాంసం కొఱకు విలువిద్యలో చల లక్ష్యమును ఛేదించుటను, నైపుణ్యమును పరీక్షించు వినోదం కొఱకు మృగములను చంపుదురు. అట్లే రాజులు ఏనుగుల కుంభస్థలములందలి ముత్యములు, శ్రేష్టములగు మణులు, బంగారము గల వివిధ ధాతువులను సంపాదింతురు.

### *3-5-8* అర్థసంగ్రహణ ముఖ్యోద్దేశ్యము:

యుద్ధరంగంలో మూర్ఛ చెందిన లక్ష్మణుని చూచి రాముడు విలపించుచూ అర్థసంగ్రహణ ముఖ్యోద్దేశ్యమును తెల్పెను.

అర్థేభ్యోఽథ ప్రవృద్ధేభ్యః సంవృత్తేభ్యస్తతస్తతః।
క్రియాః సర్వాః ప్రవర్తంతే పర్వతేభ్య ఇవాపగాః॥[176]

పన్నులను క్రమంగా పెంచిన కారణం వలన యజ్ఞదానాది సకల క్రియలు ప్రవర్తించుచున్నవి. అని శ్రీరాముడు పలుకుట ద్వారా యజ్ఞదానాదిక్రియలకు అర్థసంగ్రహణమే మూలమని తెలియుచున్నది.

అరణ్యావాస సమయంలో శ్రీరాముడు లక్ష్మణునితో
'తత్సారమఖిలం నృణాం ధనం నిచయవర్ధనమ్.।
మనసా చింతితం సర్వం యథా శుక్రస్య లక్ష్మణ॥[177]

మనుష్యుడు గొంతెమ్మకోరికలతో కోరుకొను ధనమంతయు శుక్రుని కోశాగారము నింపినట్లు మనుజుడు ధనములో శ్రేష్టమగు ధనము రాజకోశాగారమును నింపగలదు. అన్యాయం చేసి అర్థసంగ్రహణ చేయరాదని రామాయణం ప్రతిపాదించినది. రంగనాథ రామాయణములో భరతునితో శ్రీరాముడు.

'అన్యాయముల్ చేసి అర్థముల్ గొనక - మాన్యతబ్రోతులే మఱి కావుగడల[177a]'అని ప్రశ్నించుట అర్థసంగ్రహణలో రాజు అన్యాయమునకు పాల్పడరాదని సూచించు చున్నది.

### 3-5-9 ఆదాయ వ్యయసంబంధము:

రాబడికి మించిన వ్యయం చేయరాదు. రాజుసంపదను విచ్చలవిడిగా ఖర్చుచేయరాదు. శ్రీరాముడు భరతుని కుశలప్రశ్నలడుగుచూ రాబడి వ్యయముల సమన్వయము సూచించెను.

'ఆయస్తే విపులః కచ్చిత్ కచ్చిదల్పతరోవ్యయః॥
అపాత్రేషు న తే కచ్చిత్ కోశో గచ్ఛతి రాఘవ॥[178]

భరతుడా! నీకు రాబడి అధికంగాను,వ్యయం తక్కువగాను ఉన్నదా! నీ ధనము అధికముగా అపాత్రులకు నటవిటగాయకాదులకు చెందుట లేదుగదా! అని శ్రీరాముడు ప్రశ్నించెను. అంతేగాదు వ్యయం ఎట్లుండవలెనో సూచించుచూ ' నీవు చేయు వ్యయం దేవకార్యములకు పితృకార్యములకు బ్రాహ్మణులకొఱకు, అతిథులకు, యోధులకు మిత్రులకు మాత్రమే పోవుచున్నదా?' అని ప్రశ్నించెను. దీనిననుసరించి రాజు చేయువ్యయము తగిన పద్ధతిలో నిర్వహించవలెనని, రాబడియే అధికంగా ఉండవలెనని తెలియుచున్నది.

### 3-5-10 మానవ - వానర - రాక్షస రాజ్యములలో కోశనిర్వహణము:

1. దశరథుని మంత్రులు ధనాగారాన్ని నింపుటలోను, తగినవిధంగా ధనాన్ని వెచ్చించి సైన్యాన్ని హెచ్చించుటలోను తత్పరులు[179].
2. అపరాధులకు తగిన రీతిని దండము విధించి ధనాగారం నింపునట్టివారు[180]
3. రాజ్యం యొక్క రాబడి వ్యయాలను నిరంతరం పరిశీలించెడివారు. వ్యయానికి

మించి రాబడియుండునట్లు చూచెడివారు. ప్రజల పంటలో ఆరవభాగం పన్నుగా స్వీకరించారు.[181]

4. కిష్కింధ రాజ్యమున కూడా కోశము తగురీతిగా నిర్వహింపబడింది. బంగారు ఆసనం, బంగారు కలశములు కిష్కింధయందు గలవు.[182]

5. వానర రాజ్యంలో కూడా సేనాపతులు, మంత్రులు ప్రభుత్వం పరస్పరసామరస్యాలతో ఉండేవారు. ఈ విషయం హనుమంతుడు సుగ్రీవునితో కర్తవ్యోన్ముఖుని చేయుచూ పల్కు సందర్భమున స్పష్టపఱచబడినది.[183]

6. రాక్షస రాజ్యము లంకలోగూడ కోశనిర్వహణమునకు విశిష్ట ప్రాముఖ్యంకలదు. హనుమంతుడు లంకానగరమునందు సీతను వెదకుచూ

'తాం రత్నంవసనోపేతాం గోష్ఠాగారావతంసకామ్।
యంత్రాగారస్తనీమృద్ధాం ప్రమాదామివ భూషితామ్.॥[184]

అమరావతివలె శోభించు లంక రత్నములను, వస్త్రములను ధరించి, ధాన్యాగారములను, కర్ణాలంకారములను కలిగి సమృద్ధమై యుండెను.

యుద్ధరంగమున అనేకమంది రాక్షసులు మరణించినపుడు కుంభకర్ణుడు మహోదరునితో యుద్ధప్రభావాన్ని వివరించే సందర్భమున సైన్యం పైకోశం యొక్క ప్రభావం ఉన్నట్లుగా చెప్పెను.

'రాజశేషాకృతా లంకా క్షీణః కోశో బలం హతమ్।
రాజానమిమమాసాద్య సుహృచ్ఛిహ్నామమిత్రకమ్॥[185]

రాజుచేయదగిన పనికి, పనిని నివారింపనిమీరు రాజును శత్రువుగానే భావించినారు. అపుడు లంకలో రాజు తప్ప వేరెవ్వరూ లేరు. అందువలన ధనాగారము రిక్తమై సైన్యము నశించును. దీనిని బట్టి రాజ్యాంగంలో ముఖ్యమైనదగు కోశం రాజ్యం యొక్క శాంతి సౌభాగ్యాలకు మూలమని స్పష్టమగుచున్నది.

### *3-6-0* సైన్యం:

సేనాని అనుపదం తొలిసారిగా ఋగ్వేదంలో "సహస్య సేనానిర్నః"[186] అని ప్రయోగింపబడింది. బహిరింద్రియ శత్రువులనుండి ప్రజలను రక్షించడానికి రాజుకు సైన్యం సహకారిగా ఉంటుంది. చతురంగబలసమన్వితమైన సేన లేకుండా ఏ రాజ్యము కూడా మనుగడ సాగించలేదు. రాజ్యరక్షణను, రాజు మనుగడకు సైన్యం తప్పనిసరి. సైన్యం శత్రువుల బారినుండి రాజ్యాన్ని నిరంతరం కాపాడటమో లేక యుద్ధ సమయములలో వీరోచితంగా పోరాడటం అనే ప్రాథమిక విధులను, మరికొన్ని ఆనుషంగిక విధులను కూడా నిర్వర్తిస్తుంది.

*3-6-1 చతురంగ బలములు:*

గజబలం,అశ్వబలం, రథబలం, కాల్బలం అనే చతురంగబలములను రాజు తగిన విధంగా సమకూర్చుకొనవలెను.

రామాయణంలో మానవ, వానర, రాక్షస రాజ్యాలన్నీ అపారమైన సైన్యబలంతో ప్రవర్తిల్లినవని తెలుస్తున్నది. కోసల లంకారాజ్యములలో చతురంగబలాలన్నీ పటిష్టంగా ఏర్పాటు చేయబడినాయి. కానీ వానరరాజ్యంలో మాత్రం చతురంగ బలవిభాగానికి అవకాశం లేకున్నను ఆ రాజ్యానికి అపారమైన కపిసైన్యం ఉన్నట్లు తెలుస్తున్నది.

*3-6-2. సేనాపతి ప్రాధాన్యము:*

సైన్యానికి దారి చూపే సేనాపతిని సేనాధ్యక్షునిగా కూడా వ్యవహరింతురు. రాజు సేనానాయకుణ్ణి నియమించి సైన్యాన్ని నడిపించాలి. ఒకవేళ సైన్యం నాయకుని కోల్పోయిన ఎడల రాజు మరియొకనిని సేనానాయకునిగా నియమించి నాయకుని కోల్పోయిన సైన్యంచేత యుద్ధం సాగింపవలెనని కౌటిల్యుని అభిప్రాయం[187].

మనువు సేనాధ్యక్షుల నియమించవలసిన పద్ధతిని,

'సేనాపతి బలాధ్యక్షౌ సర్వేదిక్షు నివేశయేత్।

యతశ్చ భయమాశంకేత్ ప్రాచీం తాం కల్పయేద్దిశం[188]అంటూ రాజు యుద్ధానికి బయలుదేరేటప్పుడు అన్ని దిక్కులయందు సేనాధ్యక్షులను, బలాధ్యక్షులను నియమింపవలెనని తెల్పెను. యుద్ధసమయములలో ఆపత్కాలమేర్పడినపుడు రాజ్యంలోని ప్రతిపౌరుని ఒక్కొక్క సైనికునిగా చేయుటలో సేనాధ్యక్షులు నైపుణ్యం చూపేవారు. లంకలోని సేనాధ్యక్షులు ఈ విధంగా వ్యవహరించి ఇంటింటికి వెళ్లి రాక్షసుల్ని పిలిచేవారు.[189]రాక్షసుల సేనాపతి ప్రహస్తుడు అతని ఆధీనంలో మూడవవంతు సేనయుండెను.[189(a)] రాజగు రావణుని కొరకు ప్రహస్తుడు ప్రమాణాలను కూడా లెక్కచేయ నట్టి ప్రభుభక్తి పరాయణుడు[189(b)]. రావణునికి ప్రహస్తుడు అత్యంత విశ్వాసనీయుడు. సంక్షోభస్థితి తల ఎత్తినసందర్భమున మంత్రాలోచన బహిర్గతం కాకుండా శత్రువులు చొరబడకుండా తగిన రక్షణ ఏర్పాట్లను పటిష్టపరచటంలో రాజాజ్ఞమేరకు ప్రహస్తుడు ఏర్పాట్లను చేసెను.[190] అంతేగాదు రాజగు రావణునితో

"కలత చెందక నీకు ఏది ఇష్టమో దానిని ఆచరింపు" మని ధైర్యవచనములు, హితవచనములు పలికెను.[191] వానరసేనకు అధ్యక్షుడు నీలుడు. అతడు గొప్ప వీరుడు. అతని చేతనే రాక్షస సేనాధ్యక్షుడగు ప్రహస్తుడు హతుడయ్యెను.[192]

*3-6-3* సేనాధ్యక్షుని అర్హతలు:

సర్వయుద్ధములకు, ఆయుధములకు సంబంధించిన శాస్త్రములయందు ప్రవీణునిగను, హస్తి, అశ్వ, రథ చర్యలయందు నిపుణునిగను సేనాధ్యక్షుడు ఉండవలెనని కౌటిల్యుడు పేర్కొనెను.[193] సేనాధ్యక్షుడు రాజు యొక్క విజయాన్ని కాంక్షించే ధీరుడూ, శూరుడూ కావలెను. రాజ్యరక్షణవ్యవహారంలో అతిముఖ్యుడగు సేనాధ్యక్షుని అర్హతలు శ్రీరాముడు భరతుని కుశలప్రశ్నలడుగు సందర్భంలో ప్రస్తావించబడింది.

'కచ్చిద్దృష్టశ్చ శూరశ్చ ధృతిమాన్ మతిమాన్ శుచిః।
కులీనశ్చానురక్తశ్చ దక్షస్సేనాపతిః కృతః॥[194]

సంతుష్టికలవాడు, శూరుడు, బుద్ధిశాలి, ధైర్యశాలి, శుచిమంతుడు రాజుపై అంతులేని ప్రేమ కలవాడు, కార్యకుశలుడు అగువానిని సేనాపతిగా నియమించితివా అని శ్రీరాముడు భరతుని ప్రశ్నించుటలో సేనాపతి అర్హతలు స్పష్టపరచబడినవి.

రంగనాథ రామాయణములో ఇదే సందర్భమున అతిమంతుడు, సకల సమ్మతుడు, స్వామిహితుడు, వితతవిక్రముడు సేనాపతులుగా పేర్కొనబడినారు.[195]

*3-6-4* ప్రధాన వీరులకు ప్రోత్సాహము:

సైన్యములోని ప్రధాన వీరులు సన్మానింపబడవలెను. తద్వారా వారి సేవలు వెల్లడి యగుటయేగాక వారిలో, మిగతా వారిలో ఉత్సాహం మరింత పెరుగుతుంది. రామాయణములో భరతునితో శ్రీరాముడు

బలవంతశ్చ కచ్చిత్తే ముఖ్యా యుద్ధవిశారదాః।
దృష్టా పదానా విక్రాంతాస్త్వయా సత్కృత్య మానితాః॥[196]

మహాబలవంతులు, యుద్ధకుశలులు, పూర్వము యుద్ధమున తమసామర్థ్యము చూపినవారు, శూరులునైన ప్రధానవీరులను పారితోషికాదులనిచ్చి శ్లాఘించితివా! అని ప్రశ్నించుటను బట్టి ప్రధానవీరులకు గుర్తింపు లభించుచున్నదని తెలియుచున్నది.

*3-6-5* సైనిక సంక్షేమ చర్యలు:

రామాయణంలో శ్రీరాముడు భరతునితో

కచ్చిత్బలస్య భక్తం చ వేతనం చ యథోచితమ్।
సంప్రాప్తకాలం దాతవ్యం దదాసి న విలంబసే॥[197]

సైన్యానికి ఆయా సమయములందు ఇవ్వవలసిన ఆహారం, వేతనాలను ఇచ్చుచుంటివా' అని ప్రశ్నించెను.

ఇదే సందర్భమున రంగనాథరామాయణంలో

'కొలిచిన వారికి గోరి జీతములు - నిలువగాకుండసన్నిధినొసగుదువె'[198]

గంగా తీరము చేరునపుడు ప్రయాణోత్సాహం లేని సైన్యాన్ని గుఱించి భరతుడు.

'నివేశయతీ మే సైన్యమభిప్రాయేణ మహీపతే,

విశ్రాన్తాః ప్రతరిష్యామః శ్వ ఇదానీమిమాంనదమ్॥

ఇక్కడ నా సైన్యమును వారివారి ఇచ్ఛగొలది అందరూ విడిదిచేయునట్లు చేయుడు. నేడిట విశ్రమించి రేపు ఈ నదిని దాటెదము అనుటను పరిశీలింపగా రాజుసైన్యం ఎడల ప్రవర్తింపవలసిన విధానం స్పష్టమగుచున్నది. గుహుని సహాయంతో భరతుని సైన్యం అంతా గంగానదిని దాటిన తర్వాత భరద్వాజ మహర్షి ఆతిథ్యమిచ్చెదనని పలుకగా భరతుడు సేనతో ఆశ్రమప్రాంతములోనికి జొచ్చెను. అచ్చట భరద్వాజుడు సుందర మందిరాన్ని మధుర పానీయాలను, భక్ష్యాలను ఏర్పరిచినాడు. సమస్త సైన్యానికి ఆతిథ్యం ఇవ్వబడింది. అక్కడ సమస్త సైన్యం, మంత్రులు చాలా సుఖంగా రాత్రిగడిపారు.[199] దీన్ని బట్టి రాజు తన సైన్యానికి వసతి, ఆహారాలను సమకూర్చడంలో శ్రద్ధవహించెడివాడని తెలియుచున్నది.

### *3-6-6 రామాయణము - సేనల సంఖ్యాపరిమాణము:*

రామాయణము మిక్కుటము, బలసంపన్నమైన సైన్యము రాజుకు అవసరమని స్పష్టపఱిచినది. సైన్యము ఎంత ఉండవలెనో సూచింపబడకపోయినప్పటికి రావణుని చతురంగ బలముల వర్ణనములో 'అనీక' శబ్దము వాడబడుటచే ఎక్కువ పరిమాణముగల సైన్యము సూచింపబడినది.[200] గోవింద రాజీయములో

ఏకైకైక రథాత్యశ్వా పత్తిః పంచ పదాతికే
పత్త్యంగైః స్త్రిగుణైః సర్వైః క్రమదాభ్యాం యథోత్తమం
సేనాముఖమ్ గుల్మగణౌ వాహినీ పృతనాచమూం[201]

| క్రమ సంఖ్య | సేనలపేరు | రథములు | గజములు | అశ్వములు | పదాతి బలం |
|---|---|---|---|---|---|
| 1. | పత్తి | 1 | 1 | 3 | 5 |
| 2. | సేనాముఖము (3 పత్తులు) | 3 | 3 | 9 | 15 |
| 3. | గుల్మము (3 సేనాముఖాలు) | 9 | 9 | 27 | 45 |
| 4. | గణము ( 3 గుల్మములు) | 27 | 27 | 81 | 135 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 5. | వాహినీ (3 గణములు) | 81 | 81 | 243 | 405 |
| 6. | పృతన (3 వాహినులు) | 243 | 243 | 729 | 1215 |
| 7. | చమువు (3 పృతనలు) | 729 | 729 | 2187 | 3645 |
| 8. | అనీకినీ (3 చమువులు) | 2187 | 2187 | 6561 | 10935 |

అని సేనా వివరణ గలదు

రంగనాధ రామాయణంలో

"ఒక్కొక్కనికి రాములొగి లక్షయగుచు -ఒక్కొక్కనికి రాములొగి కోటి యగుచు
శీతకోటి అర్బుద సంఖ్యలు గడిచి........[202] అని పేర్కొనుటలో అర్బుద ప్రమాణము సూచింపబడినది.

భాస్కర రామాయణములో ఇదే సందర్భమున

చ॥ ఒకడు రుద్రుండు నూర్వురు సముద్ధతి వేవురు నోలి లక్షలుం
బ్రకటము గాగ, కోట్ల నయి రాఘవుడాహవ భూమి దైత్యసై
నికులకు గానగా బడియె నిక్కువమై బహుసంగరక్రియా
ధిక నిపుణత్వమేర్పరచి ధీరత నెక్కడఁ జూడ దానయై[203]

అని సైన్య పరిమాణము అనేకరూపములలో ఉన్నట్లుగా చెప్పబడినది.

హనుమంతుడు సముద్రమును లంఘించుచూ దూరము నుండి లంకను చూచిన సందర్భములో మొల్ల యిట్లు వర్ణించినది.

'కోటికిఁ గోటులై పరఁగుకుంజర వర్గము ఘోటకంబులుం
గోటికి నెక్కుడై పరగు గోత్రసమానము లౌ రథంబులుం
గోటికి హెచ్చులై బరఁగు ఘోర నిశాచర కోటికోట్లతో
సాటికి నెక్కు నప్పురము సాహసవంతుఁడుగాంచె ముందరన్[204]

అని కోటినిమించిన రాక్షస సైనికులున్నట్లు చెప్పబడినది.

*3-6-7 రామాయణము - చతురంగ బల వ్యవస్థ :*

రామాయణములో సైన్య నియామకానికై తగిన జాగ్రత్తలు ఆయా రాజ్యములలో పాటించినట్లు తెలుస్తున్నది. రాజు చతురంగబలముల సన్నాహ పటిమను సమర్థవంతంగా నిర్వహించినట్లు రంగనాథ రామాయణము ద్వారా తెలియుచున్నది[205]. సైనికులకు భయంకరములగు ఆయుధములు, కవచములు, ధ్వజములు ఉండెడివి.[206] వివిధ వాహనాలు, శకటాలు, గుఱ్ఱాలు కదం త్రొక్కిన అనాటి సైనిక వ్యవస్థ సమగ్రమైనదని వాల్మీకి రామాయణము స్పష్టపరచుచున్నది.[207] శబ్దాన్ని బట్టి బాణాన్ని

వేసేవారు; వేటలో నిపుణులైనవారు, మహారథులైన వారు నాటివ్యవస్థలో ప్రముఖస్థానాన్ని పొందినట్లు తెలియుచున్నది.

*3-6-8 రథబలము:*

రామాయణ కాలంలో రథబలానికి విశేషమైన ప్రాముఖ్యమున్నది. రాముడు రావణునిపై విజయాన్ని సాధించడంలో దేవేంద్రుడు శ్రీరామునికి పంపిన రథ బలము ఎంతగానో తోడ్పడింది.[208] భరతుడు అరణ్యంలో ఉన్న శ్రీరామునివద్దకు వెళ్లేటప్పుడు అతనితో గూడ అరవై వేలరథాలు వెంబడించినట్లుగా చెప్పడాన్నిబట్టి కోసలరాజ్యానికి అధికమైన రథబలమున్నట్లుగా తెలుస్తున్నది.[209] రాక్షస ప్రముఖులైన ఇంద్రజిత్తు, నికుంభుడు, రావణుడు మొదలైన వారు యుద్ధానికి వచ్చే సందర్భంలో రథాలపై రావడాన్నిబట్టి లంకా రాజ్యపు రథబలం ఎంతటిదో నిరూపించబడినది.[210]ఇంతేగాక రావణుని సేనకు బంగారు రథాలు ఉన్నట్లుగా వాల్మీకి రామాయణం పేర్కొన్నది.[211]

రథాలకి అనేక అలంకారాలు చేయుట యనునది ఆనాటి పద్ధతిగా తెలుస్తున్నది. యుద్ధధర్మాన్ని నిలపటంకోసం దేవేంద్రుడు శ్రీరామునికి పంపిన రథమునందలి భాగాలు బంగారముచే చిత్రింపబడినవి. వందలాది గంటలతో అది ప్రకాశించుచున్నది. అంతేగాక దానినొగ వైడూర్యంచే చేయబడినది. ఆ రథానికి సువర్ణ ఆభరణాలు, తెల్లని వింజామరలు, ఆకుపచ్చని రంగుగల మేలిమి గుఱ్ఱములు ధ్వజమునకు బంగారు దండలు గలిగి ఉండుటచే అది ఎంతో శోభాయమానంగా ప్రకాశించుచున్నట్లు చెప్పబడినది.

'తతః కాంచన చిత్రాంగః కింకిణీ శతభూషితః।
తరుణాదిత్యసంకాశో వైడూర్యమయ కూబరః॥
సదశ్వైః కాంచనాపీడైర్యుక్తః శ్వేత ప్రకీర్ణకైః।
హరిభిః సూర్యసంకాశైర్హేమజాలవిభూషితైః॥[212]

అని పేర్కొన బడెను. ఇదే సందర్భమున రంగనాథ రామాయణంలో

'అనిల మనోవేగ మలరు నశ్వముల - గనకదండా బద్ధఘన కేతనముల
మహనీయ రుచిరోరు మణి కదంబముల । మహితమై బాలార్కమహిమదీపింప
తన రాయ రథము ---------''[213]

ఇదే సందర్భములో భాస్కర రామాయణములో మాతలి,

తే॥ కింకిణీ మాలికా ఝుంకార ముఖరంబు-సురుచిర నవరత్న శోభితంబు
దటిదుజ్జ్వలోచ్చ కేతన దండ సహితంబు-గురుతర వైఢూర్య కూబరంబు
జలజలోచన చక్ర చక్ర సన్నద్ధంబు నక్షత సంకలితాక్ష యుగము
దుస్సహానిలవేగ తురగోహ్యమానంబు తరుణార్కబింబ సుందరమునగుచు
విమల వజ్రకల్ప కమనీయ కంకట దివ్యచాప తూణ దీప్త శస్త్ర
సహితమైన రథము జవమున గొనివచ్చి మొనసి రామచంద్రు మోల మెఱయు[214]

అని పేర్కొనబడినది. మొల్ల రామాయణములో మాతలి చాతుర్యమును కల రథమును తెచ్చినట్లుగా తెలుపబడినది.[215] దీనిని బట్టి ఆనాడు రథములను ఏ విధముగా అలంకరించెడివారో తెలియుచున్నది.

### *3-6-9 రథ సారథి - విజ్ఞప్తి :*

రథబలానికి సంబంధించి సారథి ఎంతో ముఖ్యుడు. శ్రీరామునిచేత రావణుడు యుద్ధరంగంలో పీడింపబడ్డాడు. అట్లాంటి క్లిష్టసమయంలో కూడా సూతుడు ఏమాత్రము తొట్రుపడక రావణుని మెల్లగా తన చాకచక్యముతో యుద్ధభూమినుండి మరలించాడు.[216] ఈ విధముగా చేసినందులకు రావణునికి కోపంవచ్చి రథసారథిని కఠినోక్తులతో నిందింపగా అపుడు సూతుడు సారధికి ఉండవలసిన విజ్ఞతను ఈ విధంగా స్పష్టపఱచెను.

దేశకాలౌచ విజ్ఞేయౌ లక్షణానీంగితాని చ।
దైన్యం ఖేదశ్చ హర్షశ్చ రథినశ్చ బలాబలమ్॥
స్థలనిమ్నాని భూమేశ్చ సమాని విషమానిచ॥
యుద్ధకాలశ్చ విజ్ఞేయః పరస్యాంతర దర్శనమ్॥
సర్వమేతద్రథస్థేన జ్ఞేయం రథకుటుంబినా॥[217]

దీనిని బట్టి దేశకాలాలను శుభాశుభ నిమిత్తాలను రథికుని మనో భావాలను నిరుత్సాహము, దుఃఖము, సంతోషాలను, బలాబలాలను భూమి యొక్క పరిస్థితిని అనగా మిట్ట పల్లములు, సమవిషమ ప్రదేశములను యుద్ధకాలజ్ఞతను, సారధి తెలిసుకొని యుండవలయును. అంతేగాక సమయా సమయములనుబట్టి ఎదుటివాడు ఏమరియున్న సమయమున రథాన్ని అన్ని దిక్కుల యందును ప్రయోగించవలెనన్న విషయాన్ని కూడా సారథి తెలిసుకొని యుండవలెను. ఈవిషయాన్ని గురించి తెలుగు రామాయణములలో ఎచ్చటను ప్రస్తావింపబడలేదు.

*3-6-10 రథ విషయమైన యుద్ధధర్మము:*

రథము యుద్ధరంగానికి అప్రదక్షిణంగా రాకూడదు. రావణుడు యుద్ధ రంగములోనికి అప్రదక్షిణంగా ప్రవేశించుట వలననే అతడు చంప బడునని సూచించుచున్నది.[218] రామ రావణ యుద్ధ సందర్భమున దేవతలు, గంధర్వులు, దానవులు భూమిపైనున్న రామునకు రథముపైనున్న రావణునకు యుద్ధము సరియైనది కాదని తలచిరి.

భూమౌ స్థితస్య రామస్య రథస్య సరక్షసః।
నసమం యుద్ధమిత్యాహుర్దేవ గంధర్వ కింనరాః [219]

అని పేర్కొనుటను బట్టి యుద్ధ ధర్మము తెలియుచున్నది. అట్టి ధర్మాన్ని పరి రక్షించటానికే దేవేంద్రుడు తన రథాన్ని, సారథిని శ్రీరాముని కొరకు పంపెను. దీనిని బట్టి రామాయణకాలంలో రాజులు రథాలను ఎట్లుపయోగించారో తెలుస్తున్నది.

*3-6-11 అశ్వబలము:*

రామాయణకాలంలోని అశ్వబలము శ్రేష్ఠమైన గుఱ్ఱాలతో సమర్థవంతంగా నిర్వహింపబడినట్లుగా తెలుస్తున్నది. కాంభోజ, బాహ్లిక, వనాయు, సింధు దేశాలయందు ఉత్పన్నములై ఇంద్రుని ఉచ్చైశ్రవమువలె ప్రకాశించినవని అయోధ్యలోగల అశ్వబలము స్పష్టపఱచబడెను.

'కాంభోజవిషయే జాతైః బాహ్లీకైశ్చ హయోత్తమైః।
వనాయుజైర్నదీజైశ్చ పూర్ణాహరిహయోత్తమైః॥[220]

భరతుడు శ్రీరాముని యొద్దకు వెళ్లునపుడు శతసహస్ర అశ్వబలం అనుసరించినట్లు చెప్పబడినది.[221]

హనుమంతుడు శ్రీరామునకు లంకయొక్క వైభవాన్ని గుఱించి చెప్తూ లంకలో పదికోట్లమంది రాక్షసులు, గుఱ్ఱాలు, రథాలు ఉన్నట్లుగా పేర్కొన్నాడు.[222] రావణుని యొక్క మూలబలంలోని రాక్షసులందఱు కూడా యుద్ధరంగానికి వెళ్లునపుడు 14 వేలమంది రౌతులతో కూడిన గుఱ్ఱాలు అనుసరించినట్లుగా తెలుస్తున్నది. ఈ విషయం వాల్మీకి రామాయణంలోనేగాక ప్రసిద్ధ తెలుగు రామాయణములైన రంగనాధ, భాస్కర, రామాభ్యుదయములలో కూడ చెప్పబడినది.[223]

### *3-6-12 గజ బలము:*

కోసల రాజధానియైన అయోధ్యలో వింధ్య పర్వతమున, హిమాలయమున, తూర్పు దిక్కునందు ఐరావతమను ఏనుగు కులము, ఆగ్నేయ దిక్కునందు అంజనమను ఏనుగు కులము, దక్షిణ దిక్కునందు వామనమను ఏనుగుకులము జన్మించి శ్రేష్టమగు ఏనుగులతో అయోధ్య నిండి ఉండెనని చెప్పుట ద్వారా అచ్చట ఉత్తమములగు గజబలమున్నట్లుగా స్పష్టమగుచున్నది.

వింధ్యపర్వతజైర్మంత్తైః పూర్ణాహేమవతైరపి।
మదాన్వితైరతి బలైర్మాతంగైః పర్వతోపమైః॥
ఐరావత కులీనైశ్చ మహాపద్మకులై స్తథా।
అంజనాదపి నిష్కాంతై ర్వామనాదపి చద్విపైః॥[224]

రావణునికి కూడ అపారమగు గజబలముండినట్లుగా హనుమంతుడు శ్రీరామునికి చెప్పినమాటల వలన తెలుస్తున్నది.[225] రావణుని మూలబలము వెంబడి పదునెనిమిదివేల గజబలమున్నట్లుగా సంస్కృతాంధ్ర రామాయణములలో చెప్పబడినది.[226]

### *3-6-13 పదాతిబలము:*

రాజు యొక్క రాజ్యాన్ని నిరంతరం కాపాడేది పదాతిబలమే. కేవలం యుద్ధ కృత్యాలకే కాకుండా నిరంతర కార్యాచరణమునకు కూడా అమితమైన పదాతిబలాన్ని ప్రయోగించేవాడు. భరతుడు అరణ్యమునగల శ్రీరాముని యొద్దకు వెళ్ళే సమయంలో "అమిత పదాతి తఱచుగ నడిచినది".[227] రావణుని మూలబలంతో పదాతి బలం మూడులక్షలని వాల్మీకి రామాయణంలో ఉంటే భాస్కర, రంగనాధ రామాయణములలో ఇదే సందర్భమున రెండులక్షలని చెప్పబడినది. మొల్లరామాయణంలో ఎట్టి సంఖ్యను ప్రస్తావించలేదు[228]. కానీ రామాభ్యుదయము రావణుని మూలబలంలోని పదాతిబలం పన్నెండు లక్షలని చెప్పబడింది.[229]

### *3-6-14 పదాతిబలంలో రకాలు :*

పదాతిబలం ప్రధానంగా ఆరురకములుగా చెప్పబడుచున్నది. 1. మూలబలము 2. భృతబలము 3. శ్రేణీబలము 4. మిత్రబలము 5. ద్విషద్బలము 6. అటవీబలము.

*1.* మూలబలము :(Heriditary Troops)

వంశపారంపర్యంగా నమ్మకంగా రాజును మూలబలమే సేవిస్తుంది. రావణునికి పుష్కలమైన మూలబలమున్నది. మహాబలులగు బలముఖ్యులైనవారిని రథ, గజ, తురగ సమూహాలతో రావణుడు పంపితే శ్రీరాముడు పగటియందలి ఎనిమిదవ పాలులోనే వారినందరినీ సంహరించెను.[230]

రంగనాథరామాయణంలో రావణుని మూలబలం చలము, బలము, సమర నైపుణ్యము కలిగినట్టిదిగా పేర్కొనబడెను.[231] అట్టి మూలబలమును శ్రీరాముడు వధించినప్పుడు విభీషణుడు 'ఇక కూలు పంక్తికంధరుడు'[232]

భాస్కరరామాయణంలో రావణుని ఆజ్ఞప్రకారం

క॥ కరితురగ రథపదాతి
స్ఫురణంబులు చెలంగ భూనభోవలదిగం
తరములు నిండగ నార్చుచు
సురవైరులు గూడి రాజి శుంభద్గతులై[233]

క॥ పటుభేరీ భాంకృతులును
బటహ నినాదములు శంఖ బహు రావంబుల్
కటు కాహళనాదంబులు
జటులములై పర్వె నోలి జగములునిండన్[234]

ఇట్టి రావణుని మూలబలాన్ని శ్రీరాముడు నిమిషార్ధంలోనే కలచి వేసెను[235]. అంతేగాక పదునాల్గువేల గుఱ్ఱాలను, పద్దెనిమిదివేల మత్తగజాలను లక్షరథాలను, రెండులక్షల మహావీర రాక్షసులు గల రావణుని మూలబలాన్ని శ్రీరాముడు నిమిషములో వధించెనని భాస్కర రామాయణము తెలుపుచున్నది.[236] ఇదే సందర్భములో మొల్ల రామాయణంలో రావణుడు యుద్ధ భూమికి వెళ్ళినట్లుగా చెప్పబడింది. సుపార్శ్వాది రక్షోనాయకులతో సహా పెక్కుమంది యుద్ధభూమిలో రావణుని ఎదుటే నేలకూలినట్లు చెప్పబడినది.[237] రామాభ్యుదయములో ఇదే సందర్భంలో రావణుని ఆజ్ఞచేత "నద్దానవ వీరులును, భీకరాకారులై తేరులు, వారణంబులు, వారువంబులు, ఘోరమృగంబులు, తమకు వాహనంబులుగా గొని నానావిధ తూర్యంబులు మ్రోయ"[238] రణరంగమునకు రాగా రావణుడు యుద్ధభూమికి వెళ్ళినట్లుగా శ్రీరామునిచేత తెల్పబడినది.

కం॥ పదివేలు పసిండితేరులు
పదునాలుగు వేల్గుఱాలు భద్రగజంబుల్

పదునెనిమిది వేలున్ మే
లుదొరల్ పండ్రెండు లక్షలుంబొడియైనన్[239]

అని రావణుని మూలబలవిశేషాలు శ్రీరాముని పరాక్రమమును గురించిన విశేషాలు రామాభ్యుదయములో చర్చించబడినది.

**2.** భృతబలము :(Macenary)

ఇది రాజుకు ఎల్లప్పుడూ సమీపమునందుండే బలగము. వీరిని అప్పటికప్పుడు జీతానికి సమకూర్చుకుంటారు. రావణునికి యిట్టి బలం పుష్కలంగా ఉన్నది. వానరసైన్యం లంకను చుట్టుముట్టగా రావణుడు తొలుత వీరినే యుద్ధానికి పంపించాడు. లక్షలకొలది రాక్షసులు నోటితో శంఖాలను ఊదగా అవి మహాధ్వనితో మ్రోగినాయి. వారందఱు తమ పరాక్రమాన్ని తామే ప్రకటించుకున్నారు.[240] వానర రాక్షసులకు జరిగిన ఆ భయంకరమైన పోరులో రాక్షసవీరులగు యమశత్రువు, మహాపార్శ్వుడు, వజ్రదంష్ట్రుడు, శుకుడు పారిపోగా మిగిలిన వారందఱు అగ్నిలోపడిన మిడుతల వలె నశించిరి.[241]

**3.** శ్రేణీ బలము :

ఈ శ్రేణీబలము దేశాభిమానముతో ప్రవర్తిల్లును. అయోధ్యలో ఇట్టి శ్రేణీబలము పుష్కలముగానున్నట్లు తెలియుచున్నది.

**4.** మిత్రబలము:

సుహృద్బలముగా చెప్పబడే ఇట్టి బలం మిత్రసామంత రాజుల వలన ప్రాప్తించును. రావణునకు మిత్రుడగు వాలి వద్ద అపారమైన వానరబలం ఉండేది. రామరావణ యుద్ధానికి పూర్వమే శ్రీరాముడు సుగ్రీవునితో చెలిమిచేయడం, వాలివధ గావించి వానరరాజుగా సుగ్రీవుని అభిషేకించడం ద్వారా వానరబలమంతా తనపక్షంలో ఉండేటట్లు చేసుకున్నాడు. దీనిద్వారా శ్రీరామునికి అపారమైన మిత్రబలం తోడై రావణుని జయించడం సులభమైనది.[242] రావణునికి యుద్ధం ప్రాప్తించే సరికి ఎట్టి సుహృద్బలము తోడులేదు. దేవరాజగు ఇంద్రుడు దశరథుని ద్వారా ప్రాప్తించిన సుహృద్బలముతోనే శంబరాసురుని జయింపగలిగెను.[243] మిథిలానగరరాజగు జనకుడు దేవరాజైన ఇంద్రునివలననే చతురంగబలములను పొంది రాజ్యరక్షణ గావించు కున్నాడు.[244] మొత్తం మీద రావణవధ విషయంలో ఇంద్రుడు శ్రీరామునికి రథబలాన్ని అందించడం కూడా సుహృద్బలాన్నే సూచిస్తున్నది.

5. ద్విషత్ బలం:

జయించుట లేదా సంధి ద్వారా రాజుకు వశబడ్డ సామంతుడు అందించే ద్విషత్‌బలం గూడ రాజుకు బాగా సహాయపడుతుంది. ఇట్టి ద్విషద్బల ప్రస్తావన రామాయణమున లేదు.

6. అటవీబలం:

పుళిందులు, శబరులు, మున్నగు అటవీజనులతో కూర్చబడిన సైన్యమిది. ముఖ్యంగా గుహుడు కోసలరాజ్యానికి ఇట్టి బలగముతోనే సహాయపడెనని చెప్పవచ్చును.

*3-6-15 శత్రుసేనలపై కుట్రలు :*

ఏదోవిధంగా శత్రువులను జయించాలనే ఇచ్ఛతో శత్రుసేన కుట్రలు చేయుటయు గలదు. మనువు దానిని ఈ విధంగా వివరించెను.

'ఉపరుధ్యారి మాసీత రాష్ట్రం చాస్యోపీడయేత్ ।
దూషయేచ్చాస్య సతతం యవసాన్నోదకేంధనమ్॥
భింధ్యాచ్చైవ తటాకాని ప్రాకార పరిఖస్తథా।
సమవస్కంధయేచ్చైనం రాత్రౌ విత్రాసయేత్తథా॥[245]

రాజ్యమును ముట్టడించినపుడు శత్రువులు నీరు, వంటచెరుకులు మొదలగు వాని యందు విషద్రవ్యములు కలిపి చెరువులను, గుంటలను, తెగగొట్టి అగడ్తలను పూడ్చుదురు. రాత్రులందు ఢక్క, భేరి వాయిద్యముల మ్రోతలచే భయపెట్టెదరు. రామాయణములో కూడ పైన పేర్కొన్న కుట్రలున్నట్లుగా తెలియుచున్నది. యుద్ధానికి బయలుదేరు సందర్భములో శ్రీరాముడు వానరసేనా పతియగు నీలునితో

'దూషయే యుర్దురాత్మానః పథి మూలఫలోదకమ్।
రాక్షసాః పరిరక్షేథా స్తేభ్యస్త్వం నిత్యముద్యతః॥[246]

దురాత్ములగు రాక్షసులు మార్గమున దుంపలు పండ్లు జలములను విషాదులచే కలుషితము చేయగలరు. అంతేగాక గోతులలోను, వనాలలోను, జలదుర్గాలయందును మనలను దెబ్బతీయుటకై శత్రువులసైన్యాలను దాచి ఉంచుదురేమో చూడవలెనని పలికెను[247]. దీనినిబట్టి శత్రుసేనలవిషయంలో ఆనాటికే నెలకొన్న కుట్రలు స్పష్టమగుచున్నవి.

### *3-6-16* రక్షణేతర - యుద్ధేతర - కృత్యాదులలో సైన్యము:

రాజ్యరక్షణయే సైన్యప్రధానవిధి. రక్షణకై దుర్గమును నిరంతరము కావలికాయుట, యుద్ధసమయములలో వీరోచితంగా పోరాడటం, సైన్యము యొక్క కృత్యాలు. అంతేగాక మరికొన్ని ఆనుషంగిక కృత్యాలలో గూడా సైన్యము పాల్గొనుటగలదు. రాజు యొక్క అభిప్రాయాను గుణముగా సైన్యము రక్షణేతర, యుద్ధేతర కృత్యాలలో కూడా పాల్గొనినది. దశరథుడు తన కుమారుల వివాహానికి వెళ్లేటప్పుడు చతురంగ సైన్యబలములను వెంటబెట్టుకొని వెళ్లాడు.[248] శ్రీరాముని అయోధ్యకు తిరిగి తీసుకొనిరావలెనని భావించిన భరతుని వెంట చతురంగబలాలు అనుసరించి వెళ్లాయి.[249]

వానరరాజును సుగ్రీవుని ఆజ్ఞమేరకు వానరసేన మిత్రకార్యము నెరవేర్చుటకై సీతాన్వేషణము గావించినది.

### *3-6-17* సైన్యం అనుమతిలేక ప్రవేశింపరాని తావు:

రామాయణకాలంలో అనుమతిలేకుండా సైన్యములు మునుల ఆశ్రమములలోనికి పోయెడివి కావు. భరద్వాజుడు భరతుని సైన్యముతో కూడి ఎందులకు తన ఆశ్రమములోనికి ప్రవేశించలేదని ప్రశ్నించినపుడు భరతుడు

'రాజ్ఞా చ భగవన్నిత్యం రాజపుత్రేణ హి తథా।
యత్నతః పరిహర్తవ్యా విషయేషు తపస్వినః॥[250]

రాజుగాని, రాజపుత్రులు గాని సైన్యంతో మునులుండు తావులకుపోరాదు. అట్లు పోకుండుటకు మిగుల ప్రయత్నింపవలెను. కాబట్టి సైన్యమును వెంటబెట్టుకొని ఆశ్రమములోనికి రాలేదని తెల్పెను. అప్పుడు భరద్వాజుని అనుమతితో సైన్యము ఆశ్రమములోనికి తీసుకొనిరాబడినది. దీనిద్వారా అనుమతి లేకుండా సైన్యము మున్యాశ్రమములలోనికి ప్రవేశించెడిది కాదని తెలియుచున్నది.

### *3-6-18* కోసల - కిష్కింధ - లంకారాజ్యములలో సైనికవ్యవస్థ - నిర్వహణ:

రామాయణములో ప్రధానరాజ్యములైన కోసల లంకారాజ్యములలో సైనికవ్యవస్థ సమగ్రమైనది. సైనికులను, సైనాకాధిపతులను నియమించుటలో తగిన ప్రమాణములు పాటింపబడెడివి. సైనికులకు భయకంరములగు కవచములు, ఆయుధములు,

ధ్వజములు ఉండెడివి.[251]వివిధ వాహనములు శకటములతో కూడిన సైనికవ్యవస్థ[252] రాజ్యరక్షణకై నిరంతరము పాటుపడెడిది. అయోధ్యలో అమితమగు సైన్యసంపద యుండేది. ఆ సైన్యంలో భుజబలం గల వీరులు వేలకొలది ఉన్నారు. రాజాజ్ఞమేరకు ఆ సైన్యం ప్రవర్తించేది. వానరరాజ్యం చతురంగ భేదములతో కూడినది కాకున్ననూ అసంఖ్యాకమగు వానరులచే ఏర్పరచబడిన సైన్యము పలుతావులందు విస్తరించినది.[253] వాలి అధీనమైన వానరసేన వాలి మరణానంతరం రాజైన సుగ్రీవుని ఆధీనంలోనికి వచ్చినది. సుగ్రీవుని ఆజ్ఞకు బద్ధమై ప్రవర్తించింది. సుగ్రీవుడు మిత్రకార్యమును నిర్వహించుటయందు తనసేనను యుద్ధమునందు రామునకు సహాయము చేయుటకుపయోగించాడు.

రాక్షసరాజ్యమగు లంకయందును పటిష్టమైన సేనగలదు. చతురంగ బలయుతమైన రాక్షససైన్యం సమర్ధవంతంగా నిర్వహింపబడింది. లంకలోనేగాక జనస్థానమందును గూడ రావణుని సేన 14 వేలు నియుక్తమైనది. ఖరుని యొక్క సేనానియగు దూషణుని ఆధీనంలోగల రాక్షససైన్యం కూడా బలమైనదే.[254]లంకారాజ్యంలోని రాక్షససేన లంక నాలుగు ద్వారాలను జాగ్రత్తగా కావలికాచేది.[255]

*3-6-19 రామ - రావణయుద్ధంలో సైనికవ్యవస్థ - నిర్వహణ :*

రావణుని పక్షంలో చతురంగ బలయుక్తమైన సైనిక వ్యవస్థయుండగా శ్రీరాముని పక్షంలో కేవలము పదాతిబలమే యున్నది. దానినే శ్రీరాముడు వ్యూహాత్మకంగా నిర్వహించి రావణుని నిర్వీర్యుని గావించినాడు. ముఖ్యముగా శ్రీరాముడనుసరించిన గరుడవ్యూహము అందుకు బాగా అనుకూలించినది.

రామరావణయుద్ధము తీవ్రమైన సందర్భమున శ్రీరామునికి హితుడగు దేవేంద్రుడు రథమును, సారధిని, కవచమును విల్లును పంపగా వాటిని శ్రీరాముడు గ్రహించి రథారూఢుడై రావణుని వధించినాడు. దీనినిబట్టి రథబలం కూడా శ్రీరామునికి విజయప్రాప్తికి సహాయపడినదని స్పష్టమగుచున్నది. కపిసేన లంకారాజ్యమును చుట్టుముట్టి రావణవధకు తోడ్పడినది. రావణుడు తనసైన్యమును వ్యూహాత్మకముగా నడిపించినప్పటికి శ్రీరాముని వ్యూహము బలవత్తరమగుటచే రావణుడు వధింపబడినాడు.

### 3-7-0. మిత్రుడు :

### 3-7-1 మిత్రుని ఆవశ్యకత :

రాజ్య రక్షణానికి అత్యవసరంగా పనికి వచ్చేవాడు మిత్రుడే. రాజ్యానికి కోశాగారం నుండి లభించే బలం ఎలాంటిదో అట్టిబలం మిత్రుల నుండి లభిస్తుంది. రామాయణంలో మిత్రుని ఆవశ్యకతను గూర్చి పలు సందర్భాలలో ప్రస్తా వించబడింది.

యస్య కోశశ్చ దండశ్చ మిత్రాణ్యాత్మా చ భూమిప।
సమాన్యేతాని సర్వాణి స రాజ్యం మహదశ్నుతే॥[256]

దీనిబట్టి ధనాగారం, సేన, ప్రభుత్వాలతోపాటు మిత్రులు పరస్పరం సామరస్యం కలిగి యున్నట్టి రాజు మహారాజ్యాన్ని పొందుతాడని చెప్పడింది.

శ్రీరాముడు సుగ్రీవునితో చెలిమిచేసెను. ఆ సందర్భంలో వానరులు సీతాదేవి నగలు శ్రీరాముని యొద్దకు తేగా శ్రీరాముడు సుగ్రీవునితో

'ఏష చ ప్రకృతిస్థోఽ హ మనునీత స్త్వయా సఖే।
దుర్లభో హీదృశో బంధురస్మిన్ కాలే విశేషతః॥[257]

మిత్రుడా! నీవు అనునయించుటచే నేనెప్పటివలె నైనాను. నీలాంటి బంధువు విశేషించి ఇట్లాంటి క్లిష్టసమయంలో వేఱొకడు లభించుట చాలకష్టమని చెప్పుటద్వారా మిత్రుడు ఎలాంటి వాడో చెప్పడం జరిగింది.

ఇదే సందర్భంలో రంగనాథరామాయణంలో

'యాపదకును సఖుడైనట్లు చుట్ట - మునాటిగానేర డారసిచూడ
గుణవంతుడైన గుణహీనుడైన - గణియింప సఖుడు సద్గతియండ్రు బుధులు
కావున నీ చెల్మిగలనాకు సౌఖ్య - మే వెంట గొదువులేదిది నిశ్చయంబు''[258] అనియు భాస్కర రామాయణంలో

'అనుమతినెయ్యడన్ హితుడనైన వయస్యుడు సేయుకృత్యముల్
పొనరగజేసితీవు నిను బోలెడు బంధుడు మాకు నిప్పు డెం
దును బరికింపగాగలడె దుఃఖము బాసితి నీ హితోక్తుల
న్మనముగలంక దేఱె భ్రమనస్థితి నెమ్మదిలోన బొంగితిన్[259] అని మిత్ర ప్రశంసగలదు.

రామాభ్యుదయంలో

నీవంటి ప్రాణ బంధుఁడు
నీవంటి హితోపదేష్ట నేఁగాన నిఁకన్

కావించెద నడుగు మనుడుఁగపివరుఁడనియెన్[260]

అని చెప్పటం వల్ల మిత్రుడే బంధువనియు, మిత్రుడు మేలుకలిగించేవాడని నిరూపిస్తున్నది.

**3-7-2 రామాయణం - మిత్రుని అర్హతలు:**

వానరేశ్వరుడగు సుగ్రీవుడు గొప్పపరాక్రమము గలవాడు. గొప్ప తేజస్సుగలవాడు. సత్యసంధుడు, వినయాన్వితుడు, ధైర్యశాలి, బుద్ధిమంతుడు, శ్రేష్ఠుడు, సమర్థుడు, ప్రతిభాశాలి, కాంతిమంతుడు, గొప్ప బలపరాక్రమములుగలవాడు.[261]ఇట్టి బలశాలియు అన్నచే నగరము నుండి వెళ్లగొట్టబడు దురవస్థనందియున్నాడు. అట్టి సుగ్రీవునితో చెలిమి చేయవలసినదిగా కబంధుడు శ్రీరామునికి చెప్పాడు. సుగ్రీవునకున్న గుణాన్ని బట్టి మిత్రునకు ఉండాల్సిన అర్హతలను గూర్చి వాల్మీకంలో పరోక్షంగా ప్రస్తావించబడింది.

రంగనాథ రామాయణంలో శబరి శ్రీరామునకు సుగ్రీవుని సుగుణాల నీవిధంగా చెప్తుంది.

'సునిశిత మతిసూర్యసుతుడు సుగ్రీవుఁ డను వానరాధీశుండు కొండనుండు.........

యతడు శోకాతురుడై యున్నవాడు అతనికి కపిసేనల ప్రమాణమ్ము'[262]

ఇక్కడ కపిసేనల ప్రమాణము' కూడ మిత్రునికుండాల్సిన అర్హతలలో ఒకటని తెలుస్తున్నది.

భాస్కరరామాయణంలో సుగ్రీవుని సుగుణాల్ని కబంధుడు శ్రీరామునికి వివరిస్తూ

'ఆ కపినాథుతోడఁ బ్రియ మారఁగ సఖ్యము సేయు; మాతఁడ
స్తోకబలుండు విక్రమయుతుండు కృతజ్ఞుఁడుఁగామ రూపియున్;
నీకు సహాయుఁడై హితము నేర్పునఁజేయఁగలండు; వానరా
నీకములోలిఁ బెక్కులు గణింపఁగ నాతని కొప్పుభూవరా[263]

'ఆ సుగ్రీవుండు దేశకాలజ్ఞుండు, వాలి వలన భీతిం బోయి సకలదేశంబులుం
జూచినాడు గాన మహావీరులైన వానరుల నెల్లదిక్కులకుం బనిచి యెక్కడ
నున్నను రావణునిసాధించి సీతనుదెచ్చి నీకు సమర్పింపఁగలండని'[264]

పేర్కొనెను.

మొల్ల రామాయణంలో

"ఇనకులాధీశ! సుగ్రీవుఁడనెడువాఁడు
కపికుల శ్రేష్ఠుఁడత్యంతఘనుడుఁ తలఁప
నతనితో 'బొందుగావింపు మన్నిపనులు
జక్కనౌటకు నాత్మ నిస్సంశయంబు'[265] అని శబరి సుగ్రీవునితో పొందుగావించుకొనుమని శ్రీరామునకు చెప్పెను.

రామాభ్యుదయంలో

------- సూర్యసూనుండు సుగ్రీవుం డనువాఁడు వానరేశ్వరుండు పుణ్యుండు వాలిచేత తిరస్కృతుండయి, కళత్ర, ధాత్రీరాజ్యరహితుండయి"[266] అని కబంధుడు శ్రీరామునితో చెప్పుట ద్వారా సుగ్రీవునితో మైత్రిచేసుకొనవలసిందిగా సూచించాడు. మరొక సందర్భంలోకూడా సుగ్రీవుని గుణగణాలను రామునికి తెలియ జెప్పటం జరిగింది. రామలక్ష్మణులవద్దకు హనుమంతుడు భిక్షుకాకృతిలో వచ్చిన సందర్భంలో సుగ్రీవుని గుణాలనుగూర్చి వాల్మీకి రామాయణంలో,[266a] రంగనాథ రామాయణంలో,[267] భాస్కర రామాయణంలో[267a] మొల్ల రామాయణంలో[268] రామాభ్యుదయంలో[268a] పేర్కొనుటను బట్టి సుగ్రీవుడు మైత్రికి తగినవాడని చెప్పబడింది.

### *3-7-3* మైత్రీ ప్రకటనవిధానం:

రామాయణకాలంలో మైత్రిని ప్రకటించడానికి కొన్ని పద్ధతులున్నట్లు తెలుస్తున్నది. అగ్నిసాక్షిగా, ఆయుధసాక్షిగా మైత్రిచేయడం, కరగ్రహణం సల్పుట ద్వారా మైత్రిని ప్రకటించే విధానం ఉన్నట్లు తెలుస్తున్నది.

'రోచతే యది మే సఖ్యం బాహురేష ప్రసారితః।
గృహ్యతాం పాణినా పాణి ర్మర్యాదాబధ్యతాం ధ్రువా"[269]

అని రాముడ్ని చూచి సుగ్రీవుడు నీకు నాతో సఖ్యమిష్టమైతే ఇదిగో చేయి చాచితిని. నీ చేతితో నాచేయి గ్రహింపుము. ఈ స్నేహం అనుల్లంఘనీయముగ కట్టుబాటు చేయుమని పల్కెను. అనగానే

'ఏతత్తు వచనం శ్రుత్వా సుగ్రీవస్య సుభాషితమ్।
సంప్రహృష్టమనా హస్తం పీడయామాస పాణినా॥[270]

రాముడు సంతుష్టాంతరంగుడై సుగ్రీవునిచేతిని తనచేతితో పట్టుకొనినట్లు రామాయణమున గలదు. పిమ్మట

'తతోఽగ్నిం దీప్యమానం తౌ చక్రతుశ్చ ప్రదక్షిణమ్।
సుగ్రీవో రాఘవశ్చైవ వయస్యత్వముపాగతౌ॥[271]

అనుటనుబట్టి రామ సుగ్రీవులు హనుమచే సత్కరింపబడి పరస్పరం చేతులు పట్టుకొని ప్రదక్షిణమొనర్చి అగ్ని సాక్షిగా చెలిమిచేసిరని వాల్మీకి రామాయణమున చెప్పబడింది.

శ్రీరాముడు సుగ్రీవుని ఆలింగనం ద్వారా మైత్రిచేసుకొన్నట్లు రంగనాథ రామాయణమున గలదు.[272]

భాస్కర రామాయణంలో

'మనమున నమ్మిక పుట్టఁగ
జనవర చేఁసాఁపు మనుఁడు జనపతియగుఁగా
కని యితరేతరమస్తక
మనుకూలతఁ బట్టి జేసి రాలింగనముల్''
'అనిలసుతుండు కాష్ఠయుగ మప్పుడు గూర్చి మథించి, యగ్నిసం
జనితముగాఁగ నర్చు, లిడి, చాల ప్రవృద్ధముచేసి ముందటం
దనరగఁదెచ్చి పెట్టినఁ బ్రదక్షిణముల్ సని వచ్చి నమ్మన
య్యలము సాక్షిగాఁగ మనమారఁగ సఖ్యముసేసి రిద్దఱున్''[273] అని చెప్పుట

ద్వారాను రామాభ్యుదయములో రామసుగ్రీవులు 'అగ్నిసాక్షిగాఁ బరస్పరంబు నమ్మికలు పుచ్చుకొని పొందు' చేసిరని చెప్పబడింది.[274]

పైన పేర్కొనిన వానినిబట్టి కరగ్రహణము, ఆలింగనము, ఆయుధసాక్షి, అగ్నిసాక్షి మొదలైన వానిద్వారా మైత్రిని ప్రకటించే విధానమున్నట్లు తెలియుచున్నది.

### *3-7-4 మిత్రుడే బంధువు - మిత్రుడేగతి:*

వ్యధలో చిక్కుకున్నప్పుడు మిత్రుడు మాత్రమే హితోక్తులతో ఓదార్చును

'ప్రకృతిస్థస్తు కాకుత్స్థః సుగ్రీవ వచనాత్ ప్రభుః।
సంపరిష్వజ్య సుగ్రీవ మిదం వచన మబ్రవీత్॥
కర్తవ్యం యద్వయస్యేన స్నిగ్ధేన చ హితేన చ
అనురూపం చ యుక్తం చ కృతం సుగ్రీవ త త్త్వయా'[275]

శ్రీరాముడు తీవ్రమైన వ్యధచెందుచున్న సందర్భంలో సుగ్రీవుడు హితోక్తులను పలికెను. సుగ్రీవుని హితవచనాలచే శ్రీరాముడు ఎప్పటివలెనే సుగ్రీవుని ఆలింగనము చేసుకొనెను. మిత్రడెటుల ఆచరింపవలెనో ఆ ప్రకారం శ్రీరామునకు శోకనివారణ మొనరించెను.

రంగనాధ రామాయణంలో యిదే సందర్భంలో

'మావంటి ప్రాకృతమతుల చందమున - నీవునుశోకింప నీతియే దేవ''[276]

అను అనునయవ్యాక్యాలద్వారా ఓదార్చినట్లు కలదు.

భాస్కర రామాయణంలో

శోకము సుఖముం బెఱచును

శోకము తేజంబు నడచు శోకము బుద్ధిం

బోకార్చుగాన దాలిమి

గైకొని శోకముడుగు తగు నీకనిన్'[277] అని ఓదార్చినట్లుగలదు.

రామాభ్యుదయములో సుగ్రీవుడు శ్రీరాముని బాధఉపశమించునట్లు

'భూవిభుని కంటఁగంటను పుట్టెడేసి

తొరగు భాష్పాంబు ధారలు తుడిచి తుడిచి

నీకు శోకార్తి చెల్లునే నృపవతంస

యనుచు నోదార్ప రవిసుతు కనియెవిభుడు.[278] అని పల్కినాడు. సుగ్రీవుడు శ్రీరామునితో

'ఆఢ్యోవాపి దరిద్రోవా దుఃఖిత స్సుఖితోఽపి వా

నిర్దోషశ్చ సదోషస్య వయస్యః పరమా గతిః'[279]

సంపన్నుడుగాని, దరిద్రుడుగాని, దుఃఖితుడుగాని, సుఖితుడుగాని, నిర్దోషిగాని, దోషికాని, మిత్రుడే ఉత్తమగతి అనిపలకడం మిత్రుని ప్రాధాన్యాన్ని నిరూపిస్తున్నది.

'రజతం వా సువర్ణం వా శుభాన్యా భరణాని చ।

అవిభక్తాని సాధూనా మవగచ్ఛంతి సాధవః[280]॥

మిత్రులైనవారు ఒండొరులకు సంబంధించిన వెండిగాని, బంగారముగాని, వస్త్రములుగాని, ఆభరణములుగాని, తమకందఱకు అవిభక్తములని తలంతురేగాని ఎవరి సొత్తు వారిదని వేఱపాటు భావింపరు అనికూడా తెలుపబడింది.

### *3-7-5* రామాయణము ప్రసిద్ధ మిత్రులు:

రామాయణకాలంలో మైత్రికి జాత్యంతరం అడ్డుగోడ కాదని తెలుస్తున్నది. దేవ, మానవ, వానర రాక్షస రాజుల మధ్య సందర్భానుసారం మైత్రియుక్తమగు రీతిని ఏర్పడింది.

1. కోసలాధీశుడైన దశరథుడు - అంగదేశాధిపతి రోమపాదుడు.

2. కోసలాధీశుడైన దశరథుడు - మిథిలాపతి జనకుడు

3. కోసలాధీశుడైన దశరథుడు - దేవరాజగు ఇంద్రుడు

4. కోసలాధీశుడైన దశరథుడు - గృధ్రరాజను జటాయువు

5. కోసలాధీశుడైన దశరథుడు - నిషధరాజగు గుహుడు.

6. లంకాధిపతి రావణుడు - కిష్కింధాధిపతి వాలి.

7. ఒకే దురవస్థలోనున్న శ్రీరాముడు - సుగ్రీవుడు.

8. దశరథునికి కారణంగా మిత్రులైన శ్రీరాముడు - దేవేంద్రుడు - జటాయువు - గుహుడు.

*3-7-6.* రామాయణము - మిత్రకార్యనిర్వహణప్రాధాన్యము:

"ఉపకార ఫలం మిత్రమపకారోఽరి లక్షణమ్'[281]

ఉపకారం చేయడమే మిత్రలక్షణం - అపకారంచేయుట శత్రులక్షణం'. దీనిననుసరించియే మిత్రకార్యనిర్వహణం చాలాముఖ్యమైనది.

"ధనత్యాగ స్సుఖత్యాగో దేశత్యాగో పి వాఽనఘః।
వయస్యార్థే ప్రవర్తన్తే స్నేహం దృష్ట్వా తథావిధమ్."[282]॥

తమకు తగిన స్నేహం గల మిత్రుని గాంచిన మిత్రులు వారికై తమధనాన్ని సుఖాన్ని చివరకు ప్రాణాల్ని కూడా వీడి మిత్రకార్యనిర్వహణకు పాటుపడతారని చెప్పడం గమనించదగినది. సుగ్రీవుని మిత్రకార్యనిర్వహణకు పురికొల్పుతు హనుమ మిత్రుల యెడ సదా సామరస్యంతో మెలగువారికి రాజ్యం, కీర్తి, ప్రతాపము వృద్ధినొందును. శీలసమన్వితుడవు, సన్మార్గుడవగు నీవు మిత్ర కార్యాన్ని నెరవేర్చుమనెను. ఎవడు తన భోగసాధనములన్నింటిని వీడి ఉత్సాహముపూని ఆదరంతో మిత్రకార్యమున ప్రవర్తించునో వానికి అనర్థములు గలుగనేరవు.[283] నిర్ణీతకాలములో నిశ్చితమగు మిత్రకార్యము నిర్వహింపక, కాలాతిక్రమణమొనర్చి మిత్రకృత్యముచేయబూనిన వాడు; మహా ప్రయత్నమొనర్చియు మిత్రకార్యాన్ని సఫలంచేయజాలరు.[284]

రంగనాథ రామాయణంలో మిత్రకార్యనిర్వహణకు హనుమంతుడు సుగ్రీవుని పురికొల్పినట్లు మాత్రమే గలదు.[285] పై వివరణలేదు.

భాస్కరరామాయణంలో హనుమసుగ్రీవునితో

'మనమున మిత్రుని మఱవక
తన మిత్రహితంబు సేయతద్జ్ఞుఁడు,రాజ్యం
బును యశము ప్రతాపముఁగని
జనశేఖరుఁడై చరించు; సర్వశ్రీలన్.[286]

అని మిత్రహితమొనర్చుట యుక్తమనుట ద్వారా మిత్రకార్యనిర్వహణకు ప్రోత్సహించినట్లు తెలుస్తున్నది.

రామాభ్యుదయములో

సుగ్రీవ! సమయమయ్యె ద
శగ్రీవు జయింపఁ దడయఁ జనునే తారా
సుగ్రీవాసుఖసక్తి గ
రగ్రీవనిభుండు సుమ్ము రఘుపతి కినుకన్[287]

అనుచు సీతనువెదుక కపివీరులను పంపుమని ప్రోత్సహించినట్లు తెలియుచున్నది.

### *3-7.7 రామాయణము - ప్రసిద్ధమిత్రుల మిత్రకార్యాచరణము:*

రామాయణంలో కనిపించే ప్రసిద్ధమిత్రులందఱు మిత్రకార్యాసక్తితో మిత్రకార్యనిర్వహణమునకు పాటుపడిరని తెలియును.

1. దశరథుడు సంతానముకోరి యాగము చేయదలచెను. యాగనిర్వహణమునకై ఋష్యశృంగుని పిలువదలచెను. తన మిత్రుడైన రోమపాదుని నీ అల్లుడైన ఋష్యశృంగుని పంపుమని దశరథుడు స్వయముగా కోరెను. అతడట్లే శాంతా సమేతుడైన ఋష్యశృంగుని దశరథుడు వెంట పంపెను.[288] తత్ఫలితంగా యాగం సఫలమయ్యెను. ఈవిధంగా అంగదేశాధిపతియైన రోమపాదుడు మిత్రకార్య నిర్వహణమునకు తోడ్పడెనని తెలియుచున్నది.

2. మిథిలాధిపతియైన జనకుడు కూడా మిత్రకార్యనురక్తి గలిగినవాడు. తన మిత్రుని కుమారుడగు శ్రీరాముడు శివధనుర్భంగము జేయగా దశరథుని కుశలాన్ని గుఱించి జనకుడంపిన సందేశాన్ని వినిపించిన సందర్భాన్ని[289] మిత్రునిగా జనకుడు దశరథుని యెడల ప్రదర్శించిన విలువలను నిరూపిస్తున్నది.

3. దేవరాజగు ఇంద్రునికి, మానవేంద్రుడగు దశరథునికి మైత్రిగలదు. శంబరాసురునితో దేవేంద్రునికి పోరుప్రాప్తింపగా దశరథుడు వైజయంతమను పట్టణానికి వెళ్లి మిత్రునిపక్షాన పోరుసల్పెను. రాణియగుకైకయును ఆ యుద్ధంలో దశరథునితో పాటు పాల్గొనుట విశేషము[290]. ఈ విధముగా దశరథుడు రాణితో గూడ

దేవేంద్రుని పక్షాన శంబరాసురునితో పోరాడుట ఆతని మిత్రకార్యాచరణను నిరూపించుచున్నది.

4. కోసలాధిపతియైన దశరథునికి గృధ్రరాజగు జటాయువునకు మైత్రిగల్గెను. దశరథుని చెలికాడైన[291] జటాయువు తండ్రిమూలాన శ్రీరామునకు హితుడై[292] సీతను రావణుని బారినుండి విడిపించుటకు తీవ్ర ప్రయత్నము చేసెను. ఆ ప్రయత్నంలోనే అతడు ప్రాణాలు కోల్పోయినాడు. రావణునిచే ఱెక్కలు నరకబడి హీనస్వరంతో రావణుని దుష్కృత్యాలను శ్రీరామునికి తెల్పెను. సీతను రావణుడు దక్షిణదిక్కుగా గొనిపోయెనని చెప్పెను.[293]

5. శ్రీరామునకు ప్రాణసమానమైన మిత్రుడు గుహుడు.[294] నిషాదరాజగు గుహుడు వృద్ధుడు. దండకారణ్యమెల్లను సంపూర్ణముగా నెఱిగినవాడు. శ్రీరాముడు తనదేశానికి వచ్చినట్లు విని గుహుడు వృద్ధులగు అమాత్యులతోను, జ్ఞాతులతోను, రామునివద్దకు వచ్చి రక్షకునిగా రాత్రియంతయు వ్యవహరించి సీతారామలక్ష్మణులను సుఖంగా గంగను దాటించాడు. ఈ విధంగా మిత్రకార్యాన్ని గుహుడు నిర్వర్తించెను. అంతేగాదు భరతునిగుఱించియు ఇతడు దుష్టుడు కాకుండుటచే ఈ సేన క్షేమంగా గంగను దాటగలదనటంలో మిత్రరక్షణ భావనను చూడగలము.

6.లంకాధిపతియైన రావణుడు యుద్ధంలో వాలిచే ఓటువడి వాలితో మైత్రి చేసుకొనెను. వాలి అనిన రావణునకు అమితమైన భయము. వాలిసోదరుని గూడ తన మిత్రునిగా చేసుకొనదలచి రావణుడు విఫలుడైనాడు.

7.రామాయణంలో అత్యంత ఆప్తులుగా, మిత్రకార్యాలను నిర్వర్తించడంలో శ్రేష్ఠులుగా ఎన్నదగినవారు రామ సుగ్రీవులు. అగ్ని సాక్షిగా మిత్రులైన వీరు మిత్రకార్యనిర్వహణమున సత్యప్రతిజ్ఞగలవారు. ముందుగా శ్రీరాముడు తనమిత్రుని శత్రువగు వాలిని వధించి తద్వారా తన మిత్రునికి రాజ్యప్రాప్తి కలిగించెను.[295] అటు తరువాత సుగ్రీవుడు తన మిత్రుడైన శ్రీరామునికి మేలొనగూర్చునట్లు సీతాన్వేషణమును వానరులచే చేయించెను. సీత క్షేమసమాచార వార్త శ్రీరామునికి చేరేటట్లు చేయటంలోనే అపార కపిసేనను రామదండుగా తరలించి లంకపై దాడికి తోడ్పడుటలోను సుగ్రీవుడు మిత్రకార్యనిర్వహణమును సమర్థంగా నెఱవేర్చెను. శ్రీరామునకు జయము లభించి అయోధ్యకు రాజగునట్లు చేయుటలోను సుగ్రీవుని కృషి ప్రశంసనీయము.

*3-7-8 మైత్రి - పరిరక్షణ:*

మైత్రి పరిరక్షణము అంటే మిత్రునియొక్క కర్తవ్యము. ఉపకారియైన మిత్రునకు ఉపకృతి చేయుదునని ప్రతిజ్ఞ యొనరించి నెఱవేర్చనివారు క్రూరుడనబడును.

'యస్తు రాజా స్థితోధర్మే మిత్రాణా ముపకారిణామ్।
మిథ్యాప్రతిజ్ఞాం కురుతేకోనృశంసతర స్తతః॥'[296]

అని లక్ష్మణుడు సుగ్రీవునితో పల్కినట్లు వాల్మీకి రామాయణమున గలదు.

ఇదే సందర్భములో భాస్కర రామాయణమున ఇట్లున్నది.

ఉపకారియైన మిత్రున
కుపకృతి సేయం బ్రతిజ్ఞ యొనరించిమృషా
లపితుండై యుండెడునా
కపటాత్ముండధిక హింస కృతయుండరయన్[297] అని లక్ష్మణుడు సుగ్రీవునితో పలికినట్లు గలదు.

లక్ష్మణుని రాకను గూర్చి విన్న సుగ్రీవుడు తనమంత్రులతో

'సర్వథా సుకరం మిత్రం దుష్కరం పరిపాలనమ్।
అనిత్యత్వాత్ తు చిత్తానాం ప్రీతిరల్పే ఽపి భిద్యతే॥[298]

మిత్రులను సంపాదించడం కష్టంకాదు. వారితో మైత్రిని కాపాడుటే కష్టమైన పని. మనస్సులు చంచలమైనవగుటచే ఎప్పుడు ఒక్కతీరుగనుండవు. అత్యల్ప కారణం చేతకూడా స్నేహం చెడుతుంది అనెను.

సీత రాక్షస వనితలతో స్నేహధోరణిని తెల్పుచూ

'దృశ్యమానే భవేత్ప్రీతి స్సౌహృదం నాస్త్యదృశ్యతః।
నాశయన్తి కృతఘ్నాస్తు న రామో నాశయిష్యతి.॥[299]

స్నేహమేర్పడినచో అది ఒకరినొకరు తఱచుగా చూచుకొనుచున్నప్పుడే వృద్ధిపొందును. ఇట్లు కృతఘ్నుల ఎడలనే కానవచ్చుచుండును. రాముడు మాత్రం ఒకసారి ఏర్పడ్డ స్నేహాన్ని నశింపజేయడనెను.

*3-7-9 మిత్రవధ దోషాలు:*

రామాయణం మిత్రవధ కూడదని స్పష్టపఱిచింది. రామకార్యాన్ని నిర్వ హించడంలో ఆలస్యాన్ని ప్రదర్శించిన సుగ్రీవుని విషయమై లక్ష్మణుడు ఆవేశపడిన సందర్భంలో శ్రీరాముడు.

'న హి వై త్వద్విధో లోకే పాప మేవం సమాచరేత్।
పాపామార్యేణ యో హన్తి స వీరః పురుషోత్తమః॥[300]

నీ వంటి వాడెవ్వడు మిత్రులను వధింపడు. అట్లు వధింపసమకట్టియు ఆ పాపకృత్యములనుండి వివేకముతో నెవడు మరలునో ఆ వీరుడు నరోత్తముడు.

నేదమద్యత్వయా గ్రాహ్యం సాధువృత్తేన లక్ష్మణ।
తాం ప్రీతిమనువర్తస్వ పూర్వవృత్తం చ సంగతమ్॥[301]

సాధువర్తనుడవైన నీవు మిత్రులను సంహరించుటయను పాపానికి ఒడిగట్టకుము. పూర్వం మనం సుగ్రీవునితో ఏర్పరుచుకొనిన సఖ్యరూపమగు బంధుత్వాన్ని ఆ ప్రేమను అంటిపెట్టుకొని ఉండుము. కాన ఆవేశపడవలదనెను. దీనినిబట్టి మిత్రవధ మహా పాపమనియు, అట్టి దుష్టత్వానికి పాల్పడరాదనియు తెలుస్తున్నది.

*3-7-10* మిత్రుడు - ధర్మార్థ కామసంబంధము:

పురుషార్థుల సాధనలో మిత్రునకు విశిష్ట స్థానం ఉంది. ధర్మార్థకామములకు మిత్రుడే మూలమని రామాయణం స్పష్టపరచింది.

'మిత్రం హ్యర్థ గుణశ్రేష్ఠం। సత్యధర్మపరాయణమ్॥
తద్ద్వయం తు పరిత్యక్తం। న తు ధర్మే వ్యవస్థితమ్॥[302]

సత్యధర్మ పరాయణుడగు మిత్రుడే అర్థకామములకు మూలం. అతడు అర్థకామములకంటే శ్రేష్ఠుడు. అట్టిమిత్రుని విడిచిపెట్టిన సుగ్రీవుడు రెంటిని మరియు ధర్మమును విడిచిపెట్టినాడని తారతో లక్ష్మణుడు పలికినట్లు గలదు. అంతేగాక

'ధర్మలోపో మహాంస్తావత్ కృతే హ్యప్రతికుర్వతః।
అర్థలోపశ్చ మిత్రస్య నాశే గుణవతో మహాన్'॥[303]

ఎవ్వడేని ఉపకారం చేస్తే దానికి తగిన ప్రత్యుపకారం చేయకుండుటచే మిక్కిలి ధర్మలోపం కలుగుతుంది. అట్లు ప్రత్యుపకారమ్మునొందని కారణంచే నొక గుణవంతుడైన మిత్రుడు నశిస్తే దానివల్ల అర్థలోపం కలుగుతుందని పలికినట్లు వాల్మీకి రామాయణంలో ఉంది.

*3-7-11* దుర్జన మైత్రి - పర్యవసానం:

రామాయణంలో దుర్జనమైత్రి ప్రమాద హేతువని పేర్కొనబడింది. రావణుడు తన సభలో విభీషణుని హితవచనాలను మన్నింపక పరుషోక్తులాడుచు దుర్జనమైత్రి దుష్ఫలితాలను సూచించెను.

'వసేత్ సహ సపత్నేన క్రుద్ధేనాశీవిషేణ చ
న తు మిత్రప్రవాదేన సంవసేచ్ఛత్రుసేవినా[304]

శత్రువుతోనైన కలిసియుండవచ్చు. కోపించిన సర్పంతోనైనా సహవాసం చేయవచ్చు. కాని మిత్రుడుగా చెల్లుబాటగుచు శత్రువును సేవించువానితో కలిసియుండరాదు. అని రావణుడు విభీషణునితో పలికినట్లు వాల్మీకిరామాయణంలో ఉంది.

ఇదే సందర్భంలో రంగనాధరామాయణమున

'పగవానితో నైన బాయక గూడి - మిగిలిన యేవుతో మెలగగవచ్చు
బటువిషంబొలికెడు పాముతోనైన - జటులనిర్భయవృత్తి(జరియింపవచ్చు
దనవారివలెనుండి దాయల గూడి - మనువారితో గూడిమనరాదు గాక''[305]

భాస్కర రామాయణములో

'అనుడు నద్దశకంఠుడతనికిట్లను విను - రోషంబుతో బిట్టురోజుచున్న
చటులోరగముతోడి సహనివాసమ్మైన - కంటె నీతో నిట్లు గలసి యునికి
కడుగీడు హితునట్లు కదియుచు శాత్రవ - మొకదెస జరపుచు గోటలేక
పగవాని పక్షంబు పలికెదు నీకంటె - నిక్కంపు బగవాడు నెరయమేలు
ధనము విద్య కీర్తి దమలోన నొకనికి గలుగుటకు నసూయ గ్రాలువారు
నెడరు వేచువారు నెందు దాయాదులకారె కాన నమ్మగాదు నిన్ను'[306]

ఇదే సందర్భంలో అయోగ్యులతో స్నేహం వల్ల కలుగు పర్యవసాన్ని గుఱించి

'యధాపూర్వం గజః స్నాత్వా గృహ్యా హస్తేన వై రజః।
దూషయత్యాత్మనో దేహం తథాఽనార్యేషు సంగతమ్'॥[307]

ఏనుగు మొదట స్నానమొనర్చి తరువాత తొండముతో ధూళిని ఎత్తి తన యొడలిపై ఎట్లు చల్లుకొనునో, అయోగ్యులతో చెలిమివలన ముందు స్నేహం కలిగినను పర్యవసానం చెఱుపేయగునని పలికెను.

### *3-7-12* మిత్రుని యోగక్షేమ విచారణము :

మిత్రుడు సర్వకాలాలయందు తన మిత్రుని హితం కోరుకొనును. అతడు మిత్రుని యోగక్షేమములను తెలిసికొనును. మిత్రరాజు యొక్క క్షేమ సమాచారము లనరయుటలో మిత్రుడు ఒక క్రమవిధానాన్ని అనుసరించును. జనకుడు తన మిత్రుడైన దశరథుని వద్దకు సీతారామ వివాహ ఆహ్వానమును తనదూతలచే పంపెను. వారు దశరథునితో

మైథిలో జనకో రాజా సాగ్నిహోత్ర పురస్కృతః।
ముహుర్ముహుర్మధురయా స్నేహ సంరక్తయా గిరా॥
కుశలం చావ్యయం చైవ సోపాధ్యాయ పురోహితమ్।
జనకస్త్వాం మహారాజ పృచ్ఛతే స పురస్సరమ్॥[308]

ఓ మహారాజా! మిథిలాపతియగు జనకమహారాజు స్నేహయుక్తములగు మాటలతో నీకును, నీ అగ్నిహోత్రమునకును, నీ ఋత్విజులకును, పురోహితునకును, పరివారమునకును, యోగక్షేమములన్నీ అరసినాడు. అనుచు 'నీకు కుశలమును కలత లేకుండటను తెలియకోరినాడు' అని పలికెను. దీన్నిబట్టి మిత్రుడు తన మిత్రుని యొక్క, అతని అగ్నిహోత్రము యొక్క, ఋత్విజుల యొక్క యోగక్షేమములను విచారించునని తెలియుచున్నది. స్నేహాన్ని ప్రదర్శించిన గుహునితో శ్రీరాముడు[309]

'భుజాభ్యాం సాధువృత్తాభ్యాం పీడయన్ వాక్యమబ్రవీత్।
దిష్ట్యా త్వాం గుహ పశ్యామి హ్యరోగం సహ బాంధవైః॥
అపి తే కుశలం రాష్ట్రే మిత్రేషు చ వనేషు చ।

భుజాలతో కౌగలించుకొని 'నీవూ నీ బంధువులు ఆరోగ్యంగా సుఖంగానుండగా నా భాగ్యవశంచేత చూడగలుగుతున్నాను. నీ రాష్ట్రానికి నీ మిత్రులకు ధనానికీ క్షేమమే గదా! అని పలకడం మిత్రుని యోగక్షేమవిచారణ విధానాన్ని స్పష్టపరుస్తున్నది.

### *3-7-13* మిత్రరాజు మరణించిన సందర్భంలో :

తొలి రాజ్యాంగ శక్తియైన రాజు మరణించినపుడు రాజ్యాంగాలన్నీ సంక్షోభం పొందును. ఒకానొక రాజ్యాంగశక్తియైన మిత్రుడుగూడ తగు విధంగా వ్యవహరించును. ఇట్టి సందర్భంలో మిత్రుడు మిత్రరాజు యొక్క రాజ్యానికి వెళ్లి అక్కడున్న ఆచార సంప్రదాయములను నిలబెట్టటానికి కృషిసల్పునని రామాయణం నిరూపిస్తున్నది.

దశరథుడు చనిపోయిన సందర్భంలో మిత్రరాజులు అక్కడకు వచ్చారు. పుత్రులెవ్వరు లేని సమయంలో దశరథునికి అంత్యక్రియలు చేయడానికి మిత్రులు ఇష్టపడలేదు.

'ఋతే తు పుత్రాద్దహనం మహీపతే ర్నరోచయంతే సుహృద స్సమాగతాః।
ఇతీవ తస్మిన్ శయనే న్యవేశయన్ విచింత్య రాజాన మచింత్య దర్శనమ్॥[310]

బలపరాక్రమ సంపన్నులగు తనయులుండియు దూరంగా ఉన్నారు. కాన మారక సంస్కారం చేయక విడుచుటతగదు. అటుపై దుర్లభమగు దర్శనంగల రాజు శరీరాన్ని తైల ద్రోణిలో ఉంచడాన్ని మిత్రుల సముచిత వ్యవహారశైలి సూచించుచున్నది.

*3-8-0:* దుర్గము

*3-8-1* దుర్గ - ప్రాధాన్యం :

రాజ్య సంరక్షణకు మూలమైంది దుర్గం. రాజుయొక్క సంపదలన్నీ ఇందు కేంద్రీకరింప బడును. దుర్గం, కోట, పురం, రాజధాని, అనే పదాలు సమానార్థకాలుగా ప్రయోగింపబడును.'సార్వభౌమాధికారానికి కేంద్రస్థానమైన, రాజ్యయంత్రాంగానికి రాజధాని కీలకస్థానమైంది. రాజధాని కోటచే సంరక్షింపబడేది.'[311]దుర్గం యొక్క ప్రాకారంపై నున్న విలుకాడు నూఱువురు శత్రువులను హింసింపగలడని, అట్టి నూర్వురు విలుకాండ్రు పదివేలమంది శత్రువులను హింసింపగలరని, కాబట్టి రాజుకు దుర్గం ముఖ్యమైనదని మనువు పేర్కొనెను.[312] కోశము సైన్యము, మూకయుద్ధం, స్వపక్షం వారిని నిగ్రహించుట, మిత్రసైన్యాన్ని స్వీకరించడం, శత్రుసైన్యాలను, ఆటవికసైన్యాలను ప్రతినిషేధించుట - వీటన్నింటికి దుర్గమే మూలము. దుర్గంలేని యెడల కోశం శత్రు స్వాధీనమౌతుంది. దుర్గంలేనివారు నిర్మూలము కావింపబడుట కనిపించునని కౌటిల్యుని యభిప్రాయము.[313]

*3-8-2* దుర్గం - రకాలు:

దుర్గాలు ఆరువిధాలని మనువు పేర్కొనెను. ఈ ఆఱింటిలో ఏదోఒక దాని నడుమ రాజధానిని నిర్మించాలని మనువు అభిప్రాయము.

'ధన్వదుర్గం మహీదుర్గ మబ్దుర్గం వార్క్షమేవ వా।
నృదుర్గం గిరిదుర్గం వా సమాశ్రిత్య వసేత్పురమ్॥[314]

వీటన్నింటిలో అనేక గుణాలు గలిగిన గిరిదుర్గం శ్రేష్టమైంది. రాజు సర్వ ప్రయత్నాలచే గిరిదుర్గాన్ని ఆశ్రయింపవలెను. గిరిదుర్గంలో నున్న రాజులను ఎవరు హింసింపజాలరు. అంతేగాక దుర్గములందున్న మృగాదులను, వ్యాధాది జనులు హింసింపజాలని విధంగానే గిరిదుర్గ మందలి రాజును ఎవరు హింసింపరని మనువు చెప్పెను.[315] గిరిదుర్గాన్ని దేవతలు ఆశ్రయిస్తారని కూడ చెప్పెను.

*3-8-3* దుర్గం - సమృద్ధి - పురనిర్మాణము:

సమృద్ధిగలదుర్గం ముఖ్యమైనదని మనువు చెప్పెను.

'తత్ స్యాదాయుధసంపన్నం ధనధాన్యేన వాహనైః।
బ్రాహ్మణై శ్శిల్పిభిర్యంత్రైర్యవసేనోదకేన చ''॥[316]

యుద్ధసాధనాలు, ధనం, ధాన్యం వాహనాలు, బ్రాహ్మణులు, శిల్పులు, యంత్రాలు, మున్నగువానితో గూడి జలసమృద్ధిగల దుర్గం గలిగి యుండవలెను[317]. అట్టి దుర్గ మధ్యంలో వేర్వేరుగా గృహ నిర్మాణాలతోగూడి నీటి వసతి, వృక్ష సంపదలతో రాజు గృహాన్ని నిర్మించాలి.

*3-8-4* రామాయణం - దుర్గాలు :

రామాయణంలో అయోధ్య, మిథిల, అంగ, లంకారాజ్యాలు చతురంగ బలాలచే కాపాడ బడ్డవి. చతురంగబలాలతో గూడిన సేనతో కాపాడబడేది మనుష్య దుర్గము.[318]

వానరాలు ఆశ్రయించునది వృక్షదుర్గము.[319] వెలుపల చుట్టును యోజన దూరం చెట్లతో చుట్టియున్న వృక్షదుర్గం కిష్కింధా రాజ్యంలో ఉంది.

అయోధ్యకు మనుష్య దుర్గలక్షణాలేకాక సెలయేళ్లను, బహుధాన్య సమృద్ధిని కలిగియున్న కారణంగా గిరిదుర్గ లక్షణాలతో కూడి ఉందని చెప్పవచ్చు.

*3-8-5* అయోధ్య దుర్గం :

అయోధ్య మనుష్యదుర్గ లక్షణాలను గలిగి యున్నది.

దుర్గగంభీర పరిఘాం దుర్గామన్యైర్దురాసదామ్।
వాజివారణ సంపూర్ణాం గోభిరుష్ట్రైః ఖరైస్తథా'॥[320]

లోతైన అగడ్తలతో శత్రువులకు ప్రవేశింపరానిదై గుఱ్ఱములు, ఆవులు, ఒంటెలు, గాడిదలు విస్తారంగా అయోధ్య గలిగియున్నది.

భాస్కర రామాయణంలో అయోధ్య గుఱించి యీ ప్రకారం చెప్పబడింది.

కం॥ సరయువుతీరంబున బహు
తరధాన్యంబులు గలిగి ధరణికిఁదొడ వై
పరఁగెడు కోసల దేశం
బరు దారఁగ మెఱసి యుండు నద్దేశమునన్

కం॥ అమరఁద్రియోజన విస్తీ
ర్ణము, దగ ఁబంద్రెండు యోజనంబుల నిడు పై
కొమరారు నయోధ్యానగ
రమును నిర్మించె మనువు ప్రాభవ మొప్పన్.[321]

రంగనాథ రామాయణంలో

'ద్వాదశయోజన వ్యాయతంబగుచు
నైదుయోజనములనది వెడల్పగుచు

నిపుణత మనువుచే నిర్మితంబగుచు
నెపుడు శాత్రవ కోటి కెదురు చక్కగుచు'

మొల్ల రామాయణంలో

సరయూ నదీతీర సతత సన్మంగళ ప్రాభవోన్నత మహా వైభవమ్ము
కనకగోపుర హర్మ్య ఘనకవాటోజ్జ్వల ప్రాకార గోపుర శ్రీకరంబు.
గజవాజి రథభట గణికాత పత్ర చామర కేతు తోరణ మండితంబు
ధరణీవధూటి కాభరణ విభ్రమరేఖ దరిసించు మాణిక్య దర్పణమ్ము
భాను కుల దీప రాజన్య పట్టభద్ర భాసి నవరత్న ఖచిత సింహాసనమ్ము
'గనుతి కెక్కు మహిమ ననారతమ్ము ధర్మనిలయమ్ము మహినయోధ్య పురమ్ము[322]

రామాభ్యుదయంలో అయోధ్య శత్రుదుర్భేద్యమైనదిగా

పురి పరిఘాసాలములం,
బురుహ భవాండములు గడిచి పోవగజాలున్
దెరువున భామడ్డంబును
నొరయికగా నెదురు చుక్కయునుగాకున్నన్[323]

అయోధ్యాదుర్గం మనుష్య దుర్గలక్షణాల్ని అధికంగా కలిగియుంది.

***3-8-6*** *మిథిలాదుర్గం:*

రామాయణంలో కనిపించే పటిష్టమైన మనుష్య దుర్గాలలో మిథిల ఒకటి. మిథిలను శత్రువులు ముట్టడించుటచే దుర్గరక్షణ సాధనలన్నీ క్షీణించాయి. ఆ సమయంలో జనకుడు దేవతలను ప్రసన్నం చేసుకొని చతురంగ బలాలను పొంది ఆపద నుండి తప్పించుకోగలిగెను.

రంగనాథ రామాయణంలో మిథిలా దుర్గవర్ణన మిట్లున్నది

'ఘన పుణ్యులందుండి కదిలి మిన్నంది - తనరు ప్రాకార యూథముల సౌధముల
నమరిన రత్నగేహముల వాహనముల - రమణీయ రాజ మార్గముల దుర్గముల
వల నొప్పు శృంగార వనముల జవ్వనుల - బొలుచు సంతత శుభంబుల నిభంబులను
ననుబొందు వైరి వర్గ శిథిలకును - జనకుని మిథిలకు.....................[324]

*3-8-7* కిష్కింధా దుర్గము:

రామాయణంలో కానవచ్చు కిష్కింధ చెట్లచే చుట్టబడినది. దీనికి భయంకరమైన వానరులు కావలియున్నారు. సుగ్రీవుని రామకార్యకర్తవ్యోన్ముఖుని గావించడానికి లక్ష్మణుడు కిష్కింధకు వెళ్ళిన సందర్భంలో

'తతస్తైః కపిభిర్వ్యాప్తాం ద్రుమహస్తైర్మహాబలైః।
అపశ్యల్లక్ష్మణం క్రుద్ధః కిష్కింధాం తాం దురాసదామ్''॥[325]

అనుటచే కిష్కింధ యొక్క రక్షణ వ్యవస్థ సూచింపబడినది.

అట్లే రామాభ్యుదయములో

"............... కిష్కింధాపురద్వారంబు నిర్నిరోధుండై దఱియంజని, నిజదురాలోక భీకర మహామహోవిభవంబునకు వెఱచి, పఱచి వరణ రక్షక ప్రముఖ నిఖిల బలీముఖులు విముఖులై గురుతరు వ్రాత భీషణ పాషాణ పాణులై కలగుండువడనార్చి...............[326]

అనుటచే కిష్కింధా దుర్గము యొక్క పటిష్టమైన రక్షణవ్యవస్థ సూచింపబడింది. సుగ్రీవుడు సుసంపన్నమైన కిష్కింధకు రాజుకావాలని రాముడు హనుమతో

'సు సమృద్ధాం గుహాం రమ్యాం సుగ్రీవో వానరర్షభః।
ప్రవిష్టో విధివ ద్వీరః క్షిప్రం రాజ్యేఽభిషిచ్య తమ్''॥[327] అనుటను బట్టి కిష్కింధా దుర్గం సుసంపన్నమైనదని తెలుస్తున్నది.

*3-8-8* లంకాదుర్గం:

రాక్షస రాజ్యమైన లంక గిరిదుర్గమని తెలుస్తున్నది. హనుమంతుడు సముద్రాన్ని లంఘించి

"స తస్మిన్నచలే తిష్ఠన్ వనాన్యుపవనాని చ।
నగాగ్రే చ స్థితాం లంకాం దదర్శ పవనాత్మజః॥[328]

లంకలో పుష్పించిన తరుశ్రేణులను దాటిపోయి, కొండయందు నిలిచి, వనాలను, ఉపవనాలను, త్రికూటాచలశృంగంలోనున్న లంకాపురాన్ని చూచాడు. అది రాజ ప్రాసాదాదులచే క్రిక్కిరిసి కాంచనమయమైన రమ్యమైన ప్రాకారాదులతో ఒప్పుచున్నది.

రంగనాథరామాయణంలోని త్రికూటాచలోత్పత్తి కథనం లంకాదుర్గ ఆవిర్భవాన్ని స్పష్టపరిచింది. దీని ప్రకారం నారదుడు ఫణిరాజుకు పవనునికి విరోధం గలిగించగా వాయువుచే ఒక శిఖరం దూరంగా తూలిపడగా త్రికూటాచలంబు సముద్రమధ్యంలో పడింది.

......................యాశృంఖల ద్వీపంబునందు దేవేంద్రునేపనుపున దేవతాశిల్పి
కరకౌశలమున లంకాపురంబనెడు పురము నిర్మించె, దత్పుర వరంబునకు
కోటలేడొప్పు నక్కోటకును -వాటమై నాల్గేసి వాకిండ్లు గలవు" అని చెప్పబడింది.

భాస్కర రామాయణంలో హనుమంతుడు సముద్రాన్ని దాటి లంకనుచేరిన సందర్భంలో

'పరిఘాభీలము వప్రదుర్గము ఘనప్రాకార ఘోరంబు గో
పుర నానాద్భుత యంత్రభీకరము, సంపూర్ణాస్త్ర శస్త్రధ్వజ
స్ఫురదట్టాలక జాలభీషణము రక్షోవీర దుస్సాధముం
దురగ స్యందన మత్తసింధుర భటస్తోమాతి భూయిష్టమున్'[329]

ఇదే సందర్భంలో రామాభ్యుదయంలో

అగరు మంటలు గ్రక్కునట్లున్నయదిగదా వప్రరత్న ప్రభావళులచేత
నట్టహాసము చేయునట్లున్నయదిగదా పటహాది కార్భటీ పటిమచేత
నదటుమై గర్జించున ట్లున్నయది గదా ప్రతిపతాకాంశుహతులచేత
నాహవగతి గాంచున ట్లున్నయది గదా నగశిఖరారోహణంబు చేత
దీనిఁగనుగొన్న వేగంటి దేవరకును వెచ్చనిట్టూర్పు పుక్కిట వెడలకున్నె
ముకుట కంపంబు తడవుగా ముదురకున్నె పిడుగుటడిదంబు చేవిడి పడకయున్నె[330]

అని లంకాదుర్గం కీర్తింపబడింది. లంకానగర ప్రాకారాన్ని గూర్చి హనుమ శ్రీరామునితో

సౌవర్ణస్తు మహాంస్తస్యాః ప్రాకారో ద్రుప్రధర్షణః।
మణివిద్రుమవైదూర్యముక్తావిరచితాంతరః'॥[331]

మిక్కిలి ఉన్నతంగా అన్యులతిక్రమింపరాని విధంగా బంగారంచే నిర్మింపబడినట్లు చెప్పడం జరిగింది.

'లంకా పునర్నిరాలంబా దేవదుర్గా భయావహా।
నాదేయం పార్వతం వాన్యం కృత్రిమం చ చతుర్విధమ్॥'[332]

దీనినిబట్టి లంకను చేరడం ఇతరులకు సాధ్యంకాదు. ఏలయంటే అది నున్నగా చెక్కబడి దేవతలకు ప్రవేశింపరాని నాలుగు దుర్గాలచే భీకరంగా ఉందని రామాయణంలో చెప్పబడింది.

'దగ్ధా చ నగరీ లంకా ప్రాకారా శ్చావసాదితాః।
బలైకదేశః క్షపితో రాక్షసానాం మహాత్మనామ్'॥[333]అని

హనుమంతుడు శ్రీరామునితో లంకాప్రాకారాలను ధ్వంసంచేసి వంతెనలు విరుగగొట్టి అగడ్తలను పూడ్చి ఆ పట్టణానికి నష్టం వాటిల్లేటట్లు చేసినట్లు చెప్పాడు ఇదే సందర్భంలో రంగనాథ రామాయణంలో

ఉర్వీలంకలో నున్నతంబగుచు - సర్వలోకంబులపోలరాని
మానైన కోటలు మఱియేడుగలవు - వీనులకింపుగా విన్నవించెదను
జుట్టులో నట్టళ్ళుచూపట్టునట్టి - యిట్టిక కోటొప్ప నిక్ష్వాకుతిలక
యాలోన గలుకోట, యందుక్కుకోట - జాలకంబుల నొప్పుగురిరాగికోట
దంచనంబులతోట దగిన బమ్మైన - కంచుకోటొకటొప్పు కమలాప్తవంశ
యజభవాదులకైన నరిగొనరాని - రజతంపుగోటొప్పు రాజేంద్ర తనయ
మణిమరీచులతోడ మానైన మహిమ - ప్రణుతింపగలదందు బసిడికోటొకటి ...........
నఖిల రత్నముల మేలైన వాకిళ్ళు - నిఖిలావనీనాథ నెఱినాలుగేసి
దరయంత్ర విధుల దివ్యంబులైనట్టి - శరచాపచయముల సంఖ్యంబులందు.........
నాలుగు నడవలు నాల్గగడ్తలును! జాలంగ బావాళసదృశమై యొప్పు''[334]

అని లంకాపురాన్ని గూర్చి తెల్పినట్లు గలదు. అట్టి లంకాపురిని

"వడి జొచ్చి యా నడవలు గూలదన్ని - యడరికోటలు ద్రవ్వి యగడితల్ పూడ్చి
యచ్చెరువుగ లంకయంతయుగాల్చి - వచ్చి మీ పాద పంకజముల్గంటి''[335]

అని హనుమ పల్కినట్లు పేర్కొనబడింది.

ఇదే సందర్భంలో భాస్కరరామాయణంలో

'ప్రాకారంబులగడ్తలట్టడులు యంత్రవ్రాతముల్ వప్రముల్
వాకిళ్లాయుధసంపదల్ గజములశ్వంబుల్ రథంబుల్ భటా
నీకంబుల్ బహుకేతనాదులు మదిన్ నిర్మించినట్లుండు భూ
నాకంబప్పుర మే కొఱంతయును గానంబట్ట దెప్పట్టునన్[336]

అని లంకాదుర్గాన్ని గుఱించి పేర్కొనెను.

మొల్ల రామాయణంలో లంకాదుర్గం యొక్క కావలిని గురించి హనుమ

'ఒక్కొక్కగవని వాఁకిట
నొక్కొక్కయేనూఱు కొటు లుందురు దైత్యుల్
పెక్కురు కావలియుంచును
దక్కక మఱి యెల్లకడలఁదానునుదిరుగున్''[337] అని పలికినట్లు గలదు.

*3-8-9 యుద్ధకాలంలో దుర్గరక్షణ :*

యుద్ధకాలంలో దుర్గాన్ని మరింత అప్రమత్తంగా నిర్వహిస్తారని రామాయణం నిరూపిస్తున్నది. వానరులు లంకను ముట్టడించారని విన్న రావణుడు తన దుర్గాన్ని రక్షించటాన్ని రెండింతలు చేశాడు. రావణుడు యుద్ధరంగానికి వస్తున్న సమయంలో రాక్షసులతో

"తతస్సరక్షోధిపతిర్మహాత్మా రక్షాంసి తాన్యాహ మహాబలాని।
ద్వారేషు చర్యాగృహగోపురేషు సు నిర్వ్రతాస్తిష్ఠత నిర్విశంకాః'॥[338]

పురద్వారాలయందును, భటులు నివసించడానికై కట్టబడ్డ చర్యా గృహాలలో మిక్కిలి సుఖులై ఉండండి. అనడం ద్వారా ఆ దుర్గమందు చర్యాగృహాలున్నట్లు తెలుస్తున్నది.

'ఇహాగతం మాం సహితం భవద్భి ర్వనౌకస కశ్చిద్రమిదం విదిత్వా।
శూన్యాం పురీందుప్ర్ప సహాం ప్రమథ్య ప్రధర్షయేయు స్సహసాసమేతాః॥[339]

మీ అందరితోను నేను పురాన్ని వీడి ఇచ్చుటకు వచ్చుటచే ఈ సమయం చూచి మనమెవ్వరంలేక శూన్యంగా ఉన్నదగుటచే గెలవరాని మన నగరాన్ని అందరు వచ్చి ధ్వంసం చేస్తారు. అని రాక్షసులను దుర్గరక్షణానికి పంపుట ద్వారా యుద్ధకాలంలో దుర్గరక్షణ అతిముఖ్యమని తెలుస్తున్నది.

*3-9-0 రామాయణం - సప్తాంగాల పరస్పరసంబంధం :*

రాజ్యం ఒక సజీవమైన వ్యవస్థ, రాజ్యం యొక్క వివిధాంగాలు పరస్పరం ఆధారపడియుండాలి. ప్రతి అంగం తనవిధులను సక్రమంగా నెరవేర్చడానికి పరస్పరం సమన్వయంతో వ్యవహరించినప్పుడే రాజ్యం సుభిక్షమవుతుంది. వాటిమధ్య ఐకమత్యానికి రాజే ప్రధాన కారకుడు.

గుహునితో శ్రీరాముడు రాజ్యాన్ని రక్షించకోవడం కష్టమంటాడు అంటూ

'అప్రమత్తో బలే కోశే దుర్గే జనపదే తథా।
భవేథా గుహ రాజ్యం హి దురారక్ష్యతమం మతమ్.॥[340]

గుహుడా చతురంగబలము, ధనాగారము, దుర్గము, దేశము, వీని విషయంలో మిక్కిలి జాగరూకుడవు కమ్ము అనడాన్ని బట్టి వీటిపై రాజు అమితంగా దృష్టిని సారించవలెనని తెలుస్తున్నది. శ్రీరాముడు భరతుని రాజ్యపాలన విశేషాలను గురించి స్వపక్షమందలి 15 తీర్థాలయొక్కయు, శత్రుపక్షమునందలి 18 తీర్థాలయొక్కయు రహస్య ప్రయత్నములను చారులద్వారా తెలిసికొనుచున్నావా! అని ప్రశ్నించుటనుబట్టి

మొదటి మంత్రియగుటయు, సేనాపతియు వారిలో ఒకడగుటయు రాజ్యాంగం పై పర్యవేక్షణాన్ని సూచిస్తున్నది. రాజ్యం మనుగడకు వివిధరాజ్యాంగాలు, అధికారులు, భృత్యులు, పౌరజానపదులందలి సమిష్టి సమన్వయ తోడ్పాటు ఎంతైనా అవసరం. రాజుయొక్క శక్తికి కోశాగారం సైన్యం మూలమైనది. ఆర్థిక ఇబ్బందులు సైన్యంమీద దుష్ప్రభావాన్ని చూపుతాయి. తద్వారా రాజ్యమనుగడకే ముప్పు వాటిల్లే ప్రమాదముంది. రాజ్యం తనకున్న లక్ష్యాలను సాధించడం కోసం సామ భేద దాన దండోపాయములను ప్రయోగిస్తుంది. ఆవిధంగాజేయడాన్ని విధానమంటారు. రాజ్యాంగవిధానాన్ని పరిపుష్టిని చెందించాలనుకుంటే ప్రతిరాజ్యాంగం మరొక రాజ్యాంగానికి సహకారాన్ని అందించవలయును. ప్రతిరాజ్యాంగం సక్రమంగా పనిచేయుడానికి, మిగతా రాజ్యాంగాలన్నీ సక్రమంగా పనిచేస్తూ తోడ్పాటునందించుట తప్పనిసరి.

### *3-9-1 రాజ్యం - దండనీతి:*

రాజ్యం అంటే కేవలం పౌరజానపదులు నివసించే ప్రాంతానికే పరిమితంగాదు. రామాయణం రాజ్యం యొక్క విస్తృత స్వరూపాన్ని సూచించింది.[341] రాజ్యపరిధిలోనున్న కొండలు,వనాలు, అరణ్యాలయందలి సమస్త మృగాలును, పక్షులను, మనుష్యులను నిగ్రహించుట, అనుగ్రహించుట. రాజు యొక్క ప్రధానవిధులుగా పేర్కొనబడుట గమనింపదగింది.విశాలమైన రాజ్యంలో ధర్మవృద్ధిని ఆకాంక్షించు రాజు లేదా అతని ప్రతినిధులు శిష్టరక్షణాన్ని దుష్టశిక్షణాన్ని నిర్వర్తించడం రాజు వీధి. నీతి, వినయం, సత్యం, శాస్త్రవిహితమగు పరాక్రమం గల రాజు అధర్మపరులను ఉపేక్షింపడు. దోషి ఎక్కడ ఉన్నా శిక్షింపబడతాడు. పాపిష్టుని శిక్షింపక విడిచిపెట్టిన కారణాన ఆ పాపం దొంగనువీడి రాజుకు సంక్రమిస్తుందని మనువు పేర్కొన్నాడు. రామాయణంలో ఈ విషయాన్ని ప్రస్తావించడంచేత ఆనాటి దండన వ్యవస్థ సూచిస్తున్నది.

'రాజ నిర్ధూతదండాస్తు కృత్వా పాపాని మానవాః।
నిర్మలాః స్వర్గమాయాంతి సంతస్సుకృతినో యథా॥
శాసనాద్వా విమోక్షాద్వా స్తేనః స్తేయాద్విమోచ్యతే,।
అశాసిత్వాతు తం రాజస్తేనస్యాప్నోతి కిల్బిషమ్॥[342]

రామాయణంలో పై శ్లోకాలకు అనుగుణంగా రాజు దండనీతిని ప్రయోగించాలని సూచింపబడింది. లోకకంటకులను శిక్షించుటకు తాటకి, వాలి, రావణవధలు తదనుగుణంగానే నిర్వర్తింపబడినవని తెలుస్తున్నది. శ్రీరాముని పూర్వీకుడైన మాంధాత

కూడా శ్రవణకుడొనరించిన పాపానికి ఈ రీతిలోనే ఘోరదండనం విధించెను.[343] తక్కిన ఇక్ష్వాకు రాజులును దండనీతినుపయోగించిరి.

"అన్యైరపి కృతం పాపం ప్రమత్తైర్వసుధాధిపైః।
ప్రాయశ్చిత్తం చ కుర్వంతి తేన తచ్ఛామ్యతే రజః"॥[344]

రాజులు రాచకార్యాలయందు ఏమరి ఉన్నప్పుడు ఇతరులు కూడా అనేకులు పాపాలు చేసియున్నారు. అపుడు రాజులు ఏమరుపాటువీడి రాచకార్యాలను నిర్వహించుపట్టున ఆ పాపులకు దండన విధింతురు. ఆదండంచే వారి పాపం శమిస్తుందని చెప్పబడింది. విస్తృతమైన పాలనాధికారాలకు కేంద్రశక్తియైన రాజు వివిధాంగాలకు అధికారులకు, భృత్యులకు, ప్రజలకు పరిరక్షకుడు మాత్రమే గాక తిరుగులేని దండనాధి కారాన్ని కలిగిన అధికారి. తన మిత్రబలాన్ని పెంచుకొనే కృషిలో మిత్రులకు రాజు ఉపకారం చేస్తాడు. తనకున్న తిరుగులేని అధికారాన్ని దుర్వినియోగం చేయక సజ్జనహితంగా ప్రయోగిస్తాడు. అధర్మానికి పాల్పడిన క్రూరుడగు శత్రువును అంతమొందించడంలో రాజు సర్వశక్తుల్ని సమీకరించి, ఏకీకృతం చేసి పోరాడుతారు. తద్వారా రాజ్యానికి గల దండనీతిని అతడు చాటిచెపుతాడు. రాజు రాజ్యహితం కోసం అవసరమైతే అధికారులను శిక్షిస్తాడు. సైన్యావసరములను తీరుస్తాడు. దూతలను, చారులను, తగినవిధంగా నియమించుకుంటాడు. వారు ఏవిధంగా పనిచేస్తున్నారో గమనిస్తాడు. దుర్లభమైన ధర్మాన్ని, జీవనాన్ని, శుభాన్ని ప్రజలకు కల్గించటానికే రాజు దండనీతిని ఉపయోగించునని రామాయణం పేర్కొన్నది.[345]

### *3-9-2 రాజ్యం - విధులు ; ధ్యేయములు :*

రాజు యొక్క మొదటి కర్తవ్యం ప్రజలను రక్షించడం. ప్రజలను రక్షించడం అనే ప్రధాన విధిలో రాజ్యం యొక్క అనేక విధులు నిక్షిప్తమైయున్నవి. విస్తృతమైన రాజ్యానికి ప్రధమాంగమైన 'రాజు' రాజ్యమనే అర్థంలో వాడబడేటంత బలీయమైన శక్తి రాజు, మంత్రి, ఇతర రాజ్యాంగాలు, సమన్వయంతో పనిచేసి ప్రజలకు ఉత్తమ పాలనా పద్ధతులను అందించడం రాజ్యం యొక్క ప్రధానవిధి. సర్వోన్నతుడగు రాజు ప్రజాభిప్రాయాన్ని గౌరవిస్తూ రాజ్యం సర్వతోముఖ వికాసం పొందడానికి ప్రయత్నించాలి. ప్రజానురాగము లేని యెడల రాజ్యం నశిస్తుంది.[346] కాబట్టి రాజు ప్రజానురాగానికి ప్రయత్నించవలెను. తీవ్రమగు దండాన్ని విధించి ప్రజలను పీడించరాదు.[347] దేవ,

పితృ , ఋషి , ఋణములు మూడింటిని తీర్చుకొనుచు శత్రువును లెస్సగా నిర్జించి మిత్రులకోర్కెలు తీర్చి రాజు పరిపాలన చేయవలె. ధర్మార్థ కామములకు తగువిధంగా సమయం కేటాయించి పరిపాలన కొనసాగించాలి. రాజ్యం సమగ్రమైంది. రాజ్యాంగాల సమిష్టి సమన్వయ కృషితో ప్రజల తోడ్పాటుతో పరిపాలన కొనసాగవలె. ప్రభుత్వములు మారిపోవచ్చు. కానీ 'రాజ్యం' శాశ్వతమైంది.

ఇక్ష్వాకు వంశంలో ఇక్ష్వాకువు అయోధ్యకు మొదటిరాజు. ఆ తర్వాత అనేకమంది రాజులుద్భవించి రాజ్యపాలనం చేశారు. వీరంతా రాజ్యసంక్షేమానికి కృషి చేశారు.

ఋక్షరజస్సునకు తండ్రియగు బ్రహ్మదేవునిచే వానర రాజ్యమీయబడినది. అపారమగు వానరజాతికి, ఋక్షరజుడు అనే రాజు ఉండేవాడు. అతని కుమారులే బలవంతులగు వాలి, సుగ్రీవులు. వానిలో పెద్దవాడగు వాలి రాజుగా కిష్కింధా రాజ్యాన్ని పాలించుచుండగా మాయావితో వాలి పోరు సాగిస్తున్నప్పుడు అతడు మరణించెనేమో అనుకొని మంత్రులందఱు ఆలోచించి వానరరాజ్యానికి వాలి తమ్ముడగు సుగ్రీవుని పట్టాభిషిక్తుని చేయడంలోను రాజ్యం అరాజకం కాకూడదనే ప్రధానాంశం.

దశరథుడు పెక్కు సంవత్సరములు పాలనచేసి వృద్ధుడైనందున శ్రీరామునికి యౌవరాజ్య పట్టాభిషేకం చేయాలనుకోవడం వెనుక రాజ్యానికి నాయకత్వలోపం కలుగకూడదన్నదే ముఖ్యోద్దేశం. తీర్థులలో ఒకడైన యువరాజు కూడా పాలనాపరంగా ముఖ్యుడే. యువరాజే భావిరాజు కూడా, రాజు యొక్క జ్యేష్ఠపుత్రునికి పట్టం కట్టడమే ధర్మం. అయితే కొన్ని ప్రత్యేక పరిస్థితులలో జ్యేష్ఠపుత్రునికి కాకుండా తరువాత పుత్రునికి పట్టం కట్టడం లేకపోలేదు. ఇదంతారాజు ప్రజాభీష్టానుసారం జరిగేటట్లు చూస్తాడు. రాజ్యసంక్షేమం దృష్ట్యా ఈ నియామకం జరిగేది రాజ్యం నిర్వహించే కార్యక్రమాలుధర్మంపై ఆధారపడాలని రామాయణం భావించింది.

యథాదృష్టి శ్శరీరస్య నిత్యమేవ ప్రవర్తతే।
తథా నరేంద్రో రాష్ట్రస్య ప్రభవ స్సత్యధర్మయోః'॥[348]

శరీరానికి కన్ను ఎటుల హితాన్ని గురూస్తూ కీడు తొలగిస్తుందో అట్లే రాజు దేశంలో సత్యాన్ని ధర్మాన్ని ప్రవర్తింపజేస్తాడు.

'రాజా సత్యం చ ధర్మశ్చ రాజా కులవతాం కులమ్।
రాజా మాతా పితా చైవ రాజా హితకరో నృణామ్॥[349]

రాజే సత్యము, ధర్మము, రాజే కులీనులను తమ కులాచారాలను ప్రవర్తింప జేయును. రాజే ప్రజలకు తల్లియు, తండ్రియు. రాజే ప్రజలకు హితం కూర్చువాడు. కాబట్టి, రాజ్యాన్ని రక్షించేవాడు రాజని రామాయణం పేర్కొన్నది.

### 3-9-3 రాజ్యం యొక్క ధ్యేయం:

రాజ్యం నిరంతరం ప్రజల సుఖ సంతోషాలకై పాటు పడుతుంది. అయోధ్య నిర్మాతయగు మనువు నుంచి క్రమానుగతంగా ప్రవర్తిల్లిన రాజ్యానికి మొదటి రాజు ఇక్ష్వాకువు. ఆతరువాత కాలంలో వచ్చిన రాజులందఱు ధర్మార్థ కామ మోక్షములను చతుర్విధపురుషార్థాల సాధనకై ప్రయత్నించారు.రాజ్యానికి సంబంధించిన ఈ పురుషార్థాల సాధనలో రాజే ప్రధాన పాత్రను పోషిస్తాడు[350] మొదటి మూడింటిని రాజు వేర్వేరుగా ఒక దానిని పిమ్మట మరొకటి చొప్పున రాజు సేవించవలెను.

**(1)** ధర్మం : పూర్వోక్తమగు నీతిని ధర్మాన్ని యుక్తాయుక్తాలను ఎఱిగి దండించేరాజు పూర్వరాజులవలె ధర్మంగా భూమిని పాలించాలి. అర్థంచే ధర్మాన్నిగాని, ధర్మంచే అర్థాన్నిగాని బాధింపరాదు.[351] దోషులను దండించుట యనునది ఒకానొక రాజధర్మం. రాజు ధర్మాన్ని తప్పిన యెడల రాజ్యమున అనావృష్టి మున్నగు విపత్తులు గలుగును. రాజోత్తములకు నయము, అనుగ్రహములు, ధర్మాలు విహితకృత్యాన్ని ఆచరించడమే ధర్మం. అను మనువచనమునకనుగుణంగా రాజు ప్రజలకు సుఖ సంతోషాల్ని కలిగించడమనే రాజ్యం యొక్క ధ్యేయానికి అనుగుణంగా పనిచేయాలి. ధర్మ సంరక్షణకొఱకే రాజు శరచాపములు దాల్చవలెను. రాజ్యంయొక్క ప్రధాన ధ్యేయములలో ధర్మరక్షణ ఒకటి.

**(2)** అర్థము : రామాయణంలో అర్థమునకు ఒక వస్తువును కోరేవాడు వస్తువు శ్రేష్టతను మురిసి పౌర్వాపర్యములాలోచింపక దానిని సాధించడానికి వెడలడమనే నిర్వచనం చేయబడింది[352].రాజ్యంయొక్క ధ్యేయాల్లో సరియైన అర్థపాలన మొకటి. అర్థం ధర్మంచేతగాని, ధర్మం అర్థంచేతగాని బాధింపబడదు.[353]

**(3)** కామము : ధర్మనిష్టుడైన రాజు పరవనితను స్పృశించడు.[354] రాజు విహితమైన పద్ధతిలో కామమందు ప్రవర్తించాలి. రాజు భోగలాలసుడై రాజ్యాన్ని చెప్పుచేతల్లో ఉంచుకొన్నయెడల అతనిరాజ్యం నశిస్తుంది. అట్టి మంత్రులు రాజుకు కర్తవ్యాన్ని తెల్పాలి.

**(4)** మోక్షం : రాజ్యంయొక్క తుదిలక్ష్యం మోక్షమే. రామాయణంలో రాజే ధర్మానికి, అర్థానికి, కామానికి కూడా ప్రవర్తకుడైనాడని స్పష్టపరిచింది.[355] రాజ్యం యొక్క ధ్యేయాలను నెరవేర్చగలరాజు చతుర్విధ పురుషార్థములను చక్కగా సేవిస్తే ఆరాజ్యం అభివృద్ధి చెందగలదు. రామాయణం ఇట్టి పురుషార్థాలనే సాధించింది.

## పాదసూచికలు

1.రామా.బాల.70-17,18శ్లో॥ 2.అయోధ్య.3-7శ్లో॥ 3.రామా.అయోధ్య.110-3శ్లో॥ 4.రామా.అయోధ్య.110-3శ్లో॥5.రామా.బాల.110-4శ్లో॥6.రామ.బాల.70-41 7.రామా.అయోధ్య.110-35శ్లో॥ 8.రంగ.రామా.అయోధ్య.95-96 పుటలు 9.యుద్ధ.130-54,55 10.రంగ.బాల.పుట-11 11.శుక్రనీతిసారం.1-62,63శ్లో॥ 12.అరణ్య.10-9 శ్లో॥ 13.మను.7అధ్యా.3,4శ్లో॥ 14.బాల.70,17-40శ్లో॥ 15.అయోధ్య.110. 16.రంగనాథ.రామా.పుట.78. 17.భాస్కర. రామా.బాల-5-699వ 18.వాల్మీకి.రామా.అరణ్య.40-12. 19.రామా.అరణ్య.40-13శ్లో॥ 20.మను.7అధ్యా.31శ్లో॥ 21.అర్థ.6అధ్యా.పుట.315,316. 22.కిష్కింధ.17-17శ్లో॥ 23.కిష్కింధ.17-27శ్లో॥ 24.రంగనాథ.కిష్కింధ.పుట.243 25.భాస్కర.కిష్కింధ - 307 26.మను.7అధ్యా.39శ్లో॥ 27.మను.7అధ్యా.43శ్లో॥ 28.అర్థ.1 అధి.2 అధ్యా.పుట.5 29.అర్థ.1అధి.5 అధ్యా.పుట.11,12 30.భాస్కర.రామా.బాల-172 31.భాస్కర.రామా.బాల-174. 32.రామాభ్యుదయం-3-150-152 33.మొల్ల.రామా.బాల-44. 34.వాల్మీకి.రామా.బాల-18-25,26శ్లో॥ 35.రంగనాథ.రామా.అయోధ్య.పుట 95. 36.వాల్మీకి.రామా.బాల.1-14 శ్లో॥ 37.వాల్మీకి.రామా.బాల.1-15 శ్లో॥ 38.రామా.అయోధ్య 36-18-25శ్లో॥ 39.రామా.అయోధ్య.2-44శ్లో॥. 40.వాల్మీ.రామా.అయోధ్య 2-50 41.రంగ.రామా.అయోధ్య.పుట-96. 42.భాస్కర.రామా.అయోధ్య-5-పద్యం. 43.రామాభ్యు.4-177ప. 44.రామా.అయోధ్య.2.9-16. 45.రామా.కిష్కిం.9-20శ్లో॥ 46.రామా.కిష్కిం.26-10శ్లో॥ 47.రామా.యుద్ధ.115-9,10. 48.రామా.కిష్కింధ.26-12శ్లో॥ 49.రామా.అయోధ్య.67-8,38శ్లో॥ 50.అయోధ్య.67-2,8 51.అయోధ్య.67.10శ్లో. 52.అయోధ్య-67-28 శ్లో. 53.అయోధ్య.67-36 శ్లో॥ 54.రంగనాథ.అయోధ్య.పుట-144 55.కిష్కింధ.10-10శ్లో॥ 56.అయోధ్య.70-10శ్లో॥ 57.అయోధ్య.82-117. 58.రంగ.రామా.అయోధ్య.పుట-148. 59. భాస్కర.రామా.అయోధ్య.238 పుట.60.రామాభ్యు.5ఆశ్వా.90 పద్యం. 61.అయోధ్య.81-6శ్లో॥ 62.బాల-1-20 63.అయోధ్య67-38శ్లో॥ 64.కిష్కింధ.26-23,35శ్లో॥ 65.రంగ.రా.కిష్కింధ.పుట.250. 66.భాస్కర.రామా.కిష్కింధ 371వ 67.రామా.కిష్కింధ.26-36శ్లో॥ 68.రంగ.రా.కిష్కింధ.250 పుట. 69.రామాభ్యు-5-320 వచనం 70. భాస్క.కిష్కింధ-371 వ 71.రామా.యుద్ధ.19-24,25శ్లో॥ 72.రంగ.రామా.యుద్ధ.పుట 354 73.భాస్కర.రామా.యుద్ధ.190 పద్యం. 74.భాస్కర.రామా.యుద్ధ-191 పద్యం 75.భాస్కర.రామా.యుద్ధ 192 పద్యం 76.మొల్ల.యుద్ధ.13పద్యం 77.రామా.యుద్ధ.115-10శ్లో॥ 78.రంగ.రామా.యుద్ధ.పుట620 79.భాస్కర.రామా.యుద్ధ.2270,2271 పద్యం 80.మొల్ల.యుద్ధ.111 81.రామాభ్యు 8.235 పద్యం. 82.వాల్మీకం.అరణ్య.40-14శ్లో॥ 83.కవిత్రయభారతం.రాజనీతి.పుట73 84.అయోధ్య.100.9-75 85.రంగనాథ.రామా.అయోధ్య పుట.155 86.వాల్మీకి.రామా.అరణ్య.33-17శ్లో॥ 87.వాల్మీ.రామా.అరణ్య.33-18శ్లో॥ 88.వాల్మీ.రామా.అరణ్య.33-19 89.మను.7అధ్యా-141శ్లో॥ 90.అర్థ.1.అధి.8 అధ్యా.పుట.18 91.మను.7అధ్యా.54శ్లో॥ 92.వాల్మీ.రామా.బాల.7-2శ్లో॥ 93.వాల్మీకి.రామా.బాల.67-3శ్లో॥ 94.వాల్మీకి.రామా.బాల.67-23శ్లో॥ 95.వాల్మీ.బాల.9-14శ్లో॥

96.రంగనాథ.బాల.పుట.12. 97.భాస్క.రామా.బాల.57 98. కిష్కింధ.2-4-8శ్లో॥ 99.యుద్ధ.63.7 100.యుద్ధ 6-7 101.యుద్ధ 6-5 శ్లో॥ 102.యుద్ధ.6-11శ్లో॥ 103.యుద్ధ 6-18 శ్లో 104.రంగనాథ.రామా.యుద్ధ.పుట-332. 105.భాస్కర.యుద్ధ.51.52 ప॥ 106.బాల.8, 5-21. 107.రంగనాథ.రామా.యుద్ధ.369పుట 108.రంగనాథ.రామా.యుద్ధ. 433పుట. 108a. బాల.7-3 శ్లో॥ 109.బాల 7-4 శ్లో॥ 110.అరణ్య.40-9శ్లో॥ 111.రంగనాథ.రామా.యుద్ధ.368పుట. 112.యుద్ధ-63-17 శ్లో॥ 113.యుద్ధ.63-20 శ్లో॥ 113a. అయోధ్య.14-43శ్లో॥ 113b. అయోధ్య.35.5-36శ్లో॥ 114.వాల్మీ.రామా.అయోధ్య.57-29 శ్లో॥ 115. వాల్మీ.రామా.అయోధ్య.52-22శ్లో॥ 116.రంగనాథ.అయోధ్య-136పుట. 117.యుద్ధ.6-19 శ్లో॥ 118.యుద్ధ.12-32॥ 119.వాల్మీకి. యుద్ధ.12-34శ్లో॥ 119.వాల్మీకి.యుద్ధ.12-34శ్లో॥ 120.వాల్మీ.రామా.యుద్ధ.25-33శ్లో॥ 121.వాల్మీ.రామా.యుద్ధ.35-15 శ్లో॥ 122.వాల్మీ.రామా.యుద్ధ.35-16 శ్లో॥ 123.యుద్ధ.93-63శ్లో॥ 124.వాల్మీ.రామా.బాల.7-13. 125.వాల్మీ.రామా.బాల.8.8శ్లో॥ 125a.అయోధ్య.68-5,6శ్లో॥ 126.యుద్ధ.131.62శ్లో॥ 127.వాల్మీకి.రామా.బాల.68-4,5శ్లో॥ 128.వాల్మీ.రామా.బాల.68-12శ్లో॥ 129.వాల్మీ.రామా.కిష్కింధ 4-7శ్లో॥ 129a.రామా.యుద్ధ.8-15.24శ్లో॥ 130.ఋగ్వే.10-19 131.మను.7-అధ్యా.69శ్లో॥ 132.కవిత్రయభారతం.రాజనీతి.పుట.39 133.వాల్మీకి. రామా.బాల.10-28శ్లో॥ 134.రంగనాథ.రామా.బాలపుట11 135.భాస్కర.రామా.బాల.58ప॥ 136.రంగనాథ.అయోధ్య.పుట-144 137.వాల్మీ.బాల.7-13శ్లో॥ 138.రంగనాథ.బాల.పుట.11 139.వాల్మీ.బాల.5-5శ్లో॥ 140.భాస్కర.రామా.బాల.24ప॥ 141.వాల్మీ.అయోధ్య.52-72శ్లో॥ 142.రంగనాథ.రామా.అయోధ్య.144పుట. 143.వాల్మీ.రామా.అయోధ్య 76-9శ్లో॥ 144.రంగనాథ. రామా.అయోధ్య.పుట.148. 145.వాల్మీకం.అయోధ్య 6-7,8-9,28-31శ్లో॥ 146.భాస్కర.అయోధ్య 238ప॥ 147.మొల్ల.రామా.అయోధ్య.2ప॥ 148.మొల్ల.రామా.అయోధ్య.38ప॥ 149.వాల్మీ.రా.అరణ్య.37-7శ్లో॥ 150.భాస్కర.రా.అరణ్య19ప॥ 151.వాల్మీ.కిష్కింధ.10-8శ్లో॥ 152.బాల.5-9శ్లో॥ 153.అయోధ్య. 50-8,10శ్లో॥ 154.రామాభ్యు.5-24ప॥ 155.వాల్మీ.రా.కిష్కింధ 9-2,3శ్లో॥ 156.కవిత్రయభారతం. రాజనీతి.పుట.40. 157.మను.7-అధ్యాయం65శ్లో॥ 158.అర్థ.6 అధి.1అధ్యా.పుట.317. 159.అర్థ3అధి.1అధ్యా.పుట.397. 160.రామా.అయోధ్య.36-7శ్లో॥ 161.రామా.అయోధ్య.36-12శ్లో॥ 162.రామా.బాల.7-9శ్లో॥ 163.రామా.బాల.7-11శ్లో॥ 164.వాల్మీ.రా.అయోధ్య.70-19శ్లో॥ 165.వాల్మీ.రా.అయోధ్య.70-20శ్లో॥ 166.వాల్మీ.రా.అయోధ్య.36-7శ్లో॥ 167.వాల్మీ.రా.అయోధ్య. 50-8శ్లో॥ 168.రామా.అయో.39-14శ్లో॥ 169.రామా.అయో.39-16,17శ్లో॥ 170.రామా.బాల.69-2శ్లో॥ 171.కవిత్రయభారతం-రాజనీతి-163పుట 172.వాల్మీ.రా.అయో.75-25శ్లో॥ 173.వాల్మీ.రా.అయో. 75-28శ్లో॥ 174.రంగ.రామా.అయోధ్య.పుట.145. 175.వాల్మీ.రామా.అరణ్య.43-31శ్లో॥ 176.వాల్మీ.రామా.యుద్ధ83-32శ్లో॥ 177.వాల్మీ.రామా.అరణ్య.43-34శ్లో॥ 177a.రంగనాథ.అయోధ్య. పుట.145 178.వాల్మీ.రామా.అయోధ్య.100-54శ్లో॥ 179.వాల్మీ.బాల.7-9శ్లో॥ 180.వాల్మీ.రామా.బాల. 7-11శ్లో॥ 181.వాల్మీ.రామా.అయోధ్య.75-25శ్లో॥ 182.వాల్మీ.రామా.కిష్కింధ 26-23శ్లో॥ 183.వాల్మీ.రామా.కిష్కింధ 29-11శ్లో॥ 184.వాల్మీ.రామా.సుంద.3-18శ్లో॥ 185.వాల్మీ.రామా.యుద్ధ.

65-7శ్లో॥ 186.ఋగ్వేదం.10-84-2 187.అర్థ.8.అధి.5అధ్యా.పుట.414 188.మను.7అధ్యా.189శ్లో॥
189.వాల్మీ.రా.యుద్ధ.96-23శ్లో॥ 189a.వాల్మీ.రా.యుద్ధ.48-4శ్లో॥ 189b.వాల్మీ.రా.యుద్ధ.57-16శ్లో॥
190.వాల్మీ.రా.యుద్ధ.12-3శ్లో॥ 191.వాల్మీ.రా.యుద్ధ.12-45శ్లో॥ 192.వాల్మీ.రా.యుద్ధ.58-56శ్లో॥
193.అర్థ.2.అధి.33.పుట.170 194.వాల్మీ.అయోధ్య.100-30శ్లో॥ 195.రంగ.రామా.అయోధ్య.పుట.155
196.వాల్మీ.రా.అయోధ్య.100-31శ్లో॥ 197.వాల్మీ.రా.అయోధ్య.100-32శ్లో॥ 198.రంగ.రామా.అయోధ్య.
199.వాల్మీ.రామా.అయోధ్య.92.5 200.వాల్మీ.రామా.యుద్ధ.94-31శ్లో॥ 201.వాల్మీ.రామా.యుద్ధ.
పుట313. 202.రంగ.రామా.యుద్ధ.546పుట. 203.భాస్క.రామా.యుద్ధ1456వద్యం
204.మొల్ల.రామా.సుంద.21ప॥ 205.రంగ.రామా.అయోధ్య.పుట.155 206.వాల్మీ.రామా.అయోధ్య.
22-19శ్లో॥ 207.వాల్మీ.రామా.అయోధ్య 113-20శ్లో॥ 208.వాల్మీ.రామా.యుద్ధ.111-12శ్లో॥
209.వాల్మీ.రామా.అయో.82-26శ్లో॥ 210.భాస్క.రామా.542వ,797వచనము 211.వాల్మీ.రామా.యుద్ధ.
95-3 శ్లో॥ 212.వాల్మీ.యుద్ధ.102-10,11శ్లో॥ 213.రంగ.రామా.యుద్ధ-పుట.598.
214.భాస్క.రా.యుద్ధ.2014ప॥ 215.మొల్ల.యుద్ధ.57ప॥ 216.వాల్మీ.రా.యుద్ధ.120-27,30.
217.వాల్మీ.రా.యుద్ధ.104-18-20. 218.వాల్మీ.రామా.యుద్ధ.108-9,10శ్లో॥ 219.వాల్మీ.రామా.యుద్ధ.
102-5శ్లో॥ 220.వాల్మీ.రా.బాల.6-22శ్లో॥ 221.వాల్మీ.రా.అయోధ్య.83-5శ్లో॥ 222.వాల్మీ.యుద్ధ.
3-27శ్లో॥ 223.వాల్మీ.రా.యుద్ధ.94-32శ్లో॥, రంగ.రామా.యుద్ధ.546పుట, భాస్క.రా.యుద్ధ.1457,
రామాభ్యు.8-193ప॥ 224.వాల్మీ.రా.బాల.6-23,24శ్లో॥ 225.వాల్మీ.రా.యుద్ధ.3-10శ్లో॥
226.వాల్మీ.రా.యుద్ధ 94-31శ్లో॥రంగ,రా.యుద్ధ-546పుట,భాస్కర.యుద్ధ.1457వచ,రామాభ్యు.8.193
227.రంగనాధ.రా.అయోధ్య.పుట.149 228.రంగ.రా.యుద్ధ.546పుట,భాస్క.రా.యుద్ధ.1457వచనం
229.రామాభ్యు.8-193ప॥ 230.వాల్మీ.రా.యుద్ధ94-2,3శ్లో॥ 231.రంగనాధ.రా.యుద్ధ.పుట.541
232.రంగనాధ.రా.యుద్ధ.పుట.547 233.భాస్కర.రా.యుద్ధ-1420ప॥ 234.భాస్కర.రా.యుద్ధ.1421ప॥
235. భాస్క.రా.యుద్ధ-1444ప॥ 236.భాస్క.రా.యుద్ధ.1457ప॥ 237.మొల్ల.రా.యుద్ధ.2-40ప॥
238.రామాభ్యు.8.193ప॥ 239.రామాభ్యు.8-193 240.వాల్మీ.రా.యుద్ధ.43-42శ్లో॥
241.వాల్మీ.రా.యుద్ధ.44-23శ్లో॥ 242.వాల్మీ.రా.యుద్ధ.118-15శ్లో॥ 243.వాల్మీ.రా.అయోధ్య.
9-11-15శ్లో॥ 244.వాల్మీ.రా.అయోధ్య.66-23శ్లో॥ 245.మను.7అధ్యా.195,196శ్లో॥
246.వాల్మీ.రా.యుద్ధ.4-11శ్లో॥ 247.వాల్మీ.రా.యుద్ధ.4-13శ్లో॥ 248.వాల్మీ.రా.బాల.69-3శ్లో॥
249.వాల్మీ.రా.అయోధ్య.82-26శ్లో॥ 250.వాల్మీ.రా.అయోధ్య.91-7శ్లో॥ 251.వాల్మీ.రా.అయోధ్య.
22-19శ్లో॥ 252.వాల్మీ.రా.అయోధ్య.113-20శ్లో॥ 253.వాల్మీ.రా.కిష్కింధ.40-5శ్లో॥
254.వాల్మీ.రా.అరణ్య.22-8,10శ్లో॥ 255.వాల్మీ.రా.యుద్ధ.3-24,27శ్లో॥ 256.వాల్మీ.రా.కిష్కింధ.
257.వాల్మీ.రా.కిష్కింధ.7-18శ్లో॥ 29-11శ్లో॥ 258.రంగ.రా.కిష్కింధ.234పుట.
259.భాస్క.రా.కిష్కింధ-74ప॥ 260.రామా.5-287ప॥ 261.వాల్మీ.రా.అరణ్య.72-13,14శ్లో॥
262.రంగ.రా.అరణ్య.పుట.221. 263.భాస్క.రా.అరణ్య407 264.భాస్క.రా.అరణ్య 408వ
265.మొల్ల.రా.అరణ్య.73ప॥ 266.రామా.5-253వ॥ 266a.వాల్మీ.రా.కిష్కింధ 3-20,21,22శ్లో॥
267.రంగ.రా.కిష్కింధ-230పు. 267a.భాస్కర.రా. కిష్కింధ.42ప॥ 268.మొల్ల.రా.కిష్కింధ.4ప॥

268a.రామా.5-273ప॥ 269.వాల్మీ.రా.కిష్కింధ.5-12శ్లో॥ 270.వాల్మీ.రా.కిష్కింధ.5-13శ్లో॥ 271.Ibid-5-15శ్లో॥ 272.రంగ.రా.కిష్కింధ232పేజి. 273.భాస్క.రా.కిష్కింధ.45,46ప॥ 274.రామాభ్యు.5-274,275 275.వాల్మీ.రా.కిష్కింధ.7-16,17శ్లో॥ 276.రంగ.రా.కిష్కింధ.233పుట. 277.భాస్క.రా.కిష్కింధ.71ప॥ 278.రామాభ్యు.5-235ప॥ 279.వాల్మీ.రా.కిష్కింధ-8-8శ్లో॥ 280.వాల్మీ.రా.కిష్కింధ.8-7శ్లో॥ 281.Ibid.8-21శ్లో॥ 282.Ibid-8-9శ్లో॥ 283.వాల్మీ.రా.కిష్కింధ.29-13శ్లో॥ 284.Ibid.కిష్కింధ.29-14శ్లో॥ 285.రంగ.నా.కిష్కింధ- 252,253పు। ।286.భాస్కర.రా.కిష్కింధ-399ప॥ 287.రామా.6-39ప॥ 288.వాల్మీ.రా.బాల.11-16,22శ్లో॥ 289.వాల్మీ.రా.బాల.68-4,6 290.వాల్మీ.రా.అయోధ్య.9-11,15శ్లో॥ 291.వాల్మీ.రా.అరణ్య14-3శ్లో॥, 67-27శ్లో॥ 292. వాల్మీ.రా.అరణ్య14-31,32శో॥ 293.Ibid.68-10-16శ్లో॥ 294.వాల్మీ.రా.అయోధ్య.50-33శ్లో॥ 295.వాల్మీ.రా.కిష్కింధ. 20-8,25శ్లో॥ 296. 296.వాల్మీ.రా. కిష్కింధ-34-7శ్లో॥ 297.భాస్క.రా.కిష్కింధ-47పద్యం. 298.వాల్మీ.రా. కిష్కింధ. 32-7శ్లో॥ 299.Ibid. కిష్కింధ 26-41శ్లో॥ 300.Ibid.కిష్కింధ.31-6శ్లో॥ 301.వాల్మీ.రా.కిష్కింధ.31-7 302.వాల్మీ.రా.కిష్కింధ.33-48 303.వాల్మీ.రా.కిష్కింధ.33-46శ్లో॥ 304.వాల్మీ.రా.యుద్ధ.16-2శ్లో॥ 305.రంగ.రా.యుద్ధ.342పు. 306.భాస్కర.రా.యుద్ధ.137ప॥ 307.వాల్మీ.రా.యు.16-15శ్లో॥ 308.1bid.బాల.68-4,5శ్లో॥ 309.వాల్మీ.రా.అయోధ్య.50-42శ్లో॥ 310.వాల్మీ.రా.అయోధ్య.66-27శ్లో॥ 311.History of Dharma Sastra,P.V.Kane-78పుట. 312.మను-7అ-70శ్లో॥ 313.అర్థ.8అధి. 1అధ్యా. పు.396 314.మను.7అధ్యా.70శ్లో॥ 315.మను-7అధ్యా.71,72,73శ్లో॥ 316.మను.7అధ్యా-75శ్లో॥ 317.Ibid/-7-76శ్లో॥ 318.మను.పుట-314(ధర్మశాస్త్రం - సవ్యాఖ్యానము) ఆంధ్రాతాత్పర్యసహితం 319.Ibid-314. 320.వాల్మీ.రా.బాల.5-13శ్లో॥ 321.భాస్కర.రా.బాల.24,25శ్లో॥ 322.మొల్ల.రా.బాల-1ప॥. 323.రామా.1-4ప॥ 324.రంగ.రా.అయోధ్య.145పుట. 325.వాల్మీ.రా. కిష్కింధ.31-26శ్లో॥ 326.రామా.6అ-42వచ॥ 327.వాల్మీ.రా.కిష్కింధ.31-27శ్లో॥ 328.వాల్మీ.రా.సుందర.2-8శ్లో॥ 329.భాస్క.రామా.సుందర.63ప॥ 330.రామా.6అ.104ప॥ 331.వాల్మీ.రామా.యుద్ధ.3-14శ్లో॥ 332.వాల్మీ.Ibid.3-20శ్లో॥ 333.వాల్మీ.రామా.యుద్ధ.3-29శ్లో॥ 334.రంగ.రా.యుద్ధ.325,326పుట 335.Ibid.326పుట. 336.భాస్కర.రామా.యుద్ధ.15పశ్లో॥ 337.మొల్ల.యుద్ధ1.34ప॥ 338.వాల్మీ.రా.యుద్ధ.59-33శ్లో॥ 339.వాల్మీ.రా.యుద్ధ.59-34 340.వాల్మీ.రా.అయోధ్య.52-72శ్లో॥ 341.వాల్మీ.రా.కిష్కింధ-18.6శ్లో॥ 342.మను.8అధ్యా.30శ్లో॥ 343.వాల్మీ.రామా.కిష్కింధ.18-34శ్లో॥ 344.వాల్మీ.రా.కిష్కింధ.18-34శ్లో॥ 345.Ibid.18-42శ్లో॥ 346.వాల్మీ.రా.అయోధ్య.100-6శ్లో॥ 347.వాల్మీ.Ibid.అయోధ్య.100-27శ్లో॥ 348.వాల్మీ.రామా. అయోధ్య.67-33శ్లో॥ 349.Ibid.అయోధ్య.67-34శ్లో॥ 350.వాల్మీ.రా.అరణ్య.50-9శ్లో॥ 351.Ibid.అరణ్య.100. 352.వాల్మీ.రా.అరణ్య.43-33 353.Ibid.100-62 354.Ibid.50-6 355.Ibid.50-9.



# చతుర్థాధ్యాయము

# 4 - 0 రామాయణము - రాజధర్మాచరణము

*4-1 రాచరికము - ధర్మచింతన:*

ప్రాచీన భారతీయ పరిపాలనా వ్యవస్థలో ధర్మము అతిముఖ్యమైనది. ధర్మ శబ్దము విస్తృతార్థమును కలిగియున్నది. ధరించేది, రక్షించేది, ధర్మమన బడుతుంది. రాజధర్మం అంటే రాజుయొక్క నడవడి అతని పుట్టుక, అతనికి తద్వారాలభించు ఫలాన్ని చర్చించడాన్ని రాజధర్మమని మనువు విశదీకరించెను. రాజుయొక్క ఎంపిక, పట్టాభిషేకము, దినచర్యలు, పరిపాలనా ప్రక్రియానిర్వహణ, వర్ణాశ్రమ ధర్మాచరణ, చతుర్విధపురుషార్థసాధన, మంత్రాభి నిర్వహణ, ఉచితజ్ఞత, ప్రజాసంబంధాలనిర్వహణ, వీటన్నిటియందు రాజు ధర్మచింతనము కలిగియుండవలెను. రాచరిక వ్యవస్థలో ధర్మప్రాధాన్యము విశిష్టమైనది.

*4-1-1 రామాయణము - రాజధర్మము :*

రాజవృత్తము, రాజనీతి, దండనీతి, నీతిశాస్త్రమను పదములు రాజధర్మమను అర్థములో రామాయణమున వినియోగింపబడినది. వసిష్ఠుడు అయోధ్యకు వచ్చి శ్రీరాముని సింహాసనమునధిష్ఠింపుమనుచు

'ఏషు తాతా! చరన్ ధర్మం నాతివర్తేస్సతాం గతిమ్'[1]

పరిపాలనా రూపమగు ధర్మమును ఆచరించుచు నీపూర్వుల మార్గమును అతిక్రమింపని వాడవు కమ్ముఅనుట ధర్మరక్షణకు ప్రమాణముగానున్నది.

రామాయణములో ప్రధానముగా 1. సత్యమునుకాపాడుట 2. కామ ప్రవృత్తికల అధర్మపరులను శిక్షించుట 3. ధర్మ వృత్తికై రాజు ప్రతినిధులను పంపుట. 4. శరణాగతరక్షణము. 5. నీతి, వినయము, పరాక్రమములకు దేశకాలములనెరిగి ప్రవర్తించుట. 6. సమస్త ప్రాణులను రక్షించుట. 7.వర్ణాశ్రమధర్మములను కాపాడుట. 8. యోగ్యతననుసరించి రాజు తనజ్యేష్ఠపుత్రునికి రాజ్యాధికారమప్పగించుట. 9. ప్రజలను పుత్రులవలె కాపాడుట. 10. క్షాత్రధర్మ పరిరక్షణ. 11. సంపాదన, వ్యయములందు ఉచితజ్ఞత, 12. ప్రియసంభాషణము 13. త్రివర్గ పురుషార్థ సాధనము. 14. రాజదర్శనము అను రాజధర్మములు ప్రస్తావించబడినవి.

*4-2* సత్యమును కాపాడుట :

రాజు సత్యవాక్పరిపాలకునిగా మెలగవలెనని రామాయణము అనేకసందర్భాలలో స్పష్టపరచినది. శ్రీరాముని వనవాసము నుండి మరల్చుటకు జాబాలి నాస్తిక వాదమును చేసిన సందర్భంలో శ్రీరాముడు సత్యమర్యాద ప్రాధాన్యమును స్పష్టపరచెను. 'మర్యాదలేనివాడగుటచే పాపాచరణము కలవాడును, వేదవిహితముకంటె భిన్నమైన ఆచారములను ప్రతిపాదించినవాడు, సజ్జనులకు మాన్యుడుకాదనుచూ''-

సత్యమేవానృశంసం చ రాజవృత్తం సనాతనమ్।
తస్మాత్సత్యాత్మకం రాజ్యం సత్యే లోకః ప్రతిష్ఠితః॥[1a]

రాజ్యము సత్యప్రధానము అనియు, సత్యము పైననే లోకము సుస్థిరముగా నిలిచిఉన్నదని రాముడు పలికెను. అంతేగాక ఋషులు దేవతలు సత్యము మిగుల గొప్పదని భావించిరి. ఇంకనూ ఈ లోకమున సత్యవాదియే ఉత్కృష్టస్థానమును పొందును.[2] సత్యపరుడొక్కడే లోకమును పాలించునని, సత్యశీలుడొక్కడే వంశమును కాపాడును. సత్యశీలుడు కానివాడు నరకమున పడును. సత్యవంతుడు స్వర్గమున మహత్వము నొందుననియు శ్రీరాముడు జాబాలితో పలికెను. అధర్మముతో కూడినట్టి క్షాత్రధర్మమును విడిచిపెట్టదగినదని స్పష్టపఱచెను.[3]

ఇదే సందర్భమున రంగనాధరామాయణములో

'సత్యమూలంబులు సకలధర్మములు - సత్యంబుకంటె నెంచగధర్మమెద్ది?--
సత్యంబు........ధర్మంబు శమమును దమము - నిత్యభూతి దయయు నీతి విక్రమము
ప్రియవాక్యమును దేవ పితృవిప్రపూజ' - రయమొప్ప స్వర్గ మార్గములంద్రు బుధుల్[4]

ఇదే సందర్భమున భాస్కరరామాయణంలో

"----------- నాయట్టి కొడుకు, దశరథునట్టితండ్రి సత్యంబు పాలింపడేని లోకంబెట్లునడుచు----[5] నని పలికినట్లు గలదు. విశ్వామిత్రునకిచ్చినమాటను నెరవేర్చుమనుచు వశిష్ఠుడు దశరథునితో

'త్రిషు లోకేషు విఖ్యాతో ధర్మాత్మా ఇతి రాఘవ।
స్వధర్మే ప్రతిపద్యస్వ నాధర్మం వోఢుమర్హసి॥[6]

ధార్మికుడవని, ముల్లోకములలో కీర్తికి అతీతుడవని, ఈ ధర్మాన్ని నీవు నిర్వర్తించుచూ అధర్మమును ఆచరింపకుమని దశరథునికి చెప్పుటలో సత్యమర్యాదను కాపాడుకొను ప్రబోధము గలదు.

రంగనాధ రామాయణమున మూలమునకంటె విస్తారముగా సత్యమును వీడినచో ఏర్పడు దుస్థితులు వర్ణింపబడినవి. శ్రీరాముని పంపనని దశరథుడు విశ్వామిత్రునితో పలుకగా విశ్వామిత్రుడు-

'నేను వచ్చినపని యెఱిగింపు మంటి - పూని చేసెదనంటి, బొంకెద విపుడు
క్రతు రక్షకై రాము గడగి వేడుటయు - ధృతిమాలి యీనని తెగి పల్కి నీవు
సూనృతేతర నిన్నుచూడగారాదు - కాన పోయెద" నని కడగిపల్కుటయు
జలనిధులింకె భూచక్రంబుగ్రుంకె - గలగె లోకములు, దిగ్గజములు మలగె
దివిజులు వెఱచిరి, దిశలు గీడ్పడియె - నవశముల్ గా జొచ్చె నఖిలభూతములు.[7]

అని పేర్కొనబడినది. అట్టి సమయమున వశిష్ఠుడు దశరథునితో

"నిచ్చెదనని పల్కియీయమన్న బొలియు- నచ్చుగా జేసిన యఖిలధర్మములు"[8]

ఇదే సందర్భమున భాస్కరరామాయణములో "దశరథుడు పలికి బొంకినను చూడరాదనుచు.

కం॥ అని కౌశికుఁడలుగఁగ మే
దిని గంపించెను, సమస్త దేవతలు భయం
బునఁ బొంది, రపుడు లోకము
మునుకొని బెగడుట వశిష్ఠముని గని నృపుతోన్

ఉ॥ ప్రాకట ధర్మమూర్తి, వతిబంధుర సత్యయశోధనుండ, వి
క్ష్వాకుకుల ప్రసూతుఁడవు సమ్మతి నిచ్చెదనంచు బల్కి, నీ
చాకృతి నీకు బొంకుట యర్హమెదిబొంకిన సర్వధర్మముల్?
వే కడ తేఱి పోవె యురు విశ్రుత కీర్తియు మాసి పోవదే[9]?

అని పలికినట్లు కలదు.

కైకేయి తనరెండు కోరికలను నెరవేర్చుటనుగూర్చి దశరథుని ప్రేరేపించుచూ సత్యమర్యాదను పాటించుమని దశరథుని కోరినది. సత్యమే ఆశ్రయింప దగినదనుచూ

'ఆహుః సత్యం హి పరమం ధర్మం ధర్మవిదో జనాః।
సత్యమాశ్రిత్య చ మయా త్వం చ ధర్మం ప్రచోదితః[10]॥

ధర్మమెఱిగినవారు సత్యము గొప్ప ధర్మమందురు. ఆ సత్యరూపమగు ధర్మమునాశ్రయించియే నేను నిన్నుప్రేరణచేసితిని'అనును.

సముద్రుడు కూడా సత్యమర్యాదను ఆశ్రయించుచూ మంచి సమయాలలో కూడా సరిహద్దుగాగల చెలియలి కట్టను దాటుటలేదు.

'సరితాం తు పతిః స్వల్పాం మర్యాదాం సత్యమన్వితః।
సత్యానురోధాత్సమయే వేలాం స్వాం నాతివర్తతే[11]॥

అనుచు నీ బుద్ధిధర్మము మీదనే స్థిరముగా నిలిచియున్నపక్షములో సత్యమునే పాటింపుమని పలికెను.

ఇదే సందర్భమున రంగనాథ రామాయణములో కైకేయి దశరథునితో

'ఆదిత్యకులజుండవగురాజ! వాదిరాజులకంటె నధిక పుణ్యుడవు
తప్పాడవాడినఁదప్పవు నాకు - దప్పక వరములు దయనిచ్చితేని.[12]

అని తన కోరికలను వెల్లడించినట్లు కలదు. సత్యమర్యాదను పాటించినట్టి వారి చరిత్రలను కైకేయి పేర్కొనుచూ

'రాజేంద్ర సత్యపరాక్రమస్ఫూర్తి పూజిత కీర్తివై బొంకంగ దగునె
ఇట్టి దేవతలందఱెఱుగంగ నొట్టు - పెట్టి తప్పెద వెట్టి పృథివిపాలుడవు
ఒక గువ్వకై తన యెడలిమాంసంబు - నొకడేగకును శిబియొసగడె మున్ను
క్షోణి దేవునకలర్కుండను రాజు - త్రాణతో నొసగడే తనలోచనములు
చెలరేగి జలధియు చెలియలికట్ట - బలిమి దాటక లోనుబడియుండలేదె
యదియటులుండె నీ యన్వయభవులు - మదిలోన నవ్వుల మాటలకైన
కలలోన బొంకరిక్ష్వాకుండవయ్యు - వెలయ కౌసల్యకు వెఱచిబొంకెదవు
బొంకెడు వాడొక్క పురుషుడే యనుచు - బొంకితినను బొందబుద్ధిగా దింక[13]

ఇదే సందర్భమున భాస్కర రామాయణములో

సీ॥ అనవుడు నక్కైక జననాథుతోనను నిక్ష్వాకువంశమహీశులెల్లఁ
బలికి తప్పరు, నీవు కులధర్మ మెల్లక కౌసల్యదిక్కునఁగరమువెఱచి
సడికోర్చి, సత్యంబువిడువఁగదలచెదు భూపాలయిది యొక్క పురుష గుణమె
బొంకుదురే రాజు లింక? నీ ముందర విషమాని ప్రాణముల్ విడుచుదాన

తే॥ నంత భరతుని సమయించి, యనుగుఁదనయు రాము నిష్కంటకంబుగా రాజ్యమునకు
నధిపుఁ గావించి నీవు నీ యగ్రసతియు విభవమున నుండుదురుగాక, వేయునేల.[14]

అని కైకేయి దశరథునితో పలికినట్లు గలదు. శ్రీరాముడు వాలిని వధించుటకుగల కారణములలో సత్యప్రతిజ్ఞయొకటి.

క్రామ్య సుఖమునందు చిక్కిన సుగ్రీవుడు సత్యమర్యాదను కాపాడునట్లు చేయుమని శ్రీరాముడు లక్ష్మణునితో పలుకుసందర్భమున

'అర్థినాముపపన్నానాం పూర్వం చాప్యుపకారిణామ్।
ఆశాం సంశ్రుత్య యో హన్తి స లోకే పురుషాధమః॥[15]

పూర్వము తనకుపకారము చేసినవాడు అనంతరకాలమున కార్యార్థియై తన కడకు వచ్చి వారి కోరిక తీర్చుదునని మాట ఇచ్చి, దానిని పరిపాలింపనివాడు నరాధముడనబడును.

ఇదేసందర్భమున భాస్కరరామాయణములో
'పాపముసేయనొండె నతిబంధుర ధర్మము సేయనొండె స
ల్లాపము లాడి సత్కృతి తలంపక బొంకెడువాఁడు నర్థికిం
జేపడి నంచితోపకృతి చేసిన వానికి వాంఛితంబు సం
క్షేప మనస్కుఁడై తనరఁజేయనివాఁడును, బూరుషాధముల్[16]
అని లక్ష్మణునితో శ్రీరాముడు పలికినట్లు గలదు.

సుగ్రీవునితో లక్ష్మణుడు
'సత్త్వాభిజనసంపన్నస్సానుక్రోశో జితేంద్రియః।
కృతజ్ఞస్సత్యవాదీ చ రాజా లోకే మహీయతే[17]॥

సుగ్రీవా! లక్ష్మణునితో 'మహాబలశాలి, దయానిధి, ఇంద్రియములను జయించినవాడు, ఇతరులు చేసిన ఉపకారము భరించువాడు, సత్యము పలుకువాడునగు రాజు లోకమున మెప్పుపొందువాడగును. ఏ రాజు అధర్మపరుడై తనకుపకారము చేసిన మిత్రులకు అసత్యమగు ప్రతిజ్ఞ చేయునో వానికంటెను మిక్కిలి క్రూరుడు ఉండబోడు.[18] ఒక గుఱ్ఱము విషయమున అసత్యమాడువాడు నూరు గుఱ్ఱములు చంపిన పాపము నొందును. ఒక గోవు విషయమున అసత్యమాడువాడు వెయ్యిగోవులను చంపిన పాపము నొందును. ఇంక ఋషులవిషయమున అసత్యమాడువాడు, ఆత్మహత్యయు, ఆత్మీయుల హత్యయు చేసిన వాడగును అని పలుకును.

'శతమశ్వానృతేహంతి సహస్రంతు గవానృతే।
ఆత్మానం స్వజనం హన్తి పురుషః పురుషానృతే''[19]॥ అని వాల్మీకి రామాయణమున చెప్పబడింది.

ఇదే సందర్భమున భాస్కర రామాయణములో లక్ష్మణుడు సుగ్రీవుని చూచి
పశువాంఛ బొంకిన బంచపశుఘ్నుడౌ గో నృతాత్ముడు దశగోప్రహర్త
యశ్వానృతుండు శతాశ్వహింసక దోషి పురుషానృత సహస్రపురుషహరుడు

వసుధకై బొంకినవాడు సర్వధ్వంసి కనకంబు కొఱకు బొంకిన ఖలుండు
సకలజాతాజాత జనుల ద్రుంచినవాడు తనపల్కు మిథ్యచేసినయతండు
దన్ను నాప్తజనులదావధించిన పాపి భువిగృతఘ్ను డఖిలభూతఘాతి
యని కృతఘ్నుగూర్చి యఖిల లోకేశుండు పరగ బల్కినట్టి పలుకు వినుము.[20]

అని హితవు పల్కినట్లు కలదు.

రామాయణములోని ఇక్ష్వాకు రాజులందఱు రాజుహితము కొఱకు సత్యమర్యాదను కాపాడినట్లుగా కానవచ్చుచున్నది.

### *4-3. కామప్రవృత్తి గల అధర్మపరులను శిక్షించుట:*

వానరరాజగు వాలియును, రాక్షసరాజగు రావణుడును ఈ రాజధర్మప్రకారమే శిక్షింపబడిరి. రాజు స్వయముగా గాని, ప్రతినిధుల ద్వారా కాని, ఇట్టి అధర్మపరులను శిక్షించుపద్ధతి ఆనాడు గలదు. వాలి కామప్రవృత్తిలో సుగ్రీవుని భార్య'రుమ'నపహరించి ఆతనిని రాజ్యబహిష్కృతుని కావించెను. దురాచారుడగు వాలిని రాముడు తన బాణముచే కొట్టెను. అప్పుడు వాలి అట్లు కొట్టుటకు గల కారణమేమని రాముని అడుగగా కామ ప్రవృత్తిగల వారి యెడల రాజధర్మమెట్టిదో స్పష్టపఱచెను.

త్వం తు సంక్లిష్ట ధర్మాచ కర్మణా చ విగర్హితః।
కామతంత్రప్రధానశ్చ న స్థితో రాజవర్మని"॥[21]

నీవు ధర్మలోపమొనర్చి చేయకూడని పని చేసితివి. కామమునే ప్రధానముగా అవలంబించినవాడవు. రాజమార్గము నవలంబింపని వాడవు. సనాతనధర్మమును విడనాడి తమ్ముని భార్యను గ్రహించి పాపకృత్యము చేసినావు. అనుచూ రాజధర్మమును నిరూపించెను. కామప్రవృత్తిచే పూర్వము వాలివలెనే శ్రమణకుడొకడు పాపముచేయగా మాంధాత అతనికి ఘోరదండనము విధించిన ఐతిహ్యమును కూడా రాముడు వాలికి వివరించెను. రావణుడు కామప్రవృత్తిచే పరదారయగు సీతను అపహరించెను. జటాయువు ఇట్టి దుష్కృత్యమును నిరసించుచూ రావణునితో

'కథం రాజా స్థితోధర్మే పరదారాన్పరామృశేత్।
రక్షణీయా విశేషేణ రాజదారా మహాబల'[22]॥ అని పలికెను.

ఇంకను అల్పబుద్ధివైన ఓ రావణా! వజ్రమువలె శరీరమును తాకునట్టి బాణములను ప్రయోగించువాడగు రాముని భార్యను నీవు అపహరించుచున్నావే? నీ యకృత్యము సకల రాక్షస సంహారమునకే సుమా!

'వజ్రసంస్పర్శబాణస్య భార్యాం రామస్య రావణః।
అల్పబుద్ధే హరస్యేనాం వధాయ ఖలు రక్షసామ్.[23]॥ అంటాడు.

కామ ప్రవృత్తితో వ్యవహరించిన వాలిని శ్రీరాముడు వధించుటలో రాజధర్మము ఇమిడియున్నదని తెలియును.

*4-4. ధర్మవృత్తికై రాజు ప్రతినిధులను పంపుట:*

రాజు స్వయముగా గాని, లేదా తన ప్రతినిధులను పంపుట ద్వారా గాని, ధర్మవృత్తిగావించవలెను.

'తే వయం మార్గవిభ్రష్టం స్వధర్మే పరమే స్థితాః।
భరతాజ్ఞాం పురస్కృత్య నిగృహ్ణీమో యథావిధి[24]॥

భరతుని ఆదేశముననుసరించి మేము ధర్మములను యథావిధిగా అనుసరించుచూ నిగ్రహించుచున్నామని వాలితో శ్రీరాముడు అతనడిగిన సందేహాలకు సమాధాన మిచ్చెను. అంతేగాక

'వయం తు భరతాదేశావిధిం కృత్వా హరీశ్వర।
త్వద్విధాన్ భిన్నమర్యాదాన్ నిగ్రహీతుం వ్యవస్థితాః॥'[25]

మేము భరతుని ఆదేశమునే శాస్త్రముగా స్వీకరించి నీవంటి ధర్మమర్యాద దప్పినవారిని శిక్షింపవలెనని కృతనిశ్చయముతోనున్నామని రాముడు వాలితో పలికెను.

ఇదే సందర్భమున రంగనాథ రామాయణములో

చతురబాహాశక్తి జగతికంతటికి - బతియైన భరతుని పనుపున వచ్చి
దుష్టమృగంబుల దుష్టరాక్షసుల - సృష్టి పై మేము శిక్షించుచుండుదుము.
నీ తమ్ముడగు వానినెలతగై కొన్న - పాతకుడవుగాన బట్టి చంపితిని'[26]

అని శ్రీరాముడు వాలితో పలికెను. దీనినిబట్టి రాజు తన ప్రతినిధిద్వారా ధర్మవృద్ధిగావించు పద్ధతి రామాయణకాలముననున్నట్లు తెలియుచున్నది.

*4.5 శరణాగత రక్షణ :*

శరణు అని కోరిన వారికి అభయమిచ్చి వృద్ధిని గలిగించుట రాజధర్మము. రామాయణకాలము నాటికి శరణాగత రక్షణమును రాజులు ప్రధానధర్మముగా భావించినట్లు తెలియుచున్నది.

రావణునిచే తిరస్కృతుడైన విభీషణుడు శ్రీరాముని శరణుకోరు నిమిత్తము ఆయుధములతో కూడి వచ్చెను. అట్టి సమయమున రాక్షసులు, కామరూపులని,

కపటోపాయము తెలిసిన వారని, వారియందు విశ్వాసము పనికిరాదని అనేకవిధముల లక్ష్మణుడు పలికెను. అప్పుడు సుగ్రీవుని మంత్రులు కూడా అట్లే పలికిరి. హనుమంతుడు మాత్రము శరణునిచ్చుట యుక్తమనెను. పిమ్మట రాముడు

'మిత్రభావేన సంప్రాప్తం న త్యజేయం కథంచన।
దోషో యద్యపి తస్య స్యాత్ సతామేతదగర్హితమ్.॥[27]

మిత్ర భావమును కోరుతూ వచ్చిన వానియందెంత దోషమున్ననూ ఎట్టి పరిస్థితులలోను విడిచిపెట్టకూడదని పలుకుచూ విభీషణునికి శరణాగతరక్షణ కల్పించెను. సమర్థుడై యుండి శరణాగతులను కాపాడకపోవడం వలన కలుగు అనర్థము అపారము. అది స్వర్గమునకు ప్రతిబంధకరము. అకీర్తికరము. ఇంకను బలపరాక్రమములను నశింపజేయునది.[28] అని విభీషణునికి శ్రీరాముడు శరణును ప్రసాదించెను.

రంగనాధ రామాయణములో ఇదే సందర్భమున శ్రీరాముడు సుగ్రీవునితో

అర్కజ, యితడు మేలౌటగీడౌట - తర్కింపనేటికి? ధర్మంబు త్రోవ
శరణని వచ్చిన శత్రువునైన - బరికింపగా రాచపాడి రక్షింప
నొకకపోతము డేగ యుద్ధతిఁదఱుచు - విమల భావంబున వేగంబున వచ్చి
శిబి మాటు సొచ్చెఁజొచ్చిన డేగయడుగ - శిబి తనువిచ్చె చెచ్చెర గువ్వగాచె
నపకీర్తిఁజెందక యార్తు జేకొన్న - కృపయాశ్వమేధ సత్కృతి ఫలంబిచ్చు
శరణన్న గాతునే చందంబు నందు - మరియాద యిట్టిది మాకులక్రమము.[29]

అని విభీషణునికి శరణు అనుగ్రహించినట్లు గలదు.

ఇదే సందర్భమున భాస్కర రామాయణములో లక్ష్మణునితో శ్రీరాముడు

ఆ॥ అభయదానమునకు నశ్వమేధాదులు
వేయునీడుగావు విశదకీర్తు
లఖిల దిశలనెసగు నార్తు రక్షించిన
నట్లు గాన సందియంబు వలదు.[30]

క॥ ఇతడనగ నెంత శరణా
గతుడయిన దాశాస్యునైన గాతున్ నాకుం
బ్రతిన యిదె వేగ తోడ్తై
యితనిం గైకొంటి నభయమిచ్చితినెమ్మిన్[31]

అని విభీషణునికి శరణుననుగ్రహించినట్లు గలదు. అంతేగాక లంకారాజ్యమునకు విభీషణుని అభిషేకము చేయుమని, శ్రీరాముడు లక్ష్మణుని నియోగించమని,సుగ్రీవుడు

శ్రీరామునితో చర్చించు సందర్భమున

"అనఘ చరిత్ర మీకు శరణాగత రక్షకుల వ్రతంబు మీ
సునిశిత బాణజాలముల చోకున కోర్వక వచ్చి తా దశా
నను డభయంబు వేడికొని నందగ నెట్లగు నన్న నవ్విభుం
డినసుతుజాచి యట్లయిన నిచ్చెద వానికయోధ్య నావుడున్[32]

అని శ్రీరాముడు స్పష్టపరచినట్లు గలదు.

ఇదే సందర్భమున మొల్ల రామాయణములో శ్రీరాముడు సుగ్రీవునితో "ఇతండెవ్వడైన నేమి శరణన్న రావణానుజునెకాదు రావణునైనం గాచెద శరణని వచ్చిన వాని ప్రాణంబులు రక్షించుట రాజులకుఁబరమ ధర్మంబు కావున"[33] శరణు ఇచ్చెదనని పలికినట్లు గలదు.

రామాభ్యుదయములో ఇదే సందర్భమున శ్రీరాముడు సుగ్రీవునితో

'ఎచ్చట నున్న వాఁడభయ మిచ్చితి నేలితి రమ్మనుండు పొం
డచ్చపు దాయయైన శరణార్థిఁజూమీ యని యొక్క మాటు వా
క్రుచ్చిన పిమ్మటం గలుపుకోలు తనంబున గాతు వానిఁలో
మచ్చర మెంచరాదు మఱి మా రఘువంశపు రాచవారికిన్[34]

అప్పుడు సుగ్రీవుడు 'రఘువరు నసాధారణంబగు శరణాగత రక్షా పరాయణత్వంబునకు నచ్చెరువందుచుం'[35] విభీషణుని శ్రీరాముని వద్దకు తెచ్చినట్లు గలదు. దీనిననుసరించి శరణాగత రక్షణము ముఖ్యమైన రాజధర్మమని తెలియుచున్నది.

### *4-6 దేశకాలముల నెఱిగి ప్రవర్తించుట:*

రాజు అసూయలేనివాడుగా, మృదుమధురముగా మాట్లాడు స్వభావము కలిగినవాడుగా ఉండవలెను. శీల జ్ఞాన వయోవృద్ధులతో సంభాషించుచూ పరుష వాక్యములకు ప్రత్యుత్తరమీయకూడదు. ఇంకను ఇతరులను తానే ముందుగా పలుకరించుచూ ఏ ప్రాణినైనను సరే అవమానింపకుండా ఉండి దేశకాలానుసారముగా ప్రవర్తించవలెను. పై గుణములన్నియు రాముని యందు గలవు.

పౌరజానపదులు దశరథునితో రాముని స్వభావమునుతెల్పుటను గూర్చి రంగనాథ రామాయణమున యిట్లు చెప్పబడెను.

హృదయరంజకము, నభీష్టదంబయ్యె - నదిగాక సకల ప్రజానందకరుని
రాజనీతిజ్ఞ, నిర్మలధర్మనిపుణు - తేజో జగద్బంధు దీనైక బంధు
సత్యసంధు ప్రసన్ను, శాంతిసంపన్ను - నిత్యవిప్రార్చనా నిరతు సచ్చరితు,

నీతియు, బ్రీతియునేర్పును నోర్పు - జ్యోతియు భూతియు గాంతియు దాంతి శాంతియు మొదలైన సద్గుణావళుల''[36] ను శ్రీరాముడు కలిగి యున్నట్లు పలికిరి. దేశకాలాలనెఱిగి ఈ విధముగా శ్రీరాముడు ప్రవర్తించినట్లు తెలియుచున్నది.

*4-7* సకల ప్రాణులను రక్షించుట:

సకల ప్రాణులసంరక్షణము రాజధర్మముగా రామాయణమున పలుసందర్భములలో నిరూపింపబడినది. ఈ కొండలు, వనములు,మహారణ్యములతో కూడిన జంబూ ద్వీపమంతయు ఇక్ష్వాకులదే. మృగములు, పక్షులు, మనుష్యులనను గ్రహించుటయే ఇక్ష్వాకుల కర్తవ్యము. ఈ విషయముననే రంగనాథరామాయణములో వాలితో శ్రీరాముడు.

"దుష్టమృగంబుల దుష్టరాక్షసుల - సృష్టిపై నెపుడు శిక్షించుచుండుదుము[37] అని పలికినట్లు కలదు.

తాటక సంహారము చేయుమని విశ్వామిత్రుడు శ్రీరామునితో పలుకుతూ

"న హి తే స్త్రీవధకృతే ఘృణా కార్యా నరోత్తమ।
చాతుర్వర్ణ్య హితార్ధంహి కర్తవ్యం రాజుసూనునా'॥[38]

ఈమెను వధించు విషయమున స్త్రీ అని దయచూపరాదు. చాతుర్వర్ణ్య హితాన్ని గుర్తించిన రాజు స్త్రీ పురుష భేదమును చూడక కర్తవ్యమును అనుసరింపవలెను అనుచు రాజ్యపాలనను నియుక్తులయిన వారికిది సనాతనధర్మమని పలికెను.

ఇదే సందర్భమున రంగనాథ రామాయణములో విశ్వామిత్రుడు శ్రీరామునితో

'ఎనయ గోబ్రాహ్మణ హితమైన జాలు - జనుజంప గామినీ జనుల రాజులకు'[39]

అని పలికినట్లు గలదు.

ఇదే సందర్భమున భాస్కరరామాయణములో

కం॥ రణశూరత నీదుశ్చా
రిణిని దునుము పాపమతిని స్త్రీనైనను ని
ర్ఘృణతం జంపఁగ నగు బ్రా
హ్మణ చాతుర్వర్ణ్య రక్షణార్థముగాఁగన్'[40]

అని చాతుర్వర్ణ్య జనులందరి రక్షణ రాజుల కర్తవ్యమని శ్రీరామునితో విశ్వామిత్రుడు పలుకుటను బట్టి సకలప్రాణుల రక్షణము రాజధర్మమని తెలియుచున్నది.

### *4-8* వర్ణాశ్రమ ధర్మములను కాపాడుట:

రామాయణకాలము నాటికి వర్ణాశ్రమ ధర్మములు విస్తృతముగా పాలింపబడినవని తెలియుచున్నది. ఆనాడు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రవిభాగములతో గూడిన చాతుర్వర్ణ్య వ్యవస్థ పాలనాపరముగా విశేషప్రాధాన్యమును సంతరించుకొనినట్లు తెలియుచున్నది. అంతేగాక ఆయావర్ణ్యముల వారి సేవలను తగినవిధముగా రాజ్యపాలనలో వినియోగించుపద్ధతులు రామాయణకాలమున అమలు జరిగెడివని తెలియుచున్నది.

### *4-8-1* బ్రాహ్మణుడు - రాజధర్మము :

మేధావి వర్గముగా భావింపబడు బ్రాహ్మణులకు రాజు పాలనాపరముగా విశేష ప్రాధాన్యాన్ని ఇచ్చినట్లు తెలియుచున్నది. రాజు పలుకీలక నిర్ణయాలను గైకొనటంలోను, అమలుపరచటం లోను బ్రాహ్మణులకు విశిష్టమైన గౌరవము లభించినట్లు తెలియుచున్నది. అశ్వమేధ యాగము చేయు తలంపుతో మంత్రిముఖ్యుడగు సుమంతునితో దశరథుడు "ప్రసిద్ధులగు గురువుల నెల్లరును పురోహితుల నెల్లరను తోడ్కొని రమ్మనగ' నతడు వేదవిదులగు పురోహితులతో పాటు సుయజ్ఞుడు, కామదేవుడు, జాబాలి, కశ్యపుడు, అను దశరథుని గురువులను, వశిష్ఠుని, తక్కిన బ్రాహ్మణోత్తముల నెల్లరను వెంటబెట్టుకొని వచ్చెను. వారందఱు దశరథుని ఆలోచనకు 'లెస్స' అని అభినందించిన పిదప అతను వశిష్ఠుడై యాగనిర్వహణకుపక్రమించెను. సుమంతుడు సనత్కుమార వచనము ఆధారముగా బ్రాహ్మణశ్రేష్ఠుడగు ఋష్యశృంగమహర్షిని రాజైన దశరథుడే స్వయముగా తీసుకొని వచ్చుటను బట్టి అతనికివ్వబడిన ప్రాధాన్యము తెలుస్తున్నది. రోమ పాదుడను రాజు అంగదేశాధిపతి. ఆ రాజు ధర్మము తప్పుటచే చిరకాలమాతని రాష్ట్రమందెల్లెడల సకలప్రాణులకు భయము కలించుచు అనావృష్టి కలిగినది. ఆ సందర్భమున అతడు బ్రాహ్మణులను పిలిపించి

'భవంతః శ్రుతకర్మాణో లోకచారిత్ర వేదినః।

సమాదిశంతు నియమం ప్రాయశ్చిత్తం యథాభవేత్[41]॥

మీరందఱు ధర్మమెఱిగినవారు, లోకాచారము తెలిసినవారు కావున ఈ అనావృష్టికి కారణమగు నా పాపమునకెట్టి ప్రాయశ్చిత్తము కావలెనో అట్టి నియమము ఆచరింప నన్ను ఆజ్ఞాపింపుడను మాటను బట్టి రాజు ప్రాయశ్చిత నియమాలను తెల్పుచూ బ్రాహ్మణుల యెడ ఎట్లు వ్యవహరింపవలెనో చెప్పబడినది.

దశరథుడు శ్రీరామునికి యువరాజ్య పట్టాభిషేకము చేయదలచి సమాలోచన చేయునపుడు వసిష్ఠాది బ్రాహ్మణముఖ్యులతో ఆలోచించుటను బట్టి బ్రాహ్మణులకు గల ప్రాధాన్యత తెలియుచున్నది. అంతేగాక వేదపారంగతులైన బ్రాహ్మణులందరు ఆ రాత్రి అక్కడే ఉండి పట్టాభిషేకమునకు కావలసిన ఏర్పాట్లన్నీ చేసినారని చెప్పుటను బట్టి యువరాజ్య పట్టాభిషేక ఏర్పాట్లు బ్రాహ్మణులచే నిర్వహింపబడెడివని తెలియుచున్నది. రాజ్యాంగ సంక్షోభ మేర్పడి పరిపాలనా విపత్తు కలిగినపుడు బ్రాహ్మణుడు మంచి ఆలోచన చేసి ఆ విపత్తు తొలగిపోవు ప్రయత్నము చేసెడివాడు. దశరథుడు మరణించిన సందర్భములో బ్రాహ్మణులు సభచేసిరి. అప్పుడు మార్కండేయుడు, మౌద్గల్యుడు, వామదేవుడు, కాశ్యపుడు, కాత్యాయనుడు, గౌతముడు అనుబ్రాహ్మణులు విడివిడిగా చర్చించుకొనిరి. కలసిచర్చించుకొనిరి. వారు అరాజకత్వము వలన కలిగెడి సకల క్లేశములను సమీక్షించి, రాజులేని రాజ్యము మరణ సదృశమగుటచే, ఇక్ష్వాకువంశ్యుడు, వదాన్యుడునగు ఒక్కని రాజుగా అభిషేకించమని కోరుట రాజ విధానములోని బ్రాహ్మణ ప్రాముఖ్యమును నిరూపించుచున్నది.
రామాభ్యుదయములో

'ఇట్టి తెఱంగునన్ భరతుఁడెంతయుఁగుంద వసిష్ఠుడున్ బుధుల్
పట్టిన మీయెడం బగిలిపాఱి యరాజకమైన దింతటన్
బట్టము గట్టుకొమ్ము జనపాలన శీలనయాభిరమ్యతల్
నెట్టుకొనన్ సమస్త ధరణీ వలయాంకిత బాహుశాలివై[42]

అని రాజ్యపాలన చేయుమని వసిష్ఠాది బ్రాహ్మణులు, పండితులు కోరినట్లు తెలియుచున్నది. అంతేగాక రాజ్యాంగ సంక్షోభాన్ని తొలగించటానికి వారు ప్రయత్నించినట్లు తెలియుచున్నది. ప్రజాసంక్షేమ కరంబగు పాలనకు సహకరించుటకై అడవులకొచ్చిన శ్రీరాముని ఎదుటకు బ్రాహ్మణులు విచ్చేసిరి. ఈ విషయాన్ని శ్రీరాముడు సీతకు వివరించుచూ

కిం కరోమీతి చ మయా వ్యాహృతం ద్విజసన్నిధౌ।
సర్వై రేవ సమాగమ్య వాగియం సముదాహృతా॥[43]

అని బ్రాహ్మణులందరినీ అడిగితిననియు, వారందఱు ఒకచోట చేరి రాక్షసులనుండి కాపాడమని కోరిరనియు పల్కెను. బ్రాహ్మణహింస నివారణకై శ్రీరాముడు ఖరదూషణాదులను వధించెను. మూలమునకు భిన్నంగా భాస్కరరామాయణములో వాలివధకు బ్రాహ్మణహింస కూడా కారణమని సూచించబడినది. ఈ సందర్భమున

శ్రీరాముడు వాలితో

కం॥ ధరలో దివిజులు ధాత్రీ
వర రూపంబులు ధరించి వర్తింతురు వా
రురుధర్మ జీవిత శుభో
త్కరదాయకు లఖిల భూమి తలవర్తులకున్[44]

తే॥ కాన బ్రత్యక్షదేవతలైన యట్టి
ఘనుల రాజుల శపియింపగాదు ధిక్క
రింపగా గాదు క్రొవ్వున జంపగాదు
వారి కప్రియములు పల్కవలను గాదు.[45]

అని పలికినట్లు కలదు. దీనినిబట్టి బ్రాహ్మణునికి అప్రియము కలిగించుట తీవ్రనేరమని సూచింపబడుచున్నది. రాజులు తమ పాలనలో బ్రాహ్మణహింసను సహించేవారు కాదని రామాయణము స్పష్టపఱుచుచున్నది.

### *4-8.2 క్షత్రియులు - రాజధర్మము :*

క్షత్రియ వంశస్థుడైన పరిపాలకునకు రాజనే పేరు వస్తుంది. చాతుర్వర్ణ్యాలలో రెండవస్థానముగా పేర్కొనబడిన క్షత్రియులకు పాలనయందు విశిష్ట ప్రాధాన్యము కలదు. క్షత్రియులను మంత్రులెన్నడు శిక్షించేవారు కాదు. దశరథ మహారాజు చేయు అశ్వమేధయాగమునకు క్షత్రియులను కూడా సత్కార పూర్వకముగా ఆహ్వానించిరి.సహజముగా భుజబలముగల వీరు రాజు చేయు ముఖ్యనిర్ణయములలో సముచితప్రాధాన్యము వహింతురు. భరతుని శ్రీరాముడు కుశలప్రశ్నలడుగుచూ క్షత్రియులందఱు నీయందనురక్తులై యున్నారా?[46] అని ప్రశ్నించుట పైఅంశమునే నిరూపించుచున్నది.

### *4-8.3 వైశ్యులు - ధర్మాచరణము:*

వైశ్యులకు వ్యవసాయము, వాణిజ్యము, ఆచరణీయముగా చెప్పబడినవి. పరిపాలనలో రాజు చేయు నిర్ణయములందు వానిని అమలు పరచుట యందు వైశ్యుల సహకారము చాలాముఖ్యం. రామాయణమున వైశ్యులు క్షత్రియుల ఆజ్ఞలను పాలించెడివారని స్పష్టపరుపబడినది.[47] దశరథమహారాజు నిర్వర్తించే అశ్వమేధ యాగమున వైశ్యులు కూడా సత్కారపూర్వకముగా ఆహ్వానింపబడిరి.[48] దశరథుని మరణానంతరము రాజ్యమున ఏర్పడిన అరాచక స్థితిగతులను వసిష్ఠునికి బ్రాహ్మణులు

వివరించుచూ

'నా రాజకే జనపదే ధనవంతస్సురక్షితా।
శేరతే వివృతద్వారాః కృషిగోరక్షజీవినః॥'[49]

రాజులులేని కారణాన రాజ్యమున సేద్యము, గోవులను రక్షించుటచే జీవించు ధనికులగు వైశ్యులు ద్వారములను తెరచుకొని నిదిరించుటలేదనుటను బట్టి అరాజక ప్రభావము వైశ్యులపై ఎట్లున్నదో తెలియుచున్నది.

శ్రీరాముడు భరతుని కుశల ప్రశ్నలడుగుచూ

"కచ్చిత్తే దయితా స్సర్వే కృషిగోరక్షజీవినః
వార్తాయాం సంశ్రిత స్తాత లోకోఽయం సుఖ మేధతే"[50]

వ్యవసాయము, గోరక్షణము చేయువైశ్యులు నీయందునురక్తులైయున్నారా! 'వాణిజ్యమున్నప్పుడే నిన్నాశ్రయించిన జనులు' అనుటద్వారా వ్యవసాయ, గోరక్షణ, వాణిజ్యాదులందు రాజు శ్రద్ధ వహించవలనని, పాలనలో వైశ్యులకును ప్రాధాన్య ముండుటను తెలుపుచున్నది.

### *4-8.4 శూద్రులు - రాజధర్మము:*

రాజువీరినిగూడ ప్రసన్నులను చేసుకొని పరిపాలన చేయువలసి యున్నది. రామాయణకాలమున శూద్రులకు కూడా గౌరవస్థానమున్నది. రాజు వారిని ఏనాడు కించపఱచలేదు. దశరథమహారాజు చేయు అశ్వమేధ యాగమునకు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులతో పాటు శూద్రులు కూడా సత్కారపూర్వకముగా ఆహ్వానింపబడిరి.[51] తగువిధమున ఆదరమును పొందిరి. వీరు కూడా సుఖజీవనమును గడిపినట్లు గలదు. రాజ్యపాలనమున వీరి అభిప్రాయము గూడ గౌరవింపబడెడిది. విభిన్నజాతుల అభిప్రాయమును యథోచితముగా రాజు వినియోగించుకొనుచూ వారందరి సంక్షేమానికి పాటు పడే విధానము, ఆనాడు అమలులో ఉండేది.

### *4-9. జ్యేష్ఠతనయునకు రాజు రాజ్యాధికారమప్పగించుట:*

రాజు తన జ్యేష్ఠతనయునకే రాజ్యాధికారమప్పగించు విధానము వానర రాజ్యమగు కిష్కింధ యందును పాటింపబడినది.రామాయణమున ఇక్ష్వాకుడు మొదలు దశరథుని పర్యంతము ఇదే విధానము కలదు. ఈ క్రమమున సగర పుత్రుడు అసమంజసుడు తన దుర్మార్గప్రవర్తన మూలమున తండ్రినుండి రాజ్యాధికారము పొందలేక పోయెను. కానీ అతనిపుత్రుడు రాజు కాగలిగెను. దశరథుడు ఈ మర్యాదననుసరించియే

శ్రీరామునికి యౌవరాజ్యపట్టాభిషేకము చేయగోరెను. అట్టి స్థితిలో అతని సత్యవాక్పరిపాలనకు భంగము ఏర్పడబోయెను. రాజ సంప్రదాయమును చూడగా జ్యేష్ఠుడే ఎల్లప్పుడు పట్టాభిషిక్తుడగుట కనిపించును. రాజులకెల్లరకు కూడ ఈ ధర్మము సమానము.

"సతతం రాజపుత్రేషు జ్యేష్ఠో రాజాஉభిషిచ్యతే।
రాజ్ఞా మేత త్సమం తత్స్యా దిక్ష్వాకూణాం విశేషతః॥[52]

రంగనాథ రామాయణమున రాజ్యము స్వీకరించబోనని వసిష్ఠునితో పలుకుచూ భరతుడు

'మదినింత యెఱుగవె మా కులక్రమము"[53] అని ప్రశ్నించుటలోనూ, ఇదే సందర్భములో భాస్కరరామాయణములో గల

'అనవుడు సైఁ ప కిట్లనియె, నక్కట! ప్రాకృతుఁడాడునట్లు లో
మునివర నీవు మత్కుల సముజ్జ్వలఁధర్మముఁ జూడ కాడె, దే
మని విననేర్తు? వీఁడల దురాత్మకురాలగు కైక నందనుం
డనునది దక్క,నాదుమన మారసి యొండొక తప్పు జెప్పుమా![54]

అను భరతుని పలుకులలోనూ రాజధర్మము కానవచ్చుచున్నది. కిష్కింధ యందును ఈ రాజధర్మప్రకారమే ఋక్షవిరజుని మరణానంతరము అతని జ్యేష్ఠ తనయుడైన వాలి వానరరాజ్యానికధిపతి కాగలిగెను.

### *4.10 ప్రజలను పుత్రులవలె కాపాడుట:*

రాజు ప్రజలను తనకన్నబిడ్డలవలె చూచుకొనవలయును. రామాయణమున మునులు శ్రీరాముని వద్దకు వచ్చి రాజు ఆరవభాగమును పన్నుగా గ్రహించి ప్రజలను పుత్రులవలె కాపాడనిచో ఆ రాజు అధర్మము పాలగునని చెప్పబడెను.

'అధర్మః సుమహాన్! నాథ భవే త్తస్య తు భూపతేః।
యో హరేద్బలి షడ్భాగం న చ రక్షతి పుత్రవత్[55]॥

ఇంకనూ మునులు ఈ విధముగా పలికిరి.

"యుంజాన స్స్వానివ ప్రాణాన్ ప్రాణైరిష్టాన్ సుతానివ।
నిత్యయుక్త స్సదా రక్షన్ సర్వా న్విషయవాసినః॥
ప్రాప్నోతి శాశ్వతీం రామ! కీర్తిం స బహువార్షికీమ్।
బ్రహ్మణః స్థాన మాసాద్య తత్ర చాపి మహీయతే॥[56]

ఎవడు సదాప్రయత్నపరుడై తన దేశములోనున్న వారినందరినీ తన ప్రాణములవలె, ప్రాణములకంటె ఇష్టమైన సుతులవలె రక్షించునో ఆ రాజు బహుకాలము నిలుచును. అతడు బ్రహ్మలోకము పొంది పూజింపబడును. ఇదే సందర్భమున మునులు శ్రీరామునితో

'ప్రతిని రక్షించిన రాజుకు గలుగు నతని పుణ్యామున నాలవపాలుగాన''[57]

మునులను రక్షించుట వలన కలుగు ఫలితమును చెప్పబడినది. భాస్కర రామాయణమున ప్రజారక్షకవిషయమున ఈవిధముగా చెప్పబడుచున్నది.

ఉ॥ శిష్టహితంబు దుష్టజన శిక్షయుఁ జేయని రాజు రాజె! యు
త్కృష్ట తపస్వి కోట్లను వధించు నిశాటులఁ జంపకుండినం
గష్టత రాదె నాకు గుణగణ్యవు ధర్మపథంబున నీకు న
స్పష్టమె; యిట్టులేల యనఁబంకరుహాయత చారులోచనా[58]

### 4-11 క్షాత్ర ధర్మపరిరక్షణ:

క్షత్రియోచిత ధర్మములను రాజు అనుసరింపవలయును. క్షత్రియులు వనవాసులను రక్షించుటకే ధనస్సు ధరింపవలెను.

'క్షత్రియాణాం తు వీరాణాం వనేషు నియతాత్మనామ్।
ధనుషా కార్య మేతావ దార్తానా మభిరక్షణమ్''॥[59]

వీరులైన క్షత్రియులు వనవాసులగు మునులకు బాధ కలిగించువారిని పారద్రోలి వారిని రక్షించుటకే ధనస్సు ధరింపవలెను. క్షత్రియులకు పట్టాభిషేకమే మొదటి ధర్మమని భరతుడు శ్రీరామునితో

'ఏష హి ప్రథమో ధర్మః క్షత్రియస్యాభిషేచనమ్।
యేన శక్యం మహాప్రాజ్ఞ ప్రజానాం పరిపాలనమ్.॥[60]

క్షత్రియునకు పట్టాభిషేకము చేతనే ప్రజాపరిపాలన సాధ్యమగునని తెల్పెను. మొత్తం మీద రామాయణమున శ్రీరాముడు అతనిసోదరులు క్షత్రియోచిత ధర్మములను నిర్వర్తించిరని తెలియుచున్నది.

### 4-12 సంపాదన వ్యయములలో ఉచితజ్ఞత :

రాజు పరిపాలనకై పాటించు ఆయ, వ్యయములకు సమన్వయముండవలెను. శ్రీరాముడు భరతుని కుశలప్రశ్నలడుగుచూ

'ఆయ స్తే విపులః కచ్చిత్ కచ్చి దల్పతరో వ్యయః।
అపాత్రేషు న తే కచ్చిత్ కోశో గచ్ఛతి రాఘవ''[61]॥

నీరాబడి అధికముగను వ్యయము అల్పముగను ఉన్నదా! నీ ధనము అధికముగా అపాత్రులకు, నటవిటగాయకాదులకు పోవుటలేదు గదా! నీవు చేయువ్యయము దేవకార్యములకు, పిత్రుకార్యములకు,బ్రాహ్మణుల కొఱకు, అతిథులకు, యోధులకు, మిత్రులకు మాత్రమే పోవుచున్నదా! అని ప్రశ్నించుట ద్వారా వ్యయమెట్లు చేయవలయునో సూచించెను.

ఇదే సందర్భమున రంగనాథ రామాయణమున

'అన్యాయములు సేసి అర్థముల్ గొనక - మాన్యత బ్రోతువె మఱి కాపుగడల''[61a]

అనుటద్వారా సంపాదన వ్యయములలో రాజు ఉచితజ్ఞతను పాటింపవలెనని తెలియుచున్నది.

*4-13 ప్రియభాషణము :*

రాజు పౌర జానపదులతో ప్రియసంభాషణము చేయవలెను. రామాయణములో దశరథుడు శ్రీరామునితో ప్రియసంభాషణము చేసినట్లు గలదు. శ్రీరాముడు ఎల్లప్పుడు ప్రశాంతచిత్తుడై ఎవరైనా పరుష వాక్యములు పలికినా దానికి ప్రత్యుత్తరమీయడు. శీల, జ్ఞాన వయోవృద్ధుల వద్దకు, సత్పురుషుల వద్దకు వెళ్ళునపుడు వారితో రాముడు మృదువుగా సంభాషించెడివాడు.

'బుద్ధిమాన్ మధురాభాషీ పూర్వభాషీ ప్రియంవదః।
వీర్యవా న్న చ వీర్యేణ మహతా స్వేన విస్మితః[62]॥

రాముడు ఇతరులను తానే ముందుగా పలకరించి మధురముగా మాట్లాడువాడు. పరాక్రమవంతుడైనను తనకున్న పరాక్రమాతిశయము చూచుకొని గర్వించేవాడుకాడు. ఎవరికైనా ఆపద గలిగినపుడు మిక్కిలి దుఃఖించునట్టివాడు. రంగనాథరామాయణములో "అమిత ప్రజానందమలరించువాని''[63] గా శ్రీరాముడు భావింపబడెను.

*4-14 రాజు - త్రివర్గ సాధనములు:*

ధర్మార్థ కామ మోక్షములను మూడింటిని త్రివర్గములందురు. వీటిని రాజు సాధించవలయును. రాజే ధర్మార్థకామములకు మూలమని స్పష్టమగుచున్నది. తనను అపహరించుకొని పోవుచున్న రావణునితో సీత

అర్థం వా యది వా కామం శిష్టాః శాస్త్రే ష్వనాగతమ్।
వ్యవస్యన్త్య రాజానం ధర్మం పౌలస్త్యనందనం॥[64]

ఓ రావణా! శిష్టులగు రాజులు శాస్త్రములందు చెప్పబడని ధర్మమును గాని, అర్థమును గాని, కామమును గాని కోరరు.

'రాజా ధర్మశ్చ కామశ్చ ద్రవ్యాణాం చోత్తమోనిధిః।
ధర్మఃశ్శుభం వా పాపం వా రాజమూలం ప్రవర్తతే'॥[65]

రాజే ధర్మమునకు, అర్థమునకు, కామమునకు కూడా ప్రవర్తకుడైనవాడు. ధర్మముగాని, శుభముగాని, పాపముగాని, రాజువల్లే కలుగునని పలుకుట రాజునకు పురుషార్థములతో గల సంబంధమును నిరూపించుచున్నది.

### *4-14-1 రాజు - ధర్మసాధనము:*

రాజు ధర్మానికి ప్రతీకగా నిలవాలని రామాయణము నిర్దేశించెను. రాముడు రూపుదాల్చిన ధర్మమేనని మారీచుడు రావణునితో ఈ విధముగ పలికెను.

'రామో విగ్రహవాన్ధర్మ స్సాధుస్సత్యపరాక్రమః।
రాజా సర్వస్య లోకస్య దేవానామివ వాసవః''॥[66]

బ్రాహ్మణులు వసిష్ఠునితో సత్యధర్మములకు రాజే మూలమనుచూ రాజేధర్మమని కూడా చెప్పిరి. ధర్మార్థకామములను మూడింటిలో శ్రేష్ఠమైనదిగా తెలుపబడు ధర్మమును గుఱించి.

త్రిషు చైతేషు యచ్ఛ్రేష్ఠం శ్రుత్వా త న్నావబుధ్యతే।
రాజా వా రాజమాత్రో వా వ్యర్థం తస్య బహుశ్రుతమ్॥[67]

ధర్మార్థ కామములు మూడింటిలో శ్రేష్ఠమగు ధర్మమును గూర్చి విని యు ఎవడాచరింపనెరుగడో అతడు రాజైనను, రాజతుల్యుడైనను అతని శాస్త్రజ్ఞానము నిష్ప్రయోజనముగా పేర్కొనబడుచున్నది. అధర్మవర్తులను శిక్షించడం కూడా ఎంతో ముఖ్యమైనది. రాముడు ఆ ప్రకారము వాలిని, రావణుని వధించెను. ధర్మార్థకామములలో శ్రీరాముడు ధర్మమునకే ప్రాధాన్యమిచ్చెను.

ఇదే సందర్భమున రంగనాథ రామాయణములో

'నర్మిలి దండ్రివాక్యము సేయుకంటె - ధర్మంబు గలదె యా తండ్రివాక్యంబు
సేయమికంటె దుష్కృతమును గలదె - వేయి విధంబుల వెదకి చూచినను
జనకుని పనుపవశ్యము నీకు నాకు - జననులకును జేయ సహజధర్మంబు[68]

అని శ్రీరాముడు లక్ష్మణునితో పలికినట్లు కలదు.

'సర్వథా ధర్మ ఇత్యేవ ద్రష్టవ్య స్తవ నిగ్రహః[69]

అనుటద్వారా దుష్ట నిగ్రహణము చేయుట రాజధర్మమనియే రామాయణము ప్రబోధించుచున్నది. ఇక్కడ వాలిని వధించుట ధర్మమేగాని అధర్మముగాదని స్పష్టపరచెను.

*4-14-2 రాజు - అర్థసాధనము:*

అర్థశబ్దమునకు రామాయణమున భిన్నమగు నిర్వచనము కాన వచ్చుచున్నది. రాజులు విరోధము కొఱకు మాత్రమే గాక అర్థార్జనకు కూడా వేటాడుదురని తెలుపబడినది.

'ధనాని వ్యవసాయేన విచీయంతే మహావనే
ధాతవో వివిధాశ్చాపి మణిరత్న సువర్ణినః॥[70]

రాజులు మహారణ్యమున వేటాడి ఏనుగుల కుంభస్థలములందలి ముత్యములు, శ్రేష్ఠమగు మణులు బంగారము, వివిధ ధాతువులను సంపాదించెదరు. అర్థము గలవారికే అందఱు మిత్రులగుదురని స్పష్టముచేయబడినది.

*4-14-3 రాజు - కామసాధనము :*

ధర్మయుక్తమగుకామము ఆచరింపబడుచున్నది. దుష్కామమే రాజును స్వేచ్ఛాచారిగా రూపొందించును. భరతునితో శ్రీరాముడు

'కచ్చిదర్థేన వా ధర్మ మర్థం ధర్మేణ వా పునః
ఉభౌ వా ప్రీతిలోభేన కామేన న విబాధసే॥[71]

నీవు అర్థముచే ధర్మమును ధర్మముచే అర్థమును బాధింపవు గదా! అట్లే సుఖాభిలాషతో కామముచే ధర్మార్థములను బాధించుటలేదు గదా! అని ప్రశ్నించెను. కామ ప్రవృత్తితో ప్రవర్తించు రాజు తనను, తన రాష్ట్రమును కూడా నాశనము చేయును. అమితమగు కామప్రవృత్తి ధర్మమునతిక్రమింపజేయును. అట్టి ధర్మము నతిక్రమించిన వానిని రాజు దండింపవలెను. త్రివర్గముగా భావింపబడు ధర్మార్థ కామములకు రాజే మూలమని పేర్కొనబడినది.

'రాజాధర్మస్య కామస్య ద్రవ్యాణాంచోత్తమో నిధిః'।

రాజు ప్రజలకు సులభముగా దర్శనమీయవలెనని రామాయణమున చెప్పబడినది. శ్రీరాముడు భరతునితో

'కచ్చి ద్దర్శయసే నిత్యం మనుష్యాణాం విభూషితమ్।
ఉత్థాయోత్థాయ పూర్వాహ్ణే రాజపుత్ర ! మహాపథే॥

రాజపుత్రా ! నీవు ప్రతిదినము ఉదయమున లేచి అలంకరించుకొని సభలో జనులకు దర్శనమిచ్చుచున్నావా! అని ప్రశ్నించుటను బట్టి రాజు యొక్క దర్శనము ప్రజలకవసరమని తెలియుచున్నది. మొత్తముపై రాజధర్మాచరణము రామాయణమున పై విధముగానున్నది.



## పాదసూచికలు

1. వాల్మీ.రా.అయోధ్య -111-5శ్లో॥ 1a. వాలీ.రా.అయోధ్య.109-10శ్లో 2.Ibid.రా. అయోధ్య 109-11శ్లో॥ 3. వాల్మీ.రా.అయోధ్య-109-20 శ్లో ॥ 4. రంగ. రా.అయోధ్య.159,160 పుటలు 5.భాస్కర.అయోధ్య-368 ప॥ 6. వాల్మీ.రా.బాల.21-7 శ్లో॥ 7.రంగ.రా.బాల.24,25 -పుటలు 8.Ibid.రా. బాల.25 9. భాస్కర.రా.బాల-201, 202 ప॥ 10.వాల్మీ.రా.అయోధ్య.14-3 శ్లో॥ 11.Ibid.రా.అయోధ్య 14-6 శ్లో॥ 12. రంగ.రా.పుట-104 (అయోధ్యకాండ) 13. రంగ.రామా.అయోధ్య.పుట - 105 14. భాస్కర. రామా. అయోధ్య -23 15.వాల్మీ.రా.కిష్కింధ -30-70 శ్లో॥ 16.భాస్క.రామా. కిష్కింధ.470 17.వాల్మీ.రా.కిష్కింధ-34-7 శ్లో॥ 18.Ibid.కిష్కింధ.34-8 శ్లో॥ 19.వాల్మీ.రామా.కిష్కింధ.34-9 శ్లో॥ 20. భాస్కర.రా.కిష్కింధ-472. 21.(వాల్మీ) మూల.రా.కిష్కింధ.18-12 శ్లో॥ 22.వాల్మీ.రా. అరణ్య.50-6శ్లో॥ 23.Ibid.అరణ్య 51-24శ్లో॥ 24.వాల్మీ.రా.కిష్కింధ.18-11 శ్లో॥ 25.Ibid.కిష్కింధ.18-25శ్లో॥ 26.రంగ.రా.కిష్కింధ -245 పుట. 27.వాల్మీ.రా.యు.18-3 శ్లో॥ 28.Ibid. 29.రంగ.రా.యుద్ధ-342 పుట. 30.భాస్కర.రా.యుద్ధ.180ప॥. 31.Ibid.యుద్ధ.181ప॥ 32.భాస్క.రా.యుద్ధ-191 ప॥ 33.మొల్ల.రా.యుద్ధ 1-13 34.రామాభ్యు.7ఆశ్వా-85 ప॥ 35.Ibid.7ఆశ్వా-86ప॥. 36.రంగ.రా.అయోధ్య.96పుట. 37.రంగనాథ.రా. కిష్కింధ-245పుట. 38.

వాల్మీ.రా.బాల.25-16శ్లో॥ 39.రంగ.రా.బాల - 129 పుట. 40.భాస్క.రా.బాల -242 ప॥ 41.వాల్మీ.రా.బాల.9-10శ్లో॥ 42.రామాభ్యు.5ఆ-90ప॥ 43.వాల్మీ.రా.అరణ్య.10-10శ్లో॥ 44.భాస్కర.రా.కిష్కింధ-261వ। 45.Ibid.కిష్కింధ.262వ॥ 46.వాల్మీ.రా.అయోధ్య.100-34శ్లో॥ 47.వాల్మీ.రా.బాల.6-19శ్లో॥ 48.Ibid.బాల.13-19శ్లో॥ 49.Ibid.అయోధ్య. 67-19శ్లో॥ 50.Ibid.అయోధ్య.100-47శ్లో॥ 51.వాల్మీ.రా.బాల.10-19శ్లో॥ 52.Ibid.అయోధ్య. 73-22శ్లో॥ 53.రంగనాధ.రా.అయోధ్య.140పుట. 54.భాస్కర.రా.అయోధ్య.367శ్లో॥ 55.వాల్మీ.రా.అరణ్య.6-11శ్లో॥ 56.వాల్మీ.రా.అరణ్య. 6-12,13శ్లో॥ 57.రంగ.రా. అరణ్య.119 58.భాస్కర.రా.అరణ్య.57 59.వాల్మీ.రా.అరణ్య.9-26శ్లో॥ 60.Ibid. అయోధ్య 106-19శ్లో॥ 61.Ibid.అయోధ్య. 100-54శ్లో॥ 61a.రంగ.రా. అయోధ్య.155పుట. 62.వాల్మీ.మూల.రా.అయోధ్య.1-13శ్లో॥ 63.రంగ.రా.అయోధ్య -95పుట. 64.వాల్మీ.రా.అరణ్య.50-8శ్లో॥ 65.Ibid.అరణ్య. 50-9శ్లో॥ 66.వాల్మీ.రా. అరణ్య.37-13శ్లో॥ 67.Ibid.యుద్ధ.63.10శ్లో॥ 68.రంగ.రా.అయోధ్య-115పుట. 69.వాల్మీ.రా.కిష్కింధ.18-29శ్లో॥ 70.వాల్మీ.రా. అరణ్య.43-31శ్లో॥. 71.Ibid. అయోధ్య.100-62శ్లో॥.



# పంచమాధ్యాయము
# 5.0 రాజ్యాంగ పరిపాలనావిధానము

### *5-1* ప్రస్తావన :

రాజ్యరక్షణకు, ప్రజాసంక్షేమానికి సమర్థవంతమైన పాలన అద్దం పడుతుంది. రామాయణంలో కానవచ్చే పరిపాలనా విధానాలను ఈ అధ్యాయంలో పేర్కొనడం జరిగినది.

### *5-1.1* రాజు - పాలనా పద్ధతులు:

ఉత్తమ పరిపాలనను అందించి తద్వారా ప్రజలను సక్రమ మార్గంలో నడిపించడానికి రాజు మేలైన పాలనా పద్ధతులనవలంబించాలి. ఇందునిమిత్తం రాజనుసరించే పద్ధతులు రెండు. 1. వ్యక్తిగతంగా రాజనుసరించే పద్ధతి. 2. ప్రజలను రంజింపచేసే పద్ధతి. రామాయణమున ప్రధానముగా మానవ - వానర - రాక్షస పాలనలయందు పటిష్టమగు అధికారగణమున్నది. వనవాసానంతరం శ్రీరాముడు ఆదర్శవంతమైన పాలనా విధానాన్ని పాటించాడు. వనవాసకాలంలో భరతుడు ధర్మాన్ని అతిక్రమించకుండా పటిష్టమైన పాలనా విధానాన్ని రూపొందించాడు.

వాలి కిష్కింధను చక్కగా పాలించినట్లు వాలి మరణానంతరం దుఃఖాన్ని పొందిన హనుమంతుడు

> "యదయం న్యాయదృష్టార్థ స్సామ దాన క్షమాపరః।
> గతో ధర్మజితాం భూమిం నైనం శోచితు మర్హసి॥[1]

వాలి శాస్త్రజ్ఞుడై అందలి తత్త్వాన్ని తెలిసినవాడై దుఃఖితులైన తనవారినోదార్చుచు యాచకులకు చాలినంత యొసగుచు, అపరాధులను క్షమిస్తూ ధర్మపరులగు పుణ్యాత్ములకు లభించులోకాన్ని పొందాడు. అని అనడం ద్వారా వాలి పాలనాపటిమ తెలియుచున్నది. వాలి వధానంతరం కిష్కింధకు రాజ్యాభిషిక్తుడైన సుగ్రీవుడు శ్రీరాముని సూచనమేరకు అంగదుని యువరాజును చేసి వానరులను చక్కగా పాలించెను. ఆజ్ఞలనిచ్చి పాలింపజేయుటలో సుగ్రీవుడు బహునేర్పరి.[2]

రంగనాథ రామాయణంలో

'వివిధ పర్వతనదీ ద్వీపాధిపతుల - ప్లవగ గోలాంగూల భల్లూకపతుల
రావింపు మొకడైన రాకున్న నాజ్ఞ - గావింపుమని బంచె గడంకమై నిచట''[3]

అని ఆజ్ఞాపించినట్లున్నది.

భాస్కరరామాయణమున

'సరభసవృత్తి నేడు దివసంబుల మీఁద దాఁక నేవనే
చరు డీఁట రాకఁయుండు నతిసాహసుఁడై మఱిఁ వానిఁబట్టి ని
ర్భరతర చండదండముల పాలుగ,జేసి వధింతు నంచు నా
తరణితనూజుఁడేఁగె నిజధామములోనికి నంతనక్కడన్[4]

రామాభ్యుదయంలో

అనవుడు వాయు సూతి పరమాప్త వచోనయరీతిఁ(బ్రీతి నూ
నినమతి నాలకించి యట నీలుని నీతివివేక కార్యశీ
లుఁగని జానకిన్ జగములో వెదకంగఁ బ్లవంగవీరులన్
బనుపు మటంచు సౌరి నిజభామిని చెంతకు నేగె నంతటన్[5]

పై ఉదాహరణలను బట్టి వానరరాజగు సుగ్రీవుడు తన ఆజ్ఞలచే తిరుగు లేని అధికారముతో పాలన చేసినట్లు తెలియుచున్నది. ఇదే సందర్భంలో

"అహోభి ర్దశభి ర్యే హి నాగచ్ఛంతి మమాజ్ఞయా।
హంతవ్యా స్తే దురాత్మానో రాజశాసనదూషకాః''॥

అట్లునా ఆజ్ఞ చొప్పున పదిదినాలలో నిచటకు చేరుకొనని దురాత్ములు రాజశాసనమునే ధిక్కరించిన వారగుటచే వారిని వధింపవలెనని ఆజ్ఞాపించినట్లును గలదు. సుగ్రీవునాజ్ఞ మీరి యెవ్వడూ సుఖముగానుండలేడనెను. కిష్కింధా రాజ్యమున రాజునకు సలహాలనిచ్చు వర్గమొకటి యున్నది. రహస్యంగా రాచకార్యాలాలోచించి ప్రయోగించటంలో దిట్టయగు సుగ్రీవుడు హెచ్చుతగ్గులాలోచించి మంత్రాలోచనము చక్కగా తెలిసి ఆ పనిలోనే నిమగ్నులైన తనమంత్రులతో సంభాషించెననుటలో అతనిపాలనావైదుష్యము ప్రకటితమగుచున్నది.[6]

ఇక రాక్షసాధిపతియైన రావణుని లంకారాజ్యంలో కూడా చక్కని పాలనాయంత్రాంగమున్నదనుటలో సందేహములేదు. రావణుడు అతి వీరభయంకరుడు. పాలనమున తగు ఏర్పాట్లు చేయించెను. రావణుడు రాజ నీతిశాస్త్రానికి విరుద్ధంగా వ్యవహరించే సందర్భంలో విభీషణుడు వారించడాన్ని బట్టి రాక్షసరాజు ఎదుట లోపములనెత్తి చూపగలవ్యవస్థ ఉండెడిదని తెలియుచున్నది.

కోసల, కిష్కింధా, లంకా రాజ్యములను విశ్లేషించినచో అనేక పోలికలు కనబడును. ఆయారాజ్యాలయందలి సువ్యవస్థీకృత పాలనావిధానములు, రాజ్యసంక్షేమమునకు, ప్రజారక్షణకు ప్రధానకారకములుగా సందర్శనమిచ్చుచున్నవి.

రాజ్యపాలన ప్రధానంగా మూడు విధానములపై ఆధారపడియున్నది. అవి 1. ప్రజాపరిపాలనము. 2.న్యాయ పరిపాలనము 3. ఆర్థిక పరిపాలనము.

*5-2 ప్రజాపరిపాలనము :*

రాజ్యపాలనా పటిమను నిర్ణయించు ప్రధాన విధానాలలో ప్రజాపరిపాలనము మొదటిది. రామాయణములో ప్రజాపరిపాలనకు సంబంధించిన విషయాలు పలుసందర్భాలలో ప్రస్తావించబడింది. లోకాభిరాముడైన శ్రీరాముడు ప్రజాపాలన తత్త్వజ్ఞుడని తెలుపబడింది. మంత్రి, పురోహితుడు, సేనాపతి, యువరాజు, దూత, నగరపరిరక్షకుడు, మున్నగు అధికారులు ప్రజలయెడ సేవాదృక్పథంతో మెలగవలయునని రామాయణమాసించింది.

*5-2-1 అధికారుల గుణగణాలు :*

తన వద్దకు తరలివచ్చిన భరతునితో శ్రీరాముడు పురోహితుల గుఱించి.

'కశ్చి ద్వినయసంపన్నః కులపుత్రో బహుశ్రుతః।
అనసూయు రనుద్రష్టా సత్కృత స్తే పురోహితః॥[7]

వినయంతో ఒప్పువాడు, సత్కులమున పుట్టినవాడు, బహుశాస్త్ర పారీణుడు, అసూయలేనివాడు, కులగురువగు వశిష్ఠుడు చెప్పిన విధులను చక్కగా పర్య వేక్షించువాడగు నీ పురోహితుని సేవించుచుంటివా! అనుటలో పురోహితునికి ఉండాల్సిన గుణగణాలు, రాజపురోహితుని పట్ల ప్రవర్తింపవలసిన తీరు వర్ణితమైనది.

రామాయణంలో పురోహితుని విధుల నీవిధముగా వివరించడం జరిగింది. అతడుఅగ్నికార్యాలను చేస్తూ అశ్వమేధాదియాగాలనాచరింపజేయువాడై, సకల యజ్ఞవిధులను తెలిసినవాడై ఊహాపోహాదులను కల్పించుటలో నేర్పరియై యుండవలెను. ధనుర్వేదాచార్యుడైన సుధన్వుడు, అమంత్రక, సమంత్రకములైన బాణాలు కలిగినవాడై నీతికోవిదుడైన వానిని ఆదరించుచుంటివా! యని శ్రీరాముడు భరతుని ప్రశ్నించెను.

కచ్చి దాత్మసమా శ్శూరా శ్శ్రుతవంతో జితేంద్రియాః।
కులీనాశ్చేంగితజ్ఞా శ్చ కృతా స్తే తాత మంత్రిణః॥[8]

నీ యొద్దగల మంత్రులు ధీరులుగను, నీతిశాస్త్రకోవిదులుగను, ఉత్తమకుల సంజాతులుగను, చూడగానే ఇతరుల మనోభావాలను గ్రహింపగలవారుగానున్నారా! అని రాముడు ప్రశ్నించెను.

### 5-2.2 సేవాధర్మాలు:

రాజుకు సర్వవిధాల సహకరిస్తూ రాజు యెడల అచంచల విశ్వాసముతో మెలగుతూ ప్రజల యెడ సేవాదృక్పధాన్ని మంత్రులు, ఇతర అధికారులు కలిగి యుండాలి.

దశరథుని మంత్రులు 'మనస్యేకం, వచస్యేకం, కర్మణ్యేకం మహాత్మనామ్' అనేసూక్తికి ఉదాహరణమై ప్రతాపము, ఓరిమి వలన మిగుల ప్రసిద్ధినొంది మాత్సర్యములేక అందరితో చిరునగవులొలికేటట్లు మాట్లాడేవారు. అంతేగాక వారు శత్రువులనదుపులో ఉంచుకొనగల పరాక్రమవంతులు, శత్రువులను జయించుటకెల్లప్పుడు ఉత్సాహాన్ని కలవారు, నీతిశాస్త్రాన్ని ఎల్లప్పుడు ఆచరణలో పెట్టుకొన్నవారు, కాబట్టే తమదేశంలో నివసించే సత్పురుషులను ఎల్లప్పుడు కాపాడేవారని వాల్మీకి రామాయణంలో చెప్పబడింది.[9]

రంగనాథ రామాయణంలో వీరిని గూర్చి ఈవిధంగా చెప్పబడింది

'నామంత్రులందఱు నన్యోన్యహితులు - స్వామికార్య విచార చతురమానసులు
పరమర్మ భేదనోపాయధౌరేయ - అరసి ప్రజారక్షమాచరింపుదురు[10]

అని ప్రజారక్షకులుగ మంత్రుల గుణగణాలు వర్ణితములైనవి.

భాస్కర రామాయణంలో

దానులు రాజ్యవర్ధనులు దత్త్వవిచారులు దారులింగిత
జ్ఞానులు మంత్రకోవిదులు సత్యవచస్కులు విద్విషత్తమో
భానులు ధీయుతుల్ చతురుపాయసమర్థులు రాజకార్యసం
ధాన పరాయణుల్ వినయతత్పరులాపురి మంత్రులెంతయున్

అనుటలో సమర్థతతో పాటు వినయతత్పరత కలిగియుండుట మంత్రివరుల కవసరమని సూచింపబడినది.

"చోరో ధన లోభాన్నరర్షభ" చోరుడు ధనలోభంచే విడిచిపెట్టబడుట లేదుగదా! అని అడుగుటలో అట్టి అవినీతికి తావుండరాదని సూచితము.

'వ్యసనే కచ్చి దాఢ్యస్య దుర్బలస్య చ రాఘవ,
అర్థం విరాగాః పశ్యన్తి తవామాత్యాః బహుశ్రుతాః॥[11]

ధనవంతునకు దరిద్రునకు నడుమ వివాదరూపమైన సంకటము గలిగితే ఆ వ్యవహారాన్ని ధనమందాశలేకుండా నిష్పక్షపాతంగా నీ మంత్రులు ప్రవర్తిస్తున్నారా! అని ప్రశ్నించుట చేత మంత్రులకుండాల్సిన నిష్పాక్షికత సూచితమగుచున్నది.

రాజు అధికారులను నియమించడంలో బాధ్యతల నప్పగించడంలో తగిన జాగ్రత్తలు తీసుకొనవలెను. అధికారులు ప్రజాసేవకులమని గుర్తెరిగి రాజుకు అన్నివిధాల చేదోడువాదోడుగా ఉండాలి. ఉపేక్షాభావం, ఉదాసీనత, నిర్లక్ష్యము, అవినీతి, ఆశ్రితపక్షపాతము మొదలగు దుర్గుణాల్ని దరిచేర నీయరాదు. రాజు చేసే దుష్కృత్యాల్ని ఖండించాలి. మంత్రులు రాజుకు హితాన్ని చెప్పవలసిన సమయమున చెప్పకపోవుట చేత రావణుడు పతనమగుటకు అవకాశమున్నట్లు మహోదరునితో కుంభకర్ణుడు ఈవిధంగా చెప్పాడు.

యుద్ధే కాపురుషై ర్నిత్యం భవద్భిః ప్రియవాదిభిః।
రాజాన మనుగచ్ఛద్భిః కృత్య మేతద్ధి సాధితమ్.॥[12]

యుద్ధమంటే భయపడే మీరు రాజు దగ్గఱ హితాన్ని పలుకవలసివచ్చినప్పుడు కూడా(సీతాపహరణ సందర్భంలో) ఇచ్చకపు మాటలు మాటాడి రాజునకనువర్తులై వ్యవహరించిరి. రాజు చేయదగిన పనిని చేయబూనినపుడు మిత్రులైన మీరు వారిని నివారింపకపోతే మీరు శత్రువులే యగుదురు. కాబట్టి వాస్తవంగా మీరు ఈ రాజును శత్రువుగనే భావించి యున్నందున తుదకు లంకలో రాజు దప్ప వేఱొక్కడు మిగులకుండా ఉండటమే గాక ధనాగారము రిక్తమౌతుంది.

'రాజ్ఞా శేషా కృతా లంకా క్షీణః కోశో బలం హితమ్।
రాజాన మిమ మాసద్య సుహృచ్ఛిహ్న మమిత్రకమ్.॥[13]

అని అధికారులు ప్రవర్తించకూడని విధము చెప్పబడింది. అధికారులను రాజు ఆజ్ఞాపించి తన పనులను నెఱవేర్చుకొనవలెనని రామాయణం చెప్తున్నది.

### *5-2.3 భృత్యుల నియామకం - రాజుల కర్తవ్యం:*

ప్రజాసేవకుల్లో రెండోవర్గంవారు భృత్యులు. తమసేవల్ని రాజ్యానికి వినియోగించే వీరికి జీతాలిచ్చి కొన్ని అధికారాలిస్తాడు. రాజుకు సన్నిహితంగా ఉండే భృత్యులు కొందరైతే, దూరంగా ఉంటూ తమకు కేటాయించిన విధులను నిర్వర్తించే భృత్యులు ఇంకొందరు. భృత్యులు చేసే సేవావిధానాలు భిన్నమైనవైనప్పటికీ, వాటినన్నింటికీ అంతిమలక్ష్యం ఒక్కటే. అదే రాజ్యానికి రాజు సేవచేయడం. వీరందఱూ తమతమ

విధుల్ని నిర్వర్తిస్తేనే రాజ్యం సక్రమంగా ప్రవర్తించగల్గుతుంది.

'కచ్చి న్ముఖ్యా మహత్స్వేవ మధ్యమేషు చ మధ్యమా।
జఘన్యాశ్చ జఘన్యేషు భృత్యాస్తే తాత యోజితాః''॥[14]

ఉత్తములైన సేవకులు వండుట, వడ్డించుట మొదలైన కార్యములందు, జాత్యాదులచే మధ్యములగు భృత్యులు శయ్యవేయుట, ఆసనాదులు తెచ్చుట మున్నగు కార్యములందు, జాత్యాదిహీనులైన సేవకులు పాదములను కడుగుట, చెప్పులు తెచ్చుట, పాదములొత్తుట మొదలగు పనులకు నియమింపవలయునని రామాయణము వలన తెలియుచున్నది.

రంగనాథ రామాయణములో కూడా

'నరసి యుత్తమ మధ్యమాధమ జనుల - వెలవుతోఁబనిగొందువే తగినట్లు''[15]

- అని శ్రీరాముడు భరతుని ప్రశ్నించుట గలదు.

'కాలాతి క్రమణాహ్యేచ్చైవ భక్తవేతనయోర్భృతాః।
భర్తురప్యతికుప్యంతి సోఽనర్థః సుమహాన్కృతః॥[16]

రాజు తమ భృత్యులకు సకాలంలో ఆహార, వేతనములనీయవలయును. లేకపోతే భృత్యులు ప్రభువుపై కోపింతురు. తద్వారా కీడు కలుగును.

రంగనాథ రామాయణంలో ఇదే సందర్భంలో

'కొలిచిన వారికి గోరి జీతములు - నిలువగాకుండ సన్నిధినొసగుదువె''[17] అని కలదు. కాబట్టి రాజ్యానికి సేవచేసి దాని అభివృద్ధికి పాటుపడే భృత్యుల్ని రాజు బాగా చూచుకోవాలి.

*5-2.4 గణజనులను పాలించు విధానము:*

అర్థాన్ని ఆర్జించే వాళ్లు, కార్యనైపుణ్యం కలవాళ్ళు, ఆయుధాలతో జీవించేవాళ్లు, ఒక సంఘంగా ఉంటారు. వీరినే గణజనులంటారు.

'కచ్చిద్ధృష్టశ్చ శూరశ్చ ధృతిమాన్ మతిమాంఞ్ఛుచిః।
కులీన శ్చానురక్తశ్చ దక్ష స్సేనాపతిః కృతః॥[18]

రాజుచేసే సత్కారం చేత సంతుష్టుడైనవాడు, శత్రువులనదుపులో పెట్టుటలోను సేనావ్యూహాదుల నెఱిగిన ధీశాలి, ఆపదలలో ధైర్యంగలవాడు, యజమానిపై విశ్వాసం కలవాడు, సత్కులంలో పుట్టినవాడు, కార్యకుశలుడైనవానిని సేనాపతిగా నియమింప వలెనని రామాయణము స్పష్టపఱుచుచున్నది.

రంగనాథ రామాయణమున ఇదే సందర్భములో

'మతిమంతుల సకల సమ్మతుస్వామిహితుని - వితత విక్రముసైన్యవిభుజేసినావె"[19] అనుటనుబట్టి బుద్ధిమంతుని, సకల జనులు సమ్మతించిన వానిని రాజుకు మేలు కూర్చువానిని, గొప్ప పరాక్రమము గలవానిని సేనాధిపతిగా నియమించవలయునని తెలియుచున్నది. మహాబలవంతులు, యుద్ధకుశలురు, పూర్వం యుద్ధంలో తమ సామర్థ్యాన్ని చూపినవారు. "శూరులైన ప్రధానవీరులకు చక్కగా పారితోషికాదుల నిచ్చుచుంటివి గదా! అని రాముడు భరతుని ప్రశ్నించుట ద్వారా గణజనులను సమాదరించవలసిన పద్ధతి వివరించబడింది[20]. వ్యవసాయము, గోరక్షణము చేస్తూ జీవించే వైశ్యులు నీయందనురక్తులై ఉన్నారా! క్రయవిక్రయాది రూపమగు వాణిజ్యమున్నపుడే నిన్నాశ్రయించిన జనులు సుఖముగానున్నారు గదా![21] ఈ ప్రకారం గణజనులను రాజు అదుపులోనుంచుకొనవలె. ఎటువంటి వారితోనైనా కయ్యానికి వీరు కాలు దువ్వుతారు కాబట్టి జాగ్రత్త వహించవలెనని రామాయణం చెప్తున్నది.

### *5-2.5 రాజపురోహితుడు:*

రాజ్యవ్యవస్థలో రాజుకు మార్గదర్శియగుశక్తి రాజపురోహితుడు. రాచకార్యాలయందు రాజపురోహితునకు ఎనలేని అనుభవముండును. రామాయణమున ఇక్ష్వాకు రాజవంశానికి కులగురువు పురోహితుడైన వశిష్ఠుడు దశరథుని, శ్రీరామచంద్రుని పాలనయందు రాజ్య సంక్షేమానికి పాటుపడినవాడు.

మొదట వశిష్ఠుడు చక్కని ఆశ్రమ జీవితాన్ని గడిపెను. ఇతడు బ్రహ్మతనయుడు. ఉదారబుద్ధిగలవాడు; ధర్మాత్ముడు, కామధేనువును ప్రసన్నము చేసికొనినాడు. అటుతర్వాత క్షత్రియ - బ్రాహ్మణ సంబంధాలు బాగా దెబ్బతీయబడిన సంఘటనలో వశిష్ఠుని కామధేనువును రాజైన విశ్వామిత్రుడు ఇవ్వవలసిందనినప్పుడు వీరిద్దరికి పోరు జరిగింది. ఆ సందర్భంలో వశిష్ఠుడీ విధముగా పలికెను.

'నహి తుల్యం బలం మహ్యం రాజా త్వద్య విశేషతః।
బలీ రాజా క్షత్రియశ్చ పృథివ్యాః పతిరేవ చ"॥[22]

నాకు రాజుబలముతో సమానమైన బలము లేదు. రాజు నాతపోబలం చేత దండనీయుడు కాడు. రాజు బలవంతుడు. క్షత్రియుడు, భూమికి పాలకుడు. కాబట్టి అతన్ని దండింపరాదని పలికినపుడు కామధేనువు శబల

"నబలం క్షత్రియస్యాహుర్బ్రాహ్మణో బలవత్తరః।
బ్రహ్మన్ బ్రహ్మబలం దివ్యం క్షత్రాత్తు బలవత్తరమ్"॥[23]

అనుటను బట్టి క్షత్రియ బలమొక బలము కాదని బ్రాహ్మణుడొ మిగుల బలవంతుడని పలికెను. అపుడుఅపారమైన సైన్యాన్ని సృజించి విశ్వామిత్రుని ఓడించెను.

కులశీలములు గలిగియుండి వేద పారీణుడై, దండనీతిలో ఆరితేరిన వశిష్ఠుడు ఇక్ష్వాకురాజులకు రాజగురువు (పురోహితుడు) అయ్యెను.

'ఇక్ష్వాకూణాం హి సర్వేషాం పురోధాః పరమా గతిః।
పురోధసస్తు విద్వాంసస్తారయంతి సదా నృపాన్॥[24]

ఇక్ష్వాకు లెల్లరకు పురోహితుడైన వశిష్ఠుడే శ్రేష్ఠుడు. విద్వాంసులగు పురోహితులెల్లప్పుడు రాజులను తరింపచేస్తారని చెప్పటాన్ని బట్టి వశిష్ఠుడు పురోహితుడనియు అతన్ని రాజు గౌరవించాలని తెలియుచున్నది.

రంగనాథ రామాయణంలో ఇదే సందర్భంలో

"నరయ బురోహితులగువారు గారె - ధరణీశులకు సర్వధర్మసాధకులు"[25]

అనుటను బట్టి పురోహితుని స్థానము విశదీకరింపబడినది.

'ఇక్ష్వాకూణాం హి సర్వేషాం పురోధాః పరమోగురుః।
న చాతిక్రమితుం శక్యం వచనం సత్యవాదినః"[26]॥

దీన్నిబట్టి ఇక్ష్వాకులెల్లరకు పురోహితుడే పరమగురువని, అతని మాట దాట శక్యము కానిదని తెలియుచున్నది.

బ్రాహ్మణ క్షాత్రసంబంధాలు దశరథుడు రాజయ్యే నాటికి కొంతమెఱుగుపడింది. వశిష్ఠుడు మాత్రమే ఓర్మిగలవాడు. దశరథుని చే నుచితరీతిని గౌరవింపబడెను.

సంతానములేదని, యాగముచేయదలచినట్లు దశరథుడు మంత్రుల నడిగినపుడు "సుమంత్ర ప్రసిద్ధులగు మాగురువులనెల్లరను పురోహితుల తోడ్కొని రండు"[27] అని పలుకగా సుమంత్రుడు, సుయజ్ఞుడు, వామదేవుడు, జాబాలి, కాశ్యపుడు అను దశరథుని గురువులను, పురోహితుడగు వశిష్ఠుని, తక్కిన బ్రాహ్మణోత్తములతో గూడ వెంటబెట్టుకొని వచ్చెననుటలో వశిష్ఠునికివ్వబడిన స్థానము స్పష్టమగుచున్నది.

'భగవాన్ స్నిగ్ధః సుహృన్మహ్యం గురుశ్చ పరమో మహాన్।
వోఢవ్యో భవతా చైవ భారో యజ్ఞస్య చోద్యతః'[28]॥

ఇక్కడ దశరథుడు, అశ్వమేధయాగ భారాన్ని వహింపుమని వశిష్ఠునాదేశించాడు. నీవు నాపై ఎడతెగని స్నేహభావం కలవాడవు. వామదేవాదులకంటె ఉత్కృష్టుడవు.

నీవీయజ్ఞభారాన్ని వహించగలిగినవాడవు. అని కోరగా దానికి వశిష్ఠుడంగీకరించి అట్లా చేశాడు. విశ్వామిత్రుడు రాక్షసవధకై రామలక్ష్మణులను తనవెంట పంపమని దశరథుని అడిగినపుడు దశరథుడు వాని వెంట పంపటానికి వెనుకాడుచుండగా వశిష్ఠుడు రాముని విడిచిపెట్టుమని, దశరథునకు సలహానిచ్చి వాని వెంట పంపించెను.

రాముని పట్టాభిషేక ప్రకటన సమయాన్ని, పట్టాభిషేకానికి కావల్సిన ఏర్పాట్లకై ఆదేశాలివ్వడం, సీతారాములచే ఉపవాసవ్రతాన్ని చేపట్టేటట్లు చెయ్యడం మొదలైన కార్యక్రమాలన్నీ వశిష్ఠుడే నిర్వహించెను[29]. రాముడు అరణ్యాలకు వెళ్లుచున్న విషయం తెలిసిన వశిష్ఠుడు కైకేయిని మందలించి రాముడులేని సమయంలో సీత రాముని రాజ్యం ఏలవలెనని చెప్తాడు. రానున్న కాలంలో భరతుడు చేయు పనిని చెప్పగలిగినాడు.[30] పిమ్మట దశరథుడు విగతజీవుడుకాగా మార్కండేయుడు, మౌద్గల్యుడు, వామదేవుడు, కాశ్యపుడు, కాత్యాయనుడు, గౌతముడు, జాబాలి వచ్చి వశిష్ఠుని ఇక్ష్వాకువంశ్యులలో నొక్కని రాజుగా చేయుమనగా వశిష్ఠుడు దూతలను బంపి భరతశత్రుఘ్నులను అయోధ్యకు రావించెను. భరతుడు కైక చేసిన పనికి దుఃఖిస్తుంటే వశిష్ఠుడు ఓదార్చుచు ఆతనిని కర్తవ్యోన్ముఖుని గావించెను.[31] సకలజనులు సమావేశమైన ఆ సభలో వశిష్ఠుడు భరతుని రాజ్యాన్ని స్వీకరింపుమని ఉపదేశిస్తాడు. కానీ భరతుడు వశిష్ఠుని యెడల గౌరవమున్నప్పటికీ 'నీవిట ధర్మము చెప్పవలయు'ననుచు పురోహితుడిట్లు అహితమును నిందించెను.[32]

భరతుడు రామాశ్రమానికి వెళ్లినపుడు ఇక్ష్వాకు కులగురువైన వశిష్ఠుని వెనుకటివలె గౌరవించుచున్నావా? అని ప్రశ్నించుటను బట్టి కులగురువుకిచ్చే గౌరవం సూచింపబడుచున్నది.

ఈసందర్భంలో రంగనాథ రామాయణమున

"కోవిదు మత్కులగురు తపోనిష్ఠ - నావశిష్ఠ గరిష్ఠ నలరింతె నీవు"[32a] అని ప్రశ్నించినట్లు గలదు.

జాబాలి యెడ శ్రీరాముడు కోపించినాడని ఎఱిగిన వశిష్ఠుడు 'జాబాలి' ఆంతర్యమును చెప్పి శాంతపరచినాడు.

రాముడు తిరిగి అయోధ్యకు వచ్చిన తరుహత ముగ్గురు మంత్రులు, రామునకు పట్టాభిషేకము జరపటానికి వశిష్ఠునితో ఆలోచన చేసిరి.[33]

"తతః సప్రయతో వృద్ధో వశిష్ఠో బ్రాహ్మణైస్సహ।
రామం రత్నమయే పీఠే సహసీతం న్యవేశయత్.[34]॥

వశిష్ఠుడు బ్రాహ్మణులతో కలిసి సీతారామసమేతునిగా రత్నాలు పొదిగిన పీఠంపై కూర్చుండజేసి అభిషేకించెను.

ఈ ప్రకారం కులగురువు, రాజపురోహితుడునగు వసిష్ఠుడు సంభావింపబడెను. రాజ్యంలో పురోహితునకు చెప్పుకోదగ్గ రాజకీయ ప్రాముఖ్యత ఉన్నట్లు రామాయణముద్వారా నిరూపించబడుచున్నది. రాజుకు సంబంధించిన అన్ని వ్యవహారాల్లో మార్గదర్శిగా ఉపదేష్టగానున్న వసిష్ఠుడు రాజ్యసంక్షేమానికి తోడ్పడినాడు.

### *5-3 విత్త పాలనము:*

సమస్త కార్యాలకు మూలమైంది కోశము. ఇది రాజ్యానికి గల సప్తాంగాలలో ఒకటి.

### *5-3.1 రాబడి - పన్నులు:*

రాజు భూమిరక్షణ కొఱకు పన్నును విధిస్తాడు. మంత్రులు ధనాన్ని సంపాదించి ధనాగారాన్ని నింపడంలో నేర్పరులు. ఈ విషయాన్ని దశరథుని మంత్రుల గుఱించి 'కోశసంగ్రహణే యుక్తా బలస్యచ పరిగ్రహే'[35] అనే శ్లోకంలో చెప్పాడు.

"బ్రహ్మక్షత్రమహింసంత స్తే కోశం సమపూరయన్।
సుతీక్ష్ణదండాః సంప్రేక్ష్య పురుషస్య బలాబలమ్.॥[36]

ఒక వ్యక్తిచేసిన అపరాధములో బలాబలాన్ని విచారించి అపరాధం పెద్దదైనచో కఠినదండము, స్వల్పమైనచో సాధారణ దండము విధించి ధనాగారాన్ని మంత్రులు నింపేవారని తెలియుచున్నది.

'బలిషడ్భాగముద్ధృత్య నృపస్యారక్షతః ప్రజాః।
అధర్మోయో ఽ స్య సోఽస్యాస్తు యస్యార్యోఽనుమతే గతః॥[37]

ప్రజలపంటలో ఆఱవపాలు కప్పంగా గ్రహించియు వారిని రక్షింపనిరాజు అధర్మంపాలవుతాడు.

'ఆయస్తే విపులః కచ్చిత్ కచ్చిదల్పతరో వ్యయః।
అపాత్రేషు న తే కచ్చిత్ కోశోగచ్ఛతి రాఘవ"॥[38]

రాబడి అధికంగాను వ్యయం అల్పంగాను ఉన్నదా! నీ ధనాన్ని అపాత్రులకు, నట విట గాయకాదులకు ఇవ్వడంలేదుగదా! అని రాముడు భరతుడ్ని ప్రశ్నించాడు.

రంగనాథరామాయణమున

'అపర రాత్రులు లేచి యర్థచింతనము- నిపుణత జేయుదె నీవు నిత్యంబు"[39]అని అర్థచింతనాన్ని అపరరాత్రులందు నైపుణ్యంతో చెయ్యాలని చెప్పబడింది.

'దైవతార్థే చ పిత్రర్థే బ్రాహ్మణాభ్యాగతేషు చ।
యోధేషు మిత్రవర్గేషు కచ్చిద్గచ్ఛతి తే వ్యయః॥[40]

నీవు చేసే వ్యయము దేవకార్యాలకు, పితృకార్యాలకు బ్రాహ్మణులకు, అతిథులకు, యోధులకు, మిత్రులకు మాత్రమే వినియోగించవలెనని శ్రీరాముడు భరతునకు వ్యయవిధానమును స్పష్టపరచెను. జ

'ధనాని వ్యవసాయేన హి యంతే మప వనే।
ధాతవో వివిధశ్చాపి మణిరత్న సువర్ణినః'[41]॥

అని చెప్పుటలో అరణ్యాలలోని ఏనుగుల కుంభస్థలము నందలి ముత్యాలు, శ్రేష్టములగు మణులు, బంగారము గల ధాతువులను రాజులు సంపాదించి కోశాగారమున చేర్చెదరు. రామాయణంలో పైవిధంగా పేర్కొనబడినటుల రాజులు ధనాన్ని సంపాదించి వ్యయం చేస్తుంటారు.

*5-4* న్యాయపాలనము:

ప్రజలు సుఖశాంతులతో జీవనాన్ని గడిపేటట్లు చేయడం రాజ్యం యొక్క విధి. అది న్యాయపరిపాలన వల్లనే నెరవేర్చబడును. రాజు న్యాయపరిపాలన చేయగలిగిన ఏకైక మప శక్తి. తన దండనాధికారాన్ని విచక్షణతో వినియోగించగలిగిన రాజు దోషులను శిక్షించడమే కాదు. క్షమాభిక్షను గూడా ప్రసాదించగలరు. దోషారోపణలు వచ్చినపుడు రాజు న్యాయాన్యాయములను బాగా విచారించి తీర్పునివ్వవలసియుంటుంది. ఒకవేళ అసత్యారోపణము చేయబడినవారిని దండించిన యెడల తీవ్రఫలితాన్నను భవించవలసియుండును.

"యాని మిధ్యాభిశస్తానాం పతంత్యశ్రూణి రాఘవ।
తాని పుత్ర పశూన్ ఘ్నంతి ప్రీత్యర్థ మనుశాసతః'[42]॥

అసత్యమైన ఆరోపణలతో ప్రజలు కన్నీరుకార్చిన యెడల ఆరాజ్యంలో న్యాయవిచారణచేయక, రాజ్యపాలనము చేస్తే అక్కడ బిడ్డలు, పశువులు నశించడం జరుగుతుంది. రాజు అందరికంటెను అధికుడు. ధర్మము తప్పి కామవశులైన వారిని శిక్షించును. ఈ విషయమే శ్రీరాముడు వాలితో

'గురుర్ధర్మ వ్యతిక్రాంతం ప్రాజ్ఞోధర్మేణ పాలయన్।
భరతః కామ వృత్తానాం నిగ్రహే పర్యవస్థితః॥[43]

భరతుడు, ధర్మము తప్పక పాలించుచున్నాడు. ధర్మము తప్పి కామప్రవృత్తులైన వారిని శిక్షింపవలయునని భరతుడు నిశ్చయించినాడు.

'అహోభి ర్దశభి ర్యేచ నాగచ్ఛంతి మమాజ్ఞయా।
హంతవ్యా స్తే దురాత్మనో రాజశాసనదూషకాః'॥[44]

రాజ శాసనం ధిక్కరించుటగూడ శిక్షార్హమే. నా ఆజ్ఞ చొప్పున పదిదినాల్లో ఇచ్చటకు చేరుకొనని దురాత్ములు (వానరులు) రాజ శాసనాన్నే ధిక్కరించిన వారగుటచే వారిని వధించాలని సుగ్రీవుడు హనుమంతునితో పలికెను.

త్రిపంచరాత్రా దూర్ధ్వం యః ప్రాప్నుయాదిహ వానరః।
తస్య ప్రాణాంతికో దండో నాత్ర కార్యవిచారణా"॥[45]

ఇప్పటినుండి పదునైదు దినములలోపల ఈ ప్రదేశానికి వానరులు రావాలి. అట్లా ఏ వానరుడైనా రాకపోతే వానికి మరణదండన విధించబడునని నీలునితో సుగ్రీవుడు చెప్తాడు.

ఇదానీ మకృతార్థానాం మర్తవ్యం నాత్ర సంశయః।
హరిరాజస్య సందేశమకృత్వా కఃసుఖీ భవేత్'[46]॥

సీతాదేవిని చూడక గడువునతిక్రమించుట చేత మనకు చావు తప్పదని సుగ్రీవుని ఆజ్ఞ మీరి ఎవరూ సుఖముగానుండరని అంగదుడు వానరులతో చెప్పెను.

రంగనాథ రామాయణంలో ఇదే సందర్భంలో

'శ్రీరాముకార్యంబు సేయకపోయి - యా రవిసూనుచే నటు సచ్చుటకంటె
నీ యెడఁజచ్చుట యిదిలెస్సమనకు - ప్రాయోపవేశన పరులు గండనుచు'[47]

భాస్కర రామాయణంలో

ఇనజుఁడు మితిచేసినయా - దినములు పోఁజొచ్చెఁగాన తిరుగఁగ నెచటన్
జనకజఁ గానమ! యటకున్ -మన మేఁగిన రవిజుఁడపుడ మడియంజేయున్[48]

అని పలికినట్లు గలదు. దీనినిబట్టి "రాజాజ్ఞ" అతిక్రమించరానిదని, అది దండార్హమైనదనియు తెలియుచున్నది.

పాపకృత్యాలు చేసిన మానవులు రాజదండనచే పాపమునుండి విముక్తులగుచున్నారు. ఇదే విషయాన్ని శ్రీరాముడు వాలితో

'రాజభి ర్ధృతదండాశ్చ కృత్వా పాపాని మానవాః।
నిర్మలాః స్వర్గమాయాంతి సంతః సుకృతినో యథా"॥[49] అని పలికెను.

రంగనాథ రామాయణములో

'రాజదండితుడు నారక బాధ బొరయ - డోజమైగాన నా యుగ్రాస్త్రనిహతి
మనికిత పడక నిర్మలుడవైయింక - ననిమిష రాజ్య సౌఖ్యము బొందుమీవు[50]

ఇదే సందర్భంలో భాస్కర రామాయణంలో

"జను లొనరించిన పాపము - పనుపడ జననాథుఁబొందుఁ బ్రాయశ్చిత్తం
బున నాదురితము వాయును । జనులకు నృపశిక్ష డాయు సకలార్థంబుల్[51]

జనులుచేసిన పాపములకు రాజుచేసిన ప్రాయశ్చిత్తంతో ఆపాపంపోతుంది. కావుననే రాజు జనులకు శిక్ష విధించును.

మొత్తంముమీద రామాయణంలోని న్యాయపరిపాలనా సూత్రములను పరిశీలించగా శిక్షాపరిధిలో బ్రాహ్మణులనుగాని, క్షత్రియులనుగాని, హింసింపక అపరాధులను దండించవలయును. అట్లే ఒకవ్యక్తిచేసిన అపరాధములో బలాబలములను అనగా దోషములో తారతమ్యాలను విచారించి, అపరాధము పెద్దదైతే కఠిన దండన విధించవలయును. స్వల్పమైనచో సాధారణ దండనము అనగా అపరాధ రుసుము మున్నగునవి విధించాలి[52] అయితే నీతి శాస్త్రానికి మీఱి కల్పాన్ని గైకొనరాదు.[52a]

*5-4-1* శిక్షలు:

రామాయణ కాలమున సాధారణ దండనము, కఠినదండములు వ్యక్తిచేసిన అపరాధముననుసరించి విధించెడివారు.[53] కన్నతండ్రినైనా శిక్షించే పద్ధతియుండేది.[54] అదేవిధంగా కన్నకొడుకునైనా న్యాయశాస్త్రానుసారం శిక్షించేవారు[55]

తమ ధర్మాన్నతిక్రమించి కామంతో వ్యవహరించిన స్త్రీపురుషులెవ్వరైనా శిక్షింపబడేవారు. రాజు వారికి అంగవిచ్ఛేదన శిక్షను విధించేవాడు. అపవిత్రము, ఒడలు మరచినది, ప్రమత్తయునగు శూర్పణఖకు[55a] అయోముఖికి[56] అంగచ్ఛేదన శిక్ష అమలు పరచబడినది.

*5-4-2* మరణ దండన :

రాజు భీకరమైన ఆజ్ఞకలవాడు. తన ఆజ్ఞను అతిక్రమించినయెడల మరణ దండన తప్పదని ప్రకటించివానరులు భయముతో కార్యసాధకులగునట్లు చేసినాడు సుగ్రీవుడు.[57] భూమిని రక్షించాల్సినరాజు అధర్మవర్తనులను ప్రజాక్షేమం కొఱకు వధించాలి. రాముడు ఈన్యాయపద్ధతినే అనుసరించి అధర్మవర్తనులగు తాటకను

గోబ్రాహ్మణహితం కొఱకు వధించెను.[58] చెడునడవడి కలిగి పాపకృత్యము లాచరించువారై యజ్ఞాల్ని చెడగొట్టుతూ, రక్తపానము చేసే మారీచుని సుదూరానికి పోగొట్టి, సుబాహునకు శ్రీరాముడు మరణ దండన విధించెను.[59]

దురాత్ముడై రామలక్ష్మణులను గొనిపోతున్న విరాధుని బాహువులు నఱికి మర్దించినా మరణింపనందున భూమిలో పాతిపెట్టటానికి ప్రయత్నించెను.[60]

యుష్మాన్పాపాత్మకాన్హంతుం విప్రకారాన్మహాహవే।
ఋషీణాంతు నియోగేన సంప్రాప్తః సశరాసనః'॥[61]

హింసా స్వభావంగల ఖరదూషణాదులను యుద్ధంలో సంహరించటానికై ఋషుల నియోగంచే ధనుర్బాణాలను దాల్చివచ్చానని రాముడు రాక్షసులతో పలికెను. రంగనాథ రామాయణంలో ఇదే సందర్భంలో

'నరుదుగా నీదండకాటవి దొల్లి - పెరిగి సన్మునుల జంపిన పాప ఫలము
గుడువకాలము వచ్చె గుడుతుగాకింక - నడరి వధింతు ఘోరాజిలోనిన్ను'[62]

అని పలికినట్లు,భాస్కర రామాయణమున

ఓరి నిశాచరాధమ, మదోద్ధతిఁ దాపస విప్రకారముల్
వారకచేసి తా ఫలమవశ్యము, బొందక పోవునే? యమా
గార గతుండవై కుడువ గాలమే నీ కిదె చేరె నింక నా
ఘోర శరంబులన్ జముని కోర్కులు దీఱఁగఁ నిన్ను ద్రుంచెదన్[63]

అని పలికెను. దీనినిబట్టి తాపసులను విప్రులను చంపినందుకు మరణదండన విధించుపద్ధతి కలదని తెలియుచున్నది.

'ఔరసీం భగినీం వాపి భార్యాం వా ప్యనుజస్య యః।
ప్రచరేత నరః కామాన్ తస్య దండో వధః స్మృతః॥[64]

కన్న కూతురుగాని, తోడబుట్టినదానినిగాని, తమ్ముని భార్యనుగాని ఎవ్వడుకామవశుడై కలియునో వానిని వధించుటే శిక్షయని శాస్త్రము తెలుపుచున్నది. రంగనాథ రామాయణమున

'ఆమేరదప్పితీ వపరాధహీను - దామర సాప్తనందను బురివెడల
నడిచి వానిని గోడలైనట్టి యతని - పడతిని రతిబల్మి బట్టి భోగించి
కామాంధుడెంద్తైన గలడె నీవంటి - పామరుడొకడుదప్ప జగత్త్రయమున
నీ తమ్ముడగువాని నెలత గైకొన్న - పాతకుడవుగాన పట్టి చంపితిమి"[65]

అని వచించినట్లు,

భాస్కర రామాయణమున :

'అనుజన్మ ప్రియపత్ని యైన రుమఁ గామాంధుండవై కాంక్షతో।
ననిశంబున్ రమియించె, దీదురిత, మింపారన్ వినం గూడునే?॥
----- క్రొవ్వున జంపగాదు వారికప్రియములు పల్కవలనగాదు[66]

అనుచు వాలి తమ్ముని భార్యయందు కామముతో చరించుటేగాక బ్రాహ్మణులను హింసించెననియు, ధిక్కరించెననియు, చంపెననియు, వారికి అప్రియ మొనరించి నందున మరణదండన విధించినట్లు శ్రీరాముడువాలితో పలికినట్లు గలదు.

రామాభ్యుదయమున :

అనుజన్మవధూగమనం - బొనరించిన ద్రోహివగుట నోర్వక నిన్నున్
గనుబ్రామి సంహరించిన - ననుఁజెందునె దుష్కృతంబు నగచర తిలకా[67]

అనుచు సోదరుని భార్యయందు కామమున ప్రవర్తించిన ద్రోహివిగనుక వధించినట్లు రాముడు వాలితో పలికినట్లు గలదు.

రావణునికి మరణదండన విధించుటకు ఆతని దుష్కృత్యములే కారణము.

'స్త్రీషు శూర! వినాధాసు పరదారాభిమర్శక।
కృత్వా కాపురుషం కర్మ శూరోఽహమితి మన్యసే''॥[68]

భర్తనెడబాసియున్న స్త్రీలను చేపట్టిన శూరుడా! నీవిట్లు పరదారాపహరణ రూపమైన నిందాకార్యముచేసి శూరుడవని భావించుచున్నావా!

'ఉత్సేకేనాభిపన్నస్య గర్హితస్యాహితస్య చ।
కర్మణః ప్రాప్నుహీదానీం తస్యాద్య సుమహత్ఫలమ్॥[69]

నీవు గర్వితుడవై నిందితము, అహితమునైన పనిచేశావు. దానికిపుడు గొప్ప ఫలితాన్నే పొందుతావని శ్రీరాముడు రావణునితోపలుకును.

ఇదే సందర్భంలో రంగనాథ రామాయణమున

కష్టచిత్తుడవతికామాతురుడవు-దుష్టబుద్ధివి సురద్రోహివిగాన
పదిలమై నిలువక పాటితేనియును-బొదివి నిన్ జంపుట పుణ్యంబునాకు[70]

భాస్కరరామాయణమున పంచభూతాలు శ్రీరాముని

'కుటిల పరాక్రమ ప్రవణు గుత్సితచేష్టిత గర్వితున్ సము
త్కట దురితాల వాలు నతిదర్పితునిన్ రజనీచరాధముం
బటుల నిశాతఘోర శరజాలములం బొలియింపుమంచు నా
క్కట బలికెన్ రఘూద్వహుని గ్రక్కున వేడుక బంచభూతముల్[71]

అనుటనుబట్టి కుటిల పరాక్రమవంతుడు, కుత్సితచేష్టలచే గర్వితుడై మహాపాపముల కాలవాలమైన రావణుని సంహరింపుమని పంచభూతములు కోరినట్లు తెలియుచున్నది.

మొల్ల రామాయణమున రావణునితో శ్రీరాముడు

మతిఁదలఁప సుఖరతిం బతి
వ్రతలను మునివరుఁబట్టి వ్రతములు గర్వో
న్నతిఁ జెఱచినట్టి దురిత
స్థితి నిప్పుడు నీవునాకుఁ జిక్కితి విచటన్[72]

అనుటను బట్టి పతివ్రతలను, మునివరులను హింసించి గర్వముచే వ్యవహరించి నందున మరణ దండన విధించెనని తెలియుచున్నది. రాజు స్వయముగా దుష్టాచారులకు, పాపాత్ములకు మరణదండన విధించెడివారు. కొన్ని ప్రత్యేక పరిస్థితులలో తన ప్రతినిధులను పంపి అపరాధులకు ఆదండన విధింపజేసి[73] లోకరక్షణకు పూనుకొనెదరు. శత్రురాజులచే పరాజయము పాలైన రాకుమారునికి రాజబహిష్కరణ శిక్ష విధించేవారు[74] ఇది వీరికి మరణ శిక్షతో సమానమైనదిగా భావించేవారు. రాజ ద్రోహము చేసెడివారికి కూడా ఈ శిక్ష విధించేవారు.[75] రామాయణంలో చెప్పబడిన శిక్షలు అపరాధులకు మాత్రమే విధింప బడవలెనని చెప్పబడినది. ఒక్కనిరపరాధికూడా శిక్షింపబడరాదనేది ఆనాడు కూడా అమలులో ఉండేది. శిక్ష వలన సమాజములో శాంతిస్థాపన జరుగవలయును. ఈవిధమైన శిక్ష లోకమున సుఖశాంతులు వర్ధిల్లటానికి ఉపయోగపడతాయి.



## పాదసూచికలు

1.వాల్మీ.రా.కిష్కింధ.21-9శ్లో॥ 2.వాల్మీ.రా.కిష్కిం.29-30శ్లో॥ 3.రంగ.రా.కిష్కిం. 32-37శ్లో॥ 4.భాస్క.రా.కిష్కిం.403వ॥ 5.రామాభ్యు.6ఆశ్వా.41వ॥ 6.వాల్మీ.రా.కిష్కిం. 32-2. 7.వాల్మీ.రా.అయోధ్య.100-11శ్లో॥ 8.Ibid.100-15శ్లో॥ 9.వాల్మీ.రా. బాల. 7-6,10 10.రంగ.రా.బాల.8-2 11.వాల్మీ.రా.అయోధ్య.100-58శ్లో॥ 12.వాల్మీ.రా.యుద్ధ. 68-6శ్లో॥ 13.Ibid.అయోధ్య.3స॥ 14.వాల్మీ.రా.అయో.100-25శ్లో॥ 15.రంగ.రా.అయో.100-2 16.వాల్మీ.రా.అయో.100-3. 17.రంగ.రా.అయోధ్య.101-2 18.వాల్మీ.రా.అయోధ్య.100-30శ్లో॥ 19.రంగ.రా.అయోధ్య.101-2. 20.వాల్మీ.రా. అయోధ్య.100-31శ్లో॥ 21.Ibid.అయోధ్య.100-47శ్లో॥ 22.Ibid.బాల.54-10శ్లో॥ 23.వాల్మీ.రా.బాల.52-13శ్లో॥ 24.Ibid.57-21శ్లో॥ 25.రంగ.రా.బాల.58వ॥ 26.వాల్మీ.రా.బాల.58-3శ్లో॥. 27.రంగ.రా.బాల.66-2. 28.వాల్మీ.రా.బాల.58-3శ్లో॥ 29.Ibid.అయోధ్య.4సర్గ. 30.Ibid.అయోధ్య.32సర్గ. 31.వాల్మీ.రా.అయోధ్య. 76-1,2శ్లో॥ 32.Ibid.అయోధ్య.82-10,12శ్లో॥ 32a.రంగ.రా.అయోధ్య.101ద్వి 33.వాల్మీ.రా.యుద్ధ.131-25,26శ్లో॥ 34.Ibid.131-59శ్లో॥ 35.వాల్మీ.రా.బాల.7-9శ్లో॥ 36.Ibid.బాల 7-11శ్లో॥ 37.Ibid.అయోధ్య.78-25శ్లో॥ 38.Ibid.అయోధ్య.100-54 శ్లో॥ 39.రంగ.రా.అయోధ్య.155పుట. 40.వాల్మీ.రా.అయో.100-62శ్లో॥ 41.Ibid.అయోధ్య. 43-31శ్లో॥ 42.Ibid.అయో.100-59శ్లో॥ 43.వాల్మీ.రా.కిష్కింధ.24శ్లో॥ 44.Ibid.కిష్కింధ.37-12శ్లో॥ 45.Ibid.29-33శ్లో॥ 46.Ibid.53-12శ్లో॥ 47.రంగ.రా.కిష్కిం.163పుట. 48.భాస్క.రా.కిష్కిం.666ప॥ 49.వాల్మీ.రా.కిష్కిం. 18-32శ్లో॥ 50.రంగ.రా.కిష్కిం.145పుట 51.భాస్క.రా.కిష్కిం.259ప॥ 52.వాల్మీ.రా.బాల.7-12శ్లో॥ 52a.Ibid.25-16శ్లో॥ 53.Ibid.బాల.7-11శ్లో॥ 54.Ibid.అయోధ్య.78-2శ్లో॥ 55.వాల్మీ.రా.అయోధ్య.36స॥ 55a.Ibid.అరణ్య.18-20 శ్లో॥ 56.Ibid.అరణ్య.69-11,17శ్లో॥ 57.Ibid.కిష్కింధ.29-33శ్లో॥ 58.Ibid.బాల. 20-5శ్లో॥ 59.వాల్మీ.రా.బాల.30-20,21. 60.వాల్మీ.రా.అరణ్య. 4-5-10శ్లో॥ 61.Ibid.అరణ్య.20-9శ్లో॥ 62.రంగ.రా.అరణ్య.190పుట. 63.భాస్కర.రామా. అరణ్య.237ప॥ 64.వాల్మీ.రా.కిష్కిం.18-22శ్లో॥ 65.రంగ.రా.కిష్కిం. 245పుట. 66.భాస్కర.రా.కిష్కిం.260-262. 67.రామాభ్యు.5ఆ-316ప॥ 68.వాల్మీ.రా.యు. 105-13శ్లో॥ 69.1bid.యు.105-16శ్లో॥ 70.రంగ.రా.యుద్ధ. 604పుట. 71.భాస్క.రా. యుద్ధ.2123ప॥ 72.మొల్ల.రా.యుద్ధ3-78ప॥ 73.వాల్మీ.రా.కిష్కిం.18-23శ్లో॥ 74.వాల్మీ.రా.సుంద.53-4శ్లో॥ 75.1bid.బాల. 70-25,26శ్లో॥



# షష్ఠాధ్యాయము

# 6-0 రామాయణాలలోని యుద్ధ విశిష్టత

*6.0.*ప్రస్తావన:

లోకంలో రెండురకములగు తెగలకు చెందిన జీవకోటియున్నట్లు భగవద్గీత తెల్పుతున్నది.[1] ఒకరు దైవీసంపత్తిగలవారు. రెండవవారు ఆసురీ సంపత్తిగలవారు. ఆసురీ సంపత్తిగలవారే రాక్షసులు. వారివలన దైవీసంపత్తి గలవారికి హాని కలుగుతునేయుంటుంది. రాజునకు రాక్షసుల బారినుండి సజ్జనులనురక్షింపవలసిన బాధ్యత యుంటుంది. ఈ మంచిచెడులకుగల్గు సంఘర్షణమే యుద్ధం. దుష్టశిక్షణ శిష్టరక్షణ కొఱకు రాజు యుద్ధాన్ని తప్పక చేయవలసిఉంటుంది.

వేదకాలంనాడే యుద్ధపద్ధతులున్నట్లు తెలుస్తున్నది. ఆధునిక పరిశోధకుల అభిప్రాయాన్ననుసరించి రామాయణ యుద్ధము క్రీస్తు పూర్వకాలానికి చెందింది. భారతదేశానికి సంబంధించి రామాయణయుద్ధము అతి ప్రాచీనమైనదనుటలో విప్రతిపత్తిలేదు. ఈ కాలంనాటి యుద్ధాలకు, ప్రాచీన కాలపు యుద్ధాలకు చాలా తేడా కన్పిస్తుంది. యుద్ధవీరులలోను వారుపయోగించే ఆయుధాలలోను చాలా వైవిధ్యం కన్పిస్తుంది. యుద్ధలక్ష్యాలలోను తేడా కన్పిస్తుంది.

రామాయణ భారతాది ఇతిహాసపు యుద్ధాలలో ధర్మరక్షణే ప్రధానధ్యేయంగా కనబడుతుంది. ఆనాటివారికి ధర్మమే జయిస్తుందనే నమ్మకం ఉండేది. రామాయణంలో మానవ,వానర, రాక్షస జాతులమధ్య జరిగిన యుద్ధాలు వర్ణింపబడ్డాయి. ఏ జాతికి సంబంధించిన యుద్ధపద్ధతులు ఆ జాతికి యున్నప్పటికి యుద్ధతంత్రంలో కొంత సమన్వయం కనబడుతుంది. ఆనాడు సామ, దాన, భేద దండోపాయములను ప్రయోగించడంలో ఒకక్రమాన్ని పాటించేవారు. యోధుల శరీరబలం, ఆయుధాలను ప్రయోగించడంలో నేర్పు యుద్ధంలో ప్రధానంగా పరిగణింపబడేవి. దొంగదెబ్బ తీయడాన్ని వీరుడు అవమానకరంగా భావించేవారు. ప్రళయాన్ని సృష్టింపగల ఆయుధాలున్నప్పటికీ తొందరపడి ప్రయోగించేవారు కాదు. యుద్ధం వినాశకారి. అది రాజును రాజ్యాన్ని నాశనం చేస్తుంది. కాబట్టి రాజైనవాడు సాధ్యమైనంతవరకు యుద్ధానికి పూనుకొనరాదని రామాయణ, భారతయుద్ధాలు ఉపదేశిస్తున్నాయి.

*6-1* యుద్ధము - దాని తత్త్వము :

'యుధి - యోధనే' అను సంస్కృతధాతువునుండి నిష్పన్నమైన రూపమే యుద్ధము తెలుగులోను సంస్కృతములోను యుద్ధమనే పదానికి అనేక పర్యాయపదాలున్నాయి. అపకారమే యుద్ధము లేక విగ్రహమగునని కౌటిల్యుడు తెల్పినాడు. దేనివల్ల విరోధం అణచివేయబడుతుందో అదే యుద్ధమని శుక్రనీతి తెల్పుతున్నది.[2] విరోధులు రెండురకాలుగా ఉంటారు. వారు 1.అంతశ్శత్రువులు. 2. బాహ్యాశత్రువులు. అంతశ్శత్రువులను మానవుడు శమ, దమాది గుణ సంపత్తితో జయింపగలడు. బాహ్యా శత్రువులను ఆయుధసంపత్తితో, శరీరబలంతో జయింపగలడు. దశరథుడు, రావణుడు వంటివారు కామానికి లొంగి అంతశ్శత్రువుల చేతిలో పరాజయం పొందినారు. సాధారణంగా యుద్ధమనే పదం బాహ్య శత్రువులపై చేసే పోరాటాన్ని తెల్పేదిగా రూఢమైంది. ఈ పోరాటతత్త్వం మానవజాతి ఆవిర్భవించిన కాలంనాటినుండే మానవ స్వభావంలోమిళితమైఉన్నది.

*6-2* వేదకాలం నాటి యుద్ధపద్ధతులు:

ఋగ్వేదంలో దాశరాజయుద్ధం వర్ణింపబడింది. ఇది సింధునదీతీరంలో జరిగింది. సప్తసింధులో వేరువేరుగా నున్న ఆర్యజనులను ఏకతాబద్ధం చేయడం ఇందు చెప్పబడింది. పదిమంది రాజులు కలసి సుదాసుతో యుద్ధం చేశారు. ఋగ్వేదకాలంనాటి మరొక భీషణమైనయుద్ధం 'దస్యుహత్య' లేక శంబరయుద్ధం'. ఇది దివోదాసునకు శంబరునికి జరిగిన యుద్ధం.భరద్వాజుడు, వసిష్ఠుడు, వామదేవుడు, శంబరయుద్ధాన్ని గురించి చెప్పినారు.[3] ఆనాటి సైనికవ్యవస్థ క్రమశిక్షణలో కూడింది. సేనకంతటికి ప్రధానాధికారి రాజు. రాజు తర్వాత పెద్దగా చెప్పదగినవాడు సేనాని. శుక్లయజుస్సంహితలో ఆనాటి రాజరికపు వ్యవస్థ యుద్ధతంత్రవిశేషాలు విపులంగా చెప్పబడ్డవి. రాజులు యుద్ధానికి బయలుదేరివెళ్ళునపుడు మంత్రి కుడిప్రక్కన ఉండేవాడు. విద్వాంసులు వేదఘోష చేస్తుండగా రాజులు యుద్ధానికి బయలుదేరేవారు.[4] ఆకాలంనాటికి చతురంగబలవ్యవస్థలేదు. రథబలము, అశ్వబలము, కాల్బలములు మాత్రమే యున్నవి. ఇంకా గజబలం ఏర్పడలేదు[5]. రథములకు బలమైన గాడిదలను కట్టెడివారు.[6]

యుద్ధములలో గుఱ్ఱములనుపయోగించుట అథర్వవేదకాలానికి అధికమైంది. అగ్నిపురాణము పదాతిదళమధికముగానున్న ప్రభువే ఎల్లప్పుడు శత్రువును

జయింపగలడని తెల్పుతున్నది.[7] ఋగ్వేదకాలంలో యుద్ధంచేయడానికి ధనుస్సు ప్రధాన ఆయుధంగా ఉన్నట్లు మన్యుసూక్తము వలన తెలుస్తున్నది.

'ఓం ధన్వనా గా ధన్వనాజింజయేమ - ధన్వనా తీవ్రాస్సమదో జయేమ
ధనుశ్శత్రో రపకామం కృణోతి - ధన్వనా సర్వాః ప్రదిశో జయేమ[8]

ధనస్సువలన శత్రువుల ఆయుధాలను తునాతునకలు చేయుదుము. ధనస్సుచేతనే యుద్ధరంగంలో తీక్షమై మదముతోనున్న శత్రువులను జయింతుము. ధనుస్సు శత్రువులను భిన్న మనోరథులుగా చేయును. ధనుస్సుచేతనే దిక్కులనన్నిటిని జయింతుముగాక! అని దీనిభావము.

అగ్నికూడా ఆయుధంగా ఉపయోగపడేది.[9] వైదికమంత్రాలు ఆయుధాల్లా పనిచేసేవి. శిరస్త్రాణాలనేగాక యోధులు భుజకీర్తులను ధరించెడివారు. ముష్టియుద్ధాన్ని గుఱించి విశ్వామిత్ర పుత్ర మధుచ్ఛందుడు స్పష్టంగా చెప్పాడు.[10] అధర్వవేదంలో సీసపు గుండ్లతో ప్రయుక్తములైన తుపాకుల ప్రసక్తి గలదు. తైత్తిరేయసంహిత 1వ కుండము 5వ ప్రశ్నయందు శతఘ్నిని గూర్చి చెప్పబడింది.

'ఏషావై సూర్మీ కర్ణకావత్యేతయా హస్మివై - దేవా అసురాణాగ్ం శతతర్హాం స్తృహంతి।
యదే తయా సమిధ ముదధాతి వజ్రమేవై - తచ్ఛతఘ్నీం యజమానో భాతృ వ్యాయ ప్రహరతి"॥

ఆదిమవాసులతో ఆర్యులకు జరిగిన యుద్ధాలను గూర్చి"Anciant India" అనే గ్రంథంలో శ్రీ రమేష్ చంద్రదత్త' "Wars with Aborigins" అనే ఛాప్టరునందు ఋగ్వేదంలో చెప్పబడ్డ యుద్ధవిషయాలకు సంబంధించిన ప్రార్థనలను వివరించారు.[11]

### *6-3 వేదకాలం తరువాత గల యుద్ధతంత్రం:*

ప్రాచీన భారతీయులకు యుద్ధశాస్త్రాన్ని గురించి పూర్తి పరిజ్ఞానముంది. ఈ విషయానికి సంబంధించిన వివరణ మహాభారతంలోను, ధర్మశాస్త్రాలలోను ఉంది. శత్రుమర్దనమే ప్రధానలక్ష్యంగా పెట్టుకొని యుద్ధమునందు గూడా ప్రాచీన భారతీయులు వివేకాన్ని, అనుకంపను ప్రదర్శించారు. యుద్ధారంభానికి శుభతిథిని నిర్ణయించు కొనెడివారు. రాజులు రాజ్యరక్షణకై పటిష్టమైన దుర్గనిర్మాణాన్ని చేసుకొనేవారు. మత్స్యపురాణంలో కోట యొక్క ఆవిర్భవాన్ని గుఱించి చెప్పబడింది. యుద్ధాన్ని యోధులు తమకు సములైన వారితోనే చేసేవారు. విషపూరితమైన శస్త్ర శరాల నుప్రయోగించెడివారు కారు. శరణాగతరక్షణము ముఖ్యధర్మంగా భావింపబడేది.

యుద్ధాచరణమున తుల్య సంఖ్యాబలములు చేకూఅనపుడు వేరు నియమాలను పాటించేవారు. యుద్ధరంగంలో గాయపడిన యోధులను దయతో చూచుట భారతీయుల స్వభావము. సాధారణముగా సూర్యాస్తమయానికి యుద్ధవిరమణ జరుగుతుండేది. కాగడాల వెలుగులో రాత్రియుద్ధము చేయుటయు గలదు. భారతసేన సాధారణంగా చతురంగ బలాలుగా విభజింపబడేది. నౌకాదళవ్యవస్థ కూడా పనిచేసేది. ప్రాచీన భారతంలో సేనాభాగముల విభజన అనేకవిధాలుగా ఉంది. పత్తి, సేనాముఖము, గుల్మము, గణము, వాహిని, పృతన, చమువు, అనీకిని, అక్షౌహిణి, అనేవి నాటి సేనావిభాగాలు. అన్ని విధాల పదాతిదళం శ్రేష్టమైనది. హరిహయ చతురంగమనే యుద్ధశాస్త్రం ఆయుధ బలాల విశిష్టతను వివరంగా తెలియజేసింది.

భారతదేశపు ప్రాచీన యుద్ధాలలో రథానికున్న ప్రాముఖ్యాన్ని అర్థశాస్త్రంలో విశేషంగా చెప్పబడ్డది.[12] వసుచరిత్రమునందు ఏకచక్ర రథము,[13] హంసలను పూన్చిన రథము[14] వర్ణింపబడింది. తరువాత చారిత్రక యుగంనాటికి రథబల సంప్రదాయము క్రమక్రమంగా క్షీణించింది.

జలప్రదేశాల్లోగాని, దుర్గామారణ్య ప్రదేశాల్లోగాని, సమవిషమ ప్రదేశాల్లోగాని, గజబలాన్ని యుపయోగించి జయాన్ని సాధించారు. ఈ విషయం

'శక్యమశ్వసహస్రేణ కృత్స్నాం జేతుం వసుంధరాం।
నయచ్ఛక్యం గజైర్జేతుం పత్తిభిర్వా ప్రహారిభిః'॥[15]

గజ పదాతి బలాలచే జయింపరానిదెల్లను అశ్వబలంచే గెలువవచ్చు. ప్రాచీన భారతమున అశ్వశిక్షనుగూర్చి తెల్పుశాస్త్రాలు అనేకం ఉన్నట్లు తెలుస్తున్నది. యుద్ధ వార్తలను రహస్యంగా చేరవేయడానికి, శత్రుసేనలోనికి చొచ్చుకొని పోవడానికి అశ్వసేన నుపయోగించేవారు.

భారతదేశంలో కాల్బలము ముఖ్యమైన యుద్ధాంగంగా పూర్వము నుండి పరిగణనను పొందింది. పదాతి బలం స్వకీయమైన ప్రజ్ఞచే ప్రవర్తించి విజయాన్ని సాధించగలదు. కాబట్టే ఈ బలము శ్రేష్టమైనదిగా చెప్పబడింది. దుర్గ, వన, పర్వత యుద్ధాలలోను, రాత్రియుద్ధమునందును పదాతిబలమే శ్రేష్టమైనది. ఈ పదాతి బలమునందే షడంగబలవ్యవస్థ గలదు. 1. మూలబలము, 2. భృత బలము, 3. శ్రేణీ బలము 4. మిత్ర బలము 5. అమిత్ర బలము 6. అటవీబలము. యోధులు

తమ సామర్థ్యముల బట్టి అతిరథ మహారథ - అర్ధ రథాలుగా పిలువ బడేవారు. తన శరీరాన్ని రథాన్ని, గుఱ్ఱాలను, సారధిని రక్షించుకొంటూ యుద్ధం చేసేవాడు మహారథుడు. పంతాల్నిపల్కి యుద్ధరంగంలో విరథుడై పాటిపోవువాడు అర్ధరథుడు. విరథుడయ్యు వెన్నుచూపక స్థిరంగా యుద్ధంచేసేవాడు అతిరథుడు. రథం విఱిగిపోగా తొలగి మరొక రథాన్ని పొంది పరాక్రమించేవాడు సమరథుడు. నొవ్వని గుఱ్ఱాలు, మొక్కవోని బాణాలు విఱుగని రథము, ధనుస్సు, పడని సారధి; ఛత్రము గల సింహపరాక్రముడు 'అతిరథ శ్రేష్ఠుడగుచున్నాడు.[16]

ప్రాచీన భారతీయులు పెక్కు శస్త్రాలను, యుద్ధతంత్రాలను కూడా కల్పించుకున్నారు[17] భారతదేశంలో ధనుర్విద్య ధనుర్వేదంగా పొగడబడింది. ధనుర్వేదం మానవుడు కనిపెట్టిన ప్రప్రథమ యుద్ధశస్త్ర విద్య. ఈ ధనుర్వేదం విశ్వామిత్ర ప్రణీతంగా చెప్పబడింది. ఇదియజుర్వేదమునకు ఉపవేదముగా చరణ వ్యూహమున చెప్పబడింది.

'యథా ఋగ్వేదస్యోపవేదః ఆయుర్వేదః చికిత్సాశాస్త్రం।
యజుర్వేదస్య ఉపవేదః ధనుర్వేదో యుద్ధశాస్త్రం॥[18]

ధనుశ్శబ్దము కేవలము ధనుస్సునకు మాత్రమేకాక సర్వప్రహరణములకు వర్తించుననియు, ధనుర్విద్యావిలాసము తెల్పుచున్నది. యోధులు బాహాబాహి, ముష్టాముష్టి, కచాకచీ పోరాడుట భారతయుద్ధ తంత్రాన పెక్కుచోట్ల వర్ణింపబడింది. ప్రాచీన కాలపు ఆయుధాలు 32 అని 'హంసవింశతి'లో తెల్పబడింది[19] యోధులకు దెబ్బలు తగులకుండా కవచాలుండేవి. ఈకవచాలు నాలుగు విధాలు. 1. చేతులతో సహా ఆపాదమస్తకము కప్పియుంచునవి. 2. శిరస్సు, వక్షః స్థలము కప్పునవి. 3. హస్తములనావరించునవి. 4.నడుమునకు కొల్లాయిగుడ్డవలె చుట్టుకొనియుండునవి.

చతుర్విధ సేనాంగాలను యుద్ధమునందు తంత్రదృష్ట్యా వివిధాకారాలతో విన్యాసమొనర్చడాన్ని వ్యూహంగా చెప్పుదురు. వ్యూహరచన యుద్ధంచేయు ప్రదేశాన్ని బట్టి యుండేది. సమతలము గల మైదానమున దండవ్యూహము, మండలవ్యూహము పనికివచ్చునని చెప్పబడింది. భూమి నిమ్నోన్నతంగా ఉన్నప్పుడు భోగవ్యూహము, అసంహతవ్యూహము, భూతలం విషమంగా ఉన్నప్పుడు విషమవ్యూహము ఉద్దిష్టములైనవి. రోమనులు, గ్రీకులు దృఢవ్యూహ నిర్మాణానికై పదాతిబలాన్ని మాత్రమే ఉపయోగించగా భారతీయుల గజాశ్వరథబలాలను గూడ ఉపయోగించిరి. దండయాత్ర సమయంలో సైన్యంవెంట భోజనాదికములను కల్పించేవారు. వైద్యబృందాలుండేవి.

ఈవిధంగా భారతీయుల యుద్ధతంత్రం పూర్వం పటిష్టమైనదై సమకాలీన విదేశీయుల కేమాత్రం తీసిపోకుండా క్రమశిక్షణగలదై నీతిబద్ధమై విరాజిల్లింది.

### *6-4 రామాయణ యుద్ధంలోని ప్రత్యేకతలు:*

రామాయణకాలంలో జరిగిన యుద్ధాల్లో కొన్ని ప్రత్యేకతలున్నవి. ముఖ్యంగా మానవులు, రాక్షసులు, వానరులు అనే మూడు భిన్నజాతులమధ్య జరిగిన యుద్ధాలు వర్ణింపబడినవి. అంతేగాక జటాయువు వంటి పక్షులు, కబంధ,విరాధులవంటి విచిత్రాకృతిగలవ్యక్తులు, అసాధారణదేహములు గల రాక్షసులు రామాయణయుద్ధాల్లో కనిపిస్తారు. ఆకాశయుద్ధాలు, మాయయుద్ధాలు, యుద్ధజయాన్ని గోరి యుద్ధరంగంలో చేసే క్షుద్రహోమాలు వంటివి రామాయణయుద్ధప్రత్యేకతలు. రామాయణ యుద్ధం కొంత అనాగరికులైన, సుశిక్షితులుగాని, వానర రాక్షసయోధులచే నిర్వహింపబడింది. అంతమాత్రం చేత ఇది పూర్తిగా ఒక పద్ధతిలేని అనాగరికపోరాటంగాదు. ఎందుకనగా వానరులలో సుగ్రీవుడు, హనుమంతుడు, అంగదుడు, నలుడు మరికొందఱు వానర యూధపులు ఆయుధ విద్యలు తెలిసినవారే. అంతేగాక మంత్రపూతమైన అస్త్రాలను గుఱించియు తెలిసిన వారుగలరు. అందుకు హనుమంతుడే నిదర్శనము. మిగిలిన వానరసైనికులంతా కొండరాళ్ళు, శిఖరములు, చెట్లు, గోళ్ళు, దంతములు ఆయుధములుగా పోరాటము చేసినవారే.

ఇక రాక్షసుల్లో రావణుడు, రావణపుత్రులు, ప్రహస్తుడు ఆదిగాగల రావణుని సేనాపతులు, ఆయుధవిద్యలలో సుశిక్షితులే. ఈవిషయము వీరులు చేసిన యుద్ధఘట్టాలయందు నిరూపించబడింది. మిగిలిన రాక్షససైన్యము కూడా ఖడ్గ, శూల, ప్రాస, ముసల, ముద్గరాది ఆయుధములను ప్రయోగించుటలో నేర్పరులే.

ఈవిధంగా వానర, రాక్షస సేనలమధ్య యుద్ధం సమానాయుధాలు గల యోధులమధ్య జరిగింది కాకపోవడంచే ఒక ప్రత్యేకతను సంతరించుకున్నది.

రాక్షసుల్లో చతురంగబలవ్యవస్థ గలదు. కానీ వానరులదంతయు పదాతిబలమే. వానర రాక్షసులిఱువురియందు సేనాపతులున్నారు. రాక్షసులకు ప్రహస్తుడు సర్వసేనాధిపతి కాగా వానరబలానికి నీలుడు సర్వసైన్యాధిపతి. రామాయణయుద్ధంలో రాముని పక్షంలో నీలుడే చివరివరకు సేనానాయకునిగా ఉన్నాడు.

సర్వసైన్యాధిపతి వ్యూహనిర్మాణం చేయుట రామాయణ యుద్ధమునందుగలదు. చతురంగ బలాలను ఒకపద్ధతి ప్రకారం యుద్ధ సన్నద్ధులను చేసి ఉపాయంగా సేనలను నడపటమే ఇందు వ్యూహంగా చెప్పబడింది. రామాయణంలో ఒక్క 'గరుడవ్యూహము' మాత్రమే ప్రస్తావించబడింది. యుద్ధాన్ని చేయడానికి, లేదా హాని తలపెట్టటానికి సిద్ధపడిన స్త్రీలను శిక్షించు సందర్భంలో రామాయణంలో ఒక ప్రత్యేకత కనిపిస్తుంది. స్త్రీని కురూపినిగా చేయుట ద్వారానే శిక్షింపదలచెడివారు. కాబట్టే తాటకను సంహరించడానికి ముందు రాముడు ఆమెను చంపదలపక ముక్కు చెవులను మాత్రమే కోశాడు. అట్లే లక్ష్మణుడు శూర్పణఖను, అయోముఖిని ముక్కుచెవులు కోసి శిక్షించినాడు. శత్రువులను లొంగదీయడానికి రాజుపయోగించే దండోపాయం రామాయణంలో ఐదువిధాలుగా చెప్పబడింది. 1. విగృహ్యాయానము 2. సంధాయయానము. 3.సంభూయయానము. 4. ప్రసంగయానము 5. ఉపేక్ష్యయానము.

**1.విగృహ్యాయానము:** శత్రువుపై ఒంటరిగా దండెత్తుట.

**2.సంధాయయానము:** పార్ష్ణి గ్రహాదులతో కలిసి యుద్ధానికి పోవుట.

**3.సంభూయయానము:** సామంతులతో కలసి దండెత్తుట, రాముడు సుగ్రీవుని సహాయంతో రావణునిపై దండెత్తుట.

**4.ప్రసంగయానము:** ఒకనిపై దండెత్తుచున్నట్లుగా ప్రకటించి అకస్మాత్తుగా మరొకరిపై దండెత్తుట.

**5.ఉపేక్ష్యయానము:** శత్రువుపై దండెత్తుటకుద్దేశించి మధ్యలో వానిని వీడి వానిమిత్రునిపై తలపడుట. రాముడు వాలిని సంహరించుట ఈ తరగతికి చెందినదే.

ఈ ప్రకారం రామాయణయుద్ధం కొంతనియమబద్ధంగా, మరికొంత అనియమబద్ధంగా జరిగినప్పటికీ తరువాతకాలంవారికి అది మార్గదర్శకమైనట్టిదేగాని కేవలం ముక్కిడిమూకల అనాగరిక యుద్ధంకాదు.

### 6-5 సైనికవ్యవస్థ:

యుద్ధతంత్రమున ప్రధాన భూమికను నిర్వర్తించేది సైనికవ్యవస్థ. కోశం కన్నా సైన్యమే రాజ్యానికి ఎక్కువ ముఖ్యమైంది. "బలవంతమైన సైన్యంగల రాజు శత్రువులను కూడా మిత్రులుగా జేసికొని నిరాటంకంగా భూమినేలుతాడనీ,

కామందకం తెల్పింది. సైన్యం మానవునకు మేధ వంటిదని శుక్రనీతి చెప్పింది. సైన్యం లేకుండా ఏ రాజ్యం ఉండదు. రాజ్యరక్షణకు, రాజు మనుగడకు సైన్యం తప్పనిసరి. ప్రాచీనభారతదేశంలో సైన్యాన్ని షడంగ దళాన్నిగా విభజించినట్లు పురాణాలు, కౌటిల్యుని అర్థశాస్త్రం, కామందకము, మానసోల్లాసము మొదలగు వానివలన తెలిస్తున్నది.

శ్రీమద్రామాయణం షడంగబలాలలో ఐదింటిని మాత్రమే చెప్పింది. మిత్రబలము, అటవీబలము, మూలబలము, భృతకబలము, ద్విషద్బలము అను ఐదింటిలో ద్విషద్బలము విడిచివేయదగినదని, మిగిలిన నాలుగును గ్రహింపదగినవని విభీషణుని స్వీకరించే విషయంలో వానరరాజగు సుగ్రీవుడు రామునితో చెప్తాడు.[20] రామాయణమున ప్రధానంగా సుగ్రీవుని మరియు రావణుని మూలబలములే వర్ణింపబడ్డాయి. రావణుడు వానరబలాన్ని చూచుటకై ఒక పెద్దసౌధమధిరోహించి చూచి వానరవీరులను గూర్చి తెల్పవలసిందని కోరగా సారణుడు సుగ్రీవుని సైన్యాన్ని గురించి చెప్తూ ఆతనిమూలబలాన్ని తెల్పుటను భాస్కరరామాయణం ఈవిధంగా తెల్పింది.

సీ॥ శంఖంబు లేక వింశతి సహస్రంబులు - బృందంబులవి రెండువేలనూర్లు
గలయల పెనుమొన గాసిలి మనమీద - మ్రొగ్గెడు సుగ్రీవుమూలబలము.
కామరూపులు దేవగంధర్వులకు జనిం - చినయట్టివారు కిష్కింధవారు
వృక్ష భూధరఘోర వృష్టి లంకాపుర - గోపురాదుల గుప్పగూల్తుమనుచు.
నాకసంబుదెసలు నార్పులనద్రువ ను - త్తాల తాలహతుల దారలురల
నేపుతోడ నాజి కెదురు సూచుచున్న - వారు రాక్షసేంద్రవారు కంటె[21]

ఈ పద్యంలో వానరవీరులసంఖ్యతో పాటు వారి విశిష్టత కూడ చెప్పబడింది.

ఇరువది యొక్క వేల శంఖములు, రెండువేల నూర్లబృందములు గల సుగ్రీవుని మూలబలం దండెత్తటానికి సిద్ధంగా ఉన్నదని, ఆవానర వీరులు కామరూపులని దేవతల యొక్క గంధర్వులయొక్క అంశలతో జన్మించినవారని చెట్లు, కొండలు, మొదలగు వానిని లంకపైవర్షింపజేసి గోపురాదులను కూల్చెదమని దిక్కులు మారుమ్రోగునట్లు అరచుచున్నారని వర్ణింపబడింది.

ఈసందర్భంగా సంస్కృతాంధ్రరామాయణములు నేటి లెక్కలకందని సంఖ్యామానాన్ని తెల్పినవి. వాల్మీకం ఈవిధంగా చెప్పింది.

శతం శతసహస్రాణాం కోటిమాహుర్మనీషిణః।
శతం కోటి సహస్రాణాం శంఖ ఇత్యభిధీయతే॥
శతం శంఖసహస్రాణాం మహాశంఖ ఇతిస్మృతః।
మహా శంఖ సహస్రాణాం శతం బృంద మిహోచ్యతే॥
శతం బృంద సహస్రాణాం మహాబృందమితిస్మృతమ్।
మహాబృందసహస్రాణాం శతం పద్మ మిహోచ్యతే॥
శతం పద్మసహస్రాణాం మహాపద్మ మితి స్మృతమ్।
మహాపద్మ సహస్రాణాం శతం ఖర్వ మిహోచ్యతే॥
శతం ఖర్వ సహస్రాణాం మహాఖర్వ మితిస్మృతమ్।
మహాఖర్వసహస్రాణాం సముద్ర మభిధీయతే॥
శతం సముద్రసహస్రం మోఘ ఇత్యభిధీయతే।
శతంమోఘసహస్రాణాం మహౌఘ ఇతివిశ్రుతః[22]॥

సుగ్రీవుని మూలబలము 21 వేల శంఖములు + 2 వేల నూర్ల బృందములు అనగా 21000 + 12 సున్నలు + 200000 + 22 సున్నలుకలిపిన సంఖ్య. ఆ కాలమున అతిపెద్దసంఖ్య 62 సున్నలు గల మహౌఘమనునది. దీనిని బట్టి సుగ్రీవుని మూలబలమెంతయో తెలుసుకొనవచ్చును. ఈ సంఖ్యామానాన్ని రంగనాథ, భాస్కర రామాయణములును అనుసరించినవి. భాస్కరుడు మహౌఘమును చెప్పలేదు. పై మూలబలంగాక మొత్తం వానరసేనను గూర్చి రావణునిచారులైన శుకసారణులు రావణునివద్దకు వచ్చి సేనావివరాలను ఈవిధంగా చెప్పారు. 'ఆయా సేనాపతుల క్రింద వేర్వేరుగా వేయి కోటులు, నూరుశంఖములు, వేయిమహాశంఖములు, నూరుబృందములు, వేయి మహాబృందములును, నూరుపద్మములును, వేయి మహాపద్మములును, కోటిమహౌఘములును గల వానరసేన సముద్రమువలె అంతులేనిదై యుండగా విభీషణుడు, ఆతని మంత్రులు ముందునడచుచుండగా మహాపరాక్రమవంతుడగు సుగ్రీవుడు యుద్ధముజేయవచ్చుచున్నాడని తెల్పెను.[23]

*6-5.1 రావణుని మూలబలము:*

రావణుని మూలబలం కూడా అసంఖ్యాకమైది. రాముడు, సుగ్రీవుడు మొదలైన వారితో మంత్రాలోచన చేసే సమయంలో విభీషణుడు రావణుని మూలబలాన్ని గూర్చిన విషయాన్ని చెప్పడాన్ని భాస్కరరామాయణకర్త ఈ విధంగా వర్ణించాడు.

'అఱువది లక్షలు రావణు, నుఱుబాహుబలంబు వీరులొగినాలములం

గఱకెక్కినారు వారం, దఱు మూలంబు దొరలు ధరణీనాథా[24]

గొప్ప బాహుబలము గల వీరులు, అనేక యుద్ధాలయందు రాటుతేలినవారగు అరువది లక్షలమంది రావణుని మూలబలంగా ఉన్నారని తెలుస్తున్నది. రావణుని మూలబలం సుగ్రీవుని మూలబలంతో లెక్కిస్తే చాల తక్కువైనట్టిది. పిమ్మట రావణుని మొత్తం బలాన్ని గూర్చి చెప్పుచు భాస్కర రామాయణ కర్త ఈ విధంగా వర్ణించాడు.

కరులుఁదేరులు వాజులుఁగాల్బలంబు, వేయుఁబదివేలు నిరువదివేలు లక్ష

వేలు గల లెక్కప్రోవది వినుము సార్ధ, కోటి భటులును కోటాను కోటులధిప[25]

రావణుని చతురంగ బలములు వేలు, పదివేలు, లక్ష, అరకోటివంటి సంఖ్యల సమూహముతో కూడినట్టిదిగా ఇందు చెప్పబడింది.

వాల్మీకి రామాయణము రావణుని మూలబలమును గూర్చి వేరు లెక్కల నిచ్చినది. రాముడు గాంధర్వాస్త్రమును ప్రయోగించి రావణుని మూలబలాన్ని నాశనం చేసే సందర్భంలో ఈ లెక్కలీయబడినాయి.

'ఏడుకోట్ల ఇరువది తొమ్మిదిలక్షల రథములు, పదమూడు కోట్ల పంద్రెండు లక్షల ఇరువదివేల బలవంతములగు గజములు, పదికోట్ల ఇరువది లక్షల అరువది వేల రౌతులతో గూడిన గుఱ్ఱములు, నూటనలుబదియైదు కోట్ల ఎనుబది లక్షల పదాతి దళములుగనున్న కామరూపులగు రాక్షసులను శ్రీరాముడు తన అగ్నిజ్వాలలవంటి బాణములతో పగటితో ఎనిమిదవ పాలులోనే తానొక్కడే నాశనము చేసినట్లు వర్ణింపబడినది.[26]

రామాభ్యుదయ కర్త ఈ సంఖ్యామానాన్ని మరొక విధంగా చెప్పాడు.

"పదివేలు పసిఁడి తేరులు

పదునాలుగువే ల్గుఱాలు భద్రగజంబుల్

పదునెనిమిదివేలున్ మే

లు దొరల్ పంద్రెండు లక్షలుం బొడియైనన్ [27]

షడంగములలో మూలబలముగాక మిగిలినవాని ప్రసక్తి రామాయణమున అధికముగాలేదు. రావణుని, సుగ్రీవుని మిగిలిన బలాలలో కొన్ని భృత బలములు, మిత్ర బలములు, అటవీ బలముల వంటివి ఉండవచ్చును. ఆయుధాలతోగాక చెట్లు, రాళ్లతో పోరాడిన రాక్షసులు, అటవీ బలమే గావచ్చును. రామునికి సహాయంగా వచ్చిన సుగ్రీవుని మూల బలమంతా మిత్ర బలమే. రాముని పక్షాన చేరిన విభీషణుడు ద్విషద్బలముగా చెప్పవచ్చును.

### *6-6 చతురంగ బలములు:*

భారతదేశమున రాజనీతి సామ, దాన, భేద, దండోపాయములని నాలుగు విధాలుగా విశిష్టతను పొందింది. వీనినే చతురుపాయాలంటారు. ఇందలి దండ శబ్దానికే 'సేన' యని యర్థం. అట్టి సేన భారతీయ దండదృష్టిలో 'రథ,గజ,తురగ,పదాతులని నాలుగు అంశాలతోకూడియున్నది. వానికే 'సేనాంగములు' లేక 'చతురంగములు' అని పేర్లు గలవు. చతురంగ బలవ్యవస్థ రామాయణ కాలం నాటికే కుదురుకొన్నదని చెప్పవచ్చు.

### *6-6-1 రథబలము :*

రామాయణ కాలంనాటి చతురంగ బల వ్యవస్థలో రథ బలము మొదటిగా చెప్పదగినది. ఇది గొప్ప శిల్పులచే నిర్మితములై దృఢమైన చక్రాలు గల్గి, మంచి గుఱ్ఱాలచే పూన్చబడి సుధ్వజ పతాకంతో అలంకరింపబడి సమస్త యుద్ధ పరికరాలు అమర్చబడియుండేవి. రథమును గుఱ్ఱములేలాగేవి. రామాయణమున గాడిదలు, ఎద్దులవంటివానిచే రథాదులను లాగించడం కనబడుతోంది. రథానికి వెనుక భాగంలో ఒక ధ్వజము పతాకాలంకృతమై ఉంటుంది.

రామాయణంలో జరిగిన యుద్ధవర్ణనల్లో రావణుడు, రావణ పుత్రులు, రావణసేనా నాయకులు, చివరియుద్ధంలో రాముడు రథంపై నుండి యుద్ధం చేశాడు. అయోధ్యానగరంలోని చతురంగ బలాలను వర్ణించే సందర్భంలో దశరథుని రథబలాన్ని గూర్చి తెల్పుతూ భాస్కరరామాయణకర్త ఈవిధంగా అంటాడు. "హరిరథము చౌక జేసెడి గురురథములు పెక్కుగలవు". అరణ్యకాండలో ఖరదూషణులు, త్రిశిరుడు రథములపైననే రామునిపైకి దండెత్తినారు. వాల్మీకి ఖరుడధిరోహించిన రథాన్ని "తతః సూర్యనికాశేన రథేన"[28] సూర్యునివలె ప్రకాశించుచున్నట్లు వర్ణించినాడు. అతని రథము బంగారు ఆభరణములతో అలంకరింపబడింది.

"హయాన్కాంచన సన్నాహాన్రథ యుక్తాంత్స సారథీన్"[29] అని వాల్మీకి వర్ణించాడు. ఆకాలంలో వీరులుపయోగించే రథాలు మంచి చక్రాలు, ధనుస్సులు, ఈటెలు, కత్తులు, ప్రాసములు, పరిఘలు, మొదలైన వాటిలో నిండిఉండేవి. అతికాయుడు అట్టి రథాన్ని అధిరోహించినట్లు వాల్మీకంలో వర్ణించబడింది. యుద్ధకాండలో రావణుడు రామునిపైకి యుద్ధానికి బయలుదేరే సందర్భంలో ఆతనిరథాన్ని భాస్కర రామాయణకర్త ఈ ప్రకారం వర్ణించాడు.

"షోడశచక్ర సంఘటితంబును బటుతర కోటిద్వయ ఘంటా కలితంబును, భల్లూకచర్మవర్మ సమాచ్ఛాదిత పవన జవన తురంగ సహస్ర వాహ్యమానంబును, గాలకేతు సమాఖ్యాన సూత నియమితంబును, రాహు శిరశ్చిహ్నకేతన త్రయ విరాజ మానంబుననగు మహారథము"[30]

రావణుని ఆమహారథము 16 చక్రాలుగలిగి రెండుకోట్ల ఘంటికలతోకూడినది. వాయువేగంగా పోవు గుఱ్ఱాలకు భల్లూక చర్మము కవచముగా కప్పబడింది. కాలకేతుడను సూతునిచే నడుపబడునది. రాహువు యొక్క శిరస్సు గుర్తుగా గలిగిన మూడు కేతనములచే ప్రకాశించునదై యున్నది.

సుందరకాండలో హనుమంతు నెదిరించిన జంబుమాలి గాడిదలు కట్టిన రథంపై వచ్చినట్లు 'రథేన ఖరయుక్తేన'[30a] అని వాల్మీకిచే వర్ణింపబడింది. అట్లే యుద్ధకాండలో ఇంద్రజిత్తుకూడా గాడిదలుకట్టిన రథంపై వచ్చినట్లు వాల్మీకి ఇట్లు వర్ణించినాడు.

'సమాఌ ఉరురోహానిలతుల్యవేగం,।
రథం ఖరశ్రేష్ఠసమాధియుక్తం'[31]॥

శ్రేష్ఠమైన గాడిదలచే కట్టబడినది, వాయువేగమున పోవునట్టిదియగు రథము నాతడధిరోహించెను. ధూమ్రాక్షుడు తోడేలు, సింహము వంటి ముఖాలుగల గాడిదలను పూన్చిన రథాన్ని అధిరోహించాడు[32] అకంపనుని మరణానంతరం మహాకాయుడు 'గార్ధభ ప్రతతి బూనినయరదము"[33] నే అధిరోహించాడు.

ఈవిధంగా రామాయణకాలంలో గుఱ్ఱాలకు బదులు ఆజాతికి ఆకార సామ్యముగల గాడిదలు రథమునకు కట్టబడినవి. ఇవన్నియు రాక్షస జాతికి చెందిన వారి రథములకు కట్టబడుట గమనార్హము. రామాయణ కాలమున క్రూరమృగాల్నికూడా రథములకు అశ్వముల వలె కట్టడం ఉంది. ఇంద్రజిత్తు హనుమ్మంతునిపైకి యుద్ధానికి బయలుదేరునపుడు ఆతని రథానికి క్రూరమృగములు కట్టబడినట్లు వాల్మీకి ఈవిధంగా వర్ణించాడు.

'సపక్షిరాజోపమ తుల్యవేగైః వ్యాళైః చతుర్భిః సిత తీవ్రదంష్ట్రైః'[34]

గరుత్మంతుని వంటి వేగంకలవి. తెల్లని తీక్ష్ణములైనదంతములు గలవి అయిన నాలుగు క్రూరమృగములు ఇంద్రజిత్తు రథానికి కట్టబడ్డాయి. ఇచ్చట 'వ్యాళైః' అనుపదానికి వ్యాఖ్యాతలు సింహాలు లేక తోడేళ్లు అని అర్థానిచ్చారు. భాస్కర రామాయణ కర్త క్రూరమృగాలని చెప్పక భయంకర ఆకారాలుగల గుఱ్ఱాలనే ఇట్లు వర్ణించాడు.

'తీవ్ర దంష్ట్రాముఖంబులు, గరుడవేగంబులు గల యహాభీల తురంగంబులంబూన్చిన యాదిత్య నిభంబగునొక్కరథం బెక్కి''[35] -- ఈ గుఱ్ఱాలు భయంకరములగు కోరలతోగూడిన ముఖాలు గలవి. రామాయణంలో దివ్య రథాల ప్రసక్తి ఉంది. అరణ్యకాండలో రావణుడు సీతాపహరణ సందర్భంలో దివ్యరథంపై వచ్చినాడు. అది మాయామయము, దివ్యము, సువర్ణమయము కామగమనము గలది.[36] అదియు గాడిదలచేతనే కట్టబడింది. సుందరకాండలో అక్షుని రథము అనేకములైన తపస్సులచే సంపాదింపబడినదిగా బంగారు వలలతో ప్రకాశించేదిగా చిన్న చిన్న పతాకాలతో అలంకరింపబడిందిగా, రత్నాలంకృతమైన ధ్వజంకలదిగా, మనోవేగంతో పోయే ఎనిమిది గుఱ్ఱాలచే కట్టబడినదిగా, ఎక్కడికైనా అడ్డులేకుండా ప్రయాణం చేసేదిగా, సూర్యకాంతితో సమానమైన కాంతిగల గంటలు కట్టిందిగా, బంగారు మాలలు గలదిగా, ఆకాశాన సంచరింప గలదిగా, ఆయాస్థానాల యందమర్చబడ్డ తూణీరాలు, ఎనిమిది ఖడ్గాలు, శక్తి, తోమరాలు, కలదిగా వాల్మీకి వర్ణించాడు[37]

రావణునకు బ్రహ్మదత్తమైన సహస్రఖరయుక్తమైన దివ్యరథమున్నట్లు రామాయణంలో చెప్పబడింది. అట్లే త్రిశిరుడును తనకు బ్రహ్మదత్తములైన శర, శరాసన, శక్తికవచంబులు, నశ్వసహస్రయుతంబగు దివ్య రథంబులు గలవని యంటాడు.[38] ప్రహస్తునకు దివ్యరథముగలదు.[39] ఇంద్రజిత్తు యుద్ధరంగంలో హోమకార్యాలుచేసి పొందిన రథాన్ని రంగనాధ రామాయణకర్త ఈవిధంగా వర్ణించాడు.

------ 'నిరుపమంబైన, హయచతుష్టయంబుతో నతిఘోరలీల గురుతర బాణాస నోజ్జ్వలంబగుచు, సురుచిరాలంకార శోభితంబగుచు, సరినొప్ప సింహార్ధ చంద్ర చిహ్నముల బరగుచు, వైఢూర్య భాసురం బయిన, పడగచే నమరుచు బ్రహ్మాస్త్ర రక్ష, నడరుచునని నదృశ్యంబయియుండు, అట్టి యారథమెక్కి యనికి నేగుచును[39ఎ]

ఆరథం బ్రహ్మాస్త్ర రక్షగలది. అదృశ్యమైయుండేది. వైఢూర్యాలచే ప్రకాశించు పడగ గలది.

రాముని కొఱకై ఇంద్రుడు మాతలిద్వారా పంపిన ఇంద్రరథ సౌందర్యాన్ని భాస్కరరామాయణకర్త మనోహరంగా వర్ణించాడు.

సీ॥ కింకిణీ మాలికా ఝుంకార ముఖరంబు- సురుచిర నవరత్న శోభితంబు.
తటిదుజ్జ్వలోచ్చ కేతన దండ సహితంబు - గురుతర వైఢూర్యకూబరంబు
జలజలోచన చక్ర చక్ర సన్నద్ధంబు - నక్షత సంకలితాక్ష యుగము
దుస్సహానిలవేగ తురగోహ్యమానంబు - తరుణార్కబింబ సుందరమునగుచు
విమల వజ్రకల్ప కమనీయ కంకట - దివ్యచాప తూణ దీప్త శస్త్ర
సహితమైనరథము జవమున గొనివచ్చి - మొనసి రామచంద్రు మ్రోలమెఱయ[40]

ఆ రథం బంగారుమయమైనది. వందలాది గంటలతో సువర్ణాభరణములతో అలంకృతమైనది. తెల్లని వింజామరలతో ప్రకాశించుచు ఆకుపచ్చరంగుగల గుజ్జాలు పూన్చబడింది. దివ్యచాపతూణాలతో గూడినది. వైఢూర్యమయమైన నొగలు గలదిగా వర్ణింపబడింది.

*6-6-2 గజ బలము:*

రాజులందఱు గజబలాన్ని పోషించినట్టివారే. తేనెరంగు కల్గిబలమైన దంతాలు, గుండ్రని లావైన శరీరం, అందమైనముఖం, మంచి అవయవసౌష్టవం గల్గినది. భద్రజాతి ఏనుగుగాను, లావైన పొట్టగలిగి, సింహనేత్రాలవంటి నేత్రాలు గలిగి, దళసరి శరీరము, కంఠము, తుండము గలిగి, మధ్యరకపు అవయవ సౌష్టవంగల పొడవైన దేహముగల ఏనుగు మంద్రజాతికి చెందినదిగాను, సన్ననికుఱుచైన గొంతు,దంతాలు, చెవులు, తుండము గలిగి, పెద్దకండ్లు, అతిసన్నని పెదవులు, పొట్టిలింగావయములు గల ఏనుగు మృగ జాతికి చెందినదిగాను 'వైజయంతి' తెల్పినట్లు గోవిందరాజీయవ్యాఖ్యయందు గలదు.[41] దీన్ని బట్టి గజశాస్త్రం ఆ కాలంలో ఎంత అభివృద్ధి చెందిందో తెలుస్తున్నది.

రామాయణంలో పైన తెల్పిన మూడు విధాలే గాక నాలుగురకాల మిశ్రతరగతి ఏనుగులును చెప్పబడ్డవి. అయోధ్యానగరంలోగల ఏనుగులను గూర్చి వర్ణిస్తూ వాల్మీకి ఈ విధంగా పేర్కొన్నాడు.

'భద్రైర్మంద్రై ర్మృగైశ్చైవ భద్రమంద్రమృగై స్తథా।
భద్రమంద్రైః భద్రమృగై ర్మృగమంద్రైశ్చ సా పురీ॥
నిత్యమత్తైః సదా పూర్ణా నాగైరచలసన్నిభైః''[42]॥

ఎల్లప్పుడు మదించిన కొండలవంటి భద్రములు, మంద్రములు, మృగాలు అనే మూడు జాతులకు చెందిన ఏనుగులే గాక భద్రమంద్రములు, భద్రమృగములు, మృగ మంద్రములు, భద్రమంద్రమృగములు, అను నాలుగు రకాల మిశ్రజాతి ఏనుగులు ఆ పట్టణంలో ఉన్నవని దాని భావము. ఆకాలంలో వింధ్య పర్వతమున పుట్టినవి. హిమాలయములందు పుట్టినవి. తూర్పు దిక్కున పుట్టిన ఐరావతకులానికి చెందినవి, ఆగ్నేయ దిశయందు గల అంజనమను దిగ్గజపు జాతిలో పుట్టినవి, దక్షిణదిశయందు గల వామనమను దిగ్గజ జాతిలో పుట్టినవి యగు ఏనుగులు అయోధ్యాపతి గజబలముననున్నట్లు వాల్మీకం వర్ణించింది.[43] అట్లే రావణుని గజబలాన్ని గూర్చిన విషయం సుందరకాండయందు చెప్పబడింది. హనుమంతుడు లంకలో ప్రవేశించి సీతాన్వేషణ చేయుచున్న సందర్భంలో రావణుని చతురంగబలాలను చూచాడు. రావణుని గజబలాన్ని గూర్చి వాల్మీకి ఈ విధంగా వర్ణించాడు.

'కులీనాన్ రూపసంపన్నాన్ గజా న్పరగజారుజాన్।
నిష్ఠితాన్ గజశిక్షాయా మైరావతసమా న్యుధి॥
క్షరతశ్చ యథామేఘాన్ స్రవతశ్చ యథా గిరీన్।
మేఘస్తనితనిర్ఘోషాన్ దుర్ధర్షాన్ సమరే పరైః[44]॥

ఆ ఏనుగులు మంచిజాతికి చెందినవి, చక్కని శిక్షణ పొందినవై ఐరావతముతో సమానమైనవి, యుద్ధమున శత్రుసైన్యాలను సంహరింపగలవి, మదధారలను స్రవించుచు వర్షించు మేఘంలాగా ఉన్నవి. ఉరుములవంటి ఘీంకారాలు కలవి.

మదధారలను స్రవించు ఏనుగులు శ్రేష్టమైనవిగా చెప్పదగినవి. అయోధ్యా నగరమునందలి ఏనుగులను భాస్కరరామాయణకర్త ఈవిధంగా వర్ణించాడు.

'తరళిత దంతకాంతి సముదంచిత బృంహిత నీలదేహముల్
పరగ తటిల్లతాస్తనిత భాసుర వారిధరంబులోయనన్
బొరిబొరి నేనుగుల్ దిరిగి పుష్కర శీకర దానధారల
ప్పురమున్ చెల్లుగా గురియు భూతలమంతయు బంకిలంబుగన్[45]

దంతకాంతులతో ప్రకాశించు నల్లని శరీరములు గలిగి మెఱుపులతో గూడిన మేఘాలలో నున్నట్లున్న ఆ పట్టణంలోని ఏనుగులు తమ మదధారలతో భూమండలమంతయు బురదగా చేస్తున్నాయని దాని భావం.

ఆకాలంనాటి వీరులు భయంకరమైన ఏనుగులను కూడా అంకుశంతో తమకు లొంగునట్లు చేసుకొనగలరు. యూపాక్షుడు యుద్ధానికి బయలుదేరుటను భాస్కర

రామాయణకర్త ఇట్లు వర్ణించాడు.

'నడపు గోపంబు గల కొండనాగ గలిత
దాన నిర్ఝరార్ద్రంబగు తన గజంబు
లీల నంకుశాహతి గెరలించుచున్న
వాడు యూపాక్షుడనువాడు వసుమతీశ'[46]

నడుస్తున్న, కోపమున్న కొండవలె అప్పటి ఏనుగు ఉన్నది. మదజలాన్ని ధారగా స్రవిస్తున్నదైన అట్టి ఏనుగును అంకుశంతో యూపాక్షుడు తోలుకొనివచ్చుట ఇందు చెప్పబడింది. యుద్ధాలలో ఉపయోగించే ఏనుగులకు పేర్లు పెట్టు ఆచారం కూడా ఆనాడున్నట్లు తెలుస్తున్నది. మహోదరుడు 'సుదర్శనం' అనే పేరుగల ఏనుగు పైకి ఎక్కి యుద్ధానికి యూపాక్షుడు వెళ్లాడు.[47] ఆ కాలంలో రాజులు గజసైన్యాలను ఉత్పత్తిచేసే'నాగవనం'లను జాగ్రత్తగా కాపాడుచుండేవారు. అయోధ్యకాండలో రాముడు భరతుని కుశలప్రశ్నలడుగు సందర్భంలో వాల్మీకి ఈ విషయాన్ని చెప్పాడు.

'కచ్చి న్నాగవనం గుప్తం కచ్చిత్తే సంతి ధేనుకాః
కచ్చిన్న గణికాశ్వానాం, కుంజరాణాం చ తృప్యసి[48]॥

నాగవనం చక్కగా రక్షింపబడుచున్నది! అంతేగాక ఏనుగులను పట్టుటకు సాధనములుగానుపయోగించు ఆడ ఏనుగులను, గుఱ్ఱాలను, మగ ఏనుగులను సాధించడంలో తృప్తి చెందవుగదా అని భావం.

"ధేనుకాః' - అనగా గజగ్రహణ సాధన భూతములైన ఆడఏనుగులు. దీన్ని బట్టి మగ ఏనుగులను పట్టటానికి ఆడ ఏనుగులను ఉపయోగిస్తారని తెలుస్తున్నది.

**6-6-3** అశ్వబలం:

అశ్వాలు రథాలకు కట్టుటకే గాక వీరులు యుద్ధానికి వెళ్లేటప్పుడు అధిరోహించడానికి ఉపయోగించేవారు. ఈ విధంగా రౌతులచే అధిరోహించబడ్డ అశ్వబలమే చతురంగబలాల్లో ఒకటైనది.

అయోధ్యానగరంలోని గుఱ్ఱాలను వాల్మీకి ఇట్లా వర్ణించాడు.

'కాంభోజవిషయే జాతైః బాహ్లీకైశ్చ హయోత్తమైః
వనాయుజై ర్నదీజై శ్చ పూర్ణా హరిహయోత్తమైః[49]॥

ఇవి కాంభోజ దేశమున జన్మించినవి. సింధుదేశమున పుట్టినవి. ఇంద్రుని ఉచ్చైశ్రవము వంటివి యగు శ్రేష్ఠమైన గుఱ్ఱాలతో అయోధ్యానగరం నిండియున్నదని భావము.

పైన తెల్పిన ఆయా దేశములందలి గుఱ్ఱాలు శ్రేష్ఠమైనవిగా చెప్పదగినవి. అయోధ్యానగరంలోని గుఱ్ఱాలు ఐదువిధాలైన ధారలతోను ప్రసిద్ధమైనట్టివిగా భాస్కరరామాయణకర్త వర్ణించాడు.

'జవమున భంజళిన్ మురళిఁజౌకమునన్ నడనైదు ధారలన్
వివిధ విచిత్ర వల్గన వివేకములన్ బొలపంబునన్ శుభ
ధ్రువముల దూరభావముల రూపబలంబుల రూఢినెక్కి యా
హవ జయశీలముల్ గలుగు నశ్వములెన్నగ బెక్కులప్పురిన్[50]

వేగము గల్గినవి, భంజళి, మురళి, చౌకము వంటి గతిభేదములందును ఐదుధారలందును చిత్రముగా దుముకుట మొదలగు వానియందు నేర్పుగలిగి మంచిరూపమును అధికబలము గలిగి ప్రసిద్ధిచెంది విజయమును గల్గించునట్టి అశ్వములు ఆ పట్టణమున అనేకములున్నాయి.

అశ్వశాలాధ్యక్షులను 'సాహిణి' అంటారు. ప్రాచీన కావ్యములయందు అశ్వాలతో పాటు యుద్ధభూమియందు వానిపై స్వారీచేయు వీరులును వర్ణింపబడినారు. రావణునితో పాటు యుద్ధానికి బయలుదేరిన వీరులను విభీషణుడు వర్ణించు సందర్భంలో పిశాచరాజు ను గూర్చి తెల్పుటను భాస్కరరామాయణకర్త ఈవిధంగా వర్ణించాడు.

'సంజ మొగులు నిద్దంపు గెంజాయమేను
గలుగు తురగరత్నము చిత్రగతుల మెఱయ
వడి మహాశనివడవున వచ్చు నన్ని
శాత కుంతహస్తుండు పిశాచరాజు''[51]

సంధ్యాకాలపు మేఘాలవంటి ఎఱ్ఱని శరీరపు రంగుగల శ్రేష్ఠమైన గుఱ్ఱము పై పిశాచరాజు పదునైన కుంతమను ఆయుధాన్ని పట్టుకొని బయలుదేరాడు. అట్లే రావణపుత్రుడు నరాంతకుడును తెల్లని గుఱ్ఱంపై నెక్కి అంగదునెదిర్చినాడు. ఆ భయంకర యుద్ధమున గుఱ్ఱాలు నేలకూలుటను రంగనాథరామాయణకర్త ఈవిధంగా వర్ణించాడు.

'ఎక్కిన రౌతులనిటునటుబడగ - లెక్కసేయక కరాళించు గుఱ్ఱములు
పక్కెలలూడంగ బఱచుగుఱ్ఱములు - దిక్కులు సుడివడ దిరుగు గుఱ్ఱములు

కీలెడలిన క్రియ గెడయుగుఱ్ఱములు - కూలికాళ్లను దన్నుకొనెడి గుఱ్ఱములు
వికలంబులై పోరువిచ్చు గుఱ్ఱములు - నొకరూపునేర్పడకుండు గుఱ్ఱములు.[52]

ఇందు గుఱ్ఱాలపై కూర్చొను రౌతు జీనును పఱచుకొనుట చెప్పబడింది.

*6-6.4* పదాతిదళం:

సేనావిభాగంలో పదాతిదళం పెద్దదిగా ఉండును. దీనినే కాల్బలమని అంటారు. పదాతిదళం అధికంగా ఉన్నసేనకే అపారమైన శక్తియుంటుంది.

అయోధ్యానగరంలోని పదాతిదళాన్ని గూర్చి భాస్కరరామాయణకర్త ఈవిధంగా వర్ణించాడు.

కులగురు లెత్తనైన వడిగుంభిని గ్రుంగగ ద్రొక్కనైన వా
ర్థుల గలపంగనైన జము దుప్పటి దూలగ దోలనైన ది
గ్వలయ మదేభ కుంభములు ప్రక్కలు సేయగనైన జాలు దో
ర్బలముల గెల్తు రాజిఁబరిపంథుల నందుల వీరసద్భటుల్[53]

అయోధ్యానగరమందలి వీరభటులు కులపర్వతము లెత్తగల్గినట్టి, భూమిని క్రుంగిపోవునట్లు చేయగల్గినట్టి, యముని గూడ చలింపజేయగల్గినట్టి, దిగ్గజముల కుంభస్థలములు పగులకొట్టగల్గినట్టి భుజబలముగలవారై శత్రువులను యుద్ధమున జయింపగలవారు.

వాల్మీకి మహర్షి అయోధ్యానగరపు పదాతిదళాన్ని మరికొంత విశేషంగా వర్ణించాడు.

'యోధానా మగ్నికల్పానాం పేశలానా మమర్షిణామ్।
సంపూర్ణా కృతవిద్యానాం గుహా కేసరిణా మివ[54]॥

అధిక శౌర్యంచే అగ్నితో సమానులు, కుటిలత్వం లేనివారు, పరాభవం సహింప రానివారు, శస్త్రవిద్యలు బాగుగా నేర్చినవారునగు భటులతో ఆ అయోధ్య సింహాలతో గుహవలె పరిపూర్ణమై ఉండెను.

రాక్షససేనకు సంబంధించిన పదాతిదళముల విశేషవర్ణనము కుంభకర్ణుడు యుద్ధానికి బయలుదేరు సందర్భంలో వాల్మీకంలో ఇట్లా ఉంది.

'పదాతయశ్చ బహవో మహానాదా మహాబలాః।
అన్వయూ రాక్షసా భీమా భీమాక్షా శ్శస్త్ర పాణయః॥
రక్తాక్షా స్సుబహువ్యామా నీలాంజనచయోపమాః।

శూలానుద్యమ్య ఖడ్గాంశ్చ నిశితాంశ్చ పరశ్వధాన్॥
బహువ్యామాశ్చ పరిఘాన్ గదాశ్చ ముసలాని చ।
తుల్యస్కంధాంశ్చ విపులాన్ క్షేపణీయాన్ దురాసదాన్[55]॥

మహాబలవంతులు, భయంకారాకారులు, భీకరనేత్రులు, ఎఱ్ఱని కన్నులు గలవారు, నల్లని కాటుక రాశులవంటివారునగు పదాతులైన రాక్షసులు వాడికత్తులను, గొడ్డళ్లను, పొడవైన పరిఘలను, గదలను, ముసలమును, తాటిచెట్లను తీసుకొని పెద్దధ్వని చేయుచు కుంభకర్ణుని వెంట వెళ్లినారు.

రావణుని చతురంగబలవర్ణనమును భాస్కరరామాయణకర్త ఈ విధంగా వర్ణించాడు.

'ధీరసత్త్వంబుల దిగ్గజంబులకైన సిగ్గుపుట్టించెడి సింధూరములు
గతివిశేషంబుల శతమఖుతురగంబు దలవంప జేయు సైంధవ గణంబు
చటులజవంబున చండభానుని తేరు సరకు సేయని మహాస్యందనములు
భూరి పరాక్రమంబున సింహములతెంపు కలిమి మెచ్చని యట్టి కాల్బలంబు[56]

లక్ష్మణుడు ఇంద్రజిత్తు నెదిరించుటకై నికుంభిలకు వెళ్లిన సందర్భంలో నీవిధమగు చతురంగబలాలను ఆతడు చూచుట జరిగినది.

### *6-6.5 ఇతరములు :*

కుంభకర్ణుడు యుద్ధానికి బయలుదేరు సందర్భంలో చతురంగబలాలతో పాటు రాక్షసులు ఇతర జంతువులనధిరోహించి వెళ్లటాన్ని వాల్మీకి ఈవిధంగా వర్ణించాడు.

"సర్పైః ఉష్ట్రైః ఖరైః అశ్వైః సింహద్విపమృగద్విజైః।
అనుజగ్ముశ్చ తం ఘోరం కుంభకర్ణం మహాబలమ్[57]॥

కొందరు సర్పాలను, ఒంటెలను గాడిదలను అశ్వాలను,సింహాలను, ఏనుగులను, లేళ్లను, పక్షులను అధిరోహించి కుంభకర్ణుననుసరించిరి. ఇందు సర్పాలను ఒంటెలను సింహాలను, లేళ్లను పక్షులను అధిరోహించుట విశేషము. సర్పాలు, లేళ్లు , పక్షులలో పెద్ద శరీరాలుగల వానిపై వారువెళ్లుట జరిగియుండును. అంతేగాక వానరులను భయభ్రాంతులను చేయడానికి వారట్లు చేసియుండవచ్చు. అట్లే వజ్రదంష్ట్రుడు యుద్ధానికి బయలుదేరునపుడు ఆతని వెంట ఒంటెల సైన్యము, గాడిదల సైన్యము వెళ్లడాన్ని వాల్మీకి వర్ణించాడు.

"నాగైరశ్వైః ఖరై రుష్ట్రైః సంయుక్త స్సుసమాహితః[58] అని చెప్పబడింది. అట్లే త్రిశిరుడు యుద్ధానికి బయలుదేరేటప్పుడు వృషభాన్ని ఎక్కివెళ్లటాన్ని వాల్మీకమిట్లు వర్ణించింది.

'యశ్చైష శూలం నిశితం ప్రగృహ్య। విద్యుత్ప్రభం కీలక వజ్రవేగం।

వృషేంద్రమాస్థాయ గిరిప్రకాశ మాయాతి యోऽసౌ త్రిశిరా యశస్వీ[59]॥

త్రిశిరుడు సింహాన్నిఎక్కి యుద్ధానికి వెళ్లినట్లు గోనబుద్ధారెడ్డి ఈవిధంగా వర్ణించాడు.

"మిక్కిలి కడిమిమై మెఱసి సింహంబు నెక్కిశూలంబుపట్టి యేతెంచువారల

అని మీద వేడుక నలరినవాడు దినకరకులనాథ త్రిశిరుడన్వాడు.[60]

రామలక్ష్మణులు, హనుమంతుడు అంగదుడు, సింహాన్ని అధిరోహించి యుద్ధం చేయడం రామాయణంలో వర్ణించబడింది.

*6-6-6* సైనిక గణన:

వానర సైన్యానికి సంబంధించి మూల బలాన్ని వివరించినపుడే లెక్కల కందని సంఖ్యామానము చెప్పబడింది. మిగిలిన సందర్భంలో సైనిక గణనకు 'అక్షౌహిణీ' పదం చెప్పబడింది. విశ్వామిత్రుడు అక్షౌహిణీ 'రథ సేనాధ్యక్షుడని' భాస్కర రామాయణం చెప్పింది.[60a]

అక్షౌహిణీపదం రామాయణంలో అనేకచోట్ల ప్రయోగింపబడింది. అంగదుడు రాయబార సందర్భంలో రాక్షసుల బారినుండి తప్పించుకొనిన తర్వాత రాక్షసులు సముద్రతీరమున విడిసిన వానరసైన్యములను చూచుటను వాల్మీకి ఇట్లు వర్ణించినాడు.

'తేషామక్షౌహిణిశతం సమవేక్ష్య వనౌకసామ్।

లంకాముపనివిష్టానాం సాగరం చాభివర్తతామ్॥

రాక్షసా విస్మయం జగ్ము స్త్రాసం జగ్ముస్తథాపరే[61]

లంకలో విడిసిన, సముద్ర తీరాన ఉన్న నూరు అక్షౌహిణుల వానర సేనను చూచి రాక్షసులు ఆశ్చర్యపడిరి. దీనినే గోనబుద్ధారెడ్డి "వేయిలక్షలు కోటాను కోటులక్షౌహిణులు" అంటాడు. విశ్వామిత్రుడు దశరథునివద్దకు వచ్చి రామలక్ష్మణులను పంపుమని కోరినపుడు అందులకిష్టపడని దశరథుడు తాను 'అక్షౌహిణీ సామంతుల నీక్షణమ గొనుచు వేగమే వచ్చెద"[62] ననుటను భాస్కరరామాయణం తెల్పింది. ఈ ప్రకారం అక్షౌహిణీపదం రామాయణకాలం నాటికే ప్రసిద్ధమై ఉంది.

### *6-7 వ్యూహము - వ్యూహనిర్మాణావశ్యకత:*

యుద్ధంలో చతురంగ బలాలను నడపడానికి అనుసరించే విధానాన్ని వ్యూహమంటారు. 'బలమును చక్కగా అమర్చి తక్కువ సైన్యాలతో ఎక్కువ యుద్ధ శక్తిని గలిగించి శత్రునిర్మూలనముచేయుటయే సుశిక్షత యుద్ధవిధానమని, దానినే వ్యూహమందురని'[62a] శ్రీఖండవల్లి వారి అభిప్రాయము. ఒకరాజు శత్రురాజుపై దాడిచేయడాన్నిగాని, రెండవరాజు ఆత్మ రక్షణ చేసుకోవడానికిగాని సందర్భాన్ని బట్టి భిన్నరీతులుగా వ్యూహాలను నిర్మించుకోవలసి యుంటుంది. రామాయణ యుద్ధంలో రాముడు దండెత్తినవాడు కాగా రావణుడు ఆత్మరక్షణ గావించుకొనినాడు.

### *6-7-1 వ్యూహనిర్మాణావశ్యకత :*

అల్పసంఖ్యాకమైన సైన్యంగలవారు ఆ బలాన్ని గరిష్ట ప్రయోజనవంతంగా ప్రయోగించడంలోనే వ్యూహ భావన ఏర్పడింది. వ్యూహనిర్మాణం వల్ల శత్రువుల యొక్క శక్తిని కాలాన్ని వృద్ధిచేయడానికి అవకాశముంటుంది. సైన్యాన్ని పొదుపుగాను, శక్తివంతంగాను ప్రయోగించడానికే వ్యూహాలు ఏర్పడ్డాయి. నిర్మాణాత్మకమైన వ్యూహం లేకుండా ముఖాముఖీదొమ్మియుద్ధానికి దిగడం వల్ల రాజు అధికంగా నష్టాన్ని పొందుతారు.

### *6-7-2 వ్యూహపద నిర్వచనం:*

1. 'వ్యూహస్తు బలవిన్యాసం' - అని అమరం. విశిష్టమైన సేనా విన్యాసపద్ధతిని వ్యూహంగా చెప్పెదరు. బలవిన్యాసం అంటే సేనను ఒడ్డడం.
2. వ్యూహ్యతే, రచ్యతే ఇతి వ్యూహః' అనగా రచింపబడునది.
3. విశేషేణ ఊహ్యతే ఇతి వ్యూహః' ఊహ్ - వితర్కే. అంటే విశేషంగా ఆలోచింపబడేది. విశేషమైన ఆలోచన చేసియే సేనాయకుడు చతురంగబలాల్ని యథాస్థానంలో ఉంచుతాడు. కాబట్టి దీనిని విశేషమైన ఊహాఫలితంగా చెప్పాడు. వ్యూహముఖంలో రథాలు, వానివెనుక గజాలు, వానివెనుక పదాతిదళాలు పార్శ్వములందు గుల్మాలు ఉండేటట్లుగా వ్యూహాన్ని ఏర్పరచాలి. అర్థచంద్రము, చక్రము, శకటము, మకరము, కమలము, గుల్మము మొదలైన ఆకారాలతో వ్యూహరచన ఉంటుంది.

*6-7-3 రామాయణవ్యూహములు:*

రామాయణంలో రామరావణ సంగ్రామ ఘట్టంలో వ్యూహనిర్మాణం కనిపిస్తున్నది. వానర రాక్షససేనలు ఒకపద్ధతి ప్రకారమే నడిచాయి. రాముడు వానర సైన్యాన్ని గరుడ వ్యూహంగా విభజించి నిల్పినాడు. శార్దూలుడనే గూఢచారి రావణునకు ఆ విషయాన్ని తెల్పటాన్ని వాల్మీకమిట్లా చెప్పింది.

'గరుడవ్యూహ మాస్థాయ సర్వతో హరిభి ర్వృతః।
మాం విసృజ్య మహాతేజా లంకా మే వాభివర్తతే[63]॥

రాముడు వానరసేనతో చుట్టుకొనబడినవాడై గరుడవ్యూహాన్ని పన్ని లంకనుముట్టడించాడు. ఈ వ్యూహంలో ఎవరెవరు ఏఏ స్థానాల్లో నిలిచిందీ వివరించాడు. దక్షిణ పార్శ్వంలో ఋషభుడు, వామపార్శ్వమున గంధమాదనుడు, శిరఃప్రదేశంలో రామలక్ష్మణులు, కుక్షి స్థానంలో జాంబవంతుడు సుషేణుడు, వేగదర్శి యనువారలు,పృచ్ఛభాగంలో వానరరాజగు సుగ్రీవుడు నిలిచినారు. వ్యూహనిర్మాణం పూర్తయిన తరువాతనే అంతకు పూర్వం దూతగా వచ్చి బంధింపబడిన శుకుని సుగ్రీవుడు విడిచినాడు[64].

రాముని వ్యూహాన్ని గూర్చి తెలుసుకొన్న రావణుడు తన లంకానగరాన్ని పూర్వంకంటే పటిష్టం చేశాడు. ప్రహస్తుని తూర్పు ద్వారం వద్దను, మహోదర మహాపార్శ్వులను దక్షిణ ద్వారం వద్దను, ఇంద్రజిత్తును పశ్చిమద్వారం వద్దను పోరాటాన్ని సాగించటానికై ఏర్పాట్లను చేశాడు. పురమధ్యమమును రక్షించటానికై విరూపాక్షుని నియమించినాడు. విభీషణుని మంత్రులు పక్షిరూపాలను ధరించి లంకానగరంలోకి గూఢచారులుగా ప్రవేశించి రావణుని ఏర్పాట్లను గురించి తెలుసుకొని రాముని వద్దకు వచ్చి వివరించినారు. అది గ్రహించిన రాముడు రావణుని వ్యూహానికి ప్రతివ్యూహాన్ని పన్నుచు పల్కిన మాటలను వాల్మీకం ఈ విధంగా తెల్పింది.

'పూర్వద్వారే తు లంకాయాం నీలో వానరపుంగవః।
ప్రహస్తం ప్రతియోద్ధా స్యాద్వానరైర్బహుభిర్వృతః॥
అంగదో వాలిపుత్రస్తు బలేన మహతా వృతః।
దక్షిణే బంధతాం ద్వారే మహాపార్శ్వమహోదరౌ॥
హనుమాన్ పశ్చిమద్వారం నిష్పీడ్య పవనాత్మజః।

ప్రవిశ త్వప్రమేయాత్మా బహుభిః కపిభి ర్వృతః॥
దైత్య దానవ సంఘానా మృషీణాం చ మహాత్మనామ్।
విప్రకారప్రియః క్షుద్రో వరదాన బలాన్వితః॥
పరిక్రామతి యః సర్వా ల్లోకాన్ సంతాపయన్ ప్రజాః।
తస్యాహం రాక్షసేంద్రస్య స్వయమేవ వధే ధృతః॥
ఉత్తరం నగరద్వార మహం సౌమిత్రిణాస్సహ।
నిపీడ్యాభిప్రవేక్ష్యామి సబలో యత్ర రావణః॥[64a]

తూర్పు ద్వారమున నిలిచిన ప్రహస్తుని నీలుడు, దక్షిణ ద్వారముననున్న మహోదర మహాపార్శ్వులను అంగదుడు, పశ్చిమ ద్వారముననున్న ఇంద్రజిత్తును హనుమంతుడు, ఉత్తరద్వారమును గల రావణుని లక్ష్మణ సమేతుడై తానును ఎదిరింపవలెనని నిర్ణయించెను. సుగ్రీవుడు, జాంబవంతుడు, విభీషణుడు ఈ ముగ్గురును ఉత్తర పశ్చిమద్వారముల మధ్య రావణేంద్రజిత్తుల నడుమ సేనతో నుండాలని పల్కును. రావణుని సేనానాయకులును వ్యూహము గానే తమ సేనలను నడుపుకొనుచు యుద్ధానికి బయలుదేరారు. ప్రహస్తుడు మంత్రి సమేతంగా యుద్ధమునకు బయలుదేరుటను వాల్మీకి ఈ విధంగా వర్ణించాడు.

'వ్యూఢేనైవ సుఘోరేణ పూర్వద్వారాత్ స నిర్యయౌ।
గజయూథనికాశేన బలేన మహతా వృతః[65]॥

ఆ ప్రహస్తుడు వ్యూహరూపమున నిలుపబడినదియు, ఏనుగుల గుంపు వలెనున్నదియు, మహాభయంకరమైనదియునగు పెద్దసేనతో తూర్పుద్వారము నుండి యుద్ధానికి వెళ్లాడని భావం. రాముడు గరుడవ్యూహముగా సేనను సిద్ధము చేయుటను తెలుగురామాయణములు గూడ తెల్పినవి. భాస్కర రామాయణకర్త ఇట్లు తెల్పినాడు.

గరుడ వ్యూహముగా వా
నరసేనవమర్చి కొని రణక్రీడకు నా
ధరణీపతి వచ్చుచున్నా
డురవడి నట సీత బుచ్చుటుచితంబింకన్[66]

మొదటిరోజున రాముడు లంకను ముట్టడించిన విధానాన్ని రామాయణం విపులంగా వర్ణించింది. తూర్పుద్వారంలో 10 కోట్ల వానరులతో కుముదుడను వానరయూధపుడా

క్రమించినాడు. ఆతనికి ప్రఘసుడు, పనసుడు, సహాయంగా వెళ్లారు. దక్షిణ ద్వారాన్ని శతబలి యను వానర యూధపుడు ఇరవై కోట్ల వానర వీరులతో ముట్టడించినాడు. గజుడు - గవాక్షుడు - గవయుడు - శరభుడు - గంధమాదనుడు అనువారు అన్ని వైపుల తిరుగుచు వానర సేనను రక్షించారు. పశ్చిమ ద్వారాన్ని సుషేణుడు 60 కోట్లమంది వానరులతో ముట్టడించాడు.ఉత్తర దిక్కును సుగ్రీవసహితులై రామలక్ష్మణులు ముట్టడించారు. గోలాంగూల నాయకుడైన గవాక్షుడు, కోటి గోలాంగూలములతోను మరొక ప్రక్క కోటి భల్లూకాలతో ధూమ్రుడు నిలిచాడు. మొత్తము మీద రాముడు లంకానగరము యొక్క ముట్టడి వ్యూహాత్మకంగానే చేసినాడనుట స్పష్టము. వానర సేనాపతియగు నీలుడును వ్యూహనిర్మాణాన్ని గూర్చిన పరిచయం గలవాడే. కాబట్టి కుంభకర్ణుడు వానర సైన్యం పైకి వచ్చిన సందర్భంలో రాముడు నీలునితో పలికిన మాటలు గమనింపదగినవి.

గచ్ఛ సైన్యాని సర్వాణి వ్యూహ్య తిష్టస్వ పావకే।
ద్వారాణ్యాదాయ లంకాయా శ్చర్యా శ్చాప్యథ సంక్రమాన్[67]॥

ఓ నీలుడా ! నీవు పోయి సైన్యములను వ్యూహరచనచే సమాయత్తం చేసి, లంకలోని ద్వారాలు, చర్యాస్థానాలు (రాజమార్గాలు) ఆక్రమించి నిలువుము. అని శ్లోకభావము. నీలుడు స్వయంగా వ్యూహరచన జేయగలవాడు కాబట్టే రాముడు నీలుని ఆవిధంగా ఆజ్ఞాపించాడు.

రామాయణంలో రాముడు లంకానగరాన్ని ముట్టడించడానికి తగిన వ్యూహాన్ని ఏర్పఱుచుకోగా, రావణుడు లంకానగర రక్షణాన్ని గూర్చి వ్యూహనిర్మాణం చేసుకొనవలసివచ్చింది. ఏ విధంగాను ప్రవేశించడానికి వీలులేని లంకానగరాన్ని లొంగదీసుకోవటానికి రాముడు వ్యూహ నిర్మాణం చేశాడు. గ్రద్దలోనుండునట్టి సూక్ష్మదృష్టి, వేగం, శత్రువునుచంచువులతో పొడవడంలో గలనేర్పు మొదలగు ప్రత్యేక గుణాలను దృష్టియందుంచు కొనియే రాముడు గరుడవ్యూహాన్ని పన్నియుండవచ్చునని చెప్పవచ్చును. ఇంద్రజిత్తు రెండవమారు యుద్ధానికి బయలుదేరునపుడు యుద్ధరంగమున హోమకార్యం చేయడానికై అతడు తనబలాన్ని వ్యూహానుసారంగా నిల్పుటను మొల్ల యిట్లు వర్ణించింది.

'లంకా నగరంబు వెడలి సంగ్రామ రంగంబునకుంజని తనబలంబుల చక్రాకారంబుగా నిలిపి తన్మధ్యంబున రథావతరణము చేసినాడు[68].

ఇచట ఇంద్రజిత్తు చక్రవ్యూహంగా తన సైన్యాన్ని నిల్పినట్లు భావించవచ్చు. అన్ని దిశలనుండి ప్రమాదం వాటిల్లునని తలచినపుడు చక్రవ్యూహం ఉపకారకంగా చెప్పబడింది.[69] ఇట్లు రామాయణము నందును వ్యూహనిర్మాణము గలదు. వ్యూహములకు సంబంధించిన పేర్లు ఒకటి రెండు తప్ప కన్పట్టవు.

*6-8* యుద్ధ పద్ధతులు:

రామాయణంలో నాలుగు రకాల యుద్ధాలు వర్ణింపబడ్డవి. అవి

1. మానవులకు రాక్షసులకు మధ్య జరిగినవి. ఉదా: రామలక్ష్మణులు రాక్షస యోధులైన రావణుడు, ఇంద్రజిత్తు ఖరదూషణాదులు మొదలగు వారితో చేసినట్టివి.
2. వానరులకు - రాక్షసులకు మధ్య జరిగినవి. ఉదా : సుగ్రీవుడు, హనుమంతుడు, నీలుడు మొదలగువారు.
3. వానరులకు - వానరులకు మధ్య జరిగినవి. ఉదా: వాలి, సుగ్రీవుల యుద్ధం.
4. అసాధారణ శరీరధారులతో జరిగిన యుద్ధం. ఇది ప్రత్యేకమైనది. ఉదా: 'జటాయువు' 'కుంభకర్ణుడు' 'విరాధుడు' కబంధుడు మొదలగువారితో జరిగినట్టివి.
5. రామాయణ మహాసంగ్రామంలో ప్రధానంగా పోరాటం సాగించిన యోధులు వానరులు, రాక్షసులు, వారుపయోగించిన ఆయుధము భిన్నములైనవి. ఆయుధాల్ని బట్టి వారి యుద్ధ పద్ధతులు భిన్నములైనవి.

*6-8.1* వానరుల యుద్ధ పద్ధతి :

వానర వీరులందరును కొండశిఖరాలు, రాళ్లు, చెట్లు, నఖములు, దంతములు, ఆయుధాలుగా చేసికొని పోరాటం చేసినవారే. సుగ్రీవుడు, అంగదుడు, హనుమంతుడు, మొదలైన వారు మాత్రం ఆయుధధారులనెదిరించి వారి వారి ఆయుధాలతోనే పోరాటం చేయడం కనబడుతుంది. వానరులందఱు మల్ల యుద్ధంలో ముష్టియుద్ధంలో ప్రవీణులైనవారు.

*6-8-2* రాక్షసుల యుద్ధ పద్ధతి:

రాక్షసులయందును కొందఱు వానరులకు వలెనే చెట్లు, కొండరాళ్లు, ఆయుధాలుగా చేసుకొని పోరాటం చేసినారు. రాక్షస వీరులలో శ్రేష్ఠులైన వారందఱు ధనుర్విద్యానిపుణులే. మిగిలిన రాక్షసులందఱు వివిధ ఆయుధములను ప్రయోగించుటయందు నేర్పుగలవారు. రాక్షసవీరులుపయోగించిన ఆయుధములను భాస్కర రామాయణకర్త ఈవిధంగా వర్ణించాడు.

మ॥ పరిఘ ప్రాస కఠోరకోణ పరశు భ్రాజిష్ణు శూలాస్త్ర ము
ద్గర చక్ర క్రకచోగ్ర శక్తి ముసలోద్యద్భిండివాలాసి తో
మర భల్లాతతఖేలు పట్టిసక చర్మప్రోద్యమత్కార్ముక
క్షురికాద్యాయుధ హస్తులై దితిజులస్తోక ప్రభావంబునన్[70]

రామలక్ష్మణులు క్షత్రియకుమారులుగా సమస్త శస్త్రాస్త్ర విద్యలందును నిపుణులే. వారు ధనుర్ధారులుగా ప్రసిద్ధిని పొందినారు.

స్థూలంగా యుద్ధ పద్ధతుల్ని రెండురకాలుగా విభజింపవచ్చు. అవి 1. ద్వంద్వ యుద్ధము 2. సంకులసమరము.

*6-8-3* ద్వంద్వ యుద్ధము:

సాయుధముగనైనను, తద్భిన్నముగనైనను ఇద్దరు వ్యక్తులు ఒకరితోనొకరు చేసేయుద్ధాన్ని ద్వంద్వయుద్ధమంటారు. దీనికే 'అంక' యుద్ధమనియు పేరుగలదు. తెలుగు సాహిత్యంలో 'ఎక్కటికయ్యంగా' పేర్కొనబడింది.

రామాయణమునందు అనేకద్వంద్వయుద్ధాలకు సంబంధించిన వర్ణనలున్నాయి. వానరులు రాళ్లు, చెట్లు మొదలైన వానితో తలపడగా రాక్షస వీరులు వివిధాయుధాలతో ద్వంద్వ యుద్ధము చేసినారు. ఆయుధరహితంగా జరిగిన మల్లయుద్ధ, ముష్టియుద్ధ వర్ణనలుగలవు. రామాయణమునందు యుద్ధప్రారంభ దినమున జరిగిన ద్వంద్వయుద్ధాన్ని వాల్మీకి ఈవిధంగా వర్ణించాడు.

'ఏతస్మి న్నంతరే తేషా మన్యోన్య మభిధావతామ్।
రక్షసాం వానరాణాం త ద్వంద్వయుద్ధ మవర్తత[71]॥ ఈ ప్రకారం వానరులు ఇరువురును ఒండొరులను తలపడు సమయంలో వారి మధ్య ద్వంద్వయుద్ధం జరిగిందని శ్లోకభావం.

రామాభ్యుదయకర్త వానర రాక్షసవీరుల మధ్య జరిగిన ద్వంద్వయుద్ధాన్ని ఈవిధంగా వర్ణించాడు.

సీ॥ అంగదుం డింద్రజిత్తుం గోరికొనియె, సంపాతి ప్రభాజనుఁబంచికొనియె,
మరుదాత్మజుఁడు జంబుమాలిఁబంచికొనె గజుండు ప్రతాపునిఁ జూచికొనియె
మైందుండు వజ్రముష్టిం దిగిచి కొనియె కుముదు డకంపనుఁగుదురుకొనియెఁ
గేసరి ధూమ్రాక్షు గిలుబాడుకొనె, వానరేశ్వరుండు ప్రహస్తు నేఱికొనియె
ద్వివిదుఁడశని ప్రభువగఁదెచ్చుకొనె, సుషేణుడు మహోదరుని విభజించుకొనియె
పనసుఁడు నరాంతకుని గుఱి పఱచుకొనియె జాంబవంతుఁడు మకరాక్షుఁజరుముకొనియె[72]
యజ్ఞకోపుని సుప్తఘ్నునగ్నికేతు రశ్మికేతుని దాఁకె శ్రీరాఘవుండు
లక్ష్మణుండు విరూపాక్షు నలఁచె నవ్విభీషణుండును మిత్రఘ్ను బిలిచె ననిచె[73]

మహావీరుడగువాడు ఒకే పర్యాయం అనేకమందితో యుద్ధాన్ని జేయడాన్ని కూడా ద్వంద్వయుద్ధమే అంటారు. శ్రీరాముడు ఒక్కమారుగా యజ్ఞకోపుని సుప్తఘ్నుని, అగ్నికేతుని, రశ్మికేతుని ఎదిరించినాడు.

ఇతర వానరవీరులు, రాక్షసవీరులు అనేకులతో బహువిధములుగా ద్వంద్వయుద్ధాన్ని చేశారు. వానరులు, రాక్షసవీరులకంటె పరాక్రమవంతులగుటవల్ల ఒక్కొక్కడు అనేకమంది రాక్షసులతో ద్వంద్వయుద్ధం చేశారు. రామాయణంలో వర్ణింపబడిన ద్వంద్వయుద్ధాలలో నిదియే పెద్దదిగా చెప్పదగింది. ఈ ద్వంద్వ యుద్ధమున యోధులుపయోగించిన ఆయుధాలు సమానమైనవికావు.

### *6-8.4* సంకుల సమరము:

అనేకులు అనేకులతో చేయునట్టి యుద్ధాన్ని సంకులసమరం అంటారు. ఇందు యోధులు విచక్షణారహితంగా చంపుకోవడం జరుగుతుంది. అనేకులతో ప్రారంభం చేసిన ద్వంద్వయుద్ధం సంకులసమరంగా మారుతుంటుంది. రామాయణంలో అసంఖ్యాకమైన వానర రాక్షసవీరుల మధ్య జరిగిన సంకులసమరం అనేక చోట్ల వర్ణింపబడింది.

యుద్ధప్రారంభ దినమున ప్రారంభమైన ద్వంద్వయుద్ధం తరువాత సంకులసమరంగా మారింది. దానిని వాల్మీకి ఈ విధంగా వర్ణించాడు.

'తత్రాసీత్ సుమహద్యుద్ధం తుములం రోమహర్షణమ్।
రక్షసాం వానరాణాంచ వీరాణాం, జయమిచ్ఛతామ్[74]॥

అప్పుడు ఒండొరులను జయింపగోరుచున్న రాక్షసులకు, వానరులకు నడుమ గగుర్పాటు గలిగించు సంకులసమరం జరిగిందని పై శ్లోకం యొక్క భావం.

వానరులు చేసిన భయంకరమగు సంకులసమరాన్ని భాస్కరరామాయణకర్త ఈవిధంగా వర్ణించాడు.

సీ॥ నిష్ఠురకరవాల నిశితంబులైయున్న ఘోరనఖంబులఁజీరి జీరి
పిడుగులకంటెను బెడిదంబులై యున్న పిడికిళ్లనందంద పొడిచి పొడిచి
భిదురధారల భంగి భీమంబులై యున్న కఠిన దంతంబుల గఱచి కఱచి.
చటులంబులైన సంపెటలతాకులబోలి వఱలు తలంబుఁ జడిచి చఱిచి
మొనసి వాలంబులార్చుచు మోదిమోది దర్పమొదవంగఁ బదములఁదన్ని తన్ని
తరులు గిరులును బైపయి గురిసి కురిసి కపుల పొలయించి రప్పుడు గడగి రిపులు[75]

వాల్మీకము సంకులసమరమును తుముల యుద్ధంగా పేర్కొనినది. ధూమ్రాక్షుడు రాక్షససేనతో వానర వీరులనెదిరించు సందర్భమున సంకులసమరము జరిగింది. దానిని వాల్మీకమిట్లు వర్ణించింది.

"తేషాం సు తుములం యుద్ధం సంజజ్ఞే కపిరక్షసామ్
అన్యోన్యం పాదపైర్ఘోరైర్నిఘ్నతాం శూలముద్గరైః"[76]

అంతట చెట్లతో వానరులు, శూలములు ముద్గరములతో రాక్షసులు దొమ్మియుద్ధం చేశారని భావం.

అట్లే అకంపనుడు యుద్ధానికి వచ్చిన సందర్భంలో జరిగిన యుద్ధంలో వాల్మీకమిట్లు దెల్పింది.

'శబ్దశ్చ సుమహాంస్తేషాం నర్దతామభిధావతామ్।
శ్రూయతే తుములే యుద్ధే న రూపాణి చకాశిరే.'[77]॥

ఈ దొమ్మి యుద్ధమున సింహనాదములు చేయువారు, ఒకరిపైనొకరు తలపడువారునగు వానరరాక్షసుల మహాధ్వని వినిపించెనేగాని రూపములు

ప్రకాశింపలేదని భావం. సంకుల సమరంలో యధేచ్ఛగా యుద్ధం చేసే యోధులపై నాయకులకు అదుపు ఉండేదికాదు. యుద్ధ విజయం వీరుల వ్యక్తిగత జయాపజయముల మీద ఆధారపడియుండేది. సామాన్యయోధులకు యుద్ధంలో ప్రాముఖ్యం ఉండేదికాదు. నాయకుడు మరణించినా పారిపోయినా సామాన్యయోధులు తామును పారిపోవడంగాని, ఆశ్రయించడంగానీ చేసేవారు. ఇందుకు రామాయణంలో అనేక ఉదాహరణలు కలవు.

*6-8.5 ద్వంద్వయుద్ధము - రకములు:*

ద్వంద్వయుద్ధాలు రెండువిధాలుగా చెప్పదగును. అవి.1.ఆయుధయుక్తములు 2.ఆయుధ రహితములు. ఆయుధయుక్తములైనవానిలో 1.ధనుర్యుద్ధం 2.ఖడ్గయుద్ధం. 3. గదాయుద్ధం ముఖ్యమైనవి. ఆయుధ రహితములైన వానిలో 1.మల్లయుద్ధము 2.ముష్టియుద్ధం పేర్కొనబడినది.

**6-8.6 ధనుర్యుద్ధం :**

ప్రాచీన కాలపు ఆయుధాలలో 'ధనుస్సు' ప్రధానమైనది. యజుర్వేదమునకుప వేదమైన 'ధనుర్వేదము' ధనుర్యుద్ధాన్ని గూర్చి తెల్పు శాస్త్రం. ధనస్సు సమస్త ఆయుధములకు వర్తిస్తుందని ధనుర్వేదం తెల్పుచున్నది. ధనుర్యుద్ధం కూడా స్థూలంగా రెండువిధములు. అవి 1.వివిధాకారములు గల బాణాలతో చేసే యుద్ధాన్ని బాణయుద్ధం అంటారు.

రామాయణంలో క్షత్రియకుమారులైన రామలక్ష్మణులు, క్షత్రియధర్మాన్ని అనుసరించిన రావణుడు, రావణపుత్రులు, రాక్షస నాయకులైన ప్రహస్తుడు, ధూమ్రాక్షుడు, కుంభుడు, విరూపాక్షుడు, మకరాక్షుడు, మాల్యవంతుడు, మహాకాయుడు, అతని మంత్రులైన రుధిరాశనుడు, వజ్రనాభుడు, కాలకల్యుడు, వపాశుడు, దుర్ధరుడు మొదలైన వారందఱు ధనుర్ధారులై యుద్ధంలో పాల్గొన్నవారే. వానరయూధపులు ధనుర్ధారులు కాకపోయినా బాణములనెదిరించి నిలబడగల నేర్పు, ధనుర్ధారిని పడగొట్టగల ఒడుపు వారికున్నాయి.

*6-8.7 రాముని ధనుర్విద్యానైపుణ్యం:*

ఆకాలపు ధనుర్ధారులలో రాముడు శ్రేష్ఠుడుగా చెప్పదగినవాడు. రాముని చేతిలోని ధనుస్సు చిత్రవిచిత్రగతులను పొందగలదు.

మొల్ల రామరావణ యుద్ధాన్ని వర్ణించే సందర్భంలో రాముని ధనుస్సును ఈవిధంగా వర్ణించింది.

'శరము దొడిగి తివియఁ జక్రంబువలె నుండు
శరము విడుచునపుడు చాపమగును
జూడ నొప్పె నౌర శోభితంబగు రాము
చేతివిల్లు సెప్పఁ జిత్రమగును.[78]

రాముని ధనుర్విద్యా నైపుణ్యం ప్రత్యర్థిగానున్న రావణునిచేత కూడా మెప్పులను పొందినట్టిది. రాముడు రావణుని ఛత్రచామరాలను పడగొట్టిన విధానాన్ని రంగనాథ రామాయణకర్త ఈవిధంగా వర్ణించాడు.

"వెనకొని లక్ష్మణ విల్లు దెమ్మనుచు - దనుకుబిమ్మట నున్న తమ్మునిచేతి
ధనువుడా చేతనెంతయు వేడ్కనంది - దక్షిణాంఘ్రియంగుష్ఠాన వింటి
కొనంబుబూని గ్రక్కున నెక్కుపెట్టి - కనదర్ధ చంద్రమార్గణమరివోసి
ధీ లక్ష్మితోల్లాసి తెగనెండదీసి - యాలీల నొఱగిన యట్లనేయుండి
యలచామర వ్యజనాత పత్రౌఘ - ములమీద నేసెనద్భుత వృత్తిమెఱయ
శరమొక్కటియు పదిశరములై నూఱు - శరములై పదివేల శరములై మఱియు
లక్షయై కోటియై లక్షించి చూడ - నాక్షణంబున సంఖ్యలన్నియు గడచి
తాలవృంతంబులు దాల్చు చేడియల - మేలిచామరములు మెఱయించు సతుల
సంగీతములుసేయు సరసిజముఖుల - బొంగుచు కైవారములు సేయుబోంట్ల
ధవళాత పత్రముల్ ధరియించు దైత్య - నివహంబులను గొల్చి నిల్చిన భటుల
కరములు ద్రుంచక గళములు ద్రెంచ - కురములునాటక యురుకిరీటములు
ధరడొల్ల జేయక తలలు ఖండింప - కరుదు దియని యమరులుప్పొంగ
నాలవట్టములు నాత పత్రములు - చాలశోభిల్లు వింజామరంబులును
కత్రించి కొనిపోయె కంఠమాత్రముల - చిత్రమైతనరిన సిత చామరములు
నాలవట్టములు సితాతపత్రములు - దేలుచు ఝల్లని దివినిండనెగసి
కొలువులో కొన్ని దిక్కులయందు గొన్ని - కొలువులోపలి దైత్యకోటిపై గొన్ని
లంకలో కొన్ని యాలవణాబ్ధి కొన్ని - లంకేశుపై గొన్ని లఘులీల బడియె
నలవుమైనటు చేసి యాదివ్య శరము - పొలయక రఘురాము పొదిజొచ్చెనంత[79]"

రాముడు రావణుని చామర వ్యజనాతపత్రములపై ఒక అర్ధచంద్ర బాణమును ప్రయోగించినాడు. ఆ బాణము లెక్కపెట్టలేనన్ని బాణాలుగా మారింది. ఆ బాణాలు

తాలవృంతములు పట్టుకొనిన, సంగీతము పాడుచున్న, చామరాలు వీచుచున్న, స్త్రీల యొక్క గాని, ఇతర భటులయొక్కగాని, చేతులను ఖండింపకుండా, కంఠాలను త్రుంచకుండా, రావణుని కిరీటాలను కూల్చకుండా తలలు ఖండింపకుండా, కేవలం ఆలవట్టములు (గుడ్డతో గుండ్రముగా చేయబడ్డ విసనకఱ్ఱలు), ఆతపత్రములు (గొడుగులు), వింజామరలను మాత్రమే కత్తిరించుకొనిపోయినది. ఆ కత్తిరించిన వానిని కొన్నింటిని రావణుని కొలువులోను, కొన్నిటిని దిక్కులయందు, కొన్నిటిని రాక్షసులమీద, కొన్నిటిని లంకలోను, కొన్నిటిని సముద్రము పైన, కొన్నిటిని రాక్షసులమీద, కొన్ని రావణునిపైన పడునట్లుగా ఆబాణము తన మహిమను చూపి మరల రామునివద్దకు వచ్చి ఆయన తూణీరమును చేరినది. ఇది రాముని ధనుర్విద్యా నైపుణ్యానికి నిదర్శనమైనట్టిది. అది చూచిన రావణుడు రాముని మెచ్చుకోవడాన్ని రంగనాధరామాయణకర్త ఈవిధంగా వర్ణిస్తాడు.

"బాపురే! రామభూపాలలోకముల - నీపాటి విలుకాడు నేర్పునే గలుగ
బాటించి పురములపై బడ్డ హరుని - మేటొప్పు నిందు నీ మేటొప్పుగాక"
యని పదినోళ్ల నందంద బొగడ"[80]

త్రిపురాలపై బాణప్రయోగం చేసిన శివుని ఏటు (వ్రేటు) తో నీ ఏటు సమానమైనదని తన పదినోళ్లతో రావణుడు రాముని ప్రశంసించినాడు. అంతేగాక రాముని కోదండ దీక్షాగురునిగా అంగీకరించినాడు.

వానరులు రాత్రి యుద్ధం చేసే సమయంలో కోపించిన రాముడు తనబాణాలతో లంకానగర ద్వారాన్ని కూల్చుట, విమానాలపై బాణాలను వేయడం, కైలాసశిఖరం వంటి లంకగోపురాన్ని ఐదుబాణాలతో పడగొట్టడం మొదలగునవన్నియు రాముని ధనుర్విద్యానైపుణ్యానికి నిదర్శనములైనట్టివే.

రామాయణకాలంలో ఎక్కువగా మూడు వంపులు గలిగిన ధనుస్సే యుద్ధాలయందుపయోగపడింది. దానిని వాల్మీకి "త్రిణత'మనినాడు[81] రాముడు ఇంద్రజిత్తు, అతికాయుడు మొదలగు ధానుష్కులందఱు ఇట్టి ధనుస్సే ఉపయోగించారు.

యోధులు బాణాలపై తమ పేర్లను చెక్కించుకొనుటయు ఆకాలమున గలదు. మహోదరుడు రావణునకు కుటిలోపాయములను తెల్పు సందర్భమున

రంగనాథరామాయణకర్త ఈవిధంగా తెల్పినాడు.

"రామనామాంకిత బాణ చటులోగ్ర పాతంబు సైరింపలేక"[82] రాముని పేరు బాణముల తీవ్రతను సహింపలేక' యని దాని యర్థం.

*6-8.8 బాణయుద్ధము:*

ధనుస్సు సహాయమున ఆలీఢాది పద్ధతులలో నిలిచి నాళీక, అర్ధచంద్ర, కర్ణి, క్షురికాది బాణాలను ప్రయోగించుట బాణయుద్ధంగా చెప్పబడును.

ధనుర్విద్యా విద్యావిశారదుడు యుద్ధమునందు నిలిచి పాదములుంచు తీరు'స్థానము' గా చెప్పబడును. పాదవిన్యాస భేదాలను బట్టి ఇవి ఐదులేక ఆఱు విధములుగా చెప్పబడినవి. భరతుడు ఈ స్థానములను. 1. వైష్ణవము. 2. సమపాదము 3. వైశాఖము, 4. మండలము 5. ప్రత్యాలీఢము 6. ఆలీఢము అను ఆఱువిధములుగా చెప్పినాడు.

ధనుర్విద్యా విలాసము వీని లక్షణాలను ఈ విధంగా తెల్పింది.

సీ॥ ఎడమ పాదము లక్ష్య మెదురుగా మున్నిడ నవని ప్రత్యాలీఢమై దనర్చు
గురికి జక్కన గాగ కుడికాలు మున్నిడ నాలీఢ మారూఢమై దనర్చు
పుడమిమూరకొలంది యెడముగా నంఘ్రిద్వయము నిల్ప వైశాఖ మై దనర్చు
నడుమ నంగుళయుగ్మమెడముగా నిలిచిన నది సమస్థానకం బై దనర్చు.
నల సమస్థానమున నుండి యడ్డముగను దోరణాకృతి నడుగుల దోయి ద్రిప్పి
యుభయ పార్ష్ణిముఖంబుల నొరయునిలుప మహిం దనరుఁదోరణాకృతి మండలంబు[83]

యోధులు ప్రత్యాలీఢ పాదముతో నిలిచియుద్ధం చేయుడాన్ని గూర్చి రామాయణంలో అనేక ఉదాహరణలున్నాయి. మచ్చునకు కొన్ని.

1. ఇంద్రజిల్లక్ష్మణుల యుద్ధాన్ని వర్ణిస్తూ లక్ష్మణుడు ఇంద్రజిత్తు శిరస్సును త్రుంచు సందర్భంలో మొల్ల ఇట్లు వర్ణించింది.

'భుజగాస్త్రంబు వింట సంధించి--------- వానిపై లక్ష్యంబుచేసి ప్రత్యాలీఢ పాదస్థుడై నిలిచి కర్ణాంతంబుగా దిగిచి"[84] బాణమును ప్రయోగించినాడు.

2. రాముడు రావణునిపై బ్రహ్మాస్త్రము ప్రయోగించేటప్పుడు రాముడు ప్రత్యాలీఢ పాదుడై నిల్చుటను మొల్ల ఇట్లు వర్ణించింది.

మ॥ అనఘుం డుజ్జ్వల చాపదండమున బ్రహ్మాస్త్రంబు సంధించి, యొ
య్యనఁగర్ణాంతముగాఁ గడున్ దివిచి ప్రత్యాలీఢ పాదస్థుఁడై
దనుజాధీశ్వరు బాహు మధ్యమువడిం దాఁకంగ లక్ష్యంబుగాఁ
గొని బిట్టేసె నదల్చి తీవ్రతరమౌ కోపంబు దీపింపఁగన్[85]

శ్రేష్టతరమైన అస్త్రాలను ప్రయోగించినప్పుడు ధానుష్కుడు ప్రత్యాలీఢపాదస్థుడగుట ధనుర్విద్యా మర్యాద కావచ్చును.

ధనుర్యుద్ధం లో బాణాల్ని ప్రయోగించే దశలను వాల్మీకం పైవిధంగా తెలియజేసింది.

లక్ష్మణ ఇంద్రజిత్తుల ద్వంద్వ యుద్ధంలో వారి హస్తలాఘవాన్ని వర్ణిస్తూ బాణప్రయోగ దశలను వాల్మీకి ఈ విధంగా వర్ణించాడు.

1.ఆదానం 2.సంధానం 3.ధనుషోవావరిగ్రహః 4.విప్రవెూక్షః 5.వికర్షః 6.విగ్రహః 7.ముష్టిప్రతిసంధానం. 8.లక్ష్యప్రతిపాదనమ్.

ఈ దశలన్నింటిని అనుసరించుచున్నప్పటికి అవి కనబడనంత వేగంగా ఇంద్రజిల్లక్ష్మణులు యుద్ధం చేసిరి.

బాలకాండలో తాటక రామలక్ష్మణుల పై శిలావర్షాన్ని కురిపింపగా రాముడు ఆ శిలావర్షాన్ని తన బాణవర్షంచేనడ్డగించి రాళ్లను ముక్కలు చేసి సమీపానికి వస్తున్న ఆమె చేతులను బాణాలతో నఱకెను. అరణ్యకాండలో రావణుడు తననెదిరించిన జటాయువు పై నాళీక బాణములను ప్రయోగించినాడు.[86] సుందరకాండలో హనుమంతుడు జంబుమాలిపై రాతిబండలను, సాలవృక్షాలను ప్రయోగింపగా అతడు అర్ధచంద్రబాణాలను, కర్ణి బాణాలను ప్రయోగించినాడు.[87]

అట్లే రావణపుత్రుడైన అక్ష కుమారుడును ధనుర్విద్యా విశారదుడే. అతనిని గూర్చి వాల్మీకి 'సమాధి, సంయోగ విమోక్ష తత్త్వవిత్''[88] అనగా అతడు బాణమును గురిపెట్టుట, సంధించుట, విడుచుట యను లక్షణాలను బాగుగా తెలిసినవాడు.

అట్లే రావణుని మంత్రిపుత్రులును, ధనుర్యుద్ధము చేసినారు. రక్తరోముడు, శతజిహ్వుడు, రుధిరలోచనుడు, స్తనితహస్తుడు, శూలదంష్ట్రుడు, దుర్ముఖుడు, వ్యాఘ్రుకబళుడు, యను రాక్షస శ్రేష్ఠులును హనుమంతునిపై బాణ ప్రయోగం చేసినారు.

అక్షుడు ప్రయోగించిన బాణాలను హనుమంతుడు తన వాలముఖంబున ద్రుంచుటను మొల్ల మనోహరంగా వర్ణించింది.

"వాయుజు (డప్పుడంపగమి వాలముఖంబున(ద్రుంచె, ద్రుంచినన్
వాయుజు మీ(ద గ్రమ్మఱ నవార్యబలంబున నేసె, నేసినన్
వాయు(జుడు(గ్రు(డ్డై తునిమె వానిశరావళి నెల్ల( బిమ్మటన్
వాయుజు నాట సేసె(గడు వా(డి శరంబుల నక్షు(డుద్ధతిన్"[89]

## 6-8-8.1రామాయణమున వర్ణింపబడిన కొన్ని బాణయుద్ధములు:

### (i) రాముడు ఖరదూషణాదులతో చేసిన యుద్ధము:

ఖరుని యనుచరులగు పదునాలుగు వేలమంది రాక్షసులు ఒకేసారి రాముని తమ తమ ధనుస్సులతో ఎదిరించిన విధానాన్ని భాస్కరరామాయణకర్త ఈవిధంగా వర్ణించినాడు.

" వెసబదునాల్గువేల బలు విండ్లను దానవులేయు బాణముల్
ప్రసభ రయంబునన్ దునిమి పార్థివు డొక్కడు నేయుబాణముల్
మసలక యెక్కుడై నిగిడి మండుచు(బాఱి యనేక ఘోర రా
క్షసుల యురంబులుచ్చి చినికాడు రణాంచలమేదినీ స్థలుల్"[90]

ఆ బాణముల తీవ్రత ఎట్టిదో కూడ భాస్కర రామాయణకర్త మనోహరంగా వర్ణించినాడు.

'మదగజేంద్రంబుల నుదురులుగాడి తో- కలనుచ్చి పోవును గ్రందుగాగ
రథసముద్ధతులగు రథిక సారథులొక్క- గుదియయి ధారుణిగూలదాకు
నద్భుతాటోపమై యాశ్విక(వ్రాతంబు - దునుము(దురంగాలి తోన తునియ
పటు సముద్ధతి వీరభటుదాకి యవ్వలి - భటుదాకి పేరుగా బాఱి(గ్రుచ్చు
బిరుదుపడగల గొడుగుల పిండునుగ్గు నూచముగ దాకు రామధనుర్విముక్త
నిష్ఠులో త్పాత నిర్ఘాత నిభ నిశాత చండ సంపాతకాండ ప్రకాండ సమితి"[91]

రాముని బాణాలు మదపుటేనుగుల కుంభస్థలముల దాకి తోకల నుచ్చిపోవునట్టిది. చతురంగబలాలను గూల్చినవి. ఆ బాణాలు ఆ పదునాల్గువేలమంది రాక్షసుల "కవచములను ముక్కలు చేయుచు, మర్మ స్థానములను గొట్టుచు, చేతులను చీల్చుచు, కండలను చెక్కుచు, తలలను నఱకుచు, వారి ప్రాణములను హరించినవి. రాముడు అమ్ములపొదినుండి బాణమును తీయుటను కాని, సంధించుటను గాని, ప్రయోగించుటను గాని, శత్రువులు గుర్తింపలేకపోయిరి.

'ధనుస్సుగుడుసై' కనిపించెడిదట. భాస్కరరామాయణకర్త ఆ విషయాన్ని ఈవిధంగా వర్ణించినాడు.

'వడిఁదూణమ్మున నమ్ము గైకొనుట, తీవ్రస్ఫూర్తి సంధించు టే
ర్పడ లీలందెగవాపు, టేయుట, మదిన్ భావింపఁగారాక, వి
ల్లుడుసై యుండుటయుం బ్రచండగతి రక్షోవక్షముల్ ప్రయ్యు చ
ప్పుడు వారొక్కటఁ గూలుమ్రోతయు నభోభాగముల్ గప్పఁగన్.[92]

శత్రువు ప్రయోగించిన ఆయుధానికి తగినవిధంగా బాణప్రయోగము చేయుటను తెలిసిన వీరుడు రాముడు. కావుననే ఖరుడు పంపిన పదునాల్గుమంది రాక్షసులు ఒకేసారి పదునాలుగుశూలములను ప్రయోగింపగా రాముడు" కత్తివాతియమ్ములతడు పదునాల్గునిగిడించి యద్భుతముగ దునిమి పదునాల్గుశూలములను"[93] యని భాస్కరరామాయణము వర్ణించినది.

రాముడు ఒకేసారి అనేకమైన బాణాలను ప్రయోగించు నేర్పుగలవాడు. ఆ విషయాన్ని తెల్పుతూ రంగనాధరామాయణకర్త ఈవిధంగా వర్ణిస్తాడు.

"కరలాఘవము మీఱగవదొనలోన - శరములన్నియు నొక్కసారె సంధించి
పదియునూఱును వేయి పదివేలు లక్ష - పదిలక్షలటు కోట్లు పదినూరుకోట్లు
మండిత పరివేషమధ్యందినార్క - మండల పరివేషమహితాను కారి"[94]

## (ii) రామ త్రిశిరుల ధనుర్యుద్ధం :

ఖరుని సేనాపతియగు త్రిశిరుడును ధనుర్విద్యా విశారదుడే. రాముని వధించెదనని యతడు ఆయుధమును తాకి ప్రతిజ్ఞచేసి యుద్ధానికి బయలుదేరినాడు. ఆతని యుద్ధమును వాల్మీకి ఈవిధంగా వర్ణించినాడు.

'శరధారా సమూహాం త్స మహామేఘ ఇవోత్సృజన్।
వ్యసృజ త్సదృశం నాదం జలార్ద్రస్య తు దుందుభేః॥

అతడు దుందుభిమ్రోత వంటి సింహనాదము చేసి, మహామేఘము వలె బాణధారా సమూహమును విడిచినాడు. రామత్రిశిరుల మధ్య సింహానికి మదపుటేనునకు మధ్య జరిగిన యుద్ధము వలె పోరాటము సాగినది. త్రిశిరుడు రాముని నుదిటిని మూడు బాణాలతో కొట్టినాడు. ఆతని బాణములను రాముడు పుష్పములుగా భావించినాడు. పిమ్మట రాముడు ఆతని రథాశ్వాలను, సారధిని నేలగూల్చి మూడు బాణాలతో ఆతని మూడు శిరస్సులను ఖండించెను.

(iii) ఇంద్రజిత్తు వానరులతో చేసిన యుద్ధము :

ఇంద్రజిత్తు మూడవ యుద్ధమున వానరులపై విజృంభించి పోరాడినాడు. ఆతని బాణాల ఏపును భాస్కరరామాయణకర్త ఈవిధంగా వర్ణించాడు.

"పిడుగులొకో కావు పొడలేవు ఘనము లుల్కాసహస్రంబులో కావు ధరణి
యడలదు కాలసర్పావళులొకొ కావు పాతాళ వివరంబు బయలుపడదు
ఖరమైన ముక్కంటి కంటి మంటలో కావు జగదవసానంబు జాడలేదు.
కాలకూటార్చులో కావు ముందర గోత్ర మానితాంభోరాశి గానబడదు.
మొదలెఱుంగగ రాదు మునుకొనిపుట్టిన చొప్పు తెలియరాదు చూడ నెచట
నని కవీంద్రులిట్టు లాజి దల్లడమంది ఇంద్రజిత్తు తూపు లేపుసూప"[95]

ఆ బాణాలు ఉల్కాసహస్రములేని పిడుగులవంటివి. పాతాళరంధ్రమును బయట పడనీయని కాలసర్పములు, జగదవసానము గాని సమయమందలి ముక్కంటి మంటలు. మందర పర్వతముతో కూడిన సముద్రము లేని కాలకూటపుటగ్నులు. ఆ బాణములు ఎచ్చటనుండి వచ్చుచున్నవో తెలియక వానర శ్రేష్ఠులందఱు తల్లడమందిరి.

ఆ సందర్భముననే ఇంద్రజిత్తు వానరుల శరీరాలపై దట్టంగా బాణ ప్రయోగాన్ని చేయడాన్ని భాస్కరరామాయణకర్త ఇట్లు వర్ణించాడు.

"ఒలసి మేనులు నువ్వుగింజలకునైన
తెఱపి లేకుండ శరములు దీటుగొలిపి
ప్లవగ చక్రమునంతయు బడలు పఱిచి
యేగె లంకకు క్రమ్మఱ నింద్రజిత్తు"[96]

వానరుల శరీరాలపై నువ్వుగింజంత చోటు కూడా మిగల్చకుండా ఇంద్రజిత్తు బాణప్రయోగం చేసినాడు.

(iv) ఇంద్రజిత్తు రామలక్ష్మణులతో చేసిన బాణయుద్ధం:

ఇంద్రజిత్తు రామలక్ష్మణులను నాగపాశబద్ధులను చేయు సందర్భంలో వారి మర్మస్థానాలయందు వివిధములైన బాణాలతో కొట్టటాన్ని వాల్మీకి ఇట్లా తెల్పినాడు.

"రుక్మపుంఖైః ప్రసన్నాగ్రై రజోగతిభి, రాశుగైః।
నారాచై రర్ధనారాచై ర్భల్లై రంజలికై రపి,॥
వివ్యాధ వత్సదంతైశ్చ సింహదంష్ట్రైః క్షురై స్తథా"[97]॥

అర్ధనారాచాలనగా నడుము విరిగిన వానివలె నుండు బాణాలు, భల్లములంటే గండ్రగొడ్డలి వంటి మొనగలవి. అంజలికములనగా అంజలివంటి మొనగలవి. వత్సదంతాలంటే దూడపండ్ల వంటి మొనగలవి. సింహదంష్ట్రాలంటే సింహపుకోరలను పోలినవి. క్షురములంటే మంగలికత్తి వంటి మొనగలవి. ఈ విధమైన బంగారు పింజలు గల మొనదేలిన బాణాలను ప్రయోగించినాడు.

(v) శోణితాక్షుడు ప్రయోగించిన బాణాలు:

శోణితాక్షుడు అంగదుని పైకి వివిధమైన ఆకృతులు గల బాణాలను ప్రయోగించటాన్ని వాల్మీకి ఇట్లు వర్ణించాడు.

"క్షురక్షురప్రనారాచై ర్వత్సదంతైః శిలీముఖైః।
కర్ణిశల్యవిపాఠై శ్చ బహుభి ర్నిశితై శ్శరైః"[98]॥

ఇందు క్రొత్తగా చెప్పబడిన శిలీముఖములు,కర్ణిబాణములు,శల్యములు. శిలీముఖములంటే కంకపత్రాకారముఖము గలవి. కర్ణిశరాలంటే రెండు ప్రక్కలకు కర్ణములు గలవి. శల్యములంటే గన్నేరాకుల కొనలవంటి బాణాలు.

(vi) రామరావణుల బాణ యుద్ధం:

ఇతిహాసయుగంనాటి చరిత్రను పరిశీలిస్తే రామరావణయుద్ధంతో సాటియైన యుద్ధం మరొకటి లేదని చెప్పవచ్చును. అది నిరుపమానమైనదని వాల్మీకి మహర్షియే స్వయంగా రామాయణంలో ఈ విధంగా చెప్పాడు.

"గగనం గగనాకారం సాగరః సాగరోపమః।
రామరావణయో ర్యుద్ధం రామరావణయో రివ"[99]॥

ఆకాశం, ఆకాశంతోనే పోల్చదగినట్లు, సముద్రం సముద్రంతోనే పోల్చదగినట్లు రామరావణయుద్ధంతో రామరావణ యుద్ధమే పోల్చదగినదని ఆ శ్లోకభావము.

రావణుడు మొదటగా ప్రహస్తుడు మరణించిన తర్వాత కోపించినవాడై స్వయంగా తానే యుద్ధరంగానికి బయలుదేరినాడు. రథస్థుడైన రావణుని ఎదిరించుటకనువుగా హనుమంతుడు రాముని భుజములపై కూర్చుండబెట్టుకొనినాడు. ఈ యుద్ధంలో రామునిదే పై చేయియైనది. ఆ సందర్భంలో రాముడు ప్రయోగించిన బాణముల తీవ్రతను వాల్మీకి ఈవిధంగా తెల్పినాడు.

"బ్రహ్మదండప్రతీకానాం విద్యుచ్చలితవర్చసామ్।
స్మరన్ రాఘవబాణానాం వివ్యథే రాక్షసేశ్వరః[100]॥

ఆరావణుడు బ్రహ్మదండమువలె మెరయుచు మెరుపు తీగలవంటి కాంతిగల్గిన ఆరాముని బాణాలను స్మరిస్తూ వ్యథ చెందినాడు. అనగా రాముడట్టి బాణాలు ప్రయోగించినాడు. రావణుని రథాన్ని, రథ చక్రాలను, ధ్వజాన్ని, ఛత్రాన్ని, సారధిని, పతాకాన్ని రాముడు పడగొట్టినాడు. రావణుడు ప్రయోగించిన బాణాలనే గాక వజ్ర, శూల, ఖడ్గాది ఆయుధాలను కూడా రాముడు తన బాణాలతో ఛేదించినాడు. వజ్రసమాన తుల్యమైన బాణంతోనాతని ఉరమును కొట్టినాడు. అర్ధచంద్రబాణంతో కిరీటాన్ని పడగొట్టినాడు. ఈ యుద్ధంలో రావణుడు ఓటమిని పొంది రాముని ఔదార్యంతో ప్రాణాలు దక్కించుకొని లంకకు తిరిగి వెళ్లాడు.

ఆసందర్భంలో రాముడు చేసిన యుద్ధాన్ని భాస్కరరామాయణకర్త మనోహరంగా ఇట్లా వర్ణించాడు.

'ఒక్కొటనారిబోసి వివిధోగ్రశరంబులదేరి చక్రముల్
చెక్కలు సేసి పై పొడవు చిందరవందరలాడి వాజులన్
వ్రక్కలు వాపి సూతుబడవైచి పతాకదళించి కైదువుల్
చక్కగ ద్రుంచి యెల్లి పలుచందంములం నొలియించి వెండియున్[101]

రాముని బాణాలు వరుణుని పాశము కంటె, ఇంద్రుని వజ్రాయుధము కంటె కాలుని దండము కంటె, దేవతల సమస్త ఆయుధములకంటె బెడిదములైనవిగా రావణుడు భావించినాడు. ఆతడు ఆయాదేవతల ఆయుధముల యొక్క శక్తిని చూచినవాడు. ఆతడు పారిపోయిన విధమును గూడ భాస్కర రామాయణకర్త ఇట్లు తెల్పినాడు.

"మీఱిన భయమున రాముని
దేఱి కనుంగొనగ నోడి ధృతికడు దూలన్
వేఱొకని తేరిపై బడి
పాఱి యతడు లంక సొచ్చెఁ బౌరులు బెదరన్[102]

ఇచట రావణుడు రాముని రథాన్ని అనగా హనుమంతుని చూచుటకును భయపడి ధైర్యాన్ని కోల్పోయి వేరొకరి రథముపై నెక్కి పారిపోయినాడు. రావణుడు రెండవపర్యాయము ముందు లక్ష్మణునితో బాణయుద్ధంచేసి, ఆతనినతిక్రమించి

రామునెదిరించినాడు. ఆ సందర్భంలో రావణుని బాణవర్షాన్ని రాముడు నివారించడాన్ని వాల్మీకి యిట్లు వర్ణించాడు.

'శరధారా స్తతో రామో రావణస్య ధనుశ్చ్యుతాః।
దృష్ట్వై వా పతత శ్శీఘ్రం భల్లాన్ జగ్రాహ సత్వరమ్.।।[103]

అంతట రాముడు రావణుని వింటినుండి ఎడతెగక ధారాపాతముగా వెడలుచున్న బాణాల్ని చూచి వెంటనే భల్లబాణాలను చేతబట్టెను. ఆ భల్ల బాణాలతో రావణుని బాణసమూహాన్ని త్రుంచి వైచినాడు. బాణాలు ధారాపాతంగా మీద పడుతున్నప్పుడు ధానుష్కుడు భల్లబాణాల్ని ప్రయోగించడం ధనుర్యుద్ధ పద్ధతి కావచ్చును. ఆ బాణయుద్ధమున యిరువురును చిత్రంగా సవ్యాపసవ్య మార్గములలో తిరుగుచూ యుద్ధం చేశారు. వారి బాణాలు ఆకాశమంతటను నిండుటను వాల్మీకి చక్కని ఉపమతో ఇట్లు వర్ణించాడు.

"సంతతం వివిధై ర్బాణై ర్బభూవ గగనం తదా।
ఘనై రివాతపాపాయే విద్యున్మాలా సమాకులైః।।
'గవాక్షిత మివాకాశం బభూవ శరవృష్టిభిః''[104]।।

వర్షాకాలంలో మెరుపుతీగలతో కూడిన మేఘాలు క్రమ్ముకొనినట్లు ఆకాశమంతటను బాణాలాక్రమించినవి. ఆ బాణ వర్షాలచే ఆకాశమందు అప్పుడు మధ్య మధ్య ఏర్పడ్డ ఖాళీలు కిటికీలు నిర్మించినట్లున్నవి.

గ్రద్దరెక్కలు గట్టిన బాణాలనుపయోగించడం ఆనాడు కలదు. రామరావణులు తమ బాణయుద్ధమున అట్టి బాణాలనుపయోగించినారని వాల్మీకి ఇట్లు వర్ణించినాడు.

"మహావేగైః సుతీక్ష్ణాగ్రైః గృధపత్రైః సువాజితైః।

మహావేగముగలవి, మిక్కిలి వాడియైనవి, గ్రద్దరెక్కలు కట్టుట వలన మంచి రెక్కలు గలవియగు బాణములని భావము.

రాముడు రావణుని శిరాలను క్షురబాణాలచే ఖండించినాడు. రావణుని శిరములు ఖండింపబడియు మరల మొలచుటను రామాభ్యుదయకర్త చమత్కారముగా వర్ణించినాడు.

'దేవముని వరోపదిష్టంబు రవిహృద
యముఁబఠించి రాముఁడమర వైరి

తలలు ద్రెంచె ద్రెంచె మొలతెంచె మొలతెంచె

డులిచె డులిచె మఱియు మొలిచె మొలిచె.[105]

రాముడును సవ్యసాచి రావణునిపై సవ్యాపసవ్యముల బాణాలను ప్రయోగించినాడు. రావణుని తెగిన తలలతో, బాహువులతో భూనభోంతరాలునిండాయి. ఆ యుద్ధంలో రాముడు కొందఱు రాక్షసులను "గురుశరంబుల గొందఱ గుదులుగా గ్రుచ్చినాడ'[106]ని భాస్కర రామాయణకర్త వర్ణించినాడు.

***6-8.9 అస్త్ర యుద్ధము:***

అస్త్రములు మంత్ర ప్రధానములైనట్టివి. అస్త్రవిదుడు ఆయాదేవతలకు సంబంధించిన మంత్రములు జపించి అస్త్ర ప్రయోగాన్ని చేస్తాడు. అస్త్ర యుద్ధము కూడా ధనుర్ధారులే చేయుటను బట్టి ఇది కూడా ధనుర్యుద్ధంలో ఒకభాగమైంది. అస్త్రవిదుడు తన ప్రత్యర్థి ప్రయోగించిన అస్త్రాన్ని గుర్తించి దానిని నివారింపగల అస్త్రాన్ని ప్రయోగింప వలసియుండును. యోధుడు తాను ప్రయోగించిన అస్త్రాన్ని మరల్చ గల ఉపసంహారమంత్రాలును తెలిసియుండాలి. రామాయణంలో అస్త్రాలకు సంబంధించిన ప్రశంస విపులంగా ఉంది.

బాలకాండలో విశ్వామిత్రుడు రామునకు అస్త్రప్రదానం చేసే సందర్భంలో అనేక శస్త్రాస్త్రముల విషయం చెప్పబడింది. విశ్వామిత్రుడు రామునకు అనేక ప్రయోగాస్త్రాలను, ఉపసంహరణాస్త్రాలను ప్రధానం చేశాడు. అందు ప్రయోగాస్త్రాలు ఈ విధమైనట్టివి.

"ఐంద్రాస్త్రము, వజ్రాస్త్రము, బ్రహ్మశిరోనామకాస్త్రము, ఐషీకము, బ్రహ్మాస్త్రము, శిఖరమను పేరుగల ఆగ్నేయాస్త్రము, హయ శిరోనామకాస్త్రము, క్రౌంచాస్త్రము, ప్రథన మనువాయవ్యాస్త్రము,వైద్యాధరము, గాంధర్వాస్త్రము, మానవాస్త్రము, ప్రస్వాపనము, ,సారము,దర్పణము, శోషణము,సంతాపనము, విలాపనము,మదనము ప్రశమనము, దుర్ధర్షము, పైశాచము, మోహనము, తామసము, సౌమనము, సంవర్తనము, మౌసలము, సత్యము, మాయాధరము, తేజఃప్రభము, సౌమ్యము, శిశిరము, సుదామనము, భగాస్త్రము, శీతేషువు, మానవము మొదలగునవి.[107]ఇందు మానవము, మానవాస్త్రము వేరువేరుగా వాల్మీకమున చెప్పబడినవి.

విశ్వామిత్రుడు రామునకుపదేశించిన ఉపసంహారణాస్త్రములీ విధముగా చెప్పబడినవి . అవి. 'సత్యవంతము, సత్యకీర్తి, దృష్టము, రభసము, ప్రతిహారతరము, పరాఙ్ముఖము, అవాఙ్ముఖము, లక్షాక్షము, విషమము, దృఢనాభము, సునాభము, దశాక్షము, దుందునాభము, సునాభకము, జ్యోతిష్యము, కృశనము, నైరాశ్యము, విమలము, యోగంధరము, హరిద్రము, దైత్యము, ప్రశమనము, సార్చిర్మాలి, ధృతి, మాలి, వృత్తిమంతము, రుచిరము, పితృసౌమనసము, విధూతము, మకరము, కరవీరకరము, ధనము, ధాన్యము, కామరూపము, కామరుచి, మోహము, ఆవరణము, జృంభకము, సర్వనాభము, సంతానము, వరణము మొదలగునవి.[108]

అస్త్ర ప్రయోగం చేసినపుడు ఆ మంత్రాధి దైవతమునకు లొంగినచో అది ప్రాణహాని కల్గింపక ఆవ్యక్తిని విడిచివేయును.

సుందరకాండలో హనుమంతునిపై ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రమును ప్రయోగింపగా హనుమంతుడు బ్రహ్మమంత్రము లుచ్చరించుటచే అది అతనికి హాని కల్గింపకపోవుటను రంగనాథరామాయణకర్త ఇట్లు తెల్పినాడు.

"బలువిడి బఱతెంచు బ్రహ్మాస్త్రమునకు దలకక బ్రహ్మమంత్రములుచ్చరింప
నది చంపజాలక యతని బంధించి కుదియించి పడవైచె గుంభినిమీద."[109]

అస్త్రప్రయోగానికి ధనుర్బాణములక్కఱలేదు. అస్త్రమంత్రములుచ్చరించి దేనిని ప్రయోగించినప్పటికి దానిద్వారా అస్త్రశక్తి బహిర్గతము కాగలదు. ఇందుకు నిదర్శనముగా కాకాసుర వృత్తాంతము చెప్పదగినది. కాకాసురుడు సీతను బాధించుటను చూచిన రాముడు కోపించి తన సమీపమునగల ఒక ఱెల్లుగడ్డి పరకను బ్రహ్మాస్త్రమంత్రంతో అభిమంత్రించి ప్రయోగించినాడు. అంతట ఆఱెల్లుగడ్డి పరక మహాతేజోవంతమై కాకాసురునిపైకి వెడలినది. అస్త్రము లేవియైనను ప్రయోగించినవాని అభిమతానుసారంగా ప్రవర్తించును. కాబట్టే రాముడు తనను శరణుగోరిన కాకాసురుని యొక్క ఒక నేత్రమును మాత్రమే హింసించునట్లు అస్త్రమునాజ్ఞాపించినాడు.

అస్త్రవిదులలో రాముడు శ్రేష్ఠుడు. ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రంచే అభిమంత్రితమైన దివ్యరథాన్ని ఆయుధాలను ధరించి యుద్ధానికి రావటాన్ని గ్రహించి లక్ష్మణునితో బ్రహ్మదేవుని మహిమ ఊహింపరానిది గావున బాణపాతాన్ని సహింపుమని పల్కెను. సాధారణంగా ధానుష్కుడు ముందుగా బాణయుద్ధాన్ని చేసి, శత్రువు బలవంతుడని,

లొంగదీయడానికి సాధ్యంకానివాడని గుర్తించినపుడే అస్త్రయుద్ధానికి పూనుకుంటాడు. రామాయణంలో నిర్వహించబడిన అస్త్ర యుద్ధాల్లో ముచ్చునకు కొన్ని :

(i) రాముడు చేసిన అస్త్రయుద్ధం:

రాముడు రాక్షసులపై చేసిన అనేక యుద్ధాలయందు వివిధాస్త్రాలను ప్రయోగించినాడు. మారీచ సుబాహులు విశ్వామిత్రుని యజ్ఞానికి విఘ్నం కల్గిస్తుండగా రాముడు "శీతేషు' వను పేరుగల మానవాస్త్రాలతో మారీచుని మూర్ఛితుని చేసి సుదూరమున పడునట్లు చేశాడు. ఆ విషయాన్ని వాల్మీకి ఈ విధంగా వర్ణించాడు.

'పశ్య లక్ష్మణ! శీతేషుం మానవం ధర్మసంహితమ్।
మోహయిత్వా నయత్యేనం న చ ప్రాణై ర్వ్యియుజ్యతే"॥[110]

ఓ లక్ష్మణా! ధర్మసహితమగు శీతేషువను వేఱొక పేరుగల మానవస్త్రాన్ని చూడుము. ఇది మారీచుని తెలివి దప్పించి సుదూరము కొనిపోవుచున్నది. ఈతడు ప్రాణాలను మాత్రం కోల్పోలేదు. రాముడు సుబాహుని ఆగ్నేయాస్త్రముతో సంహరించినాడు. ఇతర రాక్షసులను వాయువ్యాస్త్రంతో బెదరగొట్టినాడు.[111] కుంభకర్ణవధ సందర్భంలో రాముడు అనిల, ఐంద్రాస్త్రాలతో వాని బాహువులను ఖండించినాడు.[112] అనేకమందితో ఒకే పర్యాయం యుద్ధం చేయవలసి వచ్చినపుడు గాంధర్వాస్త్రాన్ని ప్రయోగించెడివారు. ఇదే సమ్మోహనాస్త్రంగాను చెప్పబడును. భారతంలో ఉత్తర గోగ్రహణఘట్టంలో అసంఖ్యాకమైన కౌరవసేన నెదిరించుటకై అర్జునుడు సమ్మోహనాస్త్రాన్ని ప్రయోగించాడు. రామాయణంలో రాముడు రెండు మార్లు గాంధర్వాస్త్ర ప్రయోగాన్ని చేశాడు. ఖరదూషణాది రాక్షసులతో పోరునపుడు ఒక్కసారిగా పదునాల్గు వేలమంది రాక్షసులు ముట్టడించగా త్వరితముగా వారిని నివారించటానికి రాముడు గాంధర్వశరాన్ని ప్రయోగించుటను భాస్కరరామాయణకర్త ఈ విధంగా తెల్పినాడు.

'జ్యానాదంబు చెలంగఁ జిత్రతర వేగాలక్షితాధాన సం
ధానాకర్షణ మోక్షితుండగుచు గంధర్వాస్త్ర పూర్వంబుగా
నానా బాణము లేసె నవ్వసుమతీనాథుడు, దద్బాణ సం
తానం బుద్ధతిఁ బర్వె నెల్లెడ మహాధ్యానంబుతో నత్తటిన్[113]

గాంధర్వాస్త్ర ప్రభావం వల్ల రాముడు ప్రయోగించిన బాణాలు యుద్ధరంగమంతటను నిండిపోయినవి. ఇందు అస్త్ర మంత్రమును ధ్యానించి నానాబాణాలు ప్రయోగించుట

చెప్పబడింది. అట్లే రావణుని అసంఖ్యాకమైన మూలబలంతో యుద్ధం చేసేటప్పుడు రాముడు గాంధర్వాస్త్రాన్ని ప్రయోగించటాన్ని రంగనాథ రామాయణకర్త ఇట్లా వర్ణించాడు.

'కని తాకునప్పుడు గాంధర్వశరము - ఘనమహత్త్వమున రాక్షసులకు జూడ
నొక్కొక్కనికి రాముడొక్కొక్కడగుచు -నొక్కొక్కనికి రాములొగిఁబదంద్రగుచు
నొక్కొక్కనికి రాములొగి నూర్గురగుచు - నొక్కొక్కనికి రాములొగి వేవురగుచు
శతకోటియర్బుద సంఖ్యలుగడిచి - యతులితంబైనట్టి యాజిరంగమున''[114]

గాంధర్వాస్త్ర ప్రభావంతో సర్వము రామమయమైంది. రాక్షసులందఱు భ్రాంతి చెందినవారైరి. ఆయుద్ధంలో రాముడు పగలు యొక్క ఎనిమిదవ పాలు కాలంలోనే ఏడుకోట్ల అరువది తొమ్మిది లక్షల వాయువేగంగల రథాలు, పదమూడుకోట్ల పంద్రెండులక్షల ఇరువదివేల బలవంతములైన గజాలు, పదికోట్ల ఇరువదిలక్షల అరువదివేల రౌతులతోకూడిన గుఱ్ఱాలు, నూటనలుబదియైదుకోట్ల యెనుబదిలక్షల పదాతి దళమును, ఒక్కడే నాశనముచేసినట్లు వాల్మీకము వర్ణించింది.[115]

రంగనాథ, భాస్కరరామాయణాలు దీన్ని మరొక విధంగాచెప్పినవి, రాముడు ఒక్కొక్క నిముషమున 14వేల గుఱ్ఱాలు, 18వేల గజాలు, లక్షరథాలు, 2 లక్షలపదాతిదళాలు చొప్పున సప్తముహూర్తములు పోరి అసంఖ్యాకమైన రాక్షససైన్యాన్ని నాశనం చేసినట్లు వర్ణించినవి. భాస్కరరామాయణకర్త ఈ సందర్భంలో నాటి కాలప్రమాణమును ఈవిధంగా తెల్పాడు.

"నిమేషంబులష్టాదశంబులొక్క కాష్ఠంబనబరగు, నవిముప్పదియైన నొక్కకళయగు, నవి త్రింశతియైననొక్కక్షణంబంద్రు, అట్టి క్షణంబులు పంద్రెండైన ఒక్క ముహూర్తంబగు"18నిమిషాలు-1కాష్టము; 30కాష్టములు-1కళ; 30కళలు-1క్షణము; 12క్షణాలు-1ముహూర్తం.

ఏడుముహూర్తాల కాలంలో ఎంతసైన్యాన్ని సంహరించిందీ ఈ లెక్కవల్ల తెలుసుకోవచ్చు.

*(ii) అతికాయ - లక్ష్మణుల అస్త్రయుద్ధం :*

కుంభకర్ణ వధానంతరం రావణతనయుడైన అతికాయుడు రావణ ప్రేరితుడై వివిధాయుధాలతోగూడిన రథాన్నధిరోహించి వానరులనెదిరించినాడు. అతని గొప్పతనాన్ని వాల్మీకి ఈవిధంగా వర్ణిస్తాడు.

"వృద్ధసేవీ శ్రుతిధరః సర్వాస్త్రవిదుషాం వరః
అశ్వపృష్ఠే నాగపృష్ఠే ఖడ్గే ధనుషి కర్షణే
భేదే సాంత్వే చ దానే చ నయే మంత్రే చ సమ్మతః[116]

అతడుపెద్దలనుసేవిస్తూ విద్యలనే నేర్చి, అస్త్రవేత్తలలో శ్రేష్ఠుడై అశ్వారోహణ, గజారోహణ, రథారోహణ, విద్యలను, ఖడ్గ ధనుర్విద్యలు తెలిసినవాడై మంత్రాలోచన యందును సమర్థుడని పైశ్లోకానికిభావం. ఆతడు వానర యూథపులను గాయపరచి రాముని వద్దకు వెళ్లి గర్వోక్తులను పల్కినాడు. అది సహింపక లక్ష్మణుడు అతికాయునెదిరించినాడు. వారిరువురు మొదట బాణయుద్ధాన్నేచేశారు.

పిమ్మట వారిరువురు అస్త్రయుద్ధంచేశారు. మొదటగా లక్ష్మణుడు ఆగ్నేయాస్త్రాన్ని అతికాయునిపై ప్రయోగించాడు. అతికాయుడు దానిని సూర్యాస్త్రంతో నివారించాడు. ఆరెండు అస్త్రములు ఒకదానినొకటి ఢీకొని భస్మములై నేలకూలినవి. పిమ్మట అతికాయుడు లక్ష్మణునిపై ఐషికాస్త్రాన్ని ప్రయోగించాడు. ఐషీకమునకు చివర కుంచెవంటి శూలములుండును.[117] లక్ష్మణుడు దానిని ఐంద్రాస్త్రంతో భేదించినాడు. తరువాత అతికాయుడు లక్ష్మణునిపై యామ్యాస్త్రమును వేసినాడు. లక్ష్మణుడు దానిని వాయవ్యాస్త్రంతో నేలకూల్చినాడు. లక్ష్మణుడాతని వజ్రకవచాన్ని భేదింపలేకపోయాడు. అంతట వాయుదేవుడాతని వద్దకు వచ్చి బ్రహ్మాస్త్రంతో అతికాయుని సంహరింపుమని చెప్తాడు. అట్లే లక్ష్మణుడు బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించినాడు. అతికాయునకు ఆఅస్త్రం గూర్చి తెలియదు. అందువల్లనే ప్రకాశమానముగా తనపైకి వచ్చుచున్న దానిపై శక్తులను, గదలను, గొడ్డళ్లను, శూలములను, ప్రయోగించినాడు. బ్రహ్మాస్త్రము ఆ ఆయుధములనన్నింటిని విఫలముజేసి శిరస్త్రాణసహితమైన ఆతని శిరమును ఖండించినది.

### *(iii) ఇంద్రజిల్లక్ష్మణుల అస్త్రయుద్ధం :*

ఇంద్రజిత్తు తనచివరి యుద్ధమును లక్ష్మణునితో భయంకరముగా చేసినాడు. ఈయుద్ధమున ఇంద్రజిత్తు తన మాయలను ప్రయోగింపలేదు. మొదట లక్ష్మణేంద్రజిత్తులిరువురు బాణయుద్ధమునే చేసిరి. ఆయుద్ధమున లక్ష్మణుడు ఇంద్రజిత్తు సారథిని సంహరింపగా నాతడు నేర్పుగా లంకలో ప్రవేశించి మరియొక రథము నధిరోహించి యుద్ధరంగమునకు వచ్చి లక్ష్మణునెదిరించినాడు. ఇరువురును

పరస్పరము ముఖములపై నాటుకొనునట్లు బాణములను ప్రయోగించుకొనినారు. లక్ష్మణుడు బాణ యుద్ధమున తననుమించుటను గుర్తించి ఇంద్రజిత్తు అస్త్రయుద్ధము నారంభించినాడు. యముడొసగిన యామ్యాస్త్రాన్ని ఇంద్రజిత్తు లక్ష్మణునిపై ప్రయోగించినాడు. లక్ష్మణుడు దానిని కుబేరుడు తనకు స్వప్నమున ప్రసాదించినట్టి కుబేరాస్త్రంతో నివారించినాడు. అవిరెండును ఆకాశమున రెండు మహాగ్రహములవలె ఢీకొని నూరుముక్కలై నేలకూలినవి. ఇంద్రజిత్తు నాగాస్త్రము ప్రయోగింపగా దానినుండి అసంఖ్యాకములైన సర్పములు ఆకాశమంతటానిండుటను భాస్కర రామాయణకర్త ఈ విధంగా వర్ణించాడు.

"కాలవిలోల దీర్ఘతర కాయములై విగళన్మహావిష
జ్వాలలతోడి ధూమములు వావిరి దిక్కులనెల్ల పర్వగా
నాలుకలోలి గ్రోయుచు ఘనస్ఫుట నిశ్వసి తానలంబులం
దూలిచె దేవయానములఁదోరములైన భుజంగ సంఘముల్"[118]

నల్లనిపొడవైన కదలుచున్న శరీరములుగలవి, మహావిషజ్వాలలతో, పొగలతో దిక్కులను నింపివేయునట్టివి, పెద్ద పడగలతో బుసలు కొట్టుచున్నవియగు సర్పాలు ఆకాశమంతటను నిండినవి. అంతట లక్ష్మణుడు నాగాస్త్రమును నివారింపగల 'గరుడాస్త్రమును ప్రయోగించినాడు. అప్పుడా గరుడాస్త్రమునుండి గరుడపక్షులు ధ్భవించటాన్ని కూడా భాస్కర రామాయణకర్త చమత్కారంగానిట్లు వర్ణించాడు.

సీ॥ పక్ష విక్షేపజ పవన వేగంబున విఱిగి వృక్షంబుల వెనుక దూలఁ
దోయధి సలిలంబు పాయయిచ్చిన యంత ఫణిరాజలోకంబు బయలుపడగ
గ్రహమండలము తారకా చక్రమును దమ గతి దప్పి విభ్రాంతిఁగలిగి పఱవ
తునకలై చెదరిన తోయదంబులలోన దివిజ యానంబులు దిరుగువడగ
ఖరములగు మహా నఖరముల, ముక్కుల జీరి పొడిచి బిట్టు చించి త్రుంచి
యక్కజంబుగాగ నహి సమూహమునెల్ల సమయజేసి విహగ సముదయంబు.[119]

గారుడాస్త్రమునుండి వెలువడిన గ్రద్దలు తమ పదునైన ముక్కులతో సర్పసమూహమును ముక్కలు చేసినవి. అప్పుడు ఇంద్రజిల్లక్ష్మణులు పరస్పరము వారుణాస్త్రము, రౌద్రాస్త్రము, ఆగ్నేయాస్త్రము, సౌరాస్త్రము మొదలగువానిని కూడా

ప్రయోగించుకొనుటను చేసిరి. ఇంద్రజిత్తు ఆసురాస్త్రాన్ని ప్రయోగింపగా ఆతని ధనుస్సునుండి ఆ అస్త్ర ప్రభావం వల్ల కూడ ముద్గరాలు, శూలాలు, ముసుండులు, గదలు, కత్తులు, గండ్రగొడ్డళ్లు, మొదలుగాగల ఆయుధాలు వెలువడినట్లు వాల్మీకం వర్ణించింది.[120] లక్ష్మణుడు దానిని మహేశ్వరాస్త్రంతో నివారించాడు. ఈ యుద్ధమున ప్రయోగింపబడిన అస్త్రాల వరుస యందు వాల్మీకానికి, తెలుగు రామాయణాలకు కొంచెం భేదం కలదు. చివరకు లక్ష్మణుడు తన అస్త్ర శక్తికి తన ప్రతిజ్ఞ శక్తిని జోడించినాడు. ఇంద్రుని వలన పొందిన ఐంద్రాస్త్రాన్ని ధనుస్సున సంధించి ప్రతిజ్ఞ చేయటాన్ని భాస్కర రామాయణకర్త ఈవిధంగా వర్ణించాడు.

రామచంద్రుడు సద్ధర్మ రతుడయేని
సీత సుచరిత్ర సాధుత్వ శీలయేని
వెలయ దైవంబు కృపనాకు గలిగెనేని
యది మహేంద్రాది సురలకు హితమయేని[121]

అనునట్టి ప్రతిజ్ఞతో ప్రయోగించబడిన ఐంద్రాస్త్రము, ఇంద్రజిత్తు శిరస్సును ఖండించింది. వ్యక్తుల వ్యక్తిత్వం అస్త్ర బలాన్ని పెంపొందింపజేస్తుందని దీనివల్ల తెలుస్తున్నది.

### (iv) రామ - మకరాక్షుల యుద్ధం:

ఇది పూర్తిగా అస్త్రయుద్ధం కాదు. కానీ రాముడు మకరాక్షుని ఆగ్నేయాస్త్రంతో సంహరించటాన్ని బట్టి ఇందు చెప్పుట జరిగినది. మకరాక్షుడు ఖరుని పుత్రుడు. హనుమంతుడు నికుంభుని చంపిన తరువాత రావణుడు మకరాక్షుని యుద్ధానికి పంపినాడు. తన తండ్రిని చంపిన పగ తీర్చుకొనవలెనను నుత్సాహంతో నాతడు చతురంగబలసమేతుడై వానరసైన్యాన్ని ఎదిరించాడు. ఆతడు వివిధాయుధములను ప్రయోగించడంలో నైపుణ్యంగలవాడు. కాబట్టి గదాఖడ్గాది ఆయుధాలలో వానరసైన్యాన్ని 'మారిమసగినట్లు'' నాశనం చేయసాగాడు. ఆతడు ధనుర్విద్యయందును నైపుణ్యం గలవాడు. ఆతడు వానర సేన పై బాణాలు వేసిన తీరును రంగనాథ రామాయణకర్త ఇట్లు వర్ణించాడు.

"......... ముప్పదిట, నూటింట, నటువదింటను మఱి యరువదేనింట
నిరువదింట వెస నిరువదారింట - బరగ నారింటను బండ్రెంట, రెంట

పదిట, పదేనింట, పదునెన్మిదింట - పదమూట నాల్గింట పదునాలుగింట
దెగగొని మూటనైదింట నేడింట - నగలించి తొమ్మిది యమ్ములనేసె"[122]

వానిని సహింపలేక వానరులు రామునాశ్రయించినారు.

మకర రాక్షుడు రామునెదిరించి తాను ఏవిధంగా యుద్ధమునందైనను నేర్పుగలవాడనేనని సూచిస్తూ ఈ విధంగా అంటాడు. దానిని భాస్కరరామాయణకర్త ఈ విధంగా తెల్పినాడు.

ఆ॥ ఖడ్గశక్తినైన గదనైన జేతుల - నైన వింటనైన నరసిజూడ
గడగి నీకు బోరగా నేర్పు మిక్కిలి - యెందుగలదు దాని నేరికొనుము"[123]

మకరాక్షుడు రామునిపై అనేక విధములైన ఆయుధములను ప్రయోగించినాడు. బాణవర్షాన్ని గురిపించినాడు. రాముడు వానినన్నింటిని తన బాణాలతో ఖండించి ఆగ్నేయాస్త్రముతో ఆతనిని సంహరించినాడు.[124]

### (V) రామరావణుల అస్త్ర యుద్ధం:

రామరావణుల తుదిపోరు భయంకరముగా సాగినది. వారును మొదట బాణ యుద్ధాన్ని చేశారు. రావణుడు రాముని బాణజాలానికి నిలువలేకపోయినాడు. అస్త్ర యుద్ధాన్ని ప్రారంభించినారు. రావణుడు మొదటగా దైవతాస్త్రాన్ని ప్రయోగింపగా రాముడు దానిని శాంతింపజేసినాడు. రామరావణుల అస్త్రయుద్ధంలో కొన్ని విచిత్రాలు కనబడుతున్నాయి. రావణుడు రాక్షసాస్త్రాన్ని ప్రయోగింపగా దానినుండి విచిత్రాకృతులు గల రాక్షసులు పుట్టటాన్ని భాస్కరరామాయణకర్త ఇట్లా వర్ణించాడు.

"మీఱినకోఱలున్ మిగిలి మింటికిఁ బర్విన పల్ల వెంట్రుకల్
తీఱిన మిట్టగ్రుడ్డులును దీర్ఘతరంబగునట్టి సాహసం
బాఱని తేజమున్ దేసలనంటిన చేతులు లోకరాజిలో
నేఱిన మేటి రూపముల నెంతయు చేర్చిరి రాక్షసుల్వడిన్[125]

వాల్మీకి రామాయణం దీనిని ఆసురాస్త్రంగా తెల్పింది. ఆ అస్త్రమునుండి సింహముఖాలు,వ్యాఘ్రముఖాలు, కంకముఖాలు, కాకిముఖాలు,గృధ్రముఖాలు, డేగముఖాలు, నక్కలముఖాలు, తోడేలుముఖాలు గలవియగు అనేక బాణాలు వెలువడినట్లు వాల్మీకం వర్ణించింది.[126] ఆసురాస్త్రాన్ని రాముడు ఆగ్నేయాస్త్రంతో నివారించాడు. ఆ ఆగ్నేయాస్త్రం వల్ల అగ్నివలె ప్రకాశించు ముఖాలు గలవి, సూర్యముఖాలు, చంద్రముఖాలు, అర్ధచంద్రముఖాలు, ధూమకేతుముఖాలు,

గ్రహముఖాలు, నక్షత్రముఖాలు, ఉల్కాముఖాలు గల బాణాలుద్భవించాయి. ఆ సురాస్త్రం నుండి పుట్టిన భీకరబాణాన్ని ఆగ్నేయాస్త్ర బాణాలు నశింపజేసినవి. ఇట్లే ఈ అస్త్ర యుద్ధంలో జరిగిన మరి కొన్ని విచిత్రాలు మనం గమనించాలి. రావణుడు వారణాస్త్రాన్ని ప్రయోగింపగా దాన్నుండి ఏనుగులగుంపు పుట్టటాన్ని భాస్కర రామాయణకర్త ఇట్లా వర్ణించాడు.

'తెలియన్ వారిధి యున్న ధీశత సపత్నీ భూతదానంబు శై
వలినీ చంద్రకి తాంబు రాశి జలమై వాలాహిదుష్ప్రేక్ష్యమై
చలహస్తాగ్రవితాన దేవతటినీ చంచత్స్వవర్ణాబ్జమై
బలసెన్ వారణసంఘ మస్త్రజనిత ప్రఖ్యాత నిష్పన్నమై''[127]

అధికంగా మదజలాన్ని స్రవించేది, చూడశక్యముగా నట్టివి, పొడవైన తుండములు గలవి యగు ఏనుగుల సమూహము ఆ అస్త్రాన్నుండి పుట్టినవి. ఆ అస్త్రానికి ప్రతిగా 'రాముడు' నారసింహాస్త్రాన్ని ప్రయోగించాడు. దానినుండి పుట్టిన సింహాల సమూహం ఏనుగుల గుంపును నశింపజేసినట్లును భాస్కర రామాయణం వర్ణించింది.[128]

ఈ విధమైన విపులమైన వర్ణనలు సంస్కృతాంధ్ర రామాయణాల్లో పెక్కు గలవు. రామాభ్యుదయ కర్త రావణుడు తాను ప్రయోగించిన ఆగ్నేయాస్త్రం రాముని వారుణాస్త్రంతో అణగిన తర్వాత నాగాస్త్రాన్ని ప్రయోగించుటను చమత్కారంగా వర్ణించాడు.

'కీలిశరమాఱిపోయినఁ
గాలోరగశరము పంక్తి కంఠుడు వఱపెన్
వ్యాళమయ మగుచు మిన్నగై
వ్రాలెన్ బ్రాణములమీద వచ్చెన్ విధికిన్'[129]

ఆకాశమంతా నల్లత్రాచులతో నిండిపోయింది. శరీరములనిండా నల్ల త్రాచులు తగులుకొనిన వానరులు, మొగిలు తీవ లలమిన మేరు పర్వత శిఖరములవలె'' నున్నారట. రాముడు నాగబాణమునకు ప్రతిగా గరుడాస్త్రము ప్రయోగించినాడు. 'ఆ అస్త్రమునుండి వెలువడిన వెన్నుని గుఱ్ఱాలు'' అనగా గరుడ పక్షులు ఆకాశమంతటను నిండినాయి. ఆ అసందర్భంలో రామాభ్యుదయకర్త చమత్కారంగా ఇట్లా వర్ణించాడు.

'ఒక కడఁ బులుగులదొర యెఱు
పొక కడఁ బెనుపాప నలుపు నొదవిన నడుమీ

ధికిఁబగ లొకకడనున్,రే

యొక కడనుం గల సురాద్రి యొరపు లభించెన్"[130]

ఒక ప్రక్కన నల్లత్రాచుల నల్లదనము, మరొక ప్రక్కన గరుడుల ఎఱ్ఱదనము గల ఆకాశము ఒక ప్రక్కన రాత్రి మరొక ప్రక్కన వగలు గలగి మేరు పర్వతమువలెనున్నదని భావము. చివరగా రాముడు బ్రహ్మాస్త్రముతో రావణుని సంహరించినాడు. బ్రహ్మాస్త్ర వర్ణనము భాస్కర రామాయణమున విపులముగా గలదు. ఆ అస్త్రములు ప్రకాశించిన విధము ఇట్లు వర్ణింపబడినది.

విలయార్క మండలావిర్భావ మొదవంగ సంవర్త పావక చటుల మగుచు

కులిశ మహాయుధ కోటి సంకాశమై కాలదండాయుతా భీలమగుచు

చటుల చక్రసహస్ర సన్నిభస్ఫురణమైన రుద్ర శూలోదగ్రరుచులు నిగుడ

నిర్ఘాత సంఘత నిష్ఠుర పాతమై ఫణి రాజ సముదాయ భయదమగుచు

సప్తమారుత దుర్వార జవముగలిగి దానవస్తోమ హృదయ సంత్రాసమొదవ

శతముఖుడు మొదలైన దిక్పతులు మెచ్చ నతి నిరర్గళమైన బ్రహ్మాస్త్రమడరె.[131]

ప్రళయకాలపు సూర్యునివలె భయంకరమై, సుడులు తిరుగుచు, అగ్ని జ్వాలలతో కూడినదై, కోటివజ్రాయుధములతో సమానమైనట్టిదై, తీక్షమైన వేయి చక్రాలతో సమానమై, భయంకరమైన శివుని శూలము వంటి కాంతులు గలదై, పిడుగుపాటు వంటి కఠినమైనదై, పాతాళలోకమునందున్న ఫణిరాజశ్రేష్ఠులకును భయము గల్గించునదై, సప్తమరుత్తులవేగము గలదై ఆ బ్రహ్మాస్త్రమొప్పినది. ఆ సమయంలో జరిగిన ప్రకృతివైపరీత్యాలను భాస్కర రామాయణకర్త వర్ణించినాడు. ఆ అస్త్రము నేటి అణ్వాస్త్రం వలె భయంకరమైనది. ఆ బ్రహ్మాస్త్రము రావణుని, వక్షస్థలమును చీల్చుకొని ఆతని ప్రాణాలను తీసి, ఆవిషయం భూమాతకు చెప్పుటకై వెళ్లినట్లు , భూమిని చీల్చుకొనిపోయి ఒక్క అర్ధనిమిషమాత్రమున తిరిగి రాముని తూణీరము చేరినట్లు భాస్కర రామాయణకర్త వర్ణించినాడు.[132]

తెలుగు రామాయణములందు రాముడు ముందుగా ఆగ్నేయాస్త్రంతో రావణుని కుక్షియందున్న అమృతభాండము నింకింపజేయుటయు వర్ణింపబడింది.

### *6-8.10* ఖడ్గ యుద్ధము:

ఖడ్గ సహాయమునజేసే యుద్ధం ఖడ్గయుద్ధంగా చెప్పబడును. రామలక్ష్మణులు, రావణుడు, రావణపుత్రులు, రాక్షస వీరులు, ఖడ్గ యుద్ధమున నిపుణులుగా

చెప్పదగినవారు. వానర యూథపులలో హనుమంతుడు, అంగదుడు, వానర రాజగు సుగ్రీవుడు మొదలగు వారు ఖడ్గయుద్ధమున ప్రవేశమున్న వారిగా కన్పింతురు. రామలక్ష్మణులు విరాధ, కబంధుల బాహువులను ఖండించునపుడే ఖడ్గములను ప్రయోగించుట కన్పించును. రాక్షసులతో రావణుడు జటాయువు యొక్క రెక్కలను ఖండించేటప్పుడు ఖడ్గమునుపయోగించినాడు. రాక్షస వీరులలో శోణితాక్షుడు, యూపాక్షుడు, క్రోధనుడు, యుద్ధోన్మత్తుడు మొదలగువారు ఖడ్గ ప్రయోగకుశలురుగా చెప్పదగినవారు. మిగిలిన సాధారణ రక్షక భటులుపయోగించిన ఆయుధములందు ఖడ్గముకూడా గలదు. ధనుస్సు తరువాత ఖడ్గమే శ్రేష్ఠమైన ఆయుధంగా చెప్పదగింది. ఖడ్గయుద్ధము చేయు వీరులు వృషభ చర్మము గప్పినడాలునుపయోగించుట గలదు. వజ్రదంష్ట్రుడు అంగదునెదిరించు సందర్భంలో ఖడ్గముతో పాటు డాలును కూడ ధరించినట్లు వాల్మీకమిట్లు దెల్పినది.

'జగ్రాహ చార్షభం చర్మ ఖడ్గం చ విపులం శుభమ్।
కింకిణీజాలసంఛన్నం చర్మణాం చ పరిష్కృతమ్''॥

అతడు వృషభ చర్మము గప్పిన డాలును విశాలమైన చిరుగంటలచే శోభిల్లు మంచి ఒరగల కత్తిని పట్టుకొని నిలిచినాడని భావము. ఇందు కత్తిఒరలకు గంటలు కట్టుటయు చెప్పబడినది. డాలునకు పర్యాయంపదంగా రామాయణమున 'చర్మ' పదమే కన్పిస్తుంది. ఖడ్గము యొక్క విశిష్టతను గూర్చి, లక్షణాలను గూర్చి ఖడ్గలక్షణ శిరోమణి, మానసోల్లాసము, శివ తత్త్వ రత్నాకరము వంటి ప్రాచీన గ్రంథాలు తెల్పినవి.

ఖడ్గానికి సంబంధించిన శాస్త్రవిజ్ఞానం వేదకాలమునాటికే ఉన్నట్లు, అది 'అసి' గా పిలువబడినట్లు ముప్పది రెండు ఆయుధాలలో 'అసి' ప్రథమ స్థానం పొందినట్లు ఇందు తెల్పబడింది.

మహాభారతంలో ఖడ్గం యొక్క ఉత్పత్తిని గూర్చి చెప్పబడింది. ధనుస్సు తర్వాత ఖడ్గమే మేలైనదని తెల్పుచు భీష్ముడు నకులునితో ఖడ్గోత్పత్తిని దాని ప్రభావాన్ని q=~ΦϘê K⁑[⊕E[33]

### 6-8.11 రామాయణంలో వర్ణింపబడ్డ ఖడ్గయుద్ధాలు:

రామాయణంలో ఖడ్గాన్ని యోధులుపయోగించటాన్ని గూర్చి అనేక చోట్ల చెప్పబడింది. రామలక్ష్మణులు అరణ్యావాసానికి బయలుదేరేటప్పుడు ధనుస్సులనే గాక ఖడ్గాలను కూడా తీసుకొని వెళ్లుటను వాల్మీకి ఈ విధంగా తెలియజేశాడు.

"తతః కలాపాన్ సన్నహ్య ఖడ్గౌ బద్ధ్వా చ ధన్వినౌ।
జగ్మతు ర్యేన తాం గంగాం సీతయా సహ రాఘవౌ॥[134]

రామలక్ష్మణులు కవచాలనుధరించి, అమ్ములపొదులు, ఖడ్గములు కట్టుకొని, విండ్లు చేతబట్టి గంగానదిని చేరు మార్గాన బయలుదేరిరని ఆశ్లోకభావం.

విరాధ కబంధులవధయందు రామలక్ష్మణులు ఖడ్గములనుపయోగించిరి. రామలక్ష్మణులు తమపైకి వచ్చిపడుచున్న విరాధుని ఖడ్గముతో కొట్టుటను వాల్మీకి ఈ విధంగా వర్ణించాడు.

"తౌ ఖడ్గౌ క్షిప్ర ముద్యమ్య కృష్ణసర్పా వివోద్యతౌ।
తూర్ణమాపేతతు స్తస్య తదా ప్రహరతాం బలాత్"॥[135]

వేగంగా తమపైకి వచ్చి పడుచున్న ఆ విరాధుని కృష్ణసర్పాలవలె నొప్పుఖడ్గాలతో ఆ రామలక్ష్మణులు ఆతన్ని ప్రహరించిరి. విరాధుడు రామలక్షణులను తన బాహువులతోనిఱికించుకొని పోవుచుండగా లక్ష్మణుడాతని ఎడమభుజాన్ని, రాముడాతని కుడిభుజాన్ని తమ ఖడ్గాలతో ఖండించారు. అట్లే రామలక్ష్మణులు కబంధుని భుజాలను నఱికిన సందర్భాన్ని భాస్కర రామాయణకర్త ఈవిధంగా వర్ణించాడు.

-------------------- ఏల
ఈ విచారంబు! వధియింపు మిపు(డ;యనుడు
దెలిసి ఖడ్గంబు వెఱికి దైతేయు దీర్ఘ
కఠిన భుజదండ ముగ్రవేగమున నఱకె;
ననుజు(డట్టుల చేసె (దక్కిన భుజంబు"[136]

రాముడు నిరాయుధుడైన కబంధుని వధించుట ధర్మముగాదని యాలోచించుచుండ లక్ష్మణుడు రామునితో అట్టి విచారము మాని ఆతని వధింపుమనినాడు. అంతట రాముడు వాని దీర్ఘమైన కఠినమైన దండమువంటి భుజాన్ని నఱికినాడు. పిమ్మట లక్ష్మణుడు రెండవ భుజాన్ని ఖండించినాడు. అట్లే ఖరుడు రామునిపై బాణాలను ప్రయోగించినపుడు ఆతని అనుచరులను బిట్టుగా నార్చి రామునిపై గదా ముసలాది ఆయుధాలు, బాణాలు, ఖడ్గములు ప్రయోగించిరి. అప్పుడు ఆకాశమంతట ఖడ్గాలు నిండుటను భాస్కర రామాయణకర్త ఈవిధంగా వర్ణించాడు.

'------------------------------ చూడ్కికిన్
పట్టెడలేక కైదువులు పందిరి కైవడి నిండిక్రమ్మగన్''[137]

ఆకాశంలో చూచే ఎడము కూడా లేకుండా కత్తులు పందిరివలె నిండినవి. ఆ రాక్షసవీరులు రామునిపై అధిక సంఖ్యలో కత్తులను ప్రయోగించినారని దీనివలన తెలియుచున్నది. రావణపుత్రుడైన అతికాయుడు గదా, ఖడ్గ, ధనుర్విద్యలలో ప్రవీణుడు. అంతేగాక అతడును కుంభకర్ణుని వలె పెద్ద శరీరాన్ని కలవాడు. అతికాయుని రథానికి కట్టబడిన ఖడ్గాలను వాల్మీకి ఈవిధంగా వర్ణించాడు.

"ద్వౌ చ ఖడౌరథగతౌ పార్శ్వస్థౌ పార్శ్వశోభితౌ"
చతుర్హస్తత్సరుయుతౌ వ్యక్త హస్త దశాయతౌ''[138]

నాలుగు చేతుల ప్రమాణము గల పిడులు గల్గి పదిచేతులు నిడివిగల్గిన రెండు ఖడ్గాలు ఆతని రథానికి ఇరుపార్శ్వములందును వ్రేలాడుచున్న వని శ్లోకభావం.

*6-8.12 రామాయణమునందలి దివ్యఖడ్గ ప్రసక్తి:*

లక్ష్మణుడొకనాడు అరణ్యంలో విహరిస్తుండగా అతనికొక దివ్యఖడ్గం లభించిన వృత్తాంతం రంగనాథ రామాయణంలో గలదు. ఇది అమూలకం.

శూర్పణఖ కుమారుడైన జృంభుడు తన తండ్రిని చంపిన రావణునిపై పగదీర్చుకొనవలెనని కోరి సూర్యుని గూర్చి తపము చేయుచుండెను. సూర్యుడాతని తపస్సుకు మెచ్చి అతని యొద్దకొక దివ్యఖడ్గాన్ని పంపాడు. ఆ ఖడ్గము తన నందు కొమ్మని జృంభునితో పల్కినది. అప్పుడారాక్షసుడు గర్వంతో ఆ భానుడు తానుగా వచ్చి యీయకుండా ఇట్లా పంపితే నేను స్వీకరింతునా? యని దానిని నిరాకరించినాడు. అతడు మరల తపస్సులో మునిగినాడు. అదే సమయానికి అచ్చటికి వచ్చిన లక్ష్మణుడు ఆ ఖడ్గాన్ని నేర్పుగా నొడిసి పట్టినాడు. ఆ ఖడ్గమచ్చటకు ఎట్లు వచ్చిందో యని ఆలోచిస్తూ అతడు అచటగల వెదురు జొంపాలను ఖండించినాడు. అందు కూర్చుండి తపస్సు చేస్తున్న జృంభుడును సంహరింపబడినాడు. ఆవిధంగా లక్ష్మణునకు దివ్యఖడ్గం లభించింది.[139]

అట్లే అగస్త్య మహర్షి రామునకు దివ్యశరచాపములు ఖడ్గ యుగాన్ని ఇచ్చుటను భాస్కరరామాయణకర్త ఈ విధంగా వర్ణించాడు.

'కలశభవుండు రామునకు కౌతుక మొప్పఁగ దివ్యమైన యు
జ్జ్వల ఘనఖడ్గయుగ్మమును, వైష్ణవమైన శరాసనంబుఁ బెం
పలరు నమోఘ సాయకము లక్షయ తూణయుగంబునిచ్చి, నీ
వలసిన వానిఁ గోరు; నివారణ నిత్తు; నరేంద్ర నావుడున్[140]

మూలరామాయణమునందును బంగారు ఒరగలిగిన, బంగారు పిడిగల కత్తిని అగస్త్య మహర్షి రామునికిచ్చినట్లు చెప్పబడింది.[141] లక్ష్మణుడు ఇంద్రజిత్తుపై యుద్ధానికి బయలుదేరేటప్పుడు రాముడాతనికి దివ్యశరచాపఖడ్గాలను, వజ్రకవచాన్ని ఇచ్చి పంపినాడు.

*6-8.13 ఖడ్గంతో చేయబడిన ద్వంద్వయుద్ధాలు:*

ఇరువురు యోధులు ఖడ్గ సహాయంతో చేసిన ద్వంద్వ యుద్ధాలు రామాయణంలో కొన్ని వర్ణింపబడ్డాయి. మచ్చునకు కొన్ని.

*(i) అంగద శోణితాక్షుల ఖడ్గయుద్ధం:*

అకంపనుడు మరణించిన తరువాత శోణితాక్షుడు అంగదుని వివిధములైన బాణములతో నొప్పించెను. అంగదుడు కోపించి ఆతని ధనుర్బాణాలను విఱిచివైచెను. అంత శోణితాక్షుడు కత్తిని, డాలును తీసుకొని ముందు వెనుక లాలోచింపక వేగముగా ఆకసమున కెగిరెను. వాల్మీకి ఆ విషయమునిట్లు వర్ణించినాడు.

"శోణితాక్ష స్తతః క్షిప్ర మసిచర్మ సమాదదే।
ఉత్పపాత తదా క్రుద్ధో వేగవా నవిచారయన్[142]॥

అంగదుడు ఆతనికంటె మరింత వేగంగా పైకెగిరి, వానిని పట్టి వాని చేతిలోని కత్తిని లాగుకొని సింహనాదము చేసినాడు. పిమ్మట అంగదుడు శోణితాక్షుని మూపుపై కత్తితో కొట్టి యజ్ఞోపవీతమునువలె ఛేదించినాడు. ఆ మహాఖడ్గమును ధరించియే ఇతర రాక్షసుల మీదకు వెళ్లినాడు.

ఖడ్గ ప్రహారములందు "యజ్ఞోపవీతమార్గము" ఇందు చెప్పబడినది. ఇంద్రజిత్తు తనరథంపై కూర్చుండబెట్టుకొని తెచ్చిన మాయసీతను అట్లే ఛేదించినాడు. వాల్మీకి దానిని 'యజ్ఞోపవీత మార్గేణ ఛిన్నా తేన మనస్వినీ''[142a] అని వర్ణించినాడు. యజ్ఞోపవీతధారణ ప్రకారము గానని గోవింద రాజీయము వ్యాఖ్యానించినది.[143] •

*(ii) అంగద - ప్రజంఘుల ఖడ్గయుద్ధం:*

అంగదునిచే దెబ్బతిన్న శోణితాక్షుడు ప్రజంఘుని, యూపాక్షుని సహాయంగా తీసుకొని మరల అంగదుని ఎదిరించినాడు. అంగదునకు మైందద్వివిదులు సహాయకులుగా వచ్చిరి. ఆ ముగ్గురును భయంకరమైన యుద్ధాన్ని చేశారు. ఆ యుద్ధంలో ప్రజంఘుడు ఖడ్గంతో అంగదునిపైకి రాగా అంగదుడాతని బాహువును పిడికిలితో పొడిచి ఖడ్గమును నేలబడజేసెను. పిమ్మట ఆ ఖడ్గముతోనే అంగదుడు ప్రజంఘుని శిరస్సును ఖండించెను.[144]

*(iii) సుగ్రీవ మహోదరుల ఖడ్గయుద్ధం:*

సుగ్రీవ మహోదరులు మొదట కొంతసేపు బాహు యుద్ధం చేసిరి. పిమ్మట మహోదరుడు సమీపమున పడియున్న ఖడ్గాన్ని డాలును తీసుకొనెను. వెంటనే సుగ్రీవుడును ఖడ్గాన్ని డాలును తీసుకోవడాన్ని వాల్మీకి ఇట్లా వర్ణించాడు.

"తథైవ చ మహాఖడ్గం చర్మణా పతితం సహ।
జగ్రాహ వానర శ్రేష్ఠం సుగ్రీవో వేగవత్తరః"॥[145]

మహోదరుని కంటె అధికవేగంగల సుగ్రీవుడు నేలపై పడియున్న వేఱొకకత్తిని డాలును తీసుకొనినాడు. అంతట ఖడ్గవిద్యలో నేర్పరులగు ఆ మహోదర సుగ్రీవు లిరువురును శరీరాలుప్పొంగ పోరాటం సాగించారు. ఈ సందర్భంలో వాల్మీకి ఖడ్గవిద్యలో ఇరువురు నేర్పరులను విషయాన్ని 'ఉభేశస్త్రవిశారదౌ'[146] అనే శ్లోకం ద్వారా తెలియజేసినాడు.

సుగ్రీవ మహోదరులిరువురు సవ్యాపసవ్యమండలాలుగా తిరుగుచూ ఖడ్గయుద్ధం చేశారు. శూరుడు వేగవంతుడునగు మహోదరుడు తన చేతి కత్తిని సుగ్రీవుని చేతియందలి డాలులో తగుల్కొనునట్లు ప్రయోగించెను. మహోదరుడు డాలుకు గ్రుచ్చు కొన్న కత్తిని లాగుచుండగానే వానరశ్రేష్ఠుడగు సుగ్రీవుడు శిరస్త్రాణ మండలాలంకృతమైన మహోదరుని శిరస్సును తనచేతి ఖడ్గంతో నఱకెను.

*(iv) హనుమ -త్రిశిరుల ఖడ్గయుద్ధం:*

రావణపుత్రుడగు త్రిశిరుడు మహోదరుని(ఈ మహోదరుని పేరు యుద్ధోన్మత్తుడు. ఇతడు రావణునకు సోదరుడు) మరణాన్ని చూచి కుపితుడై ధనుర్బాణాలను ధరించి

సమీపముననున్న హనుమంతునెదిరించెను. వారిరువురి మధ్య భయంకరమగు యుద్ధం జరిగింది. త్రిశిరుడు ప్రయోగించిన భయంకరమగు శక్త్యాయుధాన్ని కూడా హనుమంతుడు భగ్నము చేసినాడు. పిమ్మట త్రిశిరుడు ఖడ్గయుద్ధానికి సిద్ధపడటాన్ని వాల్మీకమిట్లు వర్ణించెను.

"తతః ఖడ్గం సముద్యమ్య త్రిశిరా రాక్షసోత్తమః।
నిజఘాన తదా ఖడ్గం వానరేంద్రస్య వక్షసి"॥[147]

ఆ రాక్షస శ్రేష్ఠుడగు త్రిశిరుడు ఖడ్గాన్ని తీసుకొని హనుమంతుని వక్షముపై కొట్టెను. అంతట హనుమంతుడు తన అఱచేతితో కొట్టి త్రిశిరుని క్రిందపడవైచి ఆతని చేతియందలి ఖడ్గాన్ని లాగుకొనెను. పిమ్మట హనుమంతుడు త్రిశరుని శిరస్సును ఖండించటాన్ని భాస్కరరామాయణకర్త ఇట్లా చెప్పాడు.

"ప్రకటమదోద్ధతిన్ గడగి పంక్తి ముఖాత్మజు పైకి, లెక్కసే
యక వెసదాటి ఘోర కులిశాహతి నింద్రుడు విశ్వరూపు మ
స్తకము ద్రుంచి నట్టులడిదంబున నొక్కట ద్రుంచె దత్త్రిమ
స్తకవడి భీకర భ్రుకుటి చాప కలాప లలాట పట్టికన్"[148]

ఆతని మూడుశిరములను ఇంద్రుడు విశ్వరూపుని శిరస్సును ఖండించినట్లు ఖండించినారు. దీనిని బట్టి హనుమంతునికి కూడా కొంత ఖడ్గ విద్యలో ప్రవేశమున్నట్లు భావింపవచ్చును.

### (V) అంగద - క్రోధనుల ఖడ్గయుద్ధం:

అంగదుడు కంపనుని గాయపఱచుటను చూచి క్రోధనుడు క్రోధించి అంగదునెదిరించినాడు. అంగదుడును ఆతని రథాన్ని, రథాశ్వములను చూర్ణము చేసినాడు. అంతట క్రోధనుడు కరవాలాన్ని తీసుకొని నేర్పుగా రథమునుండి క్రిందకు దుమికి అంగదునిపైకి వెడలినాడు. వారి యుద్ధాన్ని భాస్కరరామాయణకర్త ఈవిధంగా వర్ణించాడు.

"క్రోధనుండును గరవాలంబు నొడ్డనంబునుగొని
లాఘవంబున ధరణికి లంఘించి యార్చుచుంచేర్చిన చూచె
దుందుభివైరి నందనుడు సంరంభంబున విజృంభించి సింహ
నాదంబుసేసి సైంహికేయుండు చందురుంబొదవుచందం

బున నరవాయుగొనక కరవాలంబు దిగిచి పుచ్చుకొని.

విశేషంబుగ్రేసి, వానింగాలుగ్రోలికిం గాపుపుచ్చి"[149]నారు.

ఇందు అంగదుడు ఖడ్గయుద్ధంలో 'అపరిమిత విన్యాసరచనా విశేషములు'' తెలిసిన వాడుగా వర్ణింపబడినాడు. ఈ ప్రకారం వానరులలో సుగ్రీవుడు, అంగదుడు, హనుమంతుడు, ఖడ్గయుద్ధము తెలిసినవారుగా చెప్పదగినవారు. రామాయణంలో ఖడ్గయుద్ధవర్ణనలు విపులంగా లేకపోయినప్పటికి ఆనాటి యుద్ధపద్ధతులలో ఖడ్గయుద్ధాన్ని కూడా ఒక పద్ధతిగానే గ్రహింపవచ్చును.

### *6-8.14 గదాయుద్ధం:*

గదాయుద్ధముతో చేయు యుద్ధాన్ని గదాయుద్ధంగా చెప్పవచ్చును. రామాయణకాలంలో ఇనుపగదలు ఆయుధములుగా ఉపయోగింపబడ్డవి. ఖడ్గయుద్ధానికి వలెనే గదా యుద్ధవర్ణనలును రామాయణమున అధికంగా లేవు. రాక్షసులలో విభీషణుడు గదాధారి. అతడు ఇతర ఆయుధాలను ధరించినట్లు నిదర్శనములు లేవు. హనుమంతుడు మన చిత్రపటములో వలె గదాయుద్ధాన్ని ధరించిన వానిగా వాల్మీకంలో కన్పట్టదు. రామలక్ష్మణులు ఆయుధ విద్యలన్నింట నేర్పరులైనప్పటికి రామాయణమున వారు గదాయుద్ధము చేయుట ఎచ్చటను కనబడదు. అట్లే రాక్షసశ్రేష్ఠులైన రావణ ఇంద్రజిత్తులుగూడ గదాయుద్ధము చేయుట కనబడదు. రాక్షసులలో మహాపార్శ్వుడు, మహాకాయుడు, శోణితాక్షుడు, కంపనుడు, యుద్ధోన్మత్తుడు, మొదలగువారు గదాయుద్ధము చేసినారు. వానరులలో అంగదుడు, హనుమంతుడు, ఋషభుడు, గదా యుద్ధమున ప్రవేశమున్న వారిగా కనబడుదురు.

సుందరకాండలో అక్షుడు హనుమంతుని వక్షమును గదతో కొట్టి నొప్పింపగా హనుమంతుడు ఆ గదతోనే వానిని కడువడి నేసినాడు. అంతటవాడు తప్పించుకొని ఖడ్గాన్ని డాలును ధరించి ఆకసానికి ఎగురగా హనుమంతుడు వానితో నెగిరి వానిపై గదను ప్రయోగించినాడు.[150]

### *(i) మహాపార్శ్వ ఋషభుల గదాయుద్ధము:*

రావణుని సోదరుడైన మహాపార్శ్వుడు ఋషభునిపైకి గదను ధరించి యుద్ధానికి వెళ్లుటను రంగనాథరామాయణకర్త ఈవిధంగా వర్ణించాడు.

"ఉరుమణిప్రభల నత్యుగ్రమై యముని. పరుషోగ్రదండంబు పాటిగా గలిగి
అరుణపుష్పంబులనరుణ గంధంబున - నురుతరంబగుచు నయోమయంబైన
ఉదయార్క భాసమానోజ్జ్వలంబగుచు - నొదవు గదాదండ ముగ్రుడై దాల్చి"[151]

మణికాంతులతో ప్రకాశించునది, భయంకరమైనది, యమునిదండమును పోలినట్టిది. ఎఱ్ఱని పుష్పాలతో గంధంతో పూజింపబడినట్టిదియగు ఇనుపగదను మహాపార్శ్వుడు ఋషభునిపై ప్రయోగించినాడు. ఋషభుడాతనితో పోరి అతని చేతియందలి గదా దండము నేలబడగా వెంటనే దానిని గ్రహించి ఆ గదతోనే పోరి మహాపార్శ్వుని సంహరించినాడు.

(ii) *అంగద మహాకాయుల గదాయుద్ధం:*

మహాకాయుడు అంగదుని ఇనుపగుదియతో కొట్టి మూర్ఛిల్లజేసినాడు. గవాక్షుని పదిబాణాలతో, పృథుని ఐదుబాణాలతో, క్రోధనుని ఏబది బాణాలతో, వృషభు నెనిమిది బాణాలతో, మేఘ పుష్పుని పదునెనిమిది బాణాలతో ,గజుని ఐదువందల బాణాలతో, శతబలిని మూడు బాణాలతో, పనసుని ఏడుబాణాలతో మిగిలినవానరుల నొక్కక్కరిని ఒక్కొక్క బాణంతో కొట్టి గాయపరచినాడు. అంతలో మూర్ఛనుండి తేరుకొనిన అంగదుడు 'గదాపాణి' యగుచు మహాకాయుని రథముపైకి నుఱికినాడు. ఆగదతో మహాకాయుని రథాన్ని రథాశ్వములను గూల్చడాన్ని భాస్కరరామాయణకర్త ఇట్లు వర్ణించాడు.

'వికట విశంకట భ్రుకుటి వీర రసోద్భట వీచి విస్ఫుర
ద్వికృతి నటింప గట్టలుక వేయి హయంబులసూతుఁజంపి కా
ర్ముక మునుగేతనంబు రథమున్ వితథంబుల చేసివైచి సీ
సక మెడలించి నెత్తిపెలుచన్ గదవ్రేయుచు దాచె నుర్వికిన్[152]

అంగదుడు మహాకాయుని రథాశ్వాలను సూతుని చంపి ఆతని ధనుస్సును ధ్వజాన్ని విఱిచి కిరీటాన్ని పడగొట్టి ఆతని నెత్తిపై గదతో కొట్టినాడు. అంతట మహాకాయుడు మరొక గదాదండాన్ని తీసుకొని అంగదునెదిరించినాడు. వారిరువురి గదాయుద్ధమును భాస్కరరామాయణకర్త మనోహరంగా వర్ణించినాడు.

'అప్పుడు దీప్త హేమవలయద్యుతు లాకసమంటగా గదల్
ద్రిప్పుట లెత్తివేయుటలు, దీవ్రగతిం బయిదాటిపోవుటల్.

తప్పుతొలంగుటల్ బహువిధంబుల నొంచుటలార్చివేసినం
జిప్పలు వారనొగ్గుటలు జెల్లగ నిద్దఱు బోరిరుద్ధతిన్'[153]

ఇందు గదలను త్రిప్పుట, ఎత్తివేయుట, మీఱి ప్రవర్తించుట, తప్పుకొనుట అనేకవిధాలుగా బాధించుట మొదలగు రీతులలో వారిరువురు పోరాటము చేసినట్లు వర్ణింపబడింది. దీనినిబట్టి అంగదుడు గదాయుద్ధంలో నేర్పుగలవాడని చెప్పవచ్చును.

*(iii)* సుగ్రీవ యుద్ధోన్మత్తుల యుద్ధము :

విరూపాక్షునియన్న యగు యుద్ధోన్మత్తుడు సుగ్రీవు నెదిరింపగా సుగ్రీవుడు పరిఘా యుధముతో వాని ధనుస్సును ద్రుంచి రథమందలి సూతుని నేలగూల్చినాడు. అంతట యుద్ధోన్మత్తుడు గదాపాణియై పృధివికి దిగి సుగ్రీవునెదిరించినాడు. ఈ యుద్ధంలో యుద్ధోన్మత్తుడు గదతోను, సుగ్రీవుడు ఇనుపముండ్లు గల పరిఘతోను పోరాటము చేసినారు. పరిఘ'కూడా గదవంటి లోహదండమే. అప్పుడు వారు చేసిన యుద్ధమును భాస్కరరామాయణకర్త ఈవిధంగా వర్ణించాడు.

'అయ్యిద్దఱు పరిఘ గదా హస్తులై తలపడి మహోరగంబుల క్రియ నిట్టూర్పులు నిగిడించుచుం ప్రస్వేద సిక్తాంగులై మదకుంజరంబుల క్రియం బ్రవర్తించుచు, సమర సముత్సాహ పులకితగాత్రులై కంఠీరవంబుల కరణి ప్రహారంబుల తలలుపగిలి నెత్తురుగాఱ, నడ జేవురు గొండ చాడ్పున లంఘన లాఘవంబులు గలిగి గరుడుల చందంబుదోప సింహనాదంబుల జీమూతంబులకైవడి, పరస్పర జంఘల నొప్పించుచు, జాను ప్రదేశంబుల నొగిలించుచు, ఊరులభేదించుచు, కటిప్రదేశంబుల బగిలించుచు, నుదరంబుల నలంచుచు, నురంబులనగలించుచు, బాహుల స్రుక్కించుచు, కంఠంబుల జఱచుచు, చరణంబులబిట్టడచుచు, ఫాలతలంబులనలంచుచు, శిరంబుల నెత్తురు జొత్తిల్లమొత్తుచు, సోలుచు, వ్రాలుచు, దెలియుచు, మలయుచు, దేఱుచు, మీఱుచు, గేరుచు నితరేతర జయకాంక్ష లినుమడింప, చలంబుడింపక తెంపు పొంపిరివోవ, మండలక్రమభేదంబులు సూపుచు పెద్ద సేపు పోరిరి''[154] ఊరుల భేదించుచు' అని చెప్పుటంబట్టి ఆకాలమున గదాయుద్ధమునందు నాభికి క్రిందభాగమున కొట్టగూడదను నియమము లేనట్లు భావింపవచ్చును. భారతయుద్ధంలో భీముడు దుర్యోధనుని ఊరుభంగము చేయుటను కొందరు యోధులాక్షేపించిరి.[155] ప్రతిజ్ఞ నెఱవేర్చుకొనుటకై భీముడా విధంగా చేసినట్లు కృష్ణుడు సమర్థించినాడు.

సుందరకాండలో అక్షుడు హనుమంతుని వక్షాన్ని తన గదతో నొప్పింపగా హనుమంతుడు వాని గదను లాగికొని ఆతనిపై ప్రయోగించినాడు.

### *6-8.15* మల్లయుద్ధము *(లేక)* బాహుయుద్ధము:(Wrestling)

మల్లయుద్ధాన్ని నియుద్ధమనియు పిలుతురు. శాస్త్రబద్ధమైన యుద్ధక్రీడల్లో నిదియునొకటి. రాముని వద్ద మల్లదళముండెడిదని శ్రీమద్రామాయణమున చెప్పబడినది. రాముడు అరణ్యావాసానికి బయలుదేరునపుడు తన ఆశ్రయమున నున్న మల్లులకు బహుమానము లిచ్చినట్లు చెప్పబడింది.[156] మల్లయుద్ధంలో మధ్యస్థుడుగా(Refree) ఉండేవాడ్ని "ప్రాశ్నికుడు" అని పిలిచేవారు.[157]

రామాయణయుద్ధ ఘట్టాల్లో రావణుడు, సుగ్రీవుడు, హనుమంతుడు, అంగదుడు, మహాకాయుడు, విరూపాక్షుడు మొదలగువారు మల్లయుద్ధ ప్రవీణులుగా కనబడుదురు. వీరి 'నియుద్ధక్రీడ' విపులంగా రామాయణంలో వర్ణింపబడింది. వానరులందఱు బాహుయుద్ధంలో నేర్పరులే. రాజపుత్రులగు రామలక్ష్మణులును మల్లయుద్ధప్రవీణులైప్పటికి వారి మల్లయుద్ధ మెచ్చటను రామాయణమున వర్ణింపబడలేదు. మల్లయుద్ధము కొంత మొరటుదనము గల యుద్ధక్రీడగా కనబడుతుంది. రామాయణమున వర్ణింపబడిన మల్లయుద్ధాలలో మచ్చునకు కొన్ని.

#### *(i)* రావణ సుగ్రీవుల యుద్ధము:

రావణ సుగ్రీవుల మల్లయుద్ధాన్ని వాల్మీకి విపులంగా వర్ణించాడు. ఆ యుద్ధ ప్రారంభమును గూర్చి యీవిధంగా తెల్పినాడు.

"కృత్వానియుద్ధం భృశముగ్రవేగౌ కాలంచిరం గోపురవేది మధ్యే"[157a] పట్టణద్వార మధ్యమున వారిరువురును నియుద్ధక్రీడ ప్రారంభించిరి. వారిరువురును ఒకరినొకరు త్రోసుకొనిరి. క్రిందకు లాగికొనియు, ఒండొరుల దేహములు వంచియు వెనుకడగువైచి అవకాశమున కెదురుచూచూచు ఒకరి చేతులనొకరు పెనవైచి ఒండొరులనొడిసిపట్టి ప్రాకార పరిఖలమధ్య పడియు నేర్పుగా భూమిని తాకకనే పైకి లేచుచు, నిట్టూర్పులు విడుచుచూ, తమ్ముతామే ఆలింగనమును చేసుకొనుచు, బాహుపాశములచే బంధించుకొని ఊొమ్ములతో కొట్టుకొని ఒకరినొకరు గట్టిగా అదుముకొని మండలాది వివిధ పద్ధతులలో ఒకరినొకరు చంపుకొనుటకు ప్రయత్నిస్తూ భక్ష్యమునకై పొంచియున్న రెండు పిల్లులవలె పొంచి నిలుచుచు మండలాది సంచారము చేస్తూ నియుద్ధక్రీడ

సాగించినట్లు వాల్మీకి వర్ణించినాడు. వాల్మీకము నందలి యుద్ధకాండలో 40వ సర్గయందు 23 నుండి 26వరకు గల శ్లోకాలలో వివిధములగు మండలపద్ధతులు చెప్పబడ్డవి. వివిధ మండలాలననుసరించి వివిధస్థానములందు నిలిచి రావణసుగ్రీవులు యుద్ధము చేసినారు.

వివిధ మండలాలు :

(i) గోమూత్రికము : గోమూత్రము వలె వంకరగమనము
(ii) గతప్రత్యాగతము : ఉపసర్పణ, అపసర్పణములు.
(iii) తిరశ్చీన గతాని : అడ్డముగా పోవుట
(iv) వక్రగతులు : సవ్యాపసవ్య వక్రగమనములు.
(v) పరిమోక్షము : స్థానచలనము ద్వారా శత్రువుల దెబ్బను నిష్ఫలము చేయుట.
(vi) ప్రహరణా వర్జనము : ఎదురుదెబ్బతీసి తద్వారా శత్రువు దెబ్బనుండి తప్పించుకొనుట.
(vii) పరిధావనం : ఒకరు నిల్చియుండ వేఱొకరు చుట్టును తిరుగుట
(viii) అభిద్రవణం : శీఘ్రముగా పరుగెత్తి పోవుచు ఎదుర్కొనుట
(ix) ఆప్లావం : మండూకగమనం (కప్పవంటి గమనం)
(x) ఆస్థానంచ సవిగ్రహమ్ః ధైర్యముతో నిలుచుట
(xi) పరావృత్తం : పెడమొగమై పోవుట
(xii) అపావృత్తం : నిల్చినట్లే యుండి ప్రక్కకు జరుగుట
(xiii) అవద్రుతం : శత్రువు నొడిసిపట్టుటకై శరీరమును ముడిచి వంగుట
(xiv) అవప్లుతం : ఎదుటివానిని కాలితో తన్నుటకై ముఖము వంచి ఎగురుట
(xv) ఉపన్యస్తం : ఎదుటివారిని పట్టుకొనుటకై చేయి చాచుట.
(xvi) అపన్యస్తం : ఎదుటివాడు పట్టుకొనకుండా చేతులు విదల్చుట.

ఈ విధమగు పద్ధతులలో రావణసుగ్రీవులు మల్లయుద్ధము చేసినారు. భాస్కర రామాయణకర్త కూడా రావణసుగ్రీవుల మల్లయుద్ధాన్ని విపులంగా వర్ణించాడు.

"బలువిడి లాగునంబెనచి పట్టుచు పట్టిన నూడిపోవుచున్
మలయుచు, తాకుచుం తిరిగి మర్మలంటగ వ్రేయుచున్ మహీ

స్థలి బడదాచుచుం గదియజానువు బాదుచు ముష్ఠి కూర్పరా
దులవడి నొంచుచుం గడకతో నిటు లొండరు మీఱివెండియున్"[158]

ముష్టికూర్పరాదులుగా పిడికిలి,మోచేయి,మోకాలు మొదలుగునవి. "లాగునబెనచుట"- యనగానొకవిధమగుమల్లబంధ విశేషముతో పెనచుటయని వ్యాఖ్యాతలు తెల్పినారు. రావణసుగ్రీవులింకను మల్లయుద్ధము చేసిన విధమిట్లు తెల్పబడినది.

'చిత్రగతిం పెనంగిరిల చెందుచు క్రిందుచు మీదునౌచు గ్రా
స్నైత్రు ధరాపరాగములనిల్ప ముహుర్మురదుత్పత త్పత
ద్గాత్రములందు బెంజెమరు గ్రమ్మగ నూర్పులు సందడింప గో
మూత్ర కమండలీకరణముల్ మొదలైన విశేషభంగులన్'[159]

వారు శరీరములనుండి నెత్తురొలుకుచుండగా చెమటగ్రమ్ముచుండగా క్రిందును మీదును అగుచు గోమూత్రికాది వివిధమండల పద్ధతులలో మల్లయుద్ధము చేసినారు.

వారి మల్లయుద్ధమును రంగనాథ రామాయణకర్త గూడ ఈవిధంగా వర్ణించాడు.

"కటములు నుదురులు కంధరంబులును - విటతాటములజేసి వీపెల్లజీరి
కడ కాళ్ల తొడలతో గదియంగబట్టి - వడిగోపురంపు లోవైచి నొప్పించి"[160]

ఇందు 'వీపెల్ల చీరుట' వానరలక్షణమునకు చెందినదిగా చెప్పవచ్చును.

### (ii) అంగద మహాకాయుల మల్లయుద్ధము:

మఱియొక బాహుయుద్ధము అంగద మహాకాయుల మధ్య జరిగినది. మొదట వారిరువురు గదాయుద్ధము చేసినారు. "గదల్ విఱిగి పడుటతో బాహుయుద్ధక్రీడకు పూనుకొనినారు.[161] భాస్కర రామాయణకర్త వారి నియుద్ధమును విపులముగా వర్ణించినాడు.

"పొడుచుచు వ్రేయుచు పట్టుచు
విడుచుచు, గ్రొవ్వేసకమెసగ వెసదాకుచు బ
ల్విడి దిరిగి మడమదాచుచు
బడవైచుచు క్రిందమీద బడుచు నెగయుచున్"[162]

వారి బాహుయుద్ధమును చూచి ఉభయసైన్యముల వారును హాహాకారములు చేసినారు. మల్లయుద్ధమును జరుగునపుడు ఉభయపక్షములవారును తమ యోధునకు

విజయము గలుగవలెనని కోరి ఉత్సాహము కల్గించు మాటలు పల్కుటయు గలదు. అంగదమహాకాయులు యుద్ధం చేయునపుడు ఉభయసైన్యశ్రేణులును వారిని పొగిడి ఉత్సాహవంతులను చేయుట భాస్కరరామాయణమున చెప్పబడింది.[162a] నలుడు అంగదునితో ఈ విధంగా పల్కును.

"వాలి తనూజ! దోర్బల జవంబుల వాలికి నెత్తు వత్తు నీ
వాలమునన్ భవజ్జనకుడట్టి మహోద్ధతుడైన దుందుభి
న్లీలవధింపడే యతని నీవును నింక వధించి దిక్కులన్
వాలిన తండ్రికీర్తులకు వన్నియవెట్టుదుగాక నావుడున్[163]

నలుని మాటలువిని ఉత్సాహము పొందిన అంగదుడు తన అఱచేతిదెబ్బతో ఆతని తలపగులవ్రేసినాడు.

### *(iii) విరూపాక్ష సుగ్రీవుల మల్లయుద్ధము :*

విరూపాక్ష సుగ్రీవులు చేసిన మల్లయుద్ధమును భాస్కర రామాయణకర్త ఈవిధంగా వర్ణించినాడు.

మల్లయుద్ధము జేయమదిగోరి యిద్దఱు దివురుచు విడుచుచు తెఱపిగొనుచు
బెడకేల వ్రేయుచు, బిడికిట పొడుచుచు పుడమిపై బడగాచి యెడేసి పొసి
కడిమి మీదకు జిమ్మి కరములదట్టుచు కాళ్ల దన్నుచును మోకాళ్ల జదిపి
బలుగేల వ్రేసిన బడుబంతికైవడి నెగసి లాగముగొని యేపు మిగిలి
దైత్యుడర్క సూను దలమున జఱచిన పోలి తెలిసి పేర్చి సురలు పొగడ
నురము వ్రేసె వాడు, నొగినెత్తురుమియుచు గొండయొఱుగు భంగి గూలెనంత.[164]

వారిరువురు మల్లయుద్ధము చేయవలెనను కుతూహలము గలవారై ఒకరినొకరు పట్టుకొనుటను, విడుచుటను, మధ్య కొంత విశ్రాంతి తీసుకొనుటయును, భుజమును వెనుకకు ద్రిప్పికొట్టుచు పిడికిలితో పొడుచుచు, పైకెగర గొట్టి చేతులతో తిట్టుచు, కాళ్లతోతన్నుచు, బంతివలె పైకెగురుచు అనేక విధాల మల్లయుద్ధము చేసినారు. ఇందు 'లాగముగొను'ట యొక మల్లబంధ విశేషంగా చెప్పబడింది. సుగ్రీవుడు విరూపాక్షుని యురముపై గొట్టుటతో నాతడు నెత్తురు గ్రక్కుచు కొండవలె నేలగూలినాడు.

### *6-8.16 ముష్టియుద్ధము :*

ముష్టియనగా పిడికిలి యని యర్థము. పిడికిలి బిగించిచేయు పోరాటము ముష్టియుద్ధముగా చెప్పబడును. ఇది నేటి 'బాక్సింగ్' (Boxing) లో ఉపయోగించునట్టి

తొడుగులను ఆకాలమునాటి వీరులు ధరించియుండలేదు. మల్లయుద్ధమున కంటెను ముష్టియుద్ధము కొంత అనాగరికము. విచక్షణారహితంగా కొట్టుకోవడం ముష్టియుద్ధమున కనబడుతుంది. ముష్టియుద్ధమున పిడికిలి పోటులతో పాటు అఱచేతి చఱపులు కూడా ఉంటాయి. రామాయణమున బాహుయుద్ధ, ముష్టియుద్ధములు వేరువేరుగా చెప్పబడినవి. వానర రాక్షసవీరులు చేసిన బాహుయుద్ధాన్ని గూర్చి తెల్పినపుడు వాల్మీకి ఈ విధంగా తెలియజేసెను.

'కేచి దస్త్రాణి సంసృజ్య బాహుయుద్ధ మకుర్వత"

కొందఱు ఆయుధములను విడిచి బాహుయుద్ధమును చేసినారు. అట్లే ముష్టియుద్ధాన్ని గూర్చి చెప్పునపుడు దానినే స్పష్టంగా చెప్తాడు. అంగద వజ్రదంష్ట్రులు గదలను విడిచి ముష్టియుద్ధం చేసిన విషయాన్ని వాల్మీకి ఈవిధంగా చెప్తాడు.

"గదాం త్యక్త్వా తతస్తత్ర ముష్టియుద్ధమవర్తత"[165],

వానర రాక్షస వీరులందఱును ముష్టియుద్ధప్రవీణులే. వానరులు నిరాయుధులుగానే తమ ముష్టిఘాతములతో చాలమంది రాక్షసులను యమపురికంపినాడు.

ముష్టియుద్ధమునకు బయలుదేరుటకు ముందు వస్త్రమును నడుమునకు గట్టిగా బిగించికట్టుట కలదు. వాలి సుగ్రీవునితో ముష్టియుద్ధానికి బయలుదేరునపుడు పైవిధముగా చేసినట్లు వాల్మీకమున వర్ణింపబడినది.

"గాఢం పరిదధే వాసో వాలీ పరమరోషణః[166]

వాలి మిక్కిలి కోపము గలవాడై తన వస్త్రమును గట్టిగా బిగియగట్టెను.

**రామాయణంలో వర్ణింపబడిన ముష్టియుద్ధాలలో కొన్ని :**

**(i) వాలి సుగ్రీవుల ముష్టియుద్ధము :**

వాలి సుగ్రీవులు ప్రథమ యుద్ధమున పిడుగులవంటి అఱచేతి చఱపులచేత, వజ్రాయుధము వంటి ముష్టిఘాతాలచేత ఒకరినొకరు ప్రహరించుకొనినారు. ఆ యుద్ధంలో సుగ్రీవుడు ఓడిపోవుటను రంగనాథ రామాయణకర్త ఈవిధంగా తెల్పినాడు.

"వలతియై పోరాడి వాలికి నోడి - బలమేరి యాతని బలు ముష్టిహతుల
గుల్లల తిత్తియై కుట్టార్పులెసగ - చెల్లబోనేనేల శ్రీరాము నమ్మి.
వచ్చితి పదివేలు వచ్చె జాల్నాకు - వచ్చిన త్రోవ బోవగవలెనంచు
మెలకువ చెడితోక మెడమీదవైచి - సొలసి కెలంకుల జూచుచుపాఱి"[167]

వాలియొక్క పిడికిలిదెబ్బలకు సుగ్రీవుడు గుల్లల తిత్తియైనాడు. వచ్చినత్రోవనే వెళ్లవలెనని నిశ్చయించుకొని తోకను మెడపైన వేసుకొని బయలుదేరినాడు, తోకను మెడపైన వేసుకొనుట ఓటమికి చిహ్నము కావచ్చును. ముష్టియుద్ధమున కాహ్వానించుటకై వానరులు ఒకవిధమగు ధ్వనిని చేసెడివారు. కావుననే రాముడు వాలిని ద్వితీయ యుద్ధమున కాహ్వానించుటకై చేయవలసినవిధమును తెల్పుతూ ఇట్లు పల్కెను.

'సుగ్రీవ ! కురు తం శబ్దం నిష్పతే ద్యేన వానరః[168] ।

సుగ్రీవా! ఏ శబ్దము చేసిన వాలి వెంటనే వచ్చునో అట్టి శబ్దాన్ని చేయుము అంటాడు. ముష్టియుద్ధానికి బయలుదేరువాడు పిడికిలి బిగించి, పైకెత్తి పట్టుకొని, ముందుకు నడుస్తారు. ఆ విషయాన్ని భాస్కరరామాయణకర్త ఈవిధంగా వర్ణించాడు.

అటు పొడుగాంటి గాఢముగ నర్కజుఁజూచుచు, భూరిముష్టి యు
ద్భటగతి నెత్తికొంచరిగి, పైఁబఱతేరఁగ భాను సూనుఁడుం
బటుబలశాలి వాలిఁగని బంధుర ముష్టి ప్రచండభంగి ముం
దటఁగనుపట్ట నెత్తికొని తద్దయు బల్విడి జేరె, నేపునన్ [169]

వాలి సుగ్రీవుడ్ని తన పెద్దదైన ముష్టిని పైకెత్తి పట్టుకొనుచు సుగ్రీవునకెదురుగా వెళ్లాడు. సుగ్రీవుడు కూడా వాలిని చూచి తన భయంకరమైన పిడికిలి బిగించి పైకెత్తి పట్టుకొంటు వాలికెదురు వెళ్లాడు. వాలి సుగ్రీవుల ముష్టియుద్ధము భయంకరముగా సాగినది. వారు తమ శరీరభాగాలపై యథాశక్తిగా పిడికిలి పోట్లతో ప్రహరించుకొనినారు. పిడికిలి బిగించునపుడు వ్రేళ్లను గట్టిగా జేర్చి పట్టుకొనుటయుగలదు.[170]

ముష్టియుద్ధమున కాలిత్రొక్కుళ్లతో నేలను దద్దరిల్లజేయుటయు, పెడబొబ్బలు పెట్టుటయు జరుగును. ఆ విషయాన్ని భాస్కర రామాయణకర్త ఈవిధంగా వర్ణించాడు.

"నింగియు నేలయుం బగుల నిష్ఠుర భంగి జెలంగి యార్చుచుం
బొంగి పదోగ్రఘట్టనల భూమి చలింపఁగ ఁబాఱుతెంచుచున్
జంగమ భూరిశైలముల చాడ్పున ఁజేరుచు ఘోరమత్త మా
తంగ యుగక్రమంబుల మదంబున నొండురు వీఁకఁదాఁకుచున్[171]

వాలి సుగ్రీవులు నింగినేల పగులునట్లుగ పెడబొబ్బలు పెట్టినారు. కాలి త్రొక్కుళ్ళతో భూమి చలించినది. వారిరువురును ప్రాణమున్న కొండలవలె, భయంకరమైన మదపు టేనుగులవలె పోరాటము చేసినారు. భుజస్ఫాలనము చేయుట,

మల్లయుద్ధమందును, ముష్టియుద్ధమందును కనబడును. వాలి సుగ్రీవుల భుజాస్ఫాలన ధ్వనికి "ఖగంబులు, మృగంబులు కంచుమించై పారి' పోయినట్లు రామాభ్యుదయకర్త వర్ణించినాడు.

(ii) హనుమ ద్రావణుల ముష్టియుద్ధము :

రావణుడు వానర సైన్యంపై విజృంభించి యుద్ధం చేయడాన్ని చూచి హనుమంతుడు వానినెదిరించినాడు. రావణునకు కోపం కల్గేటట్లు తన్ను గూర్చి చెప్పుకొనెను. ఆ సందర్భంలో వారి నడుమ జరిగిన ముష్టియుద్ధాన్ని రంగనాథరామాయణకర్త మనోహరంగా వర్ణించాడు. రావణుడు ముందుగా హనుమంతుని వక్షాన్ని పిడికిలితో పొడిచాడు. హనుమంతుడు బాధపడియు లెక్కజేయక పిడికిట రావణుని బెట్టుగా పొడిచినాడు. ఆ దెబ్బకు రావణుడు పెనుగాలికి కదలు చెట్టువలె కంపించి మూర్ఛిల్లినాడు.

ఆ సందర్భంలో రంగనాథ రామాయణకర్త ఈవిధంగా వర్ణించాడు.

దనుజాధిపతియునంతనె మూర్ఛదెలిసి హనుమంతు జూచి
యిట్లను, నీబలంబు గడుమెచ్చవచ్చు నీఘనముష్టి హతిని,
గడకతో ప్రేతలోకము జూచివచ్చె, దేవారి యనుడు
నద్ధీరాత్ముడనియె రావణ! వినుమీవు ప్రాణంబుతోడ
నున్నవాడవిదేల యురక నాలావు సన్నుతించెద
లజ్జ జనియింప నాకు.............
ననిపల్కి నీవునన్నటు పిడికిటను గొను మొనపోటన్న
గొనుమని యతడు"[172]

రావణుడు హనుమంతుని పిడికిటి పోటును మెచ్చుకొనినాడు. తానుప్రేతలోకము చూచివచ్చినట్లు చెప్పుకొనినాడు. అది విని హనుమంతుడు రావణునితో

"నీవు ప్రాణములతోనున్నావుగావున నన్ను మెచ్చుకొనుట తగదు. నా బలము నాకే సిగ్గును గల్గించుచున్నది. యని పలుకును. దీనిని బట్టి హనుమంతుని ముష్టిఘాతము లెంత బలవత్తరములైనవో తెలియగలదు.

కిష్కింధకాండలో వాలి, మయావి, యను రాక్షసునితో ముష్టియుద్ధాన్ని చేశాడు. ఈ యుద్ధమందు ఆయుధ ప్రసక్తిలేదు. కేవలం పిడికిటిపోట్లు, అఱచేతి చరపులు మాత్రమే గలవు. అట్లే కుంభకర్ణుడు అంగదుని ఎదిరించిన సందర్భంలో తన ముష్టితో

ఆతనిని తెలివి తప్పించినాడు. ఆ విషయాన్ని మూలరామాయణం ఈ విధంగా చెప్తుంది.

'స లబ్ధ సంజ్ఞో బలవాన్ ముష్టి మావర్త్య రాక్షసః"।

బలవంతుడైన ఆ రాక్షసుడు తెలివిని పొందినవాడై పిడికిలి త్రిప్పిపెడచేతితో కొట్టగా అంగదుడు తెలివితప్పి నేలపై బడెను. వానర రాక్షసవీరులు అనేకఘట్టాల్లో చాలామంది ముష్టిప్రహారాలతో బాధించుకోవడం గలదు.

*6-8.17* కూట యుద్ధము :

యుద్ధమున విజయం కోసం యుక్తులు ప్రయోగించుట, కపట నీతిననుసరించుట జరుగుచునేయుండును. రాజనీతియందు కూట యుద్ధం అనుసరింపదగిందే. ఆంధ్రకామందకకర్త కూటయుద్ధం ధర్మబద్ధమేనని భారతయుద్ధంలో జరిగిన సంఘటనను ఉదాహరణగా తెల్పుతూ ఈ విధంగా పేర్కొన్నాడు.

"ఒక్కట కూట యుద్ధమున నుక్కఱ శత్రువధించినన్ జయం
బెక్కుడు గల్గి పాపమొక యించుక పొందదు నిశ్చయంబు, పే
రుక్కన ద్రోణ సూనుడుఅకొక్కయెడ న్నడు రేయి నిద్రమై
జొక్కిన పాండునందనుల జూచి వధింపడె సౌప్తిక క్రియన్[173]

ఒక్కొక్కప్పుడు రాజు కూట యుద్ధాన్ననుసరించి విజయాన్ని సాధింపవచ్చని, ఆవిధంగా చేసినప్పటికి పాపాన్ని పొందదని, ద్రోణపుత్రుడైన అశ్వత్థామ నిద్రిస్తున్న ఉపపాండవులను సంహరించినాడు గదా యని పై పద్యంలో చెప్పబడింది.

సామదాన భేద దండములు కాక మాయ, ఉపేక్ష ఇంద్రజాలప్రకారములు రణనీతిగానే చెప్పబడినవి. యుద్ధంలో మాయననుసరించుటయు నీతియేయని ఆంధ్రకామందక మిట్లు తెల్పింది.

"ఘనముగా మాయచే గట్టులు చీకట్లుపెను మనలగ్ని కల్పించుటయును
దవ్వున నున్నత ధ్వజములు గలిగిన సేనలగన్పడ జేయుటయును
దునుకులు మొండెముల్ దుండంబులై బడి సారగిన మూకల జూపుటయును
నడరి సముద్రంబులటు మంచుకైవడి పెల్లుగా వెల్లి గల్పించుటయును
ననగ ఇంద్రజాలంబులద్భుతముగ వైరి రాజులు భయమంద వలసి నేర్పు
దనర నొనరించవలయునుదార లీల నీతిమార్గం బెఱింగిన నృపవరుండు.[174]

యుద్ధరంగంలో చీకట్లు కల్పించుట, నిప్పులు కురిపించుట మొదలైనవి నీతిమార్గము నెఱిగిన రాజనుసరింప దగినవేయని పై పద్యంలో చెప్పబడ్డవి.

రాజు ధర్మ యుద్ధంచేయడానికి పరిస్థితులు విరుద్ధంగా ఉంటే కూటయుద్ధం చేయాలి. వివిధ కూట యుద్ధపద్ధతుల్ని గూర్చి కౌటిల్యుడు కూడా వివరించాడు.[175]ఇట్టి కపటనీతి రామాయణంలోని యుద్ధ ఘట్టాల్లో చాల చోట్ల కనబడుతుంది.ముఖ్యంగా ఈ కూటయుద్ధ పద్ధతి రాక్షసులయందే కనబడుతుంది. కాబట్టి గరుడుడు రామలక్ష్మణులను నాగపాశాలనుండి విముక్తులను చేసిన తర్వాత ఆతడు వారితో పల్కినమాటలను వాల్మీకం ఈ విధంగా తెల్పింది.

"ప్రకృత్యా రాక్షసా స్సర్వే సంగ్రామే కూటయోధినః"

రాక్షసులు స్వభావ సిద్ధంగా మాయాయుద్ధాన్ని చేయువారని దాని భావము. అంతేగాక ఆ సందర్భంలో గరుడుడు పరిశుద్ధమగు మనస్సుగల వారికి, పరాక్రమవంతులకు ఋజుస్వభావమే బలమని తెల్పుచూ పరోక్షంగా ఋజుస్వభావంగలవారి ముందు మాయలు పనిచేయవనియు, రామలక్ష్మణులతో పల్కను.

### *6-8-17.1 రామాయణమునందలి కూటయుద్ధాలు - ప్రయత్నాలు :*

(i) బాలకాండలో తాటక రామునితో మాయాయుద్ధమే చేసింది. పెద్దయెత్తున ధూళినెగజిమ్మి తన మాయతో అదృశ్యురాలై రామలక్ష్మణులపైన రాళ్ల వర్షం కురిపించినది. రాముడు తన బాణాలతో శిలావర్షాన్నడ్డగించి దాని చేతులు నఱికినాడు. భాస్కర రామాయణకర్త రాముడు మాయాస్త్రమును ప్రయోగించి దాన్ని నివారించినట్లు వర్ణించినాడు.[176]

(ii) అయోధ్యకాండలో కైక దశరథునకు యుద్ధంలో సహాయం చేసి వరాలను పొందడాన్ని గురించి రంగనాథరామాయణకర్త విపులంగా వర్ణించారు. ఈ వృత్తాంతం మూలరామాయణంలో లేదు. శంబరునితో యుద్ధం చేస్తున్న ఇంద్రునకు సహాయం చేయడానికి వెళ్లిన దశరథునకు కైక సహాయురాలుగా వెళ్లింది. ఆమెకు ధవళాంగుడనే ముని మాయనెదిరించే విధానాన్ని నేర్పినాడు. కాబట్టే కైక శంబరుని మాయ నణచి భర్తను రక్షించుకొన్నది. ఆ వృత్తాంతాన్ని రంగనాథ రామాయణకర్త ఈవిధంగా వర్ణించాడు.

"పడతుక తొల్లి శంబరుడనింద్రుండు. దొడరిపోరాడి నింద్రునకునై ప్రీతి
నినుదోడు కొని సైన్యనివహంబుదాను - జనిరాత్రిమార్కొన్న శంబరుతోడ
బోరాడ దశరథ భూపాలుమీద - నా రాక్షసుడు మాయలలుక బన్నుటయు
ధవళాంగుడనుముని దయ నీవు గన్న - నవిరళంబగు మాయ నా మాయలడచి
నీవిభు నాదైత్యు నిశితాస్త్రనిహతి - చావకుండగ గాచి సంప్రీతుఁజేసి
వసుధేశుచే రెండు వరములు నాడు - మసలక పడసితి మఱచితె వాని"[177]

ఈ వృత్తాంత విషయాన్ని మంధర కైకతో అన్నది. దీన్నిబట్టి మాయాయుద్ధాన్ని ఎదుర్కొనే విద్యలు కూడా రామాయణకాలంలో ఉన్నట్లు తెలుస్తున్నది. యుద్ధకాండలో యుద్ధవిజయానికై మాయను ప్రయోగించటాన్ని గూర్చిన అనేక ఘట్టాలున్నాయి.

(iii) రావణుడు మంత్రాంగాన్ని పూర్తి చేసుకొని రాముడ్ని యుద్ధంలో గెల్వడం కష్టమని భావించి మాయావియైన విద్యుజ్జిహ్వుని పిలిచి సీతను మాయ పుచ్చుటకై తనవెంట తీసుకొనివెళ్లినాడు. ముందుగా తాను సీతవద్దకు వెళ్లి రాముడు ప్రహస్తుని చేతిలో మరణించినాడని పల్కి విద్యుజ్జిహ్వుని పిలిపించి ఆతడు మాయాబలంతో నిర్మించిన రాముని శిరస్సును, ధనుస్సును చూపించును. ఆవిధంగా సీతను లొంగదీసుకోవాలని, రాముని బారినుండి తప్పించుకోవాలని ఆతడు ఆలోచించాడు. ఇక్కడ యుద్ధం లేకపోయినా, యుద్ధజయాన్ని గూర్చి పన్నిన మాయగా దీన్ని చెప్పవచ్చు. రావణుడు వెడలి పోవుటతో ఆ మాయాశిరము, ధనువు అదృశ్యములైనవి.

(iv) అట్లే ఇంద్రజిత్తు రామలక్ష్మణులను నాగబంధాలతో బంధించిన తర్వాత రావణుడు పుష్పక విమానం పై సీతను కూర్చుండబెట్టి ఆదృశ్యములు చూపింప జేయును. రామలక్ష్మణులు మరణించిరని తెలిసినచో సీత తనకు లొంగిపోతుందని తద్వారా యుద్ధ విజయాన్ని సాధింపవచ్చని ఆతడు తలచినాడు.

(v) ప్రహస్తాది రాక్షస వీరులు మరణించిన తర్వాత కుంభకర్ణుడు యుద్ధానికి బయలుదేరడానికి సిద్ధపడ్డప్పుడు మహోదరుడనేవాడు తన బలం తఱిగిపోవుచు శత్రు బలం వృద్ధి చెందుచున్నప్పుడు బలాన్ని చూపడం నీతికాదని, కపట నీతియే అనుసరింపదగినదని పల్కును. అతడు రావణునకొక ఉపాయమును బోధించును. మేము మా శరీరములకు రామనామాంకితములైన బాణములతో గాయము చేసుకొని రక్తసిక్త గాత్రులమై వచ్చెదము. మేము రామలక్ష్మణులను భక్షించితిమని పల్కుచు నీ పాదములు పట్టుకొందుము. నీవు మాకు అనేక బహుమానములనిచ్చి ఒకరాక్షసుని

ఏనుగు పై నెక్కించి రామలక్ష్మణులు యుద్ధమున హతులైనారని చాటింపుడు. నీవును విజయమును పొందినట్లు నటించుచు దాసదాసీ జనములకు బహుమానములనిమ్ము. ఈ వార్త సీతకు చేరిన తరువాత నీవు ఆమె వద్దకు పోయి ఓదార్చి ఆమెకు ధనధాన్యాదులనిచ్చి లోభపెట్టుము.

"నైరాశ్యాత్ స్త్రీలఘుత్వా చ్చ త్వద్వశం ప్రతిపత్స్యతే"[178]।

నైరాశ్యము వలన గాని లేక లఘుత్వముచే గాని సీత నీకు స్వాధీనమగును. ఆ విషయము తెలిసిన రాముడు యుద్ధాన్ని విరమించును. దీనివలన యుద్ధవిజయము, సీత రెండును లభింపగలవు' అని పల్కును. కుంభకర్ణుడు రాక్షసుడై యుండియు యీ కపటోపాయమును నిరాకరించుట విశేషం.

(vi) వజ్రదంష్ట్రుడను రాక్షసుడు పరాకుపడక ఉపాయములను ప్రయోగించువాడే శత్రువులను జయింపగలడని రావణునకొక కపటోపాయమును దెల్పెను. కామరూప ధరులైన రాక్షసులు కొన్ని వేలమంది మనుష్యుల ఆకారములు ధరించినవారై రాముని వద్దకు పోయి ఎంతమాత్రము తొట్రుపాటు చెందక రామునితో ' నీ తమ్ముడు భరతుడు పంపగా వచ్చినామని చెప్పవలెను. అప్పుడు రాముడు వానరసేనను విడిచి ఈ సేనతో మనపైకి రాగలడు. అంత మనము మన ఆయుధములతో వానరసేనయున్న చోటికి పోయి వారిని సంహరించెదము. ఆ తరువాత రామలక్ష్మణులు మన చేతిలో ప్రాణాలు విడిచెదరు" అని తెల్పెను.[179]

(vii) ఎక్కువగా ఇంద్రజిత్తు ఇట్టి కపటోపాయముతోనే యుద్ధం చేయడం కనబడుతుంది. రామలక్ష్మణులను నాగపాశబద్ధులనుచేసే సందర్భంలో నాతడు అదృశ్యుడై రామలక్ష్మణులపై బాణాలు ప్రయోగించాడు. నాగాస్త్రబంధాలతో వారిని బంధించాడు. ఇంద్రజిత్తు ఉనికిని గూర్చి తెలుసుకోవడానికై నీలుడు, అంగదుడు, వినతుడు, శరభుడు, ఋషభుడు మొదలగు వారిని రాముడాజ్ఞాపించగా వారు ఆకాశమున ప్రవేశించినను ప్రయోజనము లేకపోయినది. రామలక్ష్మణుల శరీరములు పూర్తిగా బాణాలతో నిండియుండుటను జూచి సుగ్రీవుడు భీతిచెందినాడు. అప్పుడు విభీషణుడాతనికి ధైర్యాన్ని చెప్పి

'తత స్సలిల మాదాయ విద్యయా పరిజప్య చ ।
సుగ్రీవనేత్రే ధర్మాత్మా ప్రమమార్జ విభీషణః'[180]॥

తరువాత నీటిని తీసుకొని మంత్రములతో జపించి సుగ్రీవుని నేత్రాలను తుడిచినాడు. అప్పుడు సుగ్రీవుడు ఇంద్రజిత్తును చూడగల్గినాడు. మాయను నివారించుటకు మరల మాయయే ప్రయోగించుటయు నిందు కనబడును.

(viii) ఇంద్రజిత్తు రామలక్ష్మణులను చంపలేకపోవుటను విచారించిన రావణుడు 'పలుమాటుచెప్పనేల? నిను పంపుట ఊరకవచ్చుచుంటకే'[181] 'త్రుంపుము పొమ్ము జయించిరమ్మొగిన్' అని ఆజ్ఞాపించి పంపినాడు.

అంత ఇంద్రజిత్తు యుద్ధానికి బయలుదేరుటను భాస్కరరామాయణకర్త ఇట్లా తెల్పినాడు.

'అనినన్ రావణి తండ్రి పీడుకొని మున్ను కుంభకర్ణాది, వీ
ర నికాయంబులు గూలెనింక ననిలో రాముం దదీయానుజున్
ఘనబాహాయుగ శక్తి గెల్వగ నశక్యంబంచు మాయాబలం
బున నోడింపగ నుత్సహించి కదలెన్ భూరి ప్రతాపంబునన్[182]

నికుంభిల యాగాన్ని నిర్విఘ్నంగా నెఱవేర్చుకొనుటకై మాయాసీతను కల్పించి, రథమునందుంచుకొని యుద్ధరంగానికి వెడలినాడు. హనుమంతుడు చూస్తుండగానే మాయసీత శిరస్సును ఖండించినాడు. ఇంద్రజిత్తు ఆలోచనకు తగినట్లుగానే హనుమంతుడు దుఃఖితుడై వానరవీరులతో రాముని వద్దకు తిరిగివెళ్లాడు. ఇంద్రజిత్తు యుద్ధవిజయాన్ని కోరి నికుంభిలా యాగం చేయడానికి వెళ్లాడు. ఇచట మాయాసీతను కల్పించడం ద్వారా ఇంద్రజిత్తు రెండు ప్రయోజనములను సాధించినాడు. మొదటిది రాముని, మరియు వానర సేనను నిర్వీర్యులను జేయుట,. రాముడు, సీత మరణించిన దుఃఖంలో యుద్ధకార్యం నుండి విముఖుడై కలత చెందిన వాడగుచుండగా ఆతన్ని సులభంగా జయింపవచ్చును. రెండవది అజేయమగు శక్తిని ప్రసాదింపగల నికుంభిలా యాగమును నిర్విఘ్నంగా నెఱవేర్చుకొని, తద్వారా రామలక్ష్మణులను సులభంగా జయింపవచ్చును. ఆతని ప్రయత్నము తాత్కాలికంగా ప్రయోజనాన్ని పొందినదైనను పూర్తి ఫలితమునీయలేదు.

(ix) రావణుడు కపటనీతిలో అందెవేసిన చేయి. హనుమంతుడే లక్ష్మణుని పునర్జీవితుని చేయుటకై రెండవమారు ద్రోణాద్రికి సంజీవకరణిని తెచ్చుటకై వెడలినపుడు ఆతనికి విఘ్నము గల్గించుటకై కాలనేమియను రాక్షసుని రావణుడు నియోగించినాడు. కాలనేమి కపట మునిగా హనుమంతుడు వచ్చుమార్గముననుండి

ఆతనిని చంపదలచి అచ్చట ఒక మహా మకరిగల సరోవరంలో నీరు త్రాగటానికి దిగునట్లుగా చేసినాడు. ఆ ప్రయత్నం విఫలం కావడంతో పక్షిరూపం, సింహరూపం ధరించి హనుమంతుని ఎదిరించినాడు. పిమ్మట సుగ్రీవుని రూపమునవచ్చి లక్ష్మణుడు మూర్ఛతేఱినాడని ఓషధులక్కఱ లేదని పల్కను. హనుమంతుడాతని మాయా జాలమునకు చిక్కక ఆతనిశిరమును ఖండించి ఓషధి పర్వతమును తీసుకొని బయలుదేరినాడు. మార్గమధ్యమున హనుమంతుని రావణప్రేరితుడైన మాల్యవంతుడు ఎదిరించి ఆతని చేతిలో మరణించినాడు.

***6-8.18 ఆకాశయుద్ధము :***

మహాభారత యుద్ధంలో కంటే రామాయణంలో కనిపించే ప్రత్యేక యుద్ధము 'ఆకాశయుద్ధం'. వానర రాక్షసులలో పెక్కుమంది ఆకాశయుద్ధంలో ప్రవీణులైనవారే. ఆకాలంలో రావణుడు, ఇంద్రజిత్తు, అక్షకుమారుడు వంటి మహావీరులకు గల దివ్యరథములు ఆకాశమునందును ప్రయాణము చేయగలవి. రావణుడు సీతనపహరించుకొని తీసుకొని వచ్చునపుడు ఆకాశమార్గమున ప్రయాణించు దివ్యరథం పైననే ఆమెను తెచ్చినాడు. పుష్పకవిమానం ప్రత్యేకంగా ఆకాశయానానికి ఉపకరించునట్టిది.

భరద్వాజమహర్షి వేదములను మథించి యంత్రసర్వస్వమును సాధించినాడు. అందలి నలుబదియవ ప్రకరణంలో 'విమానప్రకరణాన్ని' తెల్పినాడు.

'పృథివ్యస్వ్యంతరిక్షేషు । ఖగవ ద్వేగత స్స్వయం।
య స్సమర్థో భవే ద్గన్తుం । స విమాన ఇతి స్మృతః ॥

భూమి, ఆకాశము జలములందు పక్షివలె వేగముగా సంచరించు శక్తిగల దానిని విమానమనెడివారు. అట్టి విమాన రథాదులు లేకుండగనే వానర రాక్షసవీరులు ఆకాశమున నిలిచి యుద్ధమొనరించినారు. అందులకు రామాయణమున అనేక ఉదాహరణలు గలవు.

(i)హనుమంతుడు చేసిన ఆకాశయుద్ధం :

సుందరకాండలో అశోకవనాన్ని నాశనం చేసిన తరువాత హనుమంతుడు ఆకాశముననుండియే ఎక్కువభాగం యుద్ధాన్ని చేశాడు. మంత్రిపుత్రులు హనుమంతుని బాణవర్షంతో కప్పివేయగా ఆతడు చేసిన ఆకాశయుద్ధాన్ని వాల్మీకి ఇట్లు వర్ణించాడు.

"స తైః క్రీడ న్ధనుష్మద్భిః వ్యోమ్ని వీరః ప్రకాశతే।
ధనుష్మద్భి ర్యథా మేఘై ర్మారుతః ప్రభు రమ్బరే"॥[183]

ఇంద్రధనుస్సులతో కూడిన మేఘాలతో వాయుదేవుడు ఆకాశమునందు ఆడుకొనుచున్నట్లు హనుమంతుడు ధనుర్ధారులైన మంత్రిపుత్రులతో ఆకాశమునందు క్రీడించెను. అట్లే అక్షకుమారుని రథము ఆకాశమునందును సంచరింపగలదు[184] అక్షకుమారుడు ప్రయోగించిన బాణాలను తప్పించుకొంటూ హనుమంతుడు ఆకాశమున సంచరించినాడు. హనుమంతుడు అక్షుని రథాన్ని, రథాశ్వాలను విఱుగునట్లు చేయగా అతడు ఖడ్గాన్ని ధరించి ఆకాశానికెగిరినాడు. దానిని వాల్మీకి ఇట్లు వర్ణించాడు.

'స తం పరిష్వజ్య మహారథో రథం సకార్ముకః ఖడ్గధరః ఖ ముత్పతన్।
తతోఽభి యోగా దృషిరుగ్రవీర్యవాన్ విహాయ దేహం మరుతా మివాలయమ్[185]॥

తన తపః ప్రభావం చేత ఆకాశమునందు సంచరిస్తున్న అక్షకుమారుని వద్దకు మెల్లగా వెళ్లి ఆతనిపాదములను బట్టి అనేక పర్యాయములు విసురుగా త్రిప్పి, త్రిప్పినేలమీద వేసి కొట్టి చంపినాడు.

(ii) *జటాయు రావణుల ఆకాశయుద్ధం:*

జటాయు రావణుల మధ్య జరిగిన ఆకాశయుద్ధాన్ని వాల్మీకి విపులంగా వర్ణించినాడు. రావణుని రథము ఆకాశగమనము గలది. రావణుడు తన రథముపై సీతను తీసుకొని వెళ్లు చుండగా జటాయువు అడ్డుపడినాడు. అతని రథమును నేలగూల్చినాడు. రథము విఱిగిన తరువాత కూడా రావణుడు ముహూర్తకాలము యుద్ధము చేసి తన ఖడ్గముతో దానిఱెక్కలు నఱికినాడు.[186]

(iii) *శతబలి - శతమాయుల ఆకాశయుద్ధం:*

శతమాయుడు గరుత్మంతుని వలె ఒక పెద్ద పరిఘను, పటుఖడ్గమును తీసుకొని చటుల వేగముతో పైకెగిరినాడు. శతబలియు నొక కత్తిని, శక బ్రద్దపటీయను తీసుకొని ఆకాశమున కెగిరినాడు. బ్రద్ధపటీయ అనగా పేముతో తయారైన డాలు. వారి ఆకాశయుద్ధమును రంగనాధరామాయణకర్త ఈవిధంగా వర్ణించినాడు.

'పటుఖడ్గమును పెద్ద పరిఘను గొనుచు - చటులవేగంబున శతమాయు డెగయ
సరభసంబున వాలు పడియున్న బ్రద్ద - పటీయనుగొని శతబలియుతో నెగసె
ప్రేయుచు తిరుగుచు వెసదప్పుకొనుచు - పాయుచు డాయుచు పాటవంబొప్ప

గెరలుచు తెరలుచు గ్రిందుమీదగుచు - పొరిపొరినాకసంబున పోరు తటిని
శతమాయుడడిదంబు జళిపించి పూన్చి - శతబలి విపులవక్షం బేయుటయును
సరభసుడై యప్డు శతబలిబ్రద్ద - పటిదప్పకొడ్డి కృపాటోగ్రధార
చలమునదెగవ్రేసె శతమాయుతొడలు - తలక్రిందుగావాడు ధరమీదబడగ''[187]

శతబలి శతమాయుల యుద్ధం పూర్తిగా ఆకాశంలోనే జరిగింది. ఇరువురు ఖడ్గయుద్ధాన్నివివిధ పద్ధతులలో చేసినారు. శతబలి పదునైన ఖడ్గముతో శతమాయుని తొడలను తెగవ్రేయగా వాడు ఆకసమునుండి తలక్రిందులుగా నేలపైబడినాడు.

ఇంద్రజిత్తు రథముతో సహా నదృశ్యుడై ఆకాశమున నుండి యుద్ధమును చేసినాడు. వానరులలో హనుమంతుని వంటి మహావీరులు ఆకాశమున నిలిచి యుద్ధము చేసినారు.

*6-8.19 రాత్రి యుద్ధము:*

సాధారణంగా యుద్ధం సూర్యుడస్తమించగానే విరమించబడుచుండును. యుద్ధ విరామసూచకంగా నగారాలుమ్రోగించుట వంటివి జరుగుచుండును. చీకటి వలన సందిగ్ధత ఏర్పడును. అందువలన యోధులు తమవారిని తామే చంపుకొనుటయు జరుగును. కావుననే రాత్రి యుద్ధము నిషిద్ధమైనది. మహాభారతం కూడా రాత్రి యుద్ధాన్ని నిషేధించింది. కానీ ద్రోణుని నాయకత్వంలోని నాలవనాటి రాత్రి దీపాల వెలుగులో యుద్ధం జరిగింది. రథానికి ఐదు, ఏనుగునకు మూడు, గుఱ్ఱానికి ఒకటి వంతున కరదీపికలను కౌరవులు ఏర్పాటు చేసుకొనినారు.[188]

వానర రాక్షసవీరులకు మధ్య రెండుమార్లు రాత్రియుద్ధం జరిగింది. రామరావణయుద్ధం ఏడు అహోరాత్రులు జరిగినట్లు తెలుగు రామాయణాలు వర్ణించినవి.

(i) ప్రథమ యుద్ధము:

మొదటి దినమున వానర రాక్షసులకు జరిగిన యుద్ధం సూర్యాస్తమయానంత రమును సాగినది. ఆ విషయాన్ని వాల్మీకి ఇట్లు తెల్పినాడు.

'అన్యోన్యం బద్ధవైరాణాం ఘోరాణాం జయ మిచ్ఛతామ్।
సంప్రవృత్తం నిశాయుద్ధం తదా వానరరక్షసామ్[189]॥

పరస్పరము జయము కోరుచున్న ఆ భయంకరులగు వానర రాక్షసుల నడుమ రాత్రి యుద్ధము జరిగినది. ఆ అంధకారమున వానరులు రాక్షసులు ఒకరినొకరు గుర్తింపలేనివారై తమ పక్షము వారిచే చంపుకొనుట జరిగినది. అంధకారమున జరిగిన భయంకరయుద్ధమును రంగనాథరామాయణకర్త ఈవిధంగా వర్ణించాడు.

ప్రొద్దుగ్రుంకినన్నైన పోవక చలము - పెద్దయై కపులును చేరి రాక్షసులు
నతి నిబిడంబైన యంధకారమున - నతిభయంకరమైన యని సేయునపుడు
పొడుపొడుడన్మాట పోకుడన్మాట - తొలగక తలద్రుంచు త్రుంచుడన్మాట
ఇందురాలేదేడి యేడియన్మాట - యిందురానిమ్ము రానిమ్మను మాట
అటమీద హుంకృతుల్ హాసముల్ చెలగ - నిటు చెల్లు మాటలు యెక్కువలెత్తిగి
పోరుచోఁగెందూళి బోరున నెగయ - పేర్చి యాచీకటి పెద్దయౌటయును
భ్రమయుట జేసి యేర్పఱుపంగరాక - తమ తమ వారల తామె చంపుదురు.[190]

ఆ సమయంలో రాముడు అగ్ని జ్వాలలవంటి బాణాలను ప్రయోగించి దిక్కులను విదిక్కులను కాంతివంతములను జేసినాడు.[191] ఆ చీకటియందు కూడా రాముడు బంగారు పింజలుగల వేలాది బాణాలను ప్రయోగించగా ఆ రాత్రి మిడుగురులచే శరత్కాలపు రాత్రివలె ప్రకాశించినది. ఆ రాత్రియుద్ధముననే ఇంద్రజిత్తు రామలక్ష్మణులను నాగపాశబద్ధులను చేసినాడు.

(ii) రెండవ రాత్రియుద్ధము:

హనుమంతుడు ఓషధిపర్వతాన్ని తెచ్చిన పిమ్మట రామలక్ష్మణులు గాయములు తొలగిన వారైనారు. మరణించిన వానర వీరులు నిద్రమేలుకొనినట్లుగా పునర్జీవితులై లేచినారు. అప్పుడు యుద్ధనీతి విశారదుడగు సుగ్రీవుడు రాముని జూచి 'కుంభకర్ణుడాదిగాగల వీరులు మరణించినారు. కావున లంకనాక్రమించుట తగునని పల్కుటను భాస్కర రామాయణకర్త ఇట్లు తెల్పినాడు.

'కాననేటి రాత్రి కాకుత్స్థకులవీర
కపులనెల్ల లంక గాల్ప బనుపు
మనిన వానరేంద్రుడట్ల నియోగించె
సకల వృక్ష చరుల సమ్మదమున[192]

'అంత నిశాచరేంద్రు పురమంతయు గాల్ప ప్లవంగవీరు ల
త్యంత కుతూహలంబున దినాంతము గోరగ నంతరిక్ష గో
ళాంతరవీధి శోభిలుచు నంబుజబంధుడు వారుణాంబుధి
ప్రాంతము సేరె జక్కవలు పశ్చిమ భాగము సూడనోడగన్[193]

బలవంతులైన వానరశ్రేష్ఠులు కొఱువులు చేతబట్టి ప్రాకారములనెగబ్రాకిరి. అన్నివైపులనుండి తఱుమగా నగరద్వారములచెంత కావలియున్న రాక్షసులు పరుగెత్తిరి. అంతట వానరులు లంకలోనికి ప్రవేశించి వేలాది రాక్షసగృహాల్ని తగులబెట్టిరి. అశ్వశాలలు, గజశాలలు, ధనాగారములు, రాజభవనములు అన్నియు తగులబడినవి. ముహూర్తకాలంలో ఆ మహాపురి ప్రళయకాలమున మండు భూమి వలెనైనది. స్త్రీల ఆర్తనాదములు పదియోజనములవఱకు వినబడినవి. ఆ రాత్రి సమయముననే రాముడు తన ధనుర్విద్యా నైపుణ్యముతో లంకానగర ద్వారాన్ని నేలగూల్చినాడు. వానర వీరులు కొఱువులు చేతబట్టి ద్వారము వద్దకు వచ్చి నిల్చుటను చూచి రావణుడు కోపించినాడు. రావణుడు కుంభకర్ణుని పుత్రులను యుద్ధమునకు పంపినాడు. ఆ రాత్రిని వాల్మీకి ఇట్లు వర్ణించినాడు.

'తత్ర తారాధిపస్యాభా తారాణాం చ తథైవ చ।
తయో రాభరణాభా చ లితాద్యా మభాసయత్[194]॥

అప్పుడుదయించిన చంద్రుని కాంతి, నక్షత్రములకాంతి, ఉభయసైన్యములు దాల్చిన ఆభరణముల కాంతులును, ఆకాశమును ప్రకాశింపజేసినవి.

రామరావణులు సప్త అహోరాత్రములు యుద్ధము చేయుటను భాస్కర రామాయణకర్త ఈవిధంగా వర్ణించాడు.

"ఒక్క నిమిషార్థంబునుడుగక, నిద్రాది వ్యవహారంబులనొందక క్రమ
క్రమ ప్రవర్ధమాన భుజలాఘవులై సప్తాహోరాత్రంబులు సమరంబుసలిపిరి"[195]

వాల్మీకి ఈ విషయమును మరొకవిధంగా ఇట్లు వర్ణించినాడు.

'నైవ రాత్రం న దివసం న ముహూర్తం న చ క్షణమ్
రామరావణయో ర్యుద్ధం విరామ ముపగచ్ఛతి"[196]

రాత్రిగాని, పగలుగాని ఒక ముహూర్తకాలముగాని ఒక్కక్షణకాలముగాని, రామరావణుల యుద్ధమునకు విరామముగలుగలేదు.

*6-8.20* ఇతర యుద్ధములు:

వానరులు,రాక్షసులు ఆయుధములతోను, ఆయుధాలులేకుండగను చేసిన విశేషమైన యుద్ధములనేకములు గలవు. మచ్చునకుకొన్ని.

*1.* హనుమంతుడు పరిఘతో చేసిన యుద్ధము :

వానర రాక్షస వీరులకు సంబంధించిన ప్రథమయుద్ధం సుందరకాండలోనే ప్రారంభమౌతుంది. హనుమంతుడు రావణునిచే పంపబడిన ఎనుబదివేల కింకరులతో చేసిన యుద్ధమే మొదటిది. ఈ యుద్ధాన్ని హనుమంతుడు రామలక్ష్మణులకు, సుగ్రీవునకును జయము పల్కి ప్రారంభించినాడు.[197] ఈ యుద్ధమున రాక్షస వీరులందఱు ముద్గర, పట్టిస, శూల, తోమరాది ఆయుధాలు ధరింపగా హనుమంతుడు ఆ ఉద్యానవనపు ముఖద్వారమునకు గల భయంకరమైన ఇనుపగడియను తీసుకొనినాడు. తన శరీరమును చాల పెద్దదిగజేసి లంకాపట్టణము మారుమ్రోగునట్లు జబ్బలు చఱచినాడు. యుద్ధోత్సాహ సూచకముగా యోధులు జబ్బలు చఱచుట పెక్కుచోట్ల కనబడును. రాక్షస వీరులను చూచి హనుమంతుడు తోకను నేలకుగట్టిగా కొట్టినాడు. యుద్ధమునకు ప్రత్యర్థులను కవ్వించుటకై వానరులు చేయుపనిగా దీనిని భావింపవచ్చును. కింకరుల వధను గూర్చి భాస్కరరామాయణకర్త ఈవిధంగా వర్ణించినాడు

"తోరణ నిక్షిప్తంబైన దుర్భర భారక్రూరాయస పరిఘమును గొని ఘోర నిశాచరబలమును గూలమోదినాడు"[198]

*2.* హనుమ నికుంభుల యుద్ధము :

హనుమంతుడు నికుంభుని నేలకు గొట్టి ఆతని ఱొమ్ముపై కూర్చుండి మెడ త్రిప్పి చేతులతోనే ఆతని శిరమును ద్రుంచినాడు. ఆ విషయాన్ని భాస్కర రామాయణకర్త ఇట్టు తెల్పినాడు.

నెట్టన వాయుసూతి రజనీచరు నుద్ధతి బట్టి నేలతో
బిట్టుగ వ్రేసి యెమ్ములు విభిన్నములై పడ మేను నుగ్గుగా
మెట్టుచు ఱొమ్ముపై నిలిచి మించివడిన్ మెడద్రిప్పి చేతులం
దట్టిశిరంబు ద్రుంచి సముదగ్రత నార్చెననూనతేజుడై[199]

ఇది నేటి 'కరాటే యుద్ధములో వలె చేతిని కత్తిలాగా చేసి కొట్టుటవంటిది.

3. కుంభకర్ణుడు చేసిన భయంకర యుద్ధము:

కుంభకర్ణుడు అసాధారణ శరీరముగలవాడు. ఆతని చేతి శూలాయుధం కూడా అసాధారణమైనదే. ఆశూలము సహస్రభారాయస కల్పితము అనగా వేయి బారువుల ఇనుముతో చేయబడినది. వానరులు విసిరిన చెట్లు, కొండలు, మొదలగువానిని ఆతడు దానితోనే నివారించినాడు. శూలముతో వానరులను గుదులు గ్రుచ్చినాడు. ఆతడుపయోగించిన మరొక ఆయుధము గద. గదతో ఒక్కొక్క దెబ్బకు వందలు, వేలసంఖ్యలో వానరులను నేల గూల్చినాడు. కొందఱు వానరులను కౌగిటిలో చదియజేసినాడు. కొందఱను మ్రింగివేసినాడు.

ఆతని భయంకర యుద్ధమును భాస్కరారామాయణకర్త ఈ విధంగా వర్ణించాడు.

'ఒక్కొక్క వ్రేటునం బుడమి నొక్కట నూఱులు వేలు మొత్తముల్
క్రిక్కిరియం బడల్పడ బోరిన్ గద వ్రేయుచు బాహువీధికిన్
జిక్కిన గౌగిటం జదియజేయుచు మ్రింగుచు విక్రమింపగా
నక్కడ నిక్కడన్ నిలిచి రత్తఱి గుంపులు గట్టి వానరుల్[200]

అతడు పాతాళ సన్నిభమైన తన కంఠబిలమున వానరులను దిగమ్రింగుచున్నపుడు కొందఱు తప్పించుకొని ముక్కురంధ్రములనుండి, చెవి రంధ్రములనుండి బయటకురాగా వారిని కాళ్లతో నేలను త్రొక్కి చంపి యుద్ధభూమిని రక్తమాంసములతో భయంకరమైనదిగా చేసినాడు. ఆతనిని రామలక్ష్మణులు కాళ్లు, చేతులు, కంఠము వేరువేరుగా బాణములతో నఱికి సంహరించినాడు.

రామాయణంలో అసాధారణ దేహులైన విరాధ, కబంధుల్తును అసాధారణ పోరాటాన్నే చేసినారు. అతికాయుడును, కుంభకర్ణుని వంటి పెద్ద శరీరముగల వాడైనప్పటికి ఆతని యుద్ధము కుంభకర్ణునికి వలె అనాగరికమైనదిగాదు.

4. నీల ప్రహస్తుల యుద్ధము:

నీలుడు వానరుల సర్వసైన్యాధిపతి, ప్రహస్తుడు రాక్షసుల సర్వసైన్యాధిపతి. ప్రహస్తుడు తన మంత్రులతో సహా బయలుదేరి రథముపై నెక్కి వానరసేనను తన బాణములతో చీకాకు చేసినాడు. అంతట నీలుడొక పెద్ద తాటిచెట్టును తీసుకొని దానితో ఆతని రథమును నుగ్గుచేసినాడు. అప్పుడు ప్రహస్తుడు ముసలాయుధమును ధరించి నీలునెదిరించుటను భాస్కరరామాయణకర్త ఈవిధంగా వర్ణించినాడు.

"అసమున నట్లు పోరు సమయమున రక్కసుడల్కతో మహా
యస ముసలంబు హేమవలయ ద్యుతులారగ ద్రిప్పి వీకమై

నొసలవి యంగ వ్రేయ గడునొచ్చియు నాతడు వాని గ్రమ్మఱన్
వస మఱి చేతి వృక్షమున వక్షము బల్విడివైచె నార్చుచున్.[201]

ఆ ముసలాయుధము బంగారుకట్లు గలది. కావుననే అది త్రిప్పుచుండగా బంగారు కాంతులు వెదజల్లబడినవి. ప్రహస్తుడు దానితో నీలుని ముఖముపై కొట్టబోగా నాతడు గాయపడియు లెక్కసేయక తనచేతి వృక్షముతోనాతని వక్షమునుకొట్టినాడు. ప్రహస్తుడు ఇనుపరోకలిని రెండు చేతులతో గట్టిగా పట్టుకొని నీలుని కొట్టబోగా అతడు ఒక పర్వతశిఖరముతో ప్రహస్తుని శిరస్సును వ్రక్కలు చేసినాడు.

*5. నరాంతకుని యుద్ధము :*

రావణపుత్రుడైన నరాంతకుడు గుఱ్ఱమునధిరోహించి ప్రాసాయుధముతో పోరాటము చేసెను. ప్రాసము ఈటెవంటిది. ప్రాసము ఏడుమూరల పొడవుననుండు వెదురుకు సంబంధించిన కఱ్ఱ. ఇది లోహపుములికి గలిగి పదునైన అంచులు గలిగియుండును.[202]

ప్రాసస్తు సప్తహస్తస్యాత్ ఔన్నత్యేన తు వైణవః॥
లౌహశీర్షస్తీక్ష్ణ పాదః కౌశేయస్తబకాంచితః॥
ఆకర్షశ్చ వికర్షశ్చ ధూననం వేధనం తథా॥
చతుర్ర ఏతాగతయః ఉక్తాఃప్రాసం సమాశ్రితాః॥

దీన్ని ప్రయోగించుటయందు నాలుగు దశలు గలవు. అవి 1. ఆకర్షము, 2.వికర్షము, 3.ధూననము 4.వేధనము. వేధనమనగా చీల్చుట. గోవింద రాజీయమున దీనికి 'ఈట్టి' యను ద్రావిడ నామము చెప్పబడినది.

నరాంతకుడు తన ప్రాసాయుధముతో ఒక్క క్షణములో ఏడువందలమంది వానరులను చీల్చి వైచినట్లు వాల్మీకము తెల్పుచున్నది.

'స వానరాన్ సప్త శతాని వీరః ప్రాసేన దీప్తేన వినిర్బిభేద।
ఏకః క్షణే నేంద్రరిపు ర్మహాత్మా జఘాన సైన్యం హరిపుంగవానామ్॥[203]

అట్టి నరాంతకుని అంగదుడు పిడికిలితో పొడిచి చంపినాడు. అట్లే అంగదుడు మహానాదుని తలయొడిసి పట్టి.................జఱజఱ త్రిప్పి నేలకు మోది సంహరించినాడు. అంగదుడే మహాకాయుని నెత్తిని అఱచేతితో పగులగొట్టినాడు. ద్వివిదుడు శోణితాక్షుని రూపు తెలియకుండా ఉండునట్లు నేలపై ప్రామినాడు.

### *6-8.21 అమూలకమైన విచిత్రయుద్ధములు*

పైన తెల్పినవి గాక అమూలకములైన కొన్ని ప్రత్యేక యుద్ధాలను కూడా తెలుగు రామాయణకర్తలు వర్ణించినారు. అట్టివానిలో ఖడ్గరోమ, వృశ్చికరోమ, సర్పరోమ, అగ్నివర్ణుల యుద్ధము చెప్పదగినది. వీరి యుద్ధ పద్ధతి చాల విచిత్రమైనది. ఆశ్చర్యకరమైనది గూడ.

*1. ఖడ్గ రోముని యుద్ధము:*

ఖడ్గ రోముడు శరీరమంతట ఖడ్గములవంటి రోమములు గలవాడు. ఇతడును పర్వతాకారుడు. అతిబలోన్నతుడు. రావణప్రేరితుడైన ఇతడు హనుమంతు నెదిరించినాడు. తన 'రోమ శితఖడ్గధారల' నొంచినాడు. అతడు తన రోమఖడ్గములతో పర్వతములను కూడా ముక్కలు చేయగలవాడని భాస్కరరామాయణకర్త వర్ణించినాడు. హనుమంతుడు మరియొక పెద్ద పర్వతమునాతనిపై పడవైచి నాతని సంహరించినాడు.

2. సర్పరోముని యుద్ధము :

సర్పరోముడు సర్పములే రోమములుగా గలవాడు. ఆ రోమములందు పాములకు వలెనే విషము కూడాగలదు. ఖడ్గరోముడు మరణించిన తరువాత సర్పరోముడు అంగదునెదిరించుటను మొల్ల యిట్లు వర్ణించినది.

'రోజి కలన ఖడ్గ రోముండు గూలుట
సర్పరోముఁడెతిఁగి సాహసమున
వాలి సుతునిదాఁక వాని రోమంబుల
విషము సోఁకి నొచ్చి వేగఁదెలిసి[204]

సర్పరోముని విషముసోకి బాధపడిన అంగదుడు వెంటనే తెలివి తెచ్చుకొని వాని ముక్కు దూలము పగులునట్లు కొట్టి తరువాత తన బాహుదండములతో 'వాని శిరము చెక్కలై వ్రీలి పడునట్లు చేసెను.

*3. వృశ్చికరోముని యుద్ధము:*

యుద్ధమున సర్పరోముడు మరణించిన తరువాత వృశ్చికరోముడు వానరసైన్యములనెదిరించినాడు. ఇతడు వృశ్చికములే రోమములుగా గలవాడు. భాస్కరరామాయణకర్త ఆతని విజృంభణమునిట్లు వర్ణించినాడు.

"వృశ్చిక రోముడంత బరివీత దురాప విషాగ్ని విస్ఫుర
ద్వృశ్చిక రోముడై భయద వేషమునం గపిరాజసేనలన్

నిశ్చల వృత్తిగాంచి యతినిష్ఠుర శూరత దాకి తాకి తే
జశ్చటు లాన్మకుడై పటుపు చండభుజాయుధ దుర్నిరీక్ష్యుడై[205]

విషాగ్నిచే ప్రకాశించు రోమములు గలవాడగు వృశ్చికరోముడు భయంకరాకారుడై తన భుజాయుధముతో చూడశక్యముగానివాడై వానరసేన నెదిరించినాడు. 'నీలుడు కోపించి అతనిపై ఒక 'ఉరుసాల తరువును' ప్రయోగింపగా దానిని వృశ్చికరోముడు 'విషరోమ కంటకాగ్రములద్రుంచినాడు. మరల నీలుడు 'భూరి శాఖల నొప్పుభూజంబు వెలికిగొని వచ్చి వాని వక్షోవీధి వ్రేసి.......................హతజీవు జేసినాడు.

### 4. అగ్ని వర్ణుని యుద్ధము:

అగ్ని వర్ణుడు సాక్షాత్తు అగ్నివర్ణుడే. అగ్నితో సమానమైన వాడే. అతడు యుద్ధానికి వచ్చుటను భాస్కరరామాయణకర్త ఇట్లు వర్ణించినాడు.

'కల్పావసాన నిర్ణిష్క్రాంత మహావహ్ని దానవరూపంబు దాల్చెనొక్కొ
జగములన్నియు వేడ్కజవిచూడవచ్చిన జలపాయియైన కృశానుడొక్కొ
విశ్వేశు ఫాలంబు వెడలి యేతెంచిన దర్పకాంతకుడైన దహనుడొక్కొ
దశకంధరోత్కృష్ట దారుణ క్రోధాగ్ని పరిణామగురు పరిపాకమొక్కొ
యనగ రోదోంతరం బెల్ల దనదుగాత్ర నిర్గ తార్చు లుదగ్రత నిండి పర్వ
హరికులాటవి గాల్పంగ నాగ్రహించి యగ్నివర్ణుండు చనుదెంచి నార్పులొదవ[206]

ఆవిధముగా బయలుదేరిన అగ్ని వర్ణుడు తనమేని మంటలతో విజృంభించినాడు. అతడు తన శరీరపు మంటలతో పర్వతములను గూడ భస్మముచేయగలవాడు. వానిపై రాముడు వారుణాస్త్రమును ప్రయోగించినాడు. ఆ అస్త్రప్రభావంతో అగ్ని వర్ణుడు నేలగూలుటను రంగనాథరామాయణకర్త ఈ విధంగా వర్ణించినాడు.

"కప్పారు మేఘంబు గప్పి యార్భటము-లుప్పొంగ జడివానలుడుగక కురిసె
యులవేడి మంటల నార్చిపెల్పార్చి-ఖలునగ్నివర్ణు నొక్కటనేలగూల్చె[207]

అగ్ని వర్ణుని మంటలు వారుణాస్త్రజలధారలతో నశించి యాతనిని నేలగూల్చినవి.

### 6-8.22 యుద్ధరంగంలో హోమాలు :

యుద్ధరంగంలో హోమకార్యాలను నిర్వహించే విధానం రాక్షసులయుద్ధ పద్ధతులలో కనిపిస్తుంది. రామాయణమున వర్ణింపబడిన యుద్ధ ఘట్టాలలో ఇంద్రజిత్తు యుద్ధరంగానికి బయలుదేరేముందు హోమకార్యాలనాచరించడం కనబడుతుంది.

ఇవి కూడా క్షుద్రయాగములవంటివే. యుద్ధవిజయాన్ని కలిగించునట్టివి. కుటిలనీతితో కూడినట్టివి. ఇంద్రజిత్తు ప్రథమయుద్ధమున కేవలం మాయను ప్రయోగించుటయే గలదు. ఆ తరువాత చేసిన యుద్ధములందు అన్నిట హోమకార్యనిర్వహణము జరిగినది.

*1. ఇంద్రజిత్తు ద్వితీయ యుద్ధము :*

మకరాక్షుడు మరణించిన తరువాత రావణుడు కోపించినవాడై ఇంద్రజిత్తును యుద్ధమునకు వెళ్లవలసినదిగా ఆజ్ఞాపించినాడు. ఇంద్రజిత్తు యుద్ధభూమికి చేరి ఉచిత ప్రదేశమున రథముదిగి కరితురగాది సైన్యముల నియోగించి అగ్నిని ప్రతిష్ఠించినాడు. అతడు హోమకార్యము నిర్వర్తించిన విధమును రంగనాథరామాయణకర్త విపులముగా వర్ణించినాడు.

"చనుదెంచి రణమహిస్థలమున నిలిచి - ఘనభుజుండత్యంత కౌతూహలమున
రక్తవస్త్రంబుల రక్తమాల్యముల - రక్తగంధంబుల రాజితుండగుచు
వరమంత్రముల హుతవహు ప్రతిష్ఠించి - శరముల తోమర చయములు వరుస
పరిధులుగా జేసి పలుస్రుక్స్రువములు - కరమర్థిలోహముల్గా సంఘటించి
తనలోని నిష్ఠ యుదాత్తమైయొప్ప - దనుజేంద్రతనయు డథర్వణోక్తముగ
దగనెయ్యి లాజలు, దాడి సమిధలు - నొగి వేడ్కవేల్చుచు హోమాంతవేళ
గడిదికృష్ణచ్ఛాగ కంఠరక్తంబు - నడరెడు వహ్ని బూర్ణాహుతి వేల్వ
ననలుండు పొడసూపి హవ్యముల్గొనియె - ననలుని కరుణ బ్రహ్మాస్త్రంబు రథము
ధనువును కవచంబు దద్దయుబ్రీతి - గొనియార్చుటయును దిక్కులు పెల్లగిల్ల"[208]

ఇంద్రజిత్తు ఎఱ్ఱని వస్త్రములను, ఎఱ్ఱని పూలదండలను, ఎఱ్ఱని గంధములను ధరించినవాడై, అగ్నిని ప్రతిష్ఠించి బాణములు, తోమరములు మొదలుగునవి పరిధులుగా చేసి తాండ్రపుల్లలు సమిధలుగా, ఇనుప స్రుక్స్రువములు సిద్ధము చేసుకొని నేయి, వరి పేలాలను హోమముగావించెను. తరువాత నల్లమేకను బలియిచ్చి దాని కంఠరక్తమును పూర్ణాహుతిగా సమర్పించినాడు. అగ్నిదేవుడు స్వయముగా ప్రత్యక్షమై హవ్యములను స్వీకరించినాడు. దానవగురూపదిష్టమైన అథర్వణ తంత్ర విధానమున జరిపిన హోమముపూర్తియైన తర్వాత ఆ హోమగుండము నుండి వెలువడిన రథమును, ధనువును, కవచమును అగ్నిదేవుని వలన పొందినవాడై బ్రహ్మాస్త్రమంత్రాలచే వాని నభిమంత్రించి యుద్ధానికి బయలుదేరినాడు. ఆ రథమున నధిరోహించి ఇంద్రజిత్తు మాయాయుద్ధమును చేసినాడు.

2. ఇంద్రజిత్తు తృతీయ యుద్ధము :

మకరాక్షుడు మరణించిన తర్వాత రావణునిచే ప్రేరితుడై ఇంద్రజిత్తు ఉత్తర ద్వారము వద్ద రామలక్ష్మణులనెదిరించుటకై బయలుదేరినాడు. యుద్ధభూమికి చేరి రథాన్ని దిగి రాక్షససైన్యమును తన చుట్టును నిలుపుకొన్నవాడై హోమకార్యమునకు పూనుకొనినాడు. ఈ వృత్తాంతమును రంగనాథ రామాయణకర్త విపులముగా ఇట్లు వర్ణించినాడు.

"గురుతరవేది త్రికోణమై పెద్ద - పరపొంది దక్షిణప్రవణమైయున్న
భూరిశ్మశానాగ్ని పొలుపారదెచ్చి - ధీరుడై వేదిలో దీపింపజేసి
రక్త వస్త్రంబులు రక్తమాల్యంబులు - రక్తచందనమనురక్తుడై దాల్చి
దండంబు నుపవీత తతియు మౌంజియును - నిండుమనంబుతో నెఱయంగబూని
యలవడ నచట ఖట్వాంగ ధ్వజంబు - నిలిపి కపాలంబు నిష్టతో నెక్కి
పరగంగ కంకాళ పరిధి గావించి - తిరముగా దక్షిణదిశ స్రుక్స్రువంబు
లినుప పాత్రలనుంచి యేర్పడ గృష్ణ - తనుడైన వాని రక్తమును మాంసమును
పారిపారి గేలి నిండబోసి మౌనంబు ధరియించి - యప్పుడథర్వణక్రమము
దప్పకయుండ మంత్రములుచ్చరించి - చొప్పడ నినుప స్రుక్స్రువములు పట్టి
కబయ పావకుడును గడు నొప్పి తాటి - సమిధలు తిలలు సర్షపంబులును
హోమంబు సేయంగ నురుతరంబగుచు - నా మహాధూమ మజాండంబు గప్పె
నాయగ్నిలోనుండి యప్పుడు వేగ - మాయతంబైనట్టి యరదంబు వెలుగ
రయమున నుగ్ర కరాళకేశములు - భయదరూపంబు కపాల పాత్రమును
తళతళమను కోఱదవడలు మెఱయ - మలగ కార్చుచు నస్థిమాలికలలం
నెఱమంట లొలికెడు నేత్రంబులొప్ప - నుఱక హాసముతోడ నొక కృత్తివెడలి
పంపుము పంపు మేపనికైన నన్ను - సొంపరజేసెద సురవైరి యనుడు
నాకృతి నడిగి ఇంద్రారి శస్త్రములు - నాకృత్తి గైకొని యాకాశమునకు
నరదంబు తోడనె యరిగి వానరుల - దిరిగి యేయుటకు నదృశ్యుడై యుండె'[209]

ఈ హోమకార్యము మొదటి దానికంటె మరికొంత పెరిగినది. హోమగుండము త్రికోణాకృతిలోనున్నది. దానిలోనికి శ్మశానాగ్నిని తెచ్చివేసినారు. ఖట్వాంగధ్వజమును నిల్పినాడు. కపాలమునునొకదానిని అతడు ఆసనముగా చేసుకొనినాడు.

కంకాళములను పరిధులుగా నేర్పఱుచుకొనినాడు. దక్షిణ దిశయందేర్పరచిన ఇనుప పాత్రల యందు నల్లని శరీరముగలవాని రక్తమాంసములు నింపినాడు. ఇందును అథర్వణ మంత్రములనుచ్చరించుట గలదు. ఇనువ స్రుస్రువములే ఉపయోగింపబడినవి. తాటి సమిధలు, తిలలు, సర్షపములు హోమద్రవ్యములుగా వేల్చుట జరిగినది. ఆ హోమగుండమునుండి రథసహితముగా నొకకృత్య వెలువడినది.ఆ కృత్య ఉగ్రకరాళకేశములు, కపాలపాత్ర ధరించినది. భయంకరమైన కోరలతో ఎముకల దండలతో, మంటల చిమ్ము కన్నులతోనున్నది. దహన మధ్యమునుండి వెలువడిన ఆ కృత్యను భాస్కరరామాయణకర్త మరికొంత విపులముగా వర్ణించినాడు.

సీ॥ మృత్యువు జిహ్వతో మేలమాడెడునసి దాల్చి కపాలపాత్రంబు వట్టి
బాడబార్చులబోలు పల్ల వెంట్రుకలును చండప్రకాశ దంష్ట్రాయుగంబు
మెఱవమండుచునున్న మిడిగ్రుడ్లు గనలంగ పెనుపైన పునుకుల పేర్లు గలిగి
యట్టహాసమున వియచ్చరులదరంగ మెట్టిన బుడమియు బిట్టుగ్రుంగ
గృత్యయేతెంచి యాయుగ్రకృత్యు బలికె పంపుమెయ్యేది యైననే తెంపుతోడ
నిపుడ జేయుదు ననవుడు నింద్రజిత్తు దేరువడి నెక్కి శక్తితో దివికినెగసె[210]

ఇంద్రజిత్తు ఆకృత్యతో సహా నదృశ్యుడై వానరులపైన బాణవర్షమును కురిపించినాడు. అవి పిడుగులకంటె బెట్టిదములైనట్టివి. రాముడు ఇంద్రజిత్తును జయించు మార్గమును గూర్చి ఆలోచించుచుండగా వాయుదేవుడు రామునివద్దకు వచ్చి 'కృత్యను అంగీరసంబైన అమోఘబాణమున బెడబాపు 'మని దెల్పినాడు. పిమ్మట రాముడు ఆగ్నేయాస్త్రముతో కృత్యను పడగొట్టినాడు. ఇంద్రజిత్తు రథముతో సహాభూమికి దిగి వచ్చినాడు. ఈ కృత్య వృత్తాంతము మూలరామాయణమునందులేదు.

### *3. ఇంద్రజిత్తు చతుర్థ యుద్ధము :*

ఇంద్రజిత్తు వానరవీరులను గాయపఱచి లంకకేగి మరల రావణప్రేరితుడై యుద్ధభూమికి బయలుదేరినాడు. ఈ పర్యాయము నాతడు హోమకార్యము చేయించునట్టి పురోహితుని కూడ వెంటబెట్టుకొని యుద్ధభూమికేతెంచినాడు. ఆ హోమవృత్తాంతమును రంగనాథరామాయణకర్త విపులముగా వర్ణించినాడు.

'ఎలమితోడన పురోహితుని దోడ్కొనుచు - బొలుపారగా రణ భూమికేతెంచి
చెన్నొందహోమంబు సేయంగబూని - యున్నంతఁబరిచారులొగివేగమునను

బరగంగ నరసి కపాల పత్రికలు - సొరిదినుక్కునవైన స్రుక్స్రువంబులును
శస్త్రంబులును తాటి సమిధలు రక్త - వస్త్ర గంధాదులు వరుస దెచ్చుటయు
రక్తాంబరములు రక్తమాల్యములు - రక్తగంధంబును రయమొప్పనతడు
ధరియించి మారణతంత్రమార్గమున బరువడి తోమరప్రాసఖడ్గముల
సరి పరిధులు వెట్టి సప్రాణ కృష్ణ - హరిణంబుమెడ యస్థియది పుచ్చుకొంచు
నక్తాంచరాధీశు నందనుడెలమి - యుక్త క్రమంబున హోమంబుసేయు''[211]

ఈ హోమకార్యము నిర్వహించునపుడు ప్రాణముతోనున్న జింక యొక్క మెడయస్థిని పట్టుకొనుటవిశేషము.

హోమాంతమున నాలుగు గుఱ్ఱాలతో గూడినది, మనోహరంగా నలంకరింపబడినది. సింహ అర్ధచంద్రచిహ్నములు కలది, వైఢూర్యమయమైన పడగతో ప్రకాశించునది, బ్రహ్మాస్త్ర రక్షతో అదృశ్యమగునదియగు రథము హోమగుండమునుండి వెలువడినది. ఈ యుద్ధమునందును ఇంద్రజిత్తు వానరవీరులను గాయపఱచి విజయగర్వంతో లంకకు తిరిగి వెళ్లినాడు. హోమకార్యాలు నిర్విఘ్నముగా నెఱవేరిన యుద్ధములలో ఇంద్రజిత్తుకు విజయమే గల్గినది.

### 4. ఇంద్రజిత్తు నికుంభిలాయాగం :

ఇంద్రజిత్తు చేసిన నికుంభిలాయాగవర్ణనము రంగనాథ రామాయణమున విపులముగాగలదు.

'అని నికుంభిలకేగి యచట నిశాటు - డెనసిన నిష్ఠతో నేపు దీపింప
కల్లురునెత్తురు పాలు ఘనకచ్ఛపముల - బల్లుల పిల్లుల బలుసర్పములను
కారుకోళ్లను మంచిగంధంబుతేనె - నారికేళంబుల నల్లని కోళ్ల
సూకరంబుల మఱిసొరిది కేశముల - కాకుల తెల్లని గార్ధభంబులును
కాఱెనుపోతుల ఘనమేషములను - నాఱునాలుగు రెండు నఱువదికరుల
కొండగొఱ్ఱెలు వేయికోటుల లక్ష - మండూకములఁగోటి మాణిక్యములను
ముత్యంపు చిప్పలు మూడర్బుదముల - కాత్యాయనీదేవి కడనిష్టనిలిపి
మనమున నిగమన మంత్రపూతముగ - ననలుని రుధిర మాంసాదులదనిపి
హోమంబు సేయుచునుండె నయ్యెడను.................[212]

ఇచ్చట ఇంద్రజిత్తు క్షుద్రమార్గమున కాత్యాయనీదేవి పూజను చేసినాడు.

రాక్షసులలో తాంత్రికపూజా విధానమున్నట్లు దీనివలన తెలుస్తున్నది. నికుంభిలాయాగాన్ని పూర్తిచేస్తే ఇంద్రజిత్తును జయించుట ఎవ్వరికినీ సాధ్యము కాదు. అతడు దేవదానవులకజేయుడయ్యేడివాడు. ఆ హోమకార్య విధానాన్ని, ఇంద్రజిత్తు బ్రహ్మను మెప్పించి ఉపదేశాన్ని పొందినాడని విభీషణుడు రామునితో తెల్పినట్లు రంగనాథ రామాయణకర్త వివరించినాడు.

'బ్రహ్మ మెప్పించి యప్పరమేష్టివలన - బ్రహ్మశిరంబను బాణంబు విల్లు
కవచంబు, ఖడ్గంబు కవదొనల్మఱియు - నవిరళ మంత్రపూతాస్త్రముల్వడసి
కామగాశ్వంబును కమనీయకేతు - భీమంబు మారుతస్ఫీతవేగంబు
నగు రథంబాయగ్నియందు వెల్వడిన - దగ నారథంబెక్కి ధనువందెనేని
నా వాసవారాతి నాలంబులోన - దేవా సురాదులు దృష్టింపలేరు''[213]

అని చెప్పును. పిమ్మట విభీషణుడు ఇంద్రజిత్తు హోమము చేస్తున్న ప్రదేశానికి లక్ష్మణుణ్ని తీసికొని వచ్చి ఆ హోమాన్ని చూపి ఇట్లా అంటాడు. "పూర్వమీ ఇంద్రజిత్తు ఇచటనే హోమముచేసి భూతములకు బలులనిచ్చి కోరిక నెఱవేర్చుకొని యుద్ధమున అదృశ్యాకారుడై ఇంద్రునోడించినాడు. ఇప్పుడీ అగ్నినుండి వెడలునట్టిదియు, రక్తమాల్యాంబరధారియు, అసితకాయుడునైన సూతునితో రక్తరుచిరాశ్వములతో అగ్ని వర్ణముననున్నట్టిదియునగు ఆ పెద్దరథమునెక్కివచ్చినచో ఈతడజేయుడగునని తెల్పును. ఈ యాగానికి గల మరొక ప్రత్యేకత యజ్ఞభంగం జరిగితే యాగ కర్త మరణాన్ని పొందుటయై యున్నది.

*5. రావణుని పాతాళహోమం:*

రామరావణుల ద్వితీయ యుద్ధానంతరం రావణుడు కాందిశీకుడై లంకానగరానికి జేరి యంతఃపురమున సేదదీర్చుకొన్నాడు. రాముని పరాక్రమానికి భయం చెందాడు. యుద్ధరంగంలో ఎచట చూచినను రాముడే కన్పించుటను, పిడుగులకంటె భయంకరములగు రాముని అస్త్రాలను దలచి విచారాన్ని ఆశ్చర్యాన్ని చెందాడు. రాముని జయింపవలెనన్న భసితాంగరాగగాత్రుడు, భుజగభూషణుడు, అభ్రగంగా సలిలార్ద్ర జటాజూటుడు, త్రిపురాంతకుడు, ఆదిమధ్యాంతరహితుడు నగుశివుని యను గ్రహంలేక అసాధ్యమని భావించాడు. ఆసమయంలో రావణుడు పల్కిన మాటలను భాస్కరరామాయణకర్త ఈవిధంగా తెల్పాడు.

'మును నాదుసంగీతమును మెచ్చి వరమిచ్చె నగసుతా నాథుడు నాకు ప్రీతి
నరులకు నీవోడునప్పుడునను గూర్చి హోమంబు విధి తోడ నొనరజేయ
'దివిరిగ్రక్కున నొక్క దివ్యరథంబందు జనియించు నురుజవాశ్వములతోడ
కమనీయమగు మహాకవచంబు మాహేశ్వ రంబగు దివ్య చాపంబుగలుగు
నడుమ విఘ్నంబు గాకుండ నడచెనేని జయము చేకుఱు ననయంబు సంగరముల
ననియె గావున నేడు నాకట్లు జేయ వలయు నీపగదీర్పంగ వలనుగలుగ[214]

రావణుడు మండోదరితో ఈవిధంగా పలికి బ్రాహ్మణులకు అనేక ధనములనిచ్చి రక్తమాల్యాంబరాభరణ యజ్ఞోపవీతాలంకృతుడై పరమేశ్వరాలయానికి వెళ్లి అచట ఒకవేదిక నిర్మించుకొని రక్షణార్థమై రాక్షసుల నియోగించి, హోమకార్యాన్ని ప్రారంభింపదలచాడు. కానీ మండోదరి పల్కిన హితవచనాలతో అప్పటికా ప్రయత్నాన్ని విరమించాడు. మరల లక్ష్మణుడు సంజీవకరణిచే పునర్జీవితుడైన తర్వాత రాముని ప్రతిజ్ఞను కూర్చి విని కలత చెందాడు. తమ కులగురువైన శుక్రుని వద్దకు వెళ్లి తన దీనస్థితిని చెప్పుకున్నాడు. అప్పుడు శుక్రుడు పల్కిన మాటలను భాస్కరరామాయణకర్త ఇట్లు తెల్పాడు.

"సమర క్షోణి తలంబునందు బగఱన్ సాధింపగా దివ్యమం
త్రములు, దంత్రములుం మహౌషధులు, దధ్యంబారనుండంగ నీ
కు మనస్తాపమిదేల యే గలుగ రక్షోనాథ నీ శత్రు సం
ఘము ప్రాణంబులు దాల్చి యాజి నిలువంగా నోపునే చెప్పుమా[215]

యుద్ధరంగమందు శత్రువులను జయించడానికి ఆ కాలంలో దివ్యమంత్రాలు, తంత్రాలు, ఔషధులు ఉన్నట్లుగా దీని వల్ల తెలుస్తున్నది.

హోమకార్యం నెఱవేర్చినచో శత్రుజయంగల్గునని చెప్పడాన్ని భాస్కరరామాయణకర్త ఇట్లు తెల్పినాడు.

'ఉరుతరమైన ధైర్యమున హోమము నీకు నపేత విఘ్నమై
జరిగిన దివ్యఖడ్గశరచాప రథాశ్వములున్ మణి ప్రభా
గురుతర విస్ఫురత్కవచకుండలముల్ ప్రభవించు నగ్నిలో
నరుదుగ వాని దాల్చి విమతాలి జయించెద వీవు నాజిలో"[216]

అగ్నిగుండాన్నుండి దివ్యరథం, దివ్యఖడ్గశరచాపాలు, దివ్యరథాశ్వాలు, కవచకుండలాలు ప్రభవిస్తాయని వానిని ధరిస్తే శత్రుజయం గల్గుతుందని చెప్తాడు.

ఈ పాతాళ హోమకార్యక్రమం నిర్విఘ్నంగా సాగటానికై మాయోపాయాలను పన్నటంలో శ్రేష్ఠుడైన విద్యుజ్జిహ్వుని రావణుడు తన దగ్గఱుంచుకొనినాడు. పాతాళ గుహలోనికి ప్రవేశించి అతడు చేసిన హోమవిధిని భాస్కర రామాయణకర్త ఈవిధంగా తెల్పాడు.

"రక్తస్రగను లేపన పటాలంకృతుడై, గంధ కుసుమాక్షతార్చితమైన వేదిక యందు యథావిధి ననలంబు ప్రతిష్ఠించి గోమయంబులగు పాత్రలు సంస్కరించి, తత్సమీపంబున నస్త్రపరిధులు సేర్చి బిల్వ భల్లాతక కరంజంబుల సమిధలు. దత్ఫలంబులును సర్షపాగరు గుగ్గులు దూర్వలును, దధిమధుఘృత రక్తసురలును బ్రవాళ పాయస దర్భలును గాక గృధ్రకంకశ్యేన కురర భల్ల సర్పంబులును, ఛాగ మీన మకర కచ్ఛప మేషంబులును, ధాతురసంబులును, గర్పూర కుంకుమ చందన కుసుమంబులును( గేశంబులును వేల్చుచు నిశ్చల నియమంబున హోమంబు సేయునంత"[217]

ఈ హోమకార్యమునందును క్షుద్రపద్ధతులు అవలంబించబడ్డాయి. అంగదాదులు ఈ పాతాళహోమకార్యానికి విఘ్నం గల్గించారు. ఈ హోమకార్యవృత్తాంతమంతయు అమూలకమే.

ఈ ప్రకారం రామాయణకాలం నాటి యుద్ధములందు నాగరిక, ఆటవిక పద్ధతుల మిశ్రమం కనబడుతుంది. వేదకాలంనాటి యుద్ధం తర్వాత చెప్పదగినదీ యుద్ధమే. అంతేగాక ఇతిహాస కాలపు యుద్ధాలలో మొదట చెప్పదగినదియు ఇదే. ఒకవిధంగా భారత యుద్ధానికి గాని, తరువాత కాలంలో వచ్చిన యుద్ధ శాస్త్రాలకు గాని రామాయణ యుద్ధమే ఆధారమైంది. భౌతిక బలసంపద కంటె ధర్మం ప్రధానమైందని రామాయణయుద్ధంలో నిరూపించబడింది. బలసంపన్నుడైనను, వరసంపన్నుడైనను పరుల సంపదను కోరేవాడు వినాశనాన్ని తప్పక పొందగలడని రామాయణయుద్ధం ప్రబోధిస్తున్నది. యుద్ధవిద్యల్లో ప్రవేశమున్నట్టి, కొంత నాగరికులైనట్టి రాక్షసులు వానరులతో కూటయుద్ధానికి పాల్పడినారు. కాని యుద్ధమందెక్కడను మాయలను ప్రయోగించటం కనబడదు. వానరులలో కొందఱు కామరూపవిద్య తెలిసినవారున్నను వానరులు అట్టి మాయలను ప్రయోగింపక పూర్తిగా ఋజుయుద్ధాన్ని చేశారు.

రామలక్ష్మణులును అంతే. యుద్ధవిషయములలో భారతీయులు ఋజుమార్గాన్ని అనుసరించే వారని రామాయణయుద్ధంలో నిరూపింపబడింది. వివిధములైన ఆయుధాలను ప్రయోగించుట సుశిక్షితులైన వీరులకే సాధ్యమగును. అట్టి ఆయుధవిద్యలు నేర్చుకోవడంలో మనప్రాచీనులకు గల ఆసక్తియు ఈ యుద్ధం వల్ల తెలుస్తున్నది. వివిధాయుధాలతో చేయబడ్డ యుద్ధాలను బట్టి ఆ యుద్ధ పద్ధతులు రామాయణ కాలానికే ప్రసిద్ధములైనవనియు తెలుస్తున్నది. ముఖ్యంగా ధనుర్విద్యలో రామాయణకాలపు క్షత్రియులు మిక్కిలి నిపుణులుగా తెలియబడుచున్నారు. తర్వాతకాలంలో ధనుర్విద్య క్షత్రియుల సొత్తే గాక వీరులందఱుకు ఆరాధ్యమైంది. రామాయణ మహాభారత యుద్ధాల క్రమపరిణామమును పరిశీలిస్తే రామాయణ యుద్ధపు పరిణితదశ భారత యుద్ధము నందు కన్పట్టును.



## పాదసూచికలు

1.భగవద్గీత-దైవాసురసంపద్విభాగయోగం-1శ్లో॥ 2.శుక్రనీతి.4-7పేజీ468 3.ఋగ్వేదార్యులు-106పేజీ 4.ఋగ్వేదం ఆర్యులు17-41 5.ఋగ్వేదఆర్యులు-146పేజీ. 6.Ibid.-156పేజీ. 7.సేనాపదాతిబహుళాశత్రూన్‌జయతిసర్వదా 8.ఋగ్వేదం.6-75-2 9.ఋగ్వేదం.6-12 10.Ibid.1-8-2. 11.Ancient India-ChapterII పుట.11 12.సంగ్రహాంధ్రవిజ్ఞానకోశము.పేజి.594 13.వసుచరిత్ర 1-95 14.శృంగారనైషధం.8-24,25. 15.సంగ్రహాంధ్రవిజ్ఞానకోశం-పుట- 595 16.ధనుర్విద్యావిలాసం.3-83పేజీ 140పద్యం. 17.ధనుర్విద్యావిలాసం.పీఠిక. పుట.12 18.Ibid 19.హంసవిశంతి.1-105 20.వాల్మీ.రా.యు.17-22 21.భాస్క.రా.యు.355ప॥ 22.వాల్మీ.రా.యు.28-34నుండి39శ్లో॥ 23.వాల్మీ.రా.యు. 28-40నుండి43శ్లో॥ 24.భాస్క.రా.యు.434ప॥ 25.భాస్క.రా.యు.435ప॥ 26.వాల్మీ.రా.యు. 94-31నుండి33శ్లో॥ వరకు. 27.రామాభ్యు.8-193 28.వాల్మీ.రా.యు. 28.14 29.Ibid. 25-22 30.భాస్క.రా.యు.1947వ॥ 30a.వాల్మీ.రా.సుంద.44.5 31.Ibid.51-28 32.Ibid.5. 33.రంగ.రామా.324పే॥ 34.వాల్మీ.రా.సుంద.48-19 35.భాస్క.రా.సుం.

409 36.వాల్మీ.రా.అరణ్య.40-19 37.వాల్మీ.రా.అరణ్య.47-4,6శ్లో॥ 38.భాస్క.రా.యు.283. 39.వాల్మీ.రా.యు.57-25 39a.రంగ.రా.యు.393పేజి. 40.భాస్క.రా.యు.2025 41.గోవిందరాజీయం.బాల.137పుట. 42.వాల్మీ.రా.బాల.6-25 43.Ibid.బాల.6-24. 44.వాల్మీ.రా.సుం.6-32,33 45.భాస్క.రా.బా.36 46.భాస్క.రా. యు.796. 47.వాల్మీ.రా.యు.69-20. 48.Ibid.అయోధ్య.100-50 49.వాల్మీ.రా.బా. 6-22 50.భాస్క.రా.బాల.37 51.Ibid.యు.800. 52.రంగ.రా.యు. 367పేజీ. 53.భాస్క.రా.బాల.39 54.వాల్మీ.రా.బాల.21 55.Ibid.యు.65-37 నుండి40వరకుశ్లో॥ 56.భాస్క.రా.యు.1323. 57.వాల్మీ.రా.యు.65-36 58.వాల్మీ.రా.యు.53-5 59.Ibid.59-19 60.రంగ.రా.యు.336పేజి. 60a.భాస్క,రా.బాల.566పేజీ 61.వాల్మీ.రా.యు.41-95,96 62.భాస్క.రా.బాల.129ప॥ 62a.ఆంధ్రమహాభారతం. పీఠిక.పేజీ.31(ద్రోణపర్వం) 63.వాల్మీ.రా.యు.30-12 64.Ibid.24-15నుండి 18శ్లో॥ 64a.వాల్మీ.రా.యు. 37-26నుండి 31శ్లో॥ 65.వాల్మీ.రా.యు.57-32 66.భాస్క.రా.యు.375పద్యం. 67.వాల్మీ.రా.యు.61-35 68.మొల్ల.రా.యు.1-102 69.సంగ్రహాంధ్ర విజ్ఞానకోశం. 6వభాగం-231పేజీ. 70.భాస్కర.రా.యు.1446పద్యం. 71.వాల్మీ.రా.యు.43.5 72.రామాభ్యు.7-288 73.Ibid.7-289 74.వాల్మీ.రా.యు.43-16. 75.భాస్క.రా.యు.1183ప॥ 76.వాల్మీ.రా.యు.52.2 77.Ibid.55-21. 78.మొల్ల.రా.యు.3-90. 79.రంగ.రా.యు.306పేజీ. 80.1bid.-306పేజీ. 81.వాల్మీ.రా.యు.45-25,71-18 82.రంగ.రా.యు.351పేజీ 83.ధనుర్విద్యావిలాసము - 76పుట. 84.మొల్ల.రా. యు.1-117. 85.మొల్ల.రా.యు.3-105ప॥ 86.వాల్మీ.రా. బాల. 26-17. 87.Ibid.51-5. 88.వాల్మీ.రా.సుం.44-7 89.మొల్ల.రా.సుం.154 90.భాస్క.రా.అరణ్య.1-203. 91.భాస్క.రా.అరణ్య.1-203. 92.Ibid.1.210. 93.భాస్క.రా.యు.1-166. 94.రంగ.రా.అరణ్య.141పేజీ 95.భాస్క.రా.యు.1268. 96.భాస్క.రా.యు.1271. 97.వాల్మీ.రా.యు.45.23. 98.వాల్మీ.రా.యు.76-6. 99.Ibid.107-51 100.వాల్మీ.రామా.60-3 101.భాస్క.రా.యు.849ప॥ 102.భాస్క.రా.యు.854 103.వాల్మీ.రా.యు.100-23 104.వాల్మీ.రా.యు.100.23 105.రామాభ్యు.8.226.

106.భాస్క.రా.యు.1497వ॥ 107.వాల్మీ.రా.బాల.27-6నుండి 20 శ్లో॥ 108.వాల్మీ.రా.బా.28-4నుండి10శ్లో॥ 109.రంగ.రా.సుం.2పుట. 110.వాల్మీ.రా.బా. 30-20. 111.వాల్మీ.రా.బాల.30-21,22శ్లో॥ 112.Ibid.యు.67-153. 113.భాస్క.రా. అరణ్య. 1-214 ప॥ 114.రంగ.రా.యు.418,419పేజీ. 115.వాల్మీ.రా. యు. 94-31నుండి33శ్లో॥ 116.వాల్మీ.రా.యు.71-28,29శ్లో॥ 117.Ibid.-85వపేజీ 118.భాస్క.రా.యు.1375ప॥ 119.Ibid.1376ప॥ 120.వాల్మీ.రా.యు.91-60,61శ్లో॥ 121.భాస్క.ర.రా.యు.1387 122.రంగ.రా.యు. 387 పుట. 123.భాస్క.రా.యు. 1246. 124.వాల్మీ.రా.యు.79-37. 125.భాస్క.రా. యు.2040. 126.వాల్మీ.రా. యు.100-41నుండి 43శ్లో॥ 127.భాస్క.రా.యు.2055వ॥ 128.1bid.2057వ॥ 129.రామాభ్యుదయం.8-213 130.రామాభ్యుదయం.8-217. 131.భాస్క.రా.యు. 2191. 132.భాస్క.రా.యు.2193 133.మహాభారతం.శాంతి. 3-422నుండి 441. 134.వాల్మీ.రా.అయోధ్య.52-11. 135.వాల్మీ.రా.అరణ్య.3-20. 136.భాస్క.రా.అరణ్య. 2-391. 137.భాస్క.రా.అరణ్య. 1-200. 138.వాల్మీ.రా. యు.71-21. 139.రంగ.రా. అరణ్య.134,135పేజీ 140.భాస్క.రా.అరణ్య.1-98పేజీ 141.వాల్మీ.అరణ్య.12-34శ్లో॥ 142.వాల్మీ.రా.యు.76-8 142a.వాల్మీ.రా.యు.76.9 143.Ibid.యు.81-31. 144.Ibid.యు.76-26. 145.వాల్మీ.రా.యు.98.29 146.Ibid.98-37. 147.Ibid.70-41. 148.భాస్క.రా.యు.1015. 149.భాస్క.రా.యు.1194వ॥ 150.రంగ.రా.సుం.232పేజీ. 151.Ibid.యు.370పే॥ 152.భాస్క.రా.యు.7.10ప॥ 153.Ibid.712ప॥ 154.భాస్క.రా.యు.1530వ॥ 155.మహాభారతం.శల్యపర్వం.2-271 156.వాల్మీ.రా.అయోధ్య.36-4. 157.Ibid.అరణ్య.27-4 158.వాల్మీ.రా.యు.40-86. 158a.భాస్కర.రా.యు.480. 159.భాస్క.రా.యు.481. 160.రంగ.రా.యు.295పుట. 161.భాస్క.రా.యు.713. 162.భాస్క.రా.యు.710. 162a.భాస్క.రా.యు.716. 163.Ibid.719 164.Ibid.1508ప॥ 165.వాల్మీ.రా.యు.54-27. 166.వాల్మీ.రా. కిష్కిం. 16-16. 167.రంగ.రా.కి.152పేజీ 168.వాల్మీ.రా.కి.14-16. 169.భాస్క.రా.కి.220ప॥ 170.వాల్మీ.రా.కిష్కిం.16-20 171.భాస్క.రా.కి.180ప॥ 172.రంగ.రా.యు.338పేజీ

173.ఆంధ్రకామందకము- 111పేజీ. 174.ఆంధ్రకామందకము.7-176. 175.కౌటిల్యుని అర్థశాస్త్రం-512పే॥ 176.భాస్క.రా.బాల.265 177.రంగ.రా.అయోధ్య.79పే॥ 178.వాల్మీ.రా.యు.64-33 179.వాల్మీ.రా.యు.8-13-15శ్లో॥ 180.Ibid.46-35 181.భాస్కర.రా.యు.1279ప॥ 182.భాస్క.రా.యు.1280ప॥ 183.వాల్మీ.రా.సుం.45-10. 184.Ibid.-47-5 185.వాల్మీ.రా.సుం.47-33. 186.Ibid.అరణ్య.51-42. 187.రంగ.రా.యు.327పే॥ 188.మహాభారతం.ద్రోణ.5-144. 189.వాల్మీ.రా.యు.44.2 190.రంగ.రా.యు.311పే॥ 191.వాల్మీ.రా.యు.44-22 192.భాస్క.రా.యు.1130. 193.Ibid.1131 194.వాల్మీ.రా.యు.75-51 195.భాస్క.రా.యు.2129. 196.వాల్మీ.రా.యు.111-37 197.1bid.42-33. 198.భాస్క.రా.సుం.354. 199.Ibid.యు.1230. 200.భాస్క.రా.యు.922. 201.భాస్క.రా.యు.757. 202.హలాయుధకోశము.203.వాల్మీ.రా.యు.69-67 204.మొల్ల.రా.యు.3.38 205.భాస్క.రా.యు.1988. 206.భాస్క.రా.యు.1994. 207.రంగ.రా.యు.456. 208.రంగ.రా.యు.376పుట. 209.రంగ.రా.యు.389పేజి. 210.భాస్కర.రా.యు.1262 211.రంగ.రా.యు.393పేజీ. 212.రంగ.రా.యు.396,397పుటలు. 213.Ibid.399పేజీ 214.భాస్క.రా.యు.1582ప॥ 215.Ibid.1834ప॥ 216.భాస్క.రా.యు.1835. 217.Ibid.1839.



# సప్తమాధ్యాయము

## 7-0 అంతర్ రాజ్యసంబంధాలు

రాజ్యం తన సార్వభౌమాధికారాన్ని పదిలంగా కాపాడుకుంటూ రాజ్యాభివృద్ధికి, రాజ్యారక్షణకు అవలంబించే అంతర్ రాజ్య సంబంధాల ఆచరణ రాజ్యారాజకీయ వ్యవస్థ అధ్యయనంలో అత్యంత కీలకమైంది. స్వయంరక్షణ, అభివృద్ధి అనే మౌలిక లక్ష్యాల సాధనలో రాజ్యం ఇతర రాజ్యాలతో మైత్రి నెఱపడమో, శత్రుత్వం వహించడమో చేస్తుంది. రాజ్యాల మధ్య సంభవించే రాజకీయ పరిణామాలు, అవసరాలు, అంతర్ రాజ్యాంగనియమాలు రూపొందించుకొనేందుకు దోహదపడతాయి.

మానవేతరులతో కూడా రాజు సత్సంబంధాలు నెలుకొల్పుకొనే విధానం రామాయణంలో కనబడుతుంది. గృధ్రరాజుతో దశరథుని మైత్రి, వానర రాజుతో శ్రీరాముని మైత్రి, ఆనాటి అంతర్ రాజ్యసంబంధాలు ఎంత విస్తృతమైనవో వివరిస్తుంది.

రాజమండలానికి సంబంధించి రామాయణములో కొందరిని మాత్రమే దర్శించగలము.

1. విజిగీషువు : శ్రీరాముడు

2. అరి : రాక్షసరాజగు రావణుడు

3. మిత్రుడు : రావణునితో సన్నిహితసంబంధాలు గల వానర రాజ్యాధిపతియైన వాలిని వధించి రాజ్యాన్ని పొందిన సుగ్రీవుడు.

4. అరిమిత్రుడు : మిత్రుడైన సుగ్రీవుని విరోధి వాలి. ఇతడు శత్రువులగు రావణునకు మిత్రుడు. ఋష్యమూక పర్వతము వైపు వస్తున్న ఇద్దరు నరశ్రేష్ఠులను చూచిన సుగ్రీవుడు హనుమంతునితో

> "వాలి ప్రణిహితావేవ శంకే హం పురుషోత్తమౌ
>
> రాజానో బహుమిత్రాశ్చ విశ్వాసో నాత్ర హి క్షమః[1] ॥

ఈ నరశ్రేష్ఠులను వాలియే పంపియుండునని శంకించుచున్నాను. రాజుకు పలువురు మిత్రులుందురు. అరి మిత్రుని విషయంలో రాజు జాకరూకుడై యుండవలె.

### 7-1 షాడ్గుణ్యం - రాజ్యరక్షణ :

రాజ్యం ఆఱుగుణాలచే పరిరక్షింపబడుతుంది. తనకు మేలు శత్రువుకు కీడు గలిగించు ఈ గుణాలకు రాజ్యపాలనలో అత్యంత ప్రాధాన్యం ఉన్నది.

### 7-2 రామాయణం - షాడ్గుణ్యం :

కబంధుడు శ్రీరామునితో

రామ షడ్యుక్తయో లోకే యాభి స్సర్వం విమృశ్యతే ।
పరిమృష్టో దవాంతేన దశాభాగేన సేవ్యతే'[2] ॥

రామా! సీతను పొందు మార్గాన్ని చెప్తాను విను. లోకంలో ఆఱుపాయాలున్నాయి. రాజులీ ఉపాయములచేతనే తమకార్యాలనన్నింటిని సాధించుకొంటారు. అనుటను బట్టి షాడ్గుణ్య ప్రస్తావనగలదు.

'సంధిం చ విగ్రహం చైవ యానన మాస మేవ చ
ద్వైధీభావం సంశ్రయం చ షడ్గుణాం శ్చింత యే త్సదా[3] ॥

సంధి - విగ్రహం - యానం - ఆసనం - ద్వైధీభావం - సమాశ్రయం అనే ఆరుగుణాలు విజిగీషువు అనుసరింపదగిన షాడ్గుణ్యాము

దశరథుడు షడ్గుణ్యాశాలియని పేర్కొనబడెను.[4]

1. మిత్రరాజుతోనైనా సరే వియ్యమందటానికి ముందు రాజుమంత్రుల అంగీకారాన్ని పొందాలి.[5]
2. శత్రురాజు రాజ్యంపై దాడికి బయలుదేరేముందు ఆ రాజ్యంలోని దుర్గాలు ద్వారాలు, సేనావిభాగమును గూర్చి పూర్తిగా తెలుసుకొనవలెను.[6]
3. రాజు తన బలము. శత్రుబలం కంటె తక్కువగా ఉన్నా లేక సమంగా ఉన్నాలట్టి శత్రువుతో సంధి చేసుకోవాలి. శత్రువుని ఉపేక్షించరాదు. అతడు తనకంటె బలహీనుడైనచో అతనితో వైరం పెట్టుకోవాలి.[7]

### 7-3 విదేశాంగ విధానము - ముఖ్యులు - దౌత్యనీతి :

రాజ్యం యొక్క అభివృద్ధిలో కీలక పాత్రను పోషించే విదేశాంగ విధానం రాజ్యం భవిష్యత్తునే నిర్ణయించగలదు. రాజ్యానికి సంబంధించిన విదేశాంగ విధానం నిర్ణయించేది రాజ్యాంగాలలో ప్రధముడైన రాజే అయినప్పటికి ఇందుకు పూర్తిగా సహకరించగలిగిన వారు ఇద్దఱు.

1. దూతలు 2. గూఢచారులు.

ప్రాచీన భారతీయ రాజ్యాల రాజకీయ వ్యవస్థకు పటిష్టత చేకూర్చిన ఈ ఇద్దరు, విదేశాంగ విధానం అమలుపరచటంలో అతిముఖ్యులు.

### 7-4 దూతలక్షణాలు :

దూతనే రాయబారి అనికూడా అంటారు. విదేశవ్యవహారాలను నిర్వహించడానికి నియోగింపబడేది దూత. కులశీలాలు కలిగి స్వదేశమువాడైయుండి హితవాక్యాలతో కార్యాన్ని సాధించగల దక్షుడే దూత. దూతరాజుకు ప్రతీకగా సందేశాన్ని అందించేవాడు. దూతను చూచి రాజు వచ్చినట్లే భావించుట కలదు. పరిపాలనలో దూతలకు ప్రముఖస్థానమున్నది. శత్రుమిత్రులకు రాజుయొక్క సందేశాన్ని యథాతథంగా విన్పించే వాడే దూత. రాజకార్యాలను నెరవేర్చవలసియున్న దూత తన సామర్థ్యముచే పెక్కుకార్యాలను నిర్వహింపవలసియున్నది.

### 7-5. రామాయణం - దూతలు :

రామాయణకాలంనాటి రాజకీయవ్యవస్థలో రాజకార్యనిర్వహణలో దూతలు ప్రముఖస్థానమునందుండిరి.

### 7-5.1 హనుమంతుడు :

ఇతడు నవవ్యాకరణపండితుడు, సుశిక్షితుడు. సుగ్రీవునకు మంత్రి. సుగ్రీవుని హృదయాన్ని అర్థం చేసికొన్నవాడు. ఇద్దరు నరశ్రేష్ఠులెవరో ఋశ్యమూక పర్వతము వైపు వచ్చుచుండగా, వాలి వారిని పంపెనేమోనని సుగ్రీవుడు తలచెను. అప్పుడు హనుమంతుని వారికడకు పంపినప్పుడు, వారు రామలక్ష్మణులని తెలిసికొని సుగ్రీవునికి రామలక్ష్మణులతో మైత్రిని కలిగించాడు.

అప్పుడు హనుమంతుని గూర్చి శ్రీరాముడిట్లు పలికెను.

"ఏవం విధో యస్య దూతో న భవేత్ పార్థివస్య తు ।
సిధ్యంతి హి కథం తస్య కార్యాణాం గతయో నఘ"[8] ॥

మన వివరములనడుగనట్టి కౌశలము కలవాడే రాజుకు దూతగా ఉండదగినవాడు.

ఏవం గుణగణై ర్యుక్తా యస్య స్యుః కార్యసాధకాః ।
తస్య సిద్ధ్యంతి సర్వేఽర్థా దూతవాక్య ప్రచోదితాః "[9] ॥

గుణసముదాయం కలిగి కార్యాలు సాధించేటువంటి దూతలు ఏ రాజున కుంటారో, ఆ రాజు కార్యాలన్నీ ఆదూతల వాక్కౌశలం చేతనే సిద్ధించటంచేత, ఆరాజునకే మాత్రము శ్రమ ఉండదని రాముడు లక్ష్మణునితో పలుకుట వలన హనుమంతుని వంటి ప్రతిభాశాలి దూతగా ఉండదగినవాడని తెలియుచున్నది.

2. సీతాన్వేషణకు వానరులు బయలుదేరిన వేళ శ్రీరాముడు హనుమచేతికి అంగుళీయకమిచ్చి

"సీతకు మాయున్న సేమంబుసెప్పి - సీత సేమంబు జెప్ప శీఘ్రంబెరమ్ము"[10] అని పల్కినట్లు రంగనాథ రామాయణమున పేర్కొనగా

రామాభ్యుదయమున

పల్లవపాణికి న్నెగులు వాయఁగ నాకతఁజెప్పినప్పు డా
యల్లక బాధ చేతి యుడుకాఱిన యూర్పులతావి నీగురుం
డల్లనఁదెచ్చుగాఁక మలయానిలుఁడంతకు నీవు రావయా
చల్లని వార్త ఁగొంచు రభసంబున నోయి సమీరనందనా"[11] అని చెప్పిన

ట్లుండగా మొల్ల రామాయణమున

----- రామభూపాలుండతని విశ్వాసగుణంబులకు మెచ్చినవాడై దగ్గఱం బిలిచి "నీవు శౌర్యవంతుడవు. హితుండవు గావున నీచేత మత్ప్రయోజనం బీడేఱునని పల్కి"[11a] -- నట్లున్నది.

హనుమ లంకలో ప్రవేశించి సీతను కనుగొని ఆమెతో సంభాషించటానికి పూర్వం దూత ఎట్లుంటే కార్యసాఫల్యమునొందునో వాల్మీకి వివరించెను. దూత వివేకము లేనివాడైతే సిద్ధింపవలసిన కార్యాలు దేశ కాలాలకు విరుద్ధములై నశిస్తాయి[12] ఈ విషయం తెలుసుకొన్న హనుమ వ్యర్థ విషయాలు లేకుండా మధురంగాను, యుక్తి యుక్తంగాను సీతతో పరిచయం చేసికొని, నేను రాముని సందేశమునుగొని దూతగా వచ్చితిని" అని సీతకు సందేశాన్ని అందిస్తాడు.

పిమ్మట హనుమంతుడు రావణుని సమ్ముఖానికి వెళ్లి 'నేను సుగ్రీవుని సందేశాన్ని గొని ఇట్లు నగరానికి వచ్చితిననుచు ముందుగా సుగ్రీవ సందేశాన్ని రావణునకు వినిపించెను.[13] హనుమంతుడు రావణునితో 'నేను రాముని సేవకుడను, మానవుడను కాను, వానరుడను, విశేషించి అతని దూతను'అని రాముని పరాక్రమాన్ని తెలిపెను.

అది విని దురాత్ముడైన రావణుడు హనుమను వధించటానికి ఆజ్ఞాపించగా దూతను వధించరాదని విభీషణుడు హితవు పలుకగా ఆతని తోకను రాక్షసులు నిప్పుపెట్టిరి. పిమ్మట హనుమ అంగదాదులతో "చూచితి సీతను" అని పలికెను. శ్రీరామునికి కూడా సీతాదేవి స్థితిని లంకానగరస్థితిని తెలిపి యుద్ధానికి సంసిద్ధులగునట్లు హనుమ చేసెను. యుద్ధానంతరం సీతకు రాముని విజయవార్త తెలిసి సీతాసందేశాన్ని తెచ్చి మరోపర్యాయం దూతయైనాడు హనుమ. ఈ ప్రకారం శ్రీరామ దూతయైన హనుమంతుడు సంపూర్ణ స్వాతంత్ర్యముతో వ్యవహరించి యున్నాడు. ఇతడు 'నిసృష్టార్థుడు'. అను కోవకు చెందిన దూతయన వచ్చును.

*7-5.2 అంగదుడు :*

వాలి జ్యేష్ఠ తనయుడు అంగదుడు. వాలి తదనంతరం సుగ్రీవుడు రాజు కాగా వానర రాజ్యానికి యువరాజైనవాడు. ఉపాయములెఱిగినవాడు. పరాక్రమవంతుడు. ధీరుడు. యుద్ధానికి ఏర్పాట్లన్నీ పూర్తిచేసి శ్రీరాముడు విభీషణునొడబరచి తన సందేశాన్ని రావణునకు వినిపించుమని అంగదుని రాయబారిగా పంపెను. అంగదుడు రావణుని దగ్గఱకు వెళ్లి

'త ద్రామవచనం సర్వమన్యూనాధికముత్తమమ్. ।
సామాత్యం శ్రావయామాస నివే ద్యాత్మాన మాత్మనా[14] ॥

తన్ను తాను తెలియజేసికొని పిమ్మట రావణునకు రామవాక్యాలను హెచ్చు తగ్గులు లేకుండా వినిపించెను.[15] అప్పుడు రావణుడు కోపపరవశుడై ఈ దుష్టబుద్ధిని బంధింపుడు, వధింపుడని పలుమార్లు అంగదుని వధచేయుమని ఆజ్ఞాపించెను. అట్టి స్థితిలో అంగదుడు పైకెగిరి ప్రాకార శిఖరాన్ని విఱిచి, తనపేరందఱకు స్పష్టంగా వినిపించి రాక్షసులకు బాధకల్గిస్తూ వానరులకు సంతోషాన్ని కల్గిస్తూ తిరిగి వచ్చెను. దీనినిబట్టి ఆత్మరక్షణకు దూత శత్రువులను బాధించవచ్చునని తెలియుచున్నది. ఇతడు పరిమితార్థుడగు దూతయని తెలియుచున్నది.

*7-5.3 లక్ష్మణుడు :*

సీతాన్వేషణ విషయమున సందేశాన్నిచ్చి సుగ్రీవుని యొద్దకు లక్ష్మణుని రాముడు పంపెను.

'న చ సంకుచితః పంథా యేన వాలీ హతో గతః ।
సమయే తిష్ఠ సుగ్రీవ! మా వాలిపథ మన్వగాః[16] ॥

వాలి మార్గాన్ని అనుసరించవద్దని సుగ్రీవునకు తెలియజేస్తూ లక్ష్మణుడు శ్రీరాముని మాటలు యధాతథంగా సుగ్రీవుని ముందుంచిన 'పరిమితార్థుడు'

**7-5.4 సుమంత్రుడు :**

దశరథుని ఎనిమిదిమంది మంత్రులలో చివరివాడు. మహారాజునకు అత్యంత ఆప్తుడు. ఆంతరంగికుడు; సారధి యైన మంత్రియే సుమంత్రుడు.

'ఇమం తస్య మహాభాగ దూతం దుష్కరకారిణః।
వనవాసా దనుప్రాప్తం కస్మా న్న ప్రతిభాషసే[17]॥

శ్రీరాముని వీడ్కొలిపి నగరానికి వచ్చిన సుమంత్రునితో కౌసల్య ఎవరికిని చేయశక్యముగాని కార్యాన్ని నిర్వహించిన రాముని దూత ఇతడేనని చెప్తుంది. అంతేగాక ఇప్పుడు సుమంత్రుడు రామలక్ష్మణుల సందేశాన్ని తెలిపినట్లు తెలియుచున్నది. మంత్రిగా సీతారామలక్ష్మణుల యధార్థ స్థితిని దశరథునికి సుమంత్రుడు వినిపించి సారధిగానే కాక దూతగా కూడా సుమంత్రుడు తన నైపుణ్యాన్ని చూపెను.

***7-5.5 సిద్ధార్థాది మంత్రులు :***

దశరథుని మరణానంతరం వసిష్ఠుడు, సిద్ధార్థుడు, విజయుడు, జయంతుడు, అశోకుడు అనే నలుగురు మంత్రులను పిలిచి రాజగృహమునకేగి భరతుని తోడ్కొని రమ్మనగా

'పురోహిత స్త్వాం కుశలం ప్రాహ సర్వే చ మంత్రిణః ।
త్వరమాణ శ్చ నిర్యాహి కృత్య మాత్యయికం త్వయా''[18] ॥

వారు అక్కడికి వెళ్లి త్వరగా అయోధ్యకు రావలసినదిగా భరతునితో చెప్పిరి. ఆ విధముగా చెప్పి సిద్ధార్థాది మంత్రులు తమ దూతకృత్యాన్ని నిర్విఘ్నంగా పూర్తిచేసి భరతుని అయోధ్యానగరానికి తీసుకొనివచ్చిరి.

***7-5.6 శుకసారణులు :***

సుగ్రీవుని యొద్దకు రావణుని ఆజ్ఞప్రకారం వెళ్లిన శుకసారణులు రావణుని మాటలు పలుకుతుండగా వారిని వానరులు నేలపై పడవేసి గొట్టినారు. శ్రీరాముని దయచే వీరు విముక్తులైనారు. దూతకృత్యమున శుకసారణులు విఫలమైనాడు.

*7-7.7 జనకుని మంత్రులు :*

శివధనుర్భంగం జరిగిన పిమ్మట రామునకు సీతనివ్వదలచిన జనకుడు విశ్వామిత్రుని అనుమతితో దశరథుని యొద్దకు దూతలను బంపెను. జనకుని మంత్రులు దశరథుని కడకేగి సీతారామ వివాహ విషయమును తెలిపిరి. దీనినిబట్టి జనకుని మంత్రులు దూతలుగా వ్యవహరించినట్లు తెలుస్తున్నది.

*7-6 దూతలు - శిక్షలు :*

'న దూతా వధమర్హతః'[19] అని చెప్పబడినందున దూతను వధింపరాదని తెలుస్తున్నది. ఉచితానుచితముల నెఱిగినవారు, ఉత్తములగు రాజులు దూతలనెంత మాత్రము చంపరు. దూతను శిక్షించడానికెన్నో పద్ధతులున్నట్లు విభీషణుడు

వైరూప్య మంగేషు కచా భిఘాతో - మౌండ్యం తథా లక్షణ సన్నిపాతః ।
ఏతాన్ హి దూతే ప్రవదంతి దండాన్ - వధ స్తు దూతస్య ననః శ్రుతోఽస్తి॥[20]

అంగవికారము కావింపవచ్చును. కొరడాలతో కొట్టించవచ్చును. తలగొరిగింపవచ్చును. ముద్రగా వాతలు వేయవచ్చును. అంతేగాని చంపరాదు. దూతను చంపుట ఏ శాస్త్రమునందు లేదు. శుకసారణులు వానరులచే పట్టుబడినప్పుడు శాస్త్ర వచన్నాననుసరించి శ్రీరాముడు వారిని విడిచిపెట్టెను. దూతను చంపరాదను శాస్త్రవచనము తెలిసినవాడైనను కోపావేశముతో దూతను వధింపుమని రావణుడు ఆజ్ఞాపించెను. అంతేగాక రావణుడు తన మంత్రులతో అంగదుని దుష్టబుద్ధితో వధింపుడని పలుమార్లు ఆజ్ఞ ఇవ్వడం వల్ల రావణుడు శాస్త్రవచనాన్ని ఆచరణలో పెట్టలేదని తెలుస్తున్నది.

యస్తు హిత్వా మతం భర్తుః స్వమతం సంప్రధారయేత్ ।
అనుక్తవాదీ దూత స్సన్ స దూతో వధమర్హతి.[21]॥

దూతగా వచ్చినవాడు తన యజమాని చెప్పిన వాక్యాన్ని విడిచి తన అభిప్రాయాన్ని పలికితే అట్టి దూత అనుక్తవాది కనుక వానిని వధింప వచ్చుననెను.

*7-7 గూఢచారులు :*

చారులు, గుప్తచారులు అని పిలువబడే గూఢచారులు పాలనావ్యవహారములలో కీలకస్థానాన్ని పొందియున్నారు. రాజు తన పాలనావ్యవహారాలపట్ల ప్రజాభిప్రాయాన్ని

తెలుసుకోవడానికి తన అధికార గణం యొక్క వ్యవహారాల్లోని తీరుతెన్నులను గ్రహించడానికి, విదేశ రాజ్యసమాచారాలు తెలుసుకోవడానికి గూఢచారుల్ని రాజు నియమిస్తాడు.

*7-7.1 గూఢచారులు - రకాలు - విధులు :*

గూఢచారులు నిర్వర్తించు విధులననుసరించి రెండురకాలుగా పేర్కొనవచ్చు. 1. స్వపక్షము లేదా స్వదేశమున రాజుచే నియమింపబడినవాడు.

2. శత్రుపక్షము 'లేదా' విదేశమున రాజుచే నియమింపబడినవారు. వేగులవారనబడే వీరు రాజుకు కళ్లవంటివారు. అందుకే రాజును చారచక్షులనుటయు గలదు. శత్రుపక్షపు వ్యూహాదులను తెలుసుకోటానికి నియమింపబడిన గుప్తచారులు శత్రువు యొక్క సైన్యవిశేషాలను బలాబలాలను రాజుకు తెలియబరచాలి. యుద్ధం ఆసన్నమైన వేళ రాజు ఎదిరిపక్షబలాన్ని తెలుసుకొనుటకు రాజుకు వీరు ఉపయోగపడతారు.

*7-7.2 రామాయణం - గూఢచారులు :*

దశరథుడు చారులను పంపి వారివలన రాష్ట్రమునకు సంబంధించిన విషయములను గమనించుచూ దోషులను దండించుచూ ప్రజలను ఆనందింప జేయుచుండెను.

"అవేక్ష్యమాణ శ్చారేణ ప్రజా ధర్మేణ రక్షయన్
ప్రజానాం పాలనం కుర్వ న్నధర్మం పరివర్జయన్"[22] ॥

సీతారామలక్ష్మణులు గంగానదిని దాటి భరద్వాజ మునికడకేగుట, ప్రయాగతీర్థమున భరద్వాజునితో గలిసి ఉండుట, వారు చిత్రకూటమునకేగుట, మున్నగు వృత్తాంతములన్నింటిని గుహుడు చారులను నియోగించి సుమంతునకుతెల్పెను.

శత్రు పక్షమును గురించి తెలుసుకొనగోరి రావణుడు శార్దూలుడను చారుని పంపెను. అతడు అక్కడి విషయములను తెలుసుకొని వానరసేన లంకలో ప్రవేశించుచున్నదని తెలిపెను.[23] పిమ్మట రావణుడు శుకసారణులనుద్దేశించి సముద్రము పై వానరులు సేతువును నిర్మించిరనుట ఎంతమాత్రము నమ్మశక్యము కాకున్నదని భావించి వారలను, వానరసైన్యస్థితిని గురించి తెలుసుకొని రమ్మని

పంపెను. వారిరువురు వానర రూపమును ధరించి వానరసేనలోనికి ప్రవేశించిరి. విభీషణుడు ఈ విషయమును పసిగట్టి శ్రీరామునికి దెల్పెను. రాముడు వారిని దయతో విడిచిపెట్టి రావణునకు తన సందేశమును వారితో పంపించెను.

దీనినిబట్టి చారులతో కూడా సందేశమును పంపు పద్ధతికలదని తెలియుచున్నది. పిమ్మట రావణుడు రాజనీతిలో పండితులైన చారులను పిలిపించుకొని రామునకు ఆంతరంగికులు, ప్రీతి పాత్రులునైన మంత్రులెవరో తెలుసుకొనిరండని పంపెను.[24] ఆ చారులలో శార్దూలుడు కూడా గలడు. విభీషణుడు వారిని పట్టి బంధించి శ్రీరామునకు నివేదించగా రాముడు వారిని దయతో విడిచిపెట్టెను.

### *7-7.3 చారులు - శిక్షలు :*

గుప్తచారులు శత్రుపక్షము వారిచే పట్టుబడినపుడు తీవ్రదండనకు గురిచేసెడివారు. రావణునిచే పంపబడిన శుకుడు వానరులచే బంధింపబడిన తర్వాత అంగదుడు "మహారాజా! ఇతడు దూతగాడు. వీడు రావణుని గూఢచారియని నాకు తెలియుచున్నది. ఇతడు ఇచటనే ఉండి మనసేనలంతటిని కనిపెట్టినాడు. కాబట్టి వీనిని లంకకు పోనీకుండా బంధింపుడు." అని పల్కెను. ఆ సమయమున వానరులు ఇంచుమించుగా శుకుని రెక్కలను విరుగగొట్టిరి.[25] కేవలము శ్రీరాముని దయచేతనే శుకసారణులు, శార్దూలుడు విడిచిపెట్టబడిరి. దీనినిబట్టి చారులను శిక్షించుపద్ధతి ఉండెడిదని తెలియుచున్నది. శుకసారణులు లంకకు తిరిగి వచ్చిన పిమ్మట రాముని యొక్క పరాక్రమాదులను రావణునకు తెల్పిన సందర్భమున రావణుడు వారిని విడిచిపెట్టుచూ 'మీకిది వధతో సమానమని పల్కెను.[26]

సీతకు సహాయము చేయదలచి సరమయు గూఢాచారిగా వ్యవహరించెను.

### *7-7.4 చారుల ప్రాధాన్యము :*

రామాయణములో చారులకు తగిన ప్రాధాన్యమీయబడినది. చారులద్వారా రాజు సమస్త విషయాలను తెలుసుకొని చక్కగా పరిపాలన చేయువచ్చుననియు తెలియుచున్నది.[27] శూర్పణఖ రావణునితో చారులను నియమించుకొని రాజులను పరిత్యజించుదురని పలుకును.[28] రాజులు చారుల వలన దూరమందలి విషయములను గూడ చక్కగా తెలుసుకొందురు. కాబట్టే వారిని 'దీర్ఘచక్షువులు'

అందురు. మారీచుడు కూడా "నీవు చారులను నియోగించి శత్రువులను గూర్చి తెలుసుకొనవైతివి"[28a] అని మందలించెను.

శూర్పణఖ రావణునితో

"యేషాం చారశ్చ కోశ శ్చ నయ శ్చ జయతాం వర।
అస్వాధీనా నరేంద్రాణాం ప్రాకృతై స్తే జనై స్సమాః॥"[29]

ఏ రాజులకు చారులు, ధనాగారము, నీతి స్వాధీనములోనుండ వారు సామాన్యులతో సమానము అనుటను బట్టి రామాయణమున చారులకీయబడిన, ఇవ్వదగిన ప్రాధాన్యము తెలియుచున్నది.

### *7-8.0* చతుర్విధోపాయములు :

పొందదగినదానిని పొందుటకై రాజు అవలంబించునట్టివియే ఉపాయములు. ఇవి నాలుగువిధములు. 1. సామము 2. దానము 3. భేదము 4. దండన

ప్రీతిపూర్వకమైన మాటలను చెప్పి కార్యమును సాధించుకొనుటను సామముగను, గుఱ్ఱములను, ఏనుగులను, బంగారము మొదలగు వానినిచ్చి కార్యమును సాధించుకొనుటను దానముగను, రాజ్యాపేక్షగల ఆతని సేవకులను వేఱుపరచి కార్యమును సాధించుట భేదోపాయముగను చెప్పబడినది. పై మూడింటి చేతను కార్యము సాధింపబడనప్పుడు యుద్ధము చేత శత్రువులను లొంగదీయుట దండోపాయమగును. ఈ చతుర్విధోపాయములేగాక మాయ, ఉపేక్ష, ఇంద్రజాలము అను మూడు ఉపాయములున్నవి.

1. మారువేషాలు ధరించి శత్రువులను నమ్మించి వధించటాన్ని 'మాయోపాయ మందురు. 2. ఇద్దఱు బలవంతులు యుద్ధానికి దిగినపుడు బలహీనుడైన రాజు ఎవరి పక్షములోను చేరకుండా ఉండటాన్ని 'ఉపేక్ష' అందురు 3. శత్రుపక్షాన్ని భ్రమింపజేయుటకుపయోగించేదే 'ఇంద్రజాలము'

### *7-8.1* రామాయణము - చతుర్విధోపాయములు :

రామాయణమున మొదటి మూడు ఉపాయములకు అవకాశములేనప్పుడే దండోపాయము ఉపయోగింపబడినది. శార్దూలుడు వానరసైన్యాన్ని చూచి వచ్చి రావణునితో ఇట్లనెను.

'ఉపప్రధానం సాంత్వం వా భేదో వాత్ర ప్రయుజ్యతాం''[30]।

సీతను తిరిగి ఇచ్చుటో, మంచిమాటలతో అనుకూలింపజేయుటో, లేక వారి నడుమ భేదమును కలిగించుటో ఈ మూడుపాయములనుప్రయోగించుమని కోరెను.

మండోదరి రావణునితో రంగనాథ రామాయణమున ఈవిధముగా పలికెను.

'నలి సామ భేద దానంబులు చూప-గలిగిన దండంబు గాదు పాటింప''[31] అనియు

భాస్కరరామాయణములో

'సమరమునందు శాత్రవులె చత్తురనం జనదాత్మహానియుం
సమకొను గెల్పు సందియము సన్నుతికెక్కిన సామభేద దా
నములవి యుండగా మొదల నాలవవెంట సమస్త బంధు నా
శకమునకునోర్చి రాజులిటు సాహసవృత్తి దొడంగుటొప్పునే''[32]

అనియు మొదటిమూడుపాయములలో దేనినైనా అవలంబింపవచ్చునని కోరినట్లుగలదు. శత్రువు బలవంతుడైతే సామదానాదులతో కార్యమును నిర్వర్తించుకొనవచ్చునని తెలుపుటకును ఉదాహరణను తార వాలికి హితవుపలుకుట యందు చూడగలము.[33]

**7-8.2 రామాయణము - సామోపాయము :**

ఉపాయాలన్నిటిలోకి సామోపాయము ఉత్తమమైనదిగా చెప్పబడుచున్నది. భాస్కరారామాయణములో మండోదరి రావణునితో

'వెఱవెఱిగి కార్తవీర్యుని తోఁగార్య
సిద్ధి కొఱకు సంధి జేసికొనవె
పరశుజిత సహస్రబాహు రాముని మీఱు
రాముడేల తగడు సామమునకు.[34]

అని సామోపాయ ప్రదర్శనకు రాముడు తగినవాడని పలికెను. ఆస్తినష్టము, ప్రాణనష్టము లేకుండా పనినిచక్కపెట్టుకోగల అవకాశాన్నిచ్చే సామోపాయము రావణునికి, వాలికి కూడా రుచించలేదు.

### *7-8.3 రామాయణము - దానోపాయము :*

సామముతో గాని పనిని దానముతో నెరవేర్చగల అవకాశమున్నది. బలవంతులైన శత్రురాజులనుండి భయము తొలగించుకోటానికి దానోపాయము బాగుగా సహాయపడుతుంది.

'నహి తేన సమం బంధుం భువి పశ్యామి కంచన।
దానమానాదిసత్కారైః కురుష్వ ప్రత్యనంతరమ్.॥[35]

సుగ్రీవుని వంటి బంధువు నీకీ భూమిపై మరొకడు కనిపించడు. అతనికి ధనకనకాదులనిచ్చి గౌరవించి సత్కరింపుమని తార వాలితో పల్కెను. దీనిని బట్టి దానోపాయమును అనుసరింపుమని కోరినట్లు తెలియుచున్నది.

ఇదే సందర్భమున భాస్కర రామాయణములో మూలమునకు కొంత భిన్నముగా

'మన ఇంటగల సర్వమణిధనంబులు గొంచు...........[36] రామునితో సంధిగావించుకొమ్మని వాలికి హితవుపలికినట్లు గలదు.

మండోదరి రావణునితో

"హేమమహామణి ముఖ్యవస్తువులో మొదలుగ సీతనా"[37]

సకలలోక శరణ్యునకు రామునకిమ్మని చెప్పినట్లు భాస్కరరామాయణములో గలదు.

సీతాపహరణమునకు మారీచుని ఒప్పించుసందర్భమున రావణుడు మారీచునితో

'ఏవం కృత్యాత్విదం కార్యం యథేష్టం గచ్ఛ రాక్షస ।
రాజ్యస్యార్థం ప్రయచ్ఛామి మారీచ తవ సువ్రత ॥[38]

నీ ఉపకారమునకు ప్రతిగా నా సగము రాజ్యమిచ్చెదనని రావణుడు దానోపాయమును ప్రదర్శించెను. సామదానములు రెండును బలవంతుడైన శత్రురాజును లేదా కార్యము నెరవేర్చవలసిన హితుని విషయమున ప్రదర్శింతురు.

### *7-8.4 రామాయణము - భేదోపాయము :*

సామదానములను రెండు పాయములతో సాధ్యము కాని స్థితిలో భేదోపాయమును ప్రయోగింపవలెను. శత్రురాజును జయించడంలో భాగంగా రాజు మంత్రులు, సామంతులు, ఇతర అధికారులు, మిత్రరాజులు మొదలైనవారి మధ్య భేదాలను సృష్టించడమే భేదోపాయము. ఇట్లు చేయడములో గుప్తచారులు బాగా సహాయపడతారు.

రామాయణములో రావణుడు భేదోపాయమునకు ప్రయత్నించి విఫలుడైనట్లు తెలియుచున్నది. సుగ్రీవుని వద్దకు శుకుని వద్దకు పంపినపుడు నేను చెప్పినది చెప్పినట్లు ధైర్యముతో పలుకవలసినదని చెప్పెను. అప్పుడు శుకుడు సుగ్రీవునితో ఇట్లనెను ఓ మహారాజా! నీవు సూర్యనందనుడవగుటచే ఉత్తమకుల ప్రసూతడవు. మహాబలుడవు. నీవు రాముని ఆశ్రయించడం వలన నీకు గలుగు లాభముగాని, ఆశ్రయింపకపోవుట వలన గలుగు నష్టముగాని లేదు. వాలి సంబంధముచే నీవు నాకు సోదరప్రియుడవు. కాబట్టి వానరరాజా! నాతో చెలిమిచేయుము.' అని సందేశమిచ్చెను. శుకుడు తెల్పిన సందేశము ఎంతమాత్రము ప్రయోజనమునీయలేదు. ఈ ప్రకారము రావణుడు ప్రయోగించిన భేదోపాయము ఫలించలేదు.

'స చతుర్ణా ముపాయానాం తృతీయ ముపవర్ణయన్ ।
భేదయామాస తాన్ సర్వాన్ వానరాన్ వాక్యసంపదా[39] ॥

సామ దాన భేద దండోపాయములలో మూడోదైన భేదోపాయాన్ని చేపట్టి హనుమంతుడు తన మాటల నేర్పుచే వానరులను బిలమందే నివసించుటయను అంగదాభిప్రాయము నుండి వేరుచేసెను. ఆ తర్వాత దండోపాయమును అవలంబించి కఠినోక్తులు పలుకుట గమనింపదగినది. భేదోపాయాన్ని అట్లు వ్యక్తం చేసిన హనుమమాటలతో అంగదాదులు 'బిలముననే నివసించుటయను ఆలోచననుండి విముక్తులైనట్లు రాజగు సుగ్రీవుని యెడల విశ్వాసముంచినట్లు తెలియుచున్నది.

### *7-8.5 రామాయణము - దండోపాయము :*

దండోపాయము మొదటి మూడు ఉపాయములను సాధించలేని స్థితిలో వినియోగింపవలెను.

'దండ ఏవ పరో లోకే పరుషస్యేతి మే మతిః ।
ధిక్ క్షమా మకృతజ్ఞేషు సాంత్వం దాన మథా పి వా''[40] ॥

లోకములో పురుషులకు దండనే ఉత్తమ ఉపాయము. కృతజ్ఞతలేని వారి యెడల సహనము కాని, సామదాన ఉపాయములు కాని పనికిరావు.

తాటక మారీచ సుబాహులు, ఖర దూషణాదులు. వాలి రావణాదులు పెక్కుమంది రాక్షసులు వధయనుదండమునకు, అసమంజసుడు రాజ్యబహిష్కరణమను దండమునకు, శూర్పణఖ, అయోముఖి అంగవిచ్ఛేద దండమునకు గురియైరి.

రాక్షస వీరులలో విభీషణుడు

'పెనుపొందగా సామభేదదానముల - గొనరాని కార్యంబు గొన కొనెనేని
మఱి గదా దండంబు మాయలు దలచి - నెఱపుట మున్నెదురీతియేమిటికి'

రామునితో యుద్ధము తగదని రాక్షసవీరులతో విభీషణుడు తెలిపెను. మొదటి మూడుపాయములు ఉన్నప్పుడు దండము నెఱపుట దుర్నీతియని తెలిపెను. సంభాషణారూపముగా ముందుగా భేదమును, తదుపరి దండోపాయమును అంగదాదుల యెడ హనుమంతుడు ప్రవర్తింపజేయుచూ భయంకరమైన మాటలతో

"త్వం సమర్థతరః పిత్రా యుద్ధే తారేయ వై ధురం
దృఢం ధారయితుం శక్తః కపిరాజ్యం యథా పితా'[42]

అంగదా! నీవు యుద్ధంలో నీ తండ్రి వలె మిక్కిలి సమర్థుడవు. నీ తండ్రి ఈ వానర రాజ్యభారమును ధరించినట్లు నీవును ధృఢముగా ధరింపగలవు. బలహీనుడు బలవంతునితో విరోధించరాదు. చంచలాత్ములగు వానరులు నిన్ను విడిచిపెట్టగలరు. నీవు మిత్రులకును, నీ హితము గోరు బంధువులకును దూరమై హీనుడవగుదువు అంటూ దండోపాయాన్ని అనుసరించే మాటలతో అతని ప్రయత్నాన్ని విరమింపజేసెను. రామాయణ కాలమున రహస్య దండన విధానము కూడా అమలులో ఉన్నట్లు తెలియుచున్నది. హనుమంతుని హితవచనమును విన్న అంగదుడు.

'ఉపాంశుదండేన హి మాం బంధనే నోపపాదయేత్ ।
శఠః క్రూరో నృశంస శ్చ సుగ్రీవో రాజ్యకారణాత్[43] ॥

సుగ్రీవుడు గూఢముగా అపకారము చేయు క్రూరుడు. దయలేనివాడు. అతడు రాజ్యమునకై రహస్య దండనమును విధించి నన్ను బంధించును. అట్లు బంధన రూపమగు వినాశనము కన్నను ప్రాయోపవేశమే మేలు' అనుటను బట్టి రహస్య దండనము ఎంత భయంకరమో తెలియుచున్నది. మొత్తముపై రామాయణమున దండోపాయము లోకరక్షణమునకవలబింపబడినది.

### *7-8.6* రామాయణము - మాయోపాయము :

మారువేషాలు ధరించి శత్రువును నమ్మించి వంచించటం, మాయోపాయమని చెప్పవచ్చు. కేవలం రూపమే గాక కంఠధ్వనిని కూడా అనుకరించటం, మాయలేడిగా మారిన మారీచుని వృత్తాంతమును చూడగలము. మారీచుడు ఇట్టి మాయ రూపముతోనే రాజులనేకులను చంపినాడు. శ్రీరాముని బాణముచే పీడింపబడి

మరణించుచూ 'అయ్యో! సీతా! లక్ష్మణా! అని రాముని కంఠధ్వనిని అనుకరించుచూ అరచెను. అప్పుడు భయపడిన సీత లక్ష్మణుని రాముని కొరకై పంపగా పాపాత్ముడైన రావణుడు సన్యాసివేషము ధరించి బ్రాహ్మణునిగా మంచిమాటలు మాట్లాడి పిదప తన కోరికను వెల్లడించి తన దివ్యరూపముపొంది సీతాపహరణము గావించెను. ఈవిధముగా రావణుడు ప్రయోగించినది క్షుద్రమాయ. భాస్కరరామాయణమున శుకుడు రావణుని సందేశమును సుగ్రీవునికి కీరమై వినిపించెను.

మాయలమారి రావణుడు విద్యుజ్జిహ్వునితో కలసి సీత ఉన్నచోటికి పోయి "మనము జనకుని కూతురు సీతను మాయజేసి మోసపుచ్చుదము' అని పలికి విద్యుజ్జిహ్వుని సహాయమున రాముని మాయాశిరస్సు, మాయాధనుస్సును చూపి సీతను లొంగిపొమ్మని పల్కెను. ఇదియు మాయోపాయము.

యుద్ధమునకు సిద్ధపడుచున్న రామలక్ష్మణులపై పరులను వ్యామోహపెట్టు శక్తిని (మాయను) ఇంద్రజిత్తు ప్రయోగించెను. మాయచే సీతను కల్పించి రథము పై కూర్చుండబెట్టి ఆమెను హనుమంతుని యెదుట ఇంద్రజిత్తు వధించెను. ఇక్కడ శత్రుసైన్యమును నిరుత్సాహపరచవలెనను ఉద్దేశముతో ఇంద్రజిత్తు మాయోపాయము ప్రయోగించెను.

### *7.8.7.* రామాయణము - ఇంద్రజాలము :

మంత్రప్రయోగము చేత భ్రమను కల్పించి శత్రువును భయపెట్టి ఆత్మస్థైర్యాన్ని నైతికబలాన్ని వ్యర్థం చేయడమే ఇంద్రజాలము అంటారు.

రామాయణములో రావణుడు విద్యుజ్జిహ్వుని సహాయముతో మాయారాముని తలను, వింటిని, సృజింపజేసి సీతను రాముడు వధింపబడ్డాడని భ్రమింపజేసెను. ఇంద్రజిత్తు హనుమంతుని యెదుట మాయాసీతను కత్తితో వధింపగా హనుమంతుడు చూచి వానరులకు తెలిపెను. పై రెండు వృత్తాంతములలో ఇంద్రజాలము కానవచ్చు చున్నది. వివిధ ఉపాయములు రామాయణమున సమయోచితముగా ప్రదర్శింపబడినవి. కుటిల నీతిగల రావణుడు మాయోపాయమును తన స్వార్థమునకు ఎక్కువగా ఉపయోగించినట్లు తెలియుచున్నది.



## పాదసూచికలు

1.వాల్మీ.రా.కిష్కిం.2-21శ్లో॥ 2.వాల్మీ.రా.అరణ్య.72-7శ్లో॥ 3.మను.7అధ్యా. 160శ్లో॥ 4.వాల్మీ.రా.అయోధ్య.100-36శ్లో॥ 5.వాల్మీ.రా.బాల.68-16,17శ్లో॥ 6.Ibid.యుద్ధ.3-4.28శ్లో॥ 7.వాల్మీ.రా.యుద్ధ.35-9శ్లో॥ 8.వాల్మీ.రా.కిష్కిం.3-34శ్లో॥ 9.Ibid.కిష్కిం.3.35శ్లో॥ 10.రంగ.రా.కిష్కింధ.260పుట. 11.రామాభ్యు.6-59ప॥ 12.మొల్ల.రా.కిష్కిం.25ప॥ 13.వాల్మీ.రా. సుందర.30-37శ్లో॥, 13a.Ibid.సుందర.51-2,3శ్లో॥ 14.వాల్మీ.రా.యుద్ధ.41-75శ్లో॥ 15.Ibid. యుద్ధ.30-81శ్లో॥ 16.Ibid.కిష్కింధ. 34-18శ్లో॥ 17.వాల్మీ.రా.అయోధ్య.57-29శ్లో॥ 18.Ibid.అయోధ్య.70-3శ్లో॥ 19.వాల్మీ.రా.యుద్ధ.25-20శ్లో॥ 20.Ibid.సుందర.52-15శ్లో॥ 21.వాల్మీ.రా.యుద్ధ. 20-18శ్లో॥ 22.వాల్మీ.రా.బాల.7-21శ్లో॥ 23.Ibid.యుద్ధ.25-23శ్లో॥ 24.Ibid.యుద్ధ.29-18శ్లో॥ 25.వాల్మీ.రా.యుద్ధ.20-21శ్లో॥ 26.Ibid.యు.29సర్గ. 27.వాల్మీ.రా.బాల 7స॥.28.Ibid .అరణ్య 33-5 శ్లో॥ 28a.వాల్మీ.రా.అరణ్య.37-3 29.Ibid.అరణ్య.33-9శ్లో॥ 30.వాల్మీ.రా.యుద్ధ.20-7శ్లో॥ 31.రంగనాథ.రా.యుద్ధ.434పుట. 32.భాస్కర.రా.యుద్ధ.773॥ 33.భాస్కర.రా.కిష్కింధ.208ప॥ 34.భాస్కర.రా.యుద్ధ.776ప॥ 35.వాల్మీ.రాకిష్కింధ.15-26శ్లో॥ 36.భాస్క.రా.కిష్కింధ. 209ప॥ 37.Ibid.యుద్ధ.771ప॥ 38.వాల్మీ.రా.అరణ్య. 39.వాల్మీ.రా. కిష్కింధ.54-6శ్లో॥ 40.వాల్మీ.రా.యు.22-49శ్లో॥ 41.రంగ.రా.యుద్ధ. 335పే॥ 42.వాల్మీ.రా.కిష్కింధ. 54-8శ్లో॥ 43.వాల్మీ.రా.కిష్కింద.55-10.



# ఉపయుక్తగ్రంథాలు

## సంస్కృతాంధ్రములు

1. అనంతరామశాస్త్రి నేతి : కవిత్రయభారతం - రాజనీతి
అరుణాపబ్లికేషన్స్, బి1 - 82, పట్టాభిపురం, గుంటూరు-6, 1988.

2. అమరసింహుడు : అమరకోశము.
వావిళ్ల రామస్వామిశాస్త్రి అండ్ సన్స్, మదరాసు -1,1973.

3. కాళిదాసు : రఘువంశము
వావిళ్లరామస్వామిశాస్త్రి అండ్ సన్స్, మదరాసు -1, 1929.

4. గోనబుద్ధారెడ్డి : రంగనాథరామాయణము
వావిళ్లరామస్వామిశాస్త్రి అండ్ సన్స్, మదరాసు-1.

5. గోపాలకృష్ణమూర్తి మల్లాది : శ్రీమత్‌రామాయణవైభవము
ఆర్షభారతీప్రకాశన్, తెనాలి, 1971.

6. గోవిందరాజీయము : శ్రీమద్రామాయణము - తనిశ్లోకి ;
విజయముద్రశాల, చిత్తూరు, 1971.

7. నరసింహమూర్తి, భళ్లమూడి : విచిత్ర రామాయణము - ఒకపరిశీలనము,
రైల్వేకాలనీ, కురదారోడ్, 1988.

8. నరసింహావధాని ములుకుట్ల : శ్రీ రామాయణసారోద్ధారము
కృష్ణలంక, విజయవాడ, 1982.

9. పాండురంగారావు యం : ఉత్తరరామాయణవిమర్శ
5/15 బ్రాడీపేట, గుంటూరు, 1981.

10. ప్రతాపరెడ్డి సురవరం : రామాయణవిశేషములు
ఆంధ్రసారస్వతపరిషత్, హైదరాబాదు, 1955.

11. మలయవాసిని కొలవెన్ను : ఆంధ్రవాఙ్మయము - రామాయణము
లాసన్స్‌బేకాలనీ, విశాఖపట్టణము, 1989.

12. మొల్ల ఆతుకూరి : మొల్లరామాయణము
వావిళ్లరామస్వామిశాస్త్రి అండ్ సన్స్, మదరాసు-1.
13. రామభద్రకవి అయ్యలరాజు : రామాభ్యుదయము
ఆంధ్రసాహిత్య అకాడమీ, హైదరాబాదు 1967.
14. వాల్మీకి : శ్రీమద్రామాయణమ్ : వ్యాఖ్యాన చతుష్టయం,
ఆదిసరస్వతీనిలయముద్రణాలయం, 1915.
15. వీరేశ్వరశాస్త్రి కొత్తపల్లి : రామాభ్యుదయవైభవము
విక్టరీప్రెస్, విజయవాడ, 1985.
16. వేంకటావధాని దివాకర్ల : రామాయణసుధాలహరి
తిరుమలతిరుపతి దేవస్థానం, తిరుపతి 1984.
17. వేంకటశేషశాస్త్రి గడియారం : ఉత్తరరామాయణము కావ్య శిల్పము
ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమి, 1974.
18. వేంకటశేషాచార్యులు చెలమచర్ల : శ్రీమద్రామాయణము
జయలక్ష్మి పబ్లికేషన్స్, హైదరాబాదు.
19. సత్యనారాయణశాస్త్రి మధునాపంతుల : తెలుగులో రామాయణాలు
ఆం.సా.ప్రపంచతెలుగుమహాసభల ప్రచురణ, హైదరాబాదు, 1975.
20. సుందరరామశాస్త్రి చదలవాడ : శ్రీమద్రామాయణము
వావిళ్లరామస్వామిశాస్త్రి అండ్ సన్స్, మదరాసు, 1932.
21. సుబ్రహ్మణ్యశర్మ నండూరి: శ్రీమద్వాల్మీకి రామాయణోపన్యాసములు
ఆర్షవిజ్ఞాన గ్రంథమాల, విజయవాడ, 1983.
22. శ్రీ శ్రీనివాస శిరోమణి : వాల్మీకి రామాయణములు - వచనము
త్రివేణి పబ్లికేషన్స్, మచిలీపట్టణము, 1967.
23. శ్రీహరి రవ్వా : భాస్కరరామాయణము - విమర్శ
పద్మావతి ఆర్ట్‌ప్రింటర్స్, హైదరాబాదు, 1988.

24. హుళక్కి భాస్కరుడు : భాస్కరరామాయణము
వావిళ్లరామస్వామిశాస్త్రి అండ్ సన్స్, మద్రాసు-1, 1965.

## ఆంగ్లగ్రంథములు

1. **CHATTERJEE; H.L :** International Law and Interstate Relations in Ancient India, Calcutta, 1958.
2. **CHAKRAVARTHY P.C.** : The Art of war in Ancient India University of Dacca, 1941.
3. **DEVI PRASAD:** The Theory of Government in Ancient India, Allahabad, 1927.
4. **GHOSHAL U.N :** A History of Hindu Political Theories Oxford University Press,1923.
5. **KANE P.V. :** History of Dharma Sastra, Poona 1941.

## సంక్షిప్తపదసూచిక

| | |
|---|---|
| 1. వాల్మీకి రామాయణము | వాల్మీకి.రా. |
| 2. బాలకాండము | బాల |
| 3. అయోధ్యకాండము | అయోధ్య |
| 4. కిష్కింధకాండము | కిష్కింధ |
| 5. సుందరకాండము | సుందర |
| 6. యుద్ధకాండము | యుద్ధ |
| 7. రంగనాథ రామాయణము | రంగ.రా |
| 8. భాస్కరరామాయణము | భాస్క.రా |
| 9. మొల్లరామాయణము | మొల్ల.రా |
| 10. రామాభ్యుదయము | రామాభ్యు |



12. మొల్ల ఆతుకూరి : మొల్లరామాయణము
వావిళ్లరామస్వామిశాస్త్రి అండ్ సన్స్, మదరాసు-1.

13. రామభద్రకవి అయ్యలరాజు : రామాభ్యుదయము
ఆంధ్రసాహిత్య అకాడమీ, హైదరాబాదు 1967.

14. వాల్మీకి : శ్రీమద్రామాయణమ్ : వ్యాఖ్యాన చతుష్టయం,
ఆదిసరస్వతీనిలయముద్రణాలయం, 1915.

15. వీరేశ్వరశాస్త్రి కొత్తపల్లి : రామాభ్యుదయవైభవము
విక్టరీప్రెస్, విజయవాడ, 1985.

16. వేంకటావధాని దివాకర్ల : రామాయణసుధాలహరి
తిరుమలతిరుపతి దేవస్థానం, తిరుపతి 1984.

17. వేంకటశేషశాస్త్రి గడియారం : ఉత్తరరామాయణము కావ్య శిల్పము
ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమి, 1974.

18. వేంకటశేషాచార్యులు చెలమచర్ల : శ్రీమద్రామాయణము
జయలక్ష్మి పబ్లికేషన్స్, హైదరాబాదు.

19. సత్యనారాయణశాస్త్రి మధునాపంతుల : తెలుగులో రామాయణాలు
ఆం.సా.ప్రపంచతెలుగుమహాసభల ప్రచురణ, హైదరాబాదు, 1975.

20. సుందరరామశాస్త్రి చదలవాడ : శ్రీమద్రామాయణము
వావిళ్లరామస్వామిశాస్త్రి అండ్ సన్స్, మదరాసు, 1932.

21. సుబ్రహ్మణ్యశర్మ నండూరి: శ్రీమద్వాల్మీకి రామాయణోపన్యాసములు
ఆర్షవిజ్ఞాన గ్రంథమాల, విజయవాడ, 1983.

22. శ్రీ శ్రీనివాస శిరోమణి : వాల్మీకి రామాయణములు - వచనము
త్రివేణి పబ్లికేషన్స్, మచిలీపట్టణము, 1967.

23. శ్రీహరి రవ్వా : భాస్కరరామాయణము - విమర్శ
పద్మావతీ ఆర్ట్‌ప్రింటర్స్, హైదరాబాదు, 1988.

24. హుళక్కి భాస్కరుడు : భాస్కరరామాయణము
వావిళ్లరామస్వామిశాస్త్రి అండ్ సన్స్, మద్రాసు-1, 1965.

## ఆంగ్లగ్రంథములు

1. **CHATTERJEE; H.L :** International Law and Interstate Relations in Ancient India, Calcutta, 1958.

2. **CHAKRAVARTHY P.C. :** The Art of war in Ancient India University of Dacca, 1941.

3. **DEVI PRASAD:** The Theory of Government in Ancient India, Allahabad, 1927.

4. **GHOSHAL U.N :** A History of Hindu Political Theories Oxford University Press, 1923.

5. **KANE P.V. :** History of Dharma Sastra, Poona 1941.

## సంక్షిప్తపదసూచిక

| | |
|---|---|
| 1. వాల్మీకి రామాయణము | వాల్మీకి.రా. |
| 2. బాలకాండము | బాల |
| 3. అయోధ్యకాండము | అయోధ్య |
| 4. కిష్కింధకాండము | కిష్కింధ |
| 5. సుందరకాండము | సుందర |
| 6. యుద్ధకాండము | యుద్ధ |
| 7. రంగనాథ రామాయణము | రంగ.రా |
| 8. భాస్కరరామాయణము | భాస్క.రా |
| 9. మొల్లరామాయణము | మొల్ల.రా |
| 10. రామాభ్యుదయము | రామాభ్యు |



# PRASIDDHA SAMSKRUTHĀNDHRA RĀMĀYANĀLLO RĀJANEETI TATWAMU

## Prof. NETI ANANTHA RAMA SASTRY

ధర్మం సార్వత్రికమైనది. అది ఒక జాతికిగానీ, ఒక దేశానికి గానీ, ఒక సమాజానికి గానీ పరిమితం కాదు. అది సమస్త మానవజాతి కళ్యాణానికి దోహదం చేస్తుంది. వారిని ప్రమాదం నుండి కాపాడి రక్షించేది ధర్మం అని రామాయణం చెప్తుంది. సత్యంచేత, వివేకంచేత, సత్ప్రవర్తనచేత, కార్యాకారణముల సమన్వయంచేత ధర్మం రక్షింపబడుతుందని, రామాయణం వివరిస్తుంది. వ్యక్తి శ్రేయస్సు కన్నా, సమాజశ్రేయస్సుకోసం అవసరమైతే వ్యక్తిని అధర్మమార్గంలో రూపుమాపుట ధర్మమే అని రామాయణం ప్రతిపాదించింది. ఈవిధంగా ఏర్పడ్డ ఆ వ్యవస్థను తొలగించి, పునః ధర్మవ్యవస్థను ఏర్పరచడానికి రాజనీతి ఏర్పడింది.

రామాయణంలో మూడువిధాలైన రాజకీయ వ్యవస్థ ఉంది. కోసల రాజ్యాధిపతులైన దశరథ-రాముల(మానవ)., కిష్కిందాధిపతులైన వాలి-సుగ్రీవుల (వానరుల)., లంకాధిపతులైన రావణ-విభీషణుల(రాక్షసుల) పరిపాలనా విధానాదులవల్ల, ప్రాచీనకాలంలో భారతదేశ పరిపాలనా విధానాలయొక్కపరిపూర్ణ అవగాహనకు ఈ గ్రంథం ఉపకరిస్తుంది. వాల్మీకి రామాయణ కాలం నాటికీ తెలుగు రామాయణాల కాలంనాటికీ రాజకీయ వ్యవస్థలో ఏమేమి మార్పులు వచ్చినవీ ఈ గ్రంథంలో పరిశీలించడం జరిగింది.

## ఆచార్య నేతి అనంత రామ శాస్త్రి



రచయిత నాగార్జున విశ్వవిద్యాలయంలో తెలుగు శాఖలో ఆచార్యులుగా పనిచేసి, పదవీ విరమణ చేశారు.
వీరు వ్రాసిన
1. వ్యాసపూర్ణిమ 2. శ్రీనాథ భాషా పరిశీలన.
3. సంస్కృత వ్యాసమంజరి,
4. కవిత్రయ భారతం-రాజనీతి, 5. వ్యాసవింశతి
6. ఆధునిక తెలుగు భాషా శాస్త్ర విజ్ఞానం వంటి గ్రంథాలు ఆంధ్ర భాషకు పరిపుష్టిని కూర్చాయి.
వివిధ విశ్వ విద్యాలయాల్లో యు. జి. సి వారు నిర్వహించిన జాతీయ సదస్సులలో సాహిత్యాంశాలను వివరిస్తూ పత్ర సమర్పణ చేశారు. ప్రస్తుతం "ఆధునిక తెలుగు సాహిత్యంలో లౌకికవాద ప్రభావం" అనే అంశంపై యు. జి. సి. వారు ఏర్పాటుచేసిన మేజర్ రీసెర్చ్ ప్రాజెక్టు నిర్వహిస్తున్నారు.

అరుణా పబ్లికేషన్స్ బి 1-82, పట్టాభిపురం, గుంటూరు- 522006 ఫోన్: 352377

Artwork & Design: DEVIPRASAD, Guntur. Ph. 0863-355680